Telugu Classics - Popular Edition Series

# విక్రమార్క చరిత్రము

జక్కన కవి

సంపాదకుడు:

డాక్టర్ పల్లా దుర్గయ్య, ఎం. ఎ., పిహెచ్. డి.




ప్రచురణ:

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవనం : హైదరాబాదు 4

ప్రాశస్త్యమును గూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చ వలెనని నిశ్చయించనైనది. ప్రతి సంపుటము వెల ఒక రూపాయి మాత్రమే. ఈ విధముగా యీ సంపుటాలన్నిటిని సుమారు 5 సంవత్సరముల కాలములో ముద్రించి ప్రకటించవలెనని అకాడమీ కార్యవర్గము తీర్మానించినది.

మేము కోరినంతనే ఈ సంపుటము సిద్ధముచేయు బాధ్యతను స్వీకరించి, నిర్ణయించిన గడువులోపల వ్రాత ప్రతిని మా కార్యాలయానికి అందజేసిన డా॥ పల్లా దుర్గయ్యగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

పైన పేర్కొనిన 50 సంపుటాల వ్రాత ప్రతులను సిద్ధము చేసి ముద్రించుటకు, అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమీకి యిచ్చుటకు కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు వాగ్దానము గావించి యిందులో కొంత డబ్బును విడుదలకూడ చేసినవి. ఇందుకు అకాడమీపక్షాన కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలకు ధన్యవాదాలు. అనుకొనిన వ్యవధిలో సంపుటాలను సిద్ధముచేసి, ఆంధ్రపాఠకలోనికి అందజేయుట జరుగగలదని విశ్వసించుచున్నాము.

హైదరాబాదు,
31-1-1968.

దేవులపల్లి రామానుజరావు,
కార్యదర్శి

# విషయ సూచిక

# పీఠిక

ప్రాచీనాంధ్ర మహాకావ్యములలో విక్రమార్క చరిత్రము లెక్కింపఁ దగినది. విక్రమార్క మహారాజు జీవితమును వర్ణించు కావ్య మిది యని దీని పేరే తెలుపుచున్నది. 'చరిత్ర' నామముతో రచింపఁబడిన కావ్యములు దీనికి ముందు వెనుక లందును వ్రాయఁబడు చుండినవి. పండితారాధ్య చరిత్రము, దశకుమార చరిత్రము మఱియుఁ గేయూరబాహు చరిత్రములు దీనికిఁ బూర్వ రచనలు, మను, వసుచరిత్రాదు లనంతర కృతులు. పండితారాధ్య చరిత్రము శైవ మతప్రచారకుఁడును, గురుస్థానీయుఁడు నయిన మల్లికార్జున పండితారాధ్యుని జీవిత విశేషములను వర్ణించు ద్విపదకృతి. ఇట్టి వానిలో నిది మొదటిది. దశకుమార చరిత్రము దండి సంస్కృత గద్యకావ్యమునకుఁ బద్యానువాదము. ఇది బహు నాయక మగు కల్పిత కథాసంపుటి. ఇట్టి వానిలో నిది యాద్యము. కేయూర బాహు చరిత్రము సంస్కృత నాటికకుఁ బద్యానుకృతి యైనను నిందు నీతికథ లనేకము క్రొత్తగా కవిచేఁ జేర్పఁబడినవి. ఇట్టి వానిలో నిదియే మొదటిది, తుదిది గూడ. తరువాతి కవులును సంస్కృత నాటకముల ననువదించినను వారు తమ కావ్యములయం దిట్లు నూత్న కథలను జేర్చరయిరి. ఈ విక్రమార్క చరిత్ర నాయకుఁడు లోకోత్తర గుణసంపన్నుఁ డగు విక్రమార్క మహారాజు. ఇతఁడు చారిత్రక పురుషుఁడే కాని, అతిలోక మహిమోపేతుఁడు. ఈయన సాహసౌదార్య పరాక్రమాది గుణస్ఫోరకము లగు కథ లనేకము లిందు వర్ణితములు. ఇట్టి వానిలో నిదియే మొదటిది.

దశకుమార చరిత్రాదు లాంధ్ర సాహిత్యమునఁ గథాకావ్యములుగాఁ బరిగణింపఁ బడుచున్నవి. దశకుమార చరిత్రము నందలి కథలు విడివిడిగాఁ బదుగురకు సంబంధించిన వగుటయే కాక పరస్పర సంబంధ మంతగా లేనివి. కేయూర బాహు చరిత్రము నందలి కథలు పై నుండి ప్రత్యేకముగాఁ జేర్పఁబడి ప్రధాన కథతోఁ గాని, కథానాయకునితోఁ గాని బొత్తిగా సంబంధము లేనివి. వీనిని తొలగించినచో కావ్యము మఱింత రసవంత మగునేకాని, దానికెట్టి న్యూనతయు వాటిల్లదు. ఈ విక్రమార్క చరిత్రము నందలి సమస్త కథలును నతనితోఁ బ్రత్యక్ష సంబంధము కలవి. ఇందుండి కొన్నిటిని తొలఁగించితిమేని నాయకుని యుత్తమ గుణములకుఁ గొంత న్యూనత నాపాదించిన వారమగుదుము. ఇది యీ కావ్య వైలక్షణ్యము.

వర్ణనాబాహుళ్యము చేతఁ గుమారసంభవ, నృసింహ పురాణములును, ప్రౌఢశైలీ విన్యాసము చేతను శబ్దార్థాలంకార బహుళ వర్ణనా చమత్కారము చేత నుత్తర హరివంశమును; ఏకైకరాజ నాయకత్వ శృంగార రసప్రాధాన్యముల చేత, కేయూరబాహు చరిత్రమును ప్రబంధలక్షణ విలసితములు. ఈ విక్రమార్క చరిత్ర మన్ననో ఉపర్యుక్త సమస్త గుణలక్షితమై ప్రబంధశయ్యా గ్రథితమయిన ప్రబంధ సామ్యకృతి. మనుచరిత్రాది ప్రబంధకావ్య రచనకు మార్గదర్శకములైన పూర్వ కావ్యములలో విక్రమార్క చరిత్ర మొక్కటి. అట్టి ప్రబంధ కవులకు మార్గదర్శకు లయిన పూర్వ కవులలో ఏతద్విక్రమార్క చరిత్ర కర్తయగు జక్కన కవియు నొక్కఁడు.

## కవికుల గోత్రాదులు

జక్కన నియోగి బ్రాహ్మణుఁడు. ఇతని తండ్రి అన్నయామాత్యుఁడు, తల్లి అక్కమాంబ. తాత పెద్దయామాత్యుఁడు. స్వవిషయమున నీ కవికృత్యవతారికలో నింతకు మించి విశేషము లెవ్వియుఁ దెలుపలేదు. విక్రమార్క చరిత్ర కృతిభర్త యగు సిద్ధనమంత్రి కులగోత్రాదుల నుగ్గడించెనే కాని, తన కుల మె యో, గోత్రమెద్ది యో, సూత్రమెద్ది యో సుతరాము సూచింపలేదు. జక్కన యి టి పేరు 'పేరంరాజు' వారని, శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావుగారు వ్రాసిరి కాని, దాని కాధారమును జూపరయిరి. అది మొదలు కొందఱు పేరంరాజు జక్కన యని వ్రాయుచున్నారు. ఇది యెంతవఱకు నిజమో విచార్యము. ఇక్లే పెద్దన తాత, తిరుకాళ చోడునిచే సన్మానితుఁ డని జక్కన చెప్పిన దానినిఁబట్టి జక్కన కూడా నెల్లూరి పురవాసుఁడని యూహింప వచ్చునని అచ్యుతరావుగారు వ్రాసిరి. కాని జక్కన తాత కూడా నెల్లూరు వాస్తవ్యుఁడో, కాఁడో, నిజము మనకుఁ దెలియదు.

## పండితకవి వంశము

జక్కన విద్వత్కవి. విద్వత్కవి వంశీయుఁడు. ఈ కవి తాతను గూర్చి ఈ క్రింది వివరములు అవతారిక (ఆ. 1–20)లోఁ దెలుపఁ బడినవి.

జక్కన తాత పెద్దయామాత్యుఁడు. గొప్ప పండితుఁడు, కవి. సంస్కృత ప్రాకృత శౌర్యసేన్యాది బహుభాషా కోవిదుఁడు. ఘటికామాత్ర కాలములో బయి భాషలలో 'శతకము' జెప్పఁగలవాఁడు. ప్రహసన, భాణాదిరూపకములు: చక్ర. చతుర్భద్ర, చతురుత్తరాధిక క్షుద్ర ప్రబంధములు రచించు నేర్పరి. సకల రసములలో వర్ణనలు చేయు సమర్థుఁడు. ఏకసంధా. ద్విసంధా, త్రిసంధా గ్రహణ పద్ధతిని పద్యములను వినినంతనే ధారణచేసి తిరిగి వినిపించు శక్తిగలవాఁడు. అన్ని విధముల అవధానముల ... ... నితరులను మించి యవధానము లొన

రించు దక్షుఁడు. వృత్తకందము, కందవృత్తము, చతుష్కందము మున్నగు గర్భ కావ్యవర్గ నిర్మాణ కుశలుఁడు: ఆంధ్రమునందుఁ బ్రబంధములు క్రొత్తలు పుట్టించు కొని (నూత్న కథలను గల్పించుకొని) లిఖించు ప్రతిభావంతుఁడు. అక్షరచ్యుతక, మాత్రాచ్యుతక, బంధచ్యుతకములును, నామగోప్య, క్రియాగోప్య, భావగోప్య ములుగా పద్యములు చెప్పుట యందును, మఱియు సభలయందుఁ బద్యంబు గీతి కార్భటిఁ జదువుట యందును చతురుఁడు. ఎల్లవిద్యల నెఱిఁగినవాఁడు. ఇతఁడు నెల్లూరి తిరుకాళవిభుని (నెల్లూరి మనుమసిద్ధి తండ్రికినిఁ గుమారునకుఁ గూడ నీ పేరుగలదు) సభలో తన సాహిత్య పటిమను బ్రదర్శించి కీర్తిపాత్రుఁ డయ్యెను. ఇట్టి తాతకుఁ దగిన మనుమఁడు మన జక్కనకవి.

## జక్కనకుఁ బూర్వపు నష్టప్రబంధములు

పై వివరములను బట్టి జక్కనకు సుమారు 50 సం॥ పూర్వమే ఆంధ్ర భాషలో, ఆశు, బంధ, గర్భ, చిత్ర కవిత్వములును, అవధాన (కవితా) విధాన ములును, మఱియుఁ బ్రఖ్యాత, మిశ్రమ, కల్పితేతి వృత్తప్రబంధ రచనమును బ్రచారమున నుండినట్లు తెలియవచ్చు చున్నది. జక్కన కూడ అవధాన కవిత్వము చేయువాఁ డని కొందఱ అభిప్రాయము. తన తాత అవధాన కవిత్వ నిపుణుఁడని చెప్పెనే కాని, స్వవిషయమున అట్లెక్కడను జక్కన చెప్పలేదు.

ఇది చాలవఱకు వాస్తవమే యని తోఁచును. పలవఁ బ్రబంధ కవులలోఁ బెద్దన హరికథాసారము మున్నగు ప్రబంధేతర గ్రంథములను గూడ రచించినట్లే పురాణయుగ కవులును ఆ పురాణాదులు మాత్రమే కాక, ప్రబంధములను గూడ రచింపుచు వచ్చిరని యూహించుటకుఁ బ్రబలాధారములు కలవు.

లక్షణ గ్రంథములయం దుదాహృతము లయిన పరిమిత పద్యముల వలనను సాహిత్య చరిత్రల మూలముననను, నన్నయభట్టు రాఘవాభ్యుదయ, ఇంద్రవిజ యము లను రెండు ప్రబంధములను, తిక్కన 'విజయసేన' మను బ్రబంధమును, ఎఱ్ఱన 'రామాయణ' ప్రబంధమును ('వల్మీకభవు వచోవైఖరి రామాయణంబు నాంధ్ర ప్రబంధంబుఁ జేసె' నని చెదలువాడ ఎఱ్ఱాప్రెగడ); నన్నెచోడుఁడు 'కళావిలాస' ప్రబంధమును, నాచనసోముఁడు 'వసంతవిలాస' ప్రబంధమును మఱియుఁ జిమ్మపూడి యమరేశ్వరుఁడు 'విక్రమసేన' ప్రబంధమును రచించినట్లు తెలియవచ్చు చున్నది. కాని, యివి యన్నియు కాలవైపరీత్యముచే నష్టములయి మనకు లభింపక పోయినవి. ఈ గ్రంథములే యుపలబ్ధములయి యుండినచో 16వ శతాబ్దమునఁ బ్రబంధములు క్రొత్తఁగాఁ బుట్టినవను నూహ సాహిత్య చరిత్ర కారులకుఁ గలుగకుండెడిది.

తాతయగు పెద్దనామాత్యుని బహువిధ కావ్యకరణ దక్షత నంతగా నుగ్గడించిన జక్కన తత్కృత కావ్యనామ మొక్కటియేనిఁ బేర్కొనకుండుటకు హేతువు విచార్యము. జక్కన తండ్రి కవియైనట్లు చెప్పలేదు. సరియైన రక్షణ లేక పెద్దన కావ్యప్రతులు జక్కన నాటికే లుప్తమయి కీర్తి మాత్రము మిగిలియుండె నేమో? విచార్యము.

## జక్కన కవిత్వ విశేషములు

జక్కన విద్వత్కవి యని వెనుకఁ దెలుపఁబడెను. తండ్రి పోలికలు గాక యితనికి తాతగారి పోలికలే వచ్చుట యదృష్టము. విక్రమార్క చరిత్రము మొదట కృతిభర్త యీ కవినిఁ గ్రిందివిధమునఁ బ్రశంసించెను.

'చక్కన నీ వైదుష్యము
చక్కన నీ కావ్యరచన చాతుర్యంబుల్
చక్కన నీ వాగ్వైఖరి
చక్కన నీ వంశమహిమ జక్కన సుకవీ!' (ఆ. 1–23)

'స్వాభావిక నవకవితా
ప్రాభవముల నుభయభాషఁ బ్రౌఢిమఁ జెప్పన్
భూభువనంబున సరి లే
రాభారతి నీవుఁదక్క నన్నయజక్కా!' (ఆ. 1–24)

జక్కన కవిత్వముఁ జెప్పుట యందు భారతీ దేవితో సముఁడని కృతిభర్త ప్రస్తుతించినను జక్కన తాను 'శారదాదయావిధేయు'ఁ డయినట్లు ఆశ్వాసాంత గద్యలో సవినయముగాఁ దెలుపుకొనినాఁడు. ఈ గద్యల మొదట 'శ్రీమదఖిల కవిమిత్ర' యను విశేషణమును వేసికొనెను. ఇది తిక్కనగారి 'ఉభయకవిమిత్ర' బిరుదము వంటిది కావచ్చును. కుకవి నిరసన సందర్భమున నీ కవి యీ క్రింది పద్యము కూడ వ్రాసెను.

'ప్రతిపద్యము చోద్యముగాఁ
గృతిఁ జెప్పిన నొప్పుఁగాక, కృతినొక పద్యం
బతీ మూఢుఁడైనఁ జిత్రతఁ
బ్రతిపాదింపఁడె ఘుణాక్షర న్యాయమునన్?' (ఆ. 1–17)

ఇతని పూర్వులలో నన్నెచోడుఁడు కూడ నిట్టి యభిప్రాయము కలవాఁడే.

'అక్కజమై మహార్థనివహంబు సదుక్తులు మెచ్చఁ జూచినన్
గ్రుక్కిదమైన సత్కృతియ గుర్వగుఁ గాకిలఁ జీకు లావుకం
ద్రొక్కినయట్లు నోరఁగొలఁదుల్ పురికొల్పఁగ నఁదులోన నొ
క్కొక్కఁడు సక్కనైనగృతియుం గృతియందురె? వాని మెత్తురే!'
(కుమా. సం. ఆ. 1–58)

జక్కన తరువాత వారిలో ముఖ్యముగాఁ జేమకూర వేంకటకవి కూడ యీ మతమువాఁడే. రఘునాథరాయ లతని కవిత్వము నిట్లు కొనియాడెను.

'ప్రతిపద్యము నందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తు, వెల్లెడఁ బెళుకౌ
కృతివింటి మపారముగా,
క్షితిలో నీమార్గ మెవరికిఁ రాదు సుమీ!'
(విజ. విలా. ఆ. 1–50)

ఈ కవులు కావ్యము నందలి 'ప్రతిపద్యము' నందును 'జమత్కృతి' గలుగు నట్లు కావ్యము రచింపవలె నను అభిప్రాయము గలవారు. ఈ విషయమున వీరికి మతభేదము లేదు.

'ప్రతిపద్యము చోద్యముగాఁ గృతిఁ జెప్పిన నొప్పు' నను జక్కనమాట కేవలము కుకవినిరసనైక పరిమిత ప్రయోజనము కలదికాదు. విక్రమార్క చరిత్రము నతఁడు ప్రతిపద్య చమత్కృతిగా రచించి తన పంతము నిలుపుకొని నాఁడు. కావుననే జక్కన కవిత్వ మనిన సిద్ధమంత్రికిఁ బ్రీతి. ఈ విషయమును కవి యీ క్రింది షష్ఠ్యంత పద్యముచేత సూచించెను.

'అక్కాంబానందనునకు
ధిక్కృత సురరాజమంత్రి ధీవిభవునకున్
దిక్కూలంకష కీర్తికి
జక్కనకవి కావ్యకరణ సత్ప్రియమతికిన్.' (ఆ. 1–61)

చేమకూర వెంకటకవి రఘునాథ భూపాలునిఁ గూర్చి పలికినట్లు ఈ జక్కనకవి గూడ —

తారసపుష్టియైఁ బ్రతిపదంబున జాతియు వార్తయుఁ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేకకృతుల్ ప్రసన్న గం
భీరగతిన్....

రచింపఁగల కవిసత్తముఁ డనియు, విక్రమార్క చరిత్రము నతఁ డట్లే రచించెననియుఁ జెప్పుట యతిశయోక్తి కాఁజాలదు.

## పండితాభిప్రాయములు

ఇఁక నీ కవివరునిఁ గూర్చిన పండితాభిప్రాయము లొకటి రెండు దిగువఁ జూపఁబడును.

1. "ఈ జక్కన లాక్షణికుఁడైన మంచికవి. ఈతని కవిత్వము నిర్దుష్టమై మనోహరముగా నుండును. ఈ విక్రమార్క చరిత్రము నందలి కథలు సహిత మద్భుతములుగానే యుండును."

   — వీరేశలింగం పంతులుగారు, క.చ.భా. 1.

2. "జక్కన విక్రమార్క చరిత్రము అల్లసాని పెద్దనగారి పాండిత్యమును, ముక్కు తిమ్మనగారి లాలిత్యమును, రామరాజభూషణుని ప్రౌఢియుం బొరసి చెన్నారుచున్నది."

   [వేదం వేంకటరాయశాస్త్రిగారు. శారదాంబికా ప్రథమకింకిణి అను విక్రమార్క చరిత్రముద్రణ విమర్శనము.]

3. "ప్రౌఢకవి మల్లన, మారన, జక్కన.... వీరు లాక్షణికులయిన గొప్ప కవులు. వీరు రచించిన గ్రంథములు తొల్లింటి కవుల గ్రంథముల వలె మిక్కిలి కొనియాడఁ దగినవిగా నుండును."

   – బి. సీతారామాచార్యులవారు, శ.ర పీఠిక.

4. "జక్కయ కవిత్వము ప్రౌఢమైనది. వర్ణనాంశములు పెక్కులు గలవు. స్వాభావికములైన వర్ణనలకంటె నుత్ప్రేక్షాదుల యందే యీ కవి కభిరుచి మెండు.

   పదునెనిమిది వర్ణనలను సందర్భోచితముగా నీ కావ్యమున మనోహరముగా వర్ణించియుండెను,

   ఈ కవి లోకోక్తుల నెన్నిఁటినో సందర్భోచితముగ నీ కావ్యమం దిమిడ్చియున్నాఁడు.

   విక్రమార్క చరిత్ర ముత్తమములైన యాంధ్ర కావ్యములలో నొకటి."

   ఆంధ్రకవి తరంగిణి–సం. 4.

జక్కనకవి సంస్కృతాంధ్ర భాషలయందుఁ జక్కని వైదుష్యము గలవాఁడు. వ్యాకరణ సాహిత్యశాస్త్ర పాండిత్యముతో పాటు, జ్యోతిశ్శాస్త్ర, యోగశాస్త్రముల యందును, యజ్ఞయాగాది వైదికకర్మనిర్వహణ విధానము నందును మంచి పరిచయము సంపాదించినవాఁడు. సంస్కృతము నందును, గవిత్వముచేయు శక్తి గలవాఁ డని యితఁ డీ కావ్యమున రచించిన కొన్ని శ్లోకముల వలనఁ దెలియుచున్నది. ఇందుకుఁ గొన్ని యుదాహరణములు.

జ్యోతిశ్శాస్త్రము :- విక్రమార్కుఁడు జనించిన సందర్భమున నితఁడు వ్రాసిన పద్యములు.

"దినకృద్వాసర చైత్రశుద్ధనవమిం దిష్యం దృతీయాంశ సం
జననంబొందెడు రాగమంజరికి రాజద్భాగ్యసౌభాగ్య సూ
చనలగ్నంబునఁ బుత్రరత్నము, నిజోచ్చక్షేత్ర సందీప్తులై
యినమందార సురాసురేజ్య బుధులా యిందు న్విలోకింపఁగన్.
(ఆ. 1-174)

(ఇన, మంద, అర అని యిట పదవిభాగము; అనఁగా సూర్య, శని, అంగారకులు; తిష్యన్ అనఁగా పుష్యమి నక్షత్రము నందనుట.) రవ్యాది గ్రహములాఱును తమ తమ ఉచ్చస్థానముల నుండి పుష్యమి నక్షత్రమునఁ దన స్వగృహము నందున్న చంద్రునిఁ జంద్రలగ్నమును వీక్షించుచుండగా శుభలగ్నము నందు విక్రమార్కుఁడు జన్మించినట్లు కవి వర్ణించెను. శ్రీరామచంద్రుఁడు నీ దినముననే జన్మించెను.

పై జన్మముహూర్తమునకు జ్యోతిష్కులీ క్రింది ఫలితమును జెప్పిరఁట.

శ్లో॥ కుముదగహనబంధౌ వీక్ష్యమాణే సమస్తై
రగనగ గృహవాసై ర్దీర్ఘజీవీసతుస్యాత్,
యదసదశుభజన్యం యచ్చకీదృగ్విమోదం
సభవతి నరనాథస్సార్వభౌమో జితారిః." (ఆ. 1-76)

అని హోరాస్కంధబంధురంబైన యీ పద్యంబు నుపన్యసించి యిక్కుమారుండు దీర్ఘాయురుపేతుండును, జితారిసంఘాతుండును, చక్రవర్తి పదఖ్యాతుండును నగునని విన్నవించిరఁట !

వీరు చెప్పినట్లే విక్రమార్కుఁడు చక్రవర్తి యయ్యెను. కాని శ్రీరాముఁడు జన్మించిన దినముననే జన్మించుటచేతనేమో, భట్టి సలహా ప్రకార మితఁడును జీవి

తమున సగము కాలము రాజ్యము నందును, గడమ సగము (సంవత్సరమునకు ఆఱు నెలల చొప్పున) లోకసంచారము చేయుచు అన్యత్రయుఁ గడపెను. పైనిఁ జేర్కొనిన హోరాశాస్త్రము సంస్కృతమునఁ గలదు. 'కలాపారాశరిహోరా' యనుట నిది మిగులఁ బ్రామాణికము. జక్కన యిందలి శ్లోకము నుద్ధరించి ఫలితాంశమును జెప్పుటఁ జూడ నీ కవికి జ్యోతిశ్శాస్త్రము నందు మంచి పరిచయము గలదని తెలియును. ఇట్లే శరదృతు వర్ణనము నందలి యీ క్రింది పద్యమును నీ విషయమునే నిరూపించెను.

"జలజచ్ఛత్రరుచిం బ్రకాశతరకాశశ్రేణికా చామరం
బులభద్రాసనకాంతి రాజ్యపదమొప్పల్ మీఱఁ గుంభోద్భవుం
డెలమిన్ దక్షిణదిక్కునం దుదితుఁడయ్యెం, జంద్రతారాబలం
బుల మేలైనదినంబు లెవ్వరికి సమ్మోదంబు సంధింపవే!" (ఆ. 4-६8)

## యోగవిద్య

ఈ క్రింది పద్యము కవికిఁ గల యోగవిద్యా పరిచితి నెఱిఁగింపఁ గలది.
'బద్ధసిద్ధాసనపరిణతిఁ గూర్చిండి

హృదయసమాధాన మొదవఁజేసి
మూలాలవాల సమున్నతిఁ గైకొని
యనిలు మధ్యమనాడి యందునిలిపి
యంతర్గతములైన యాఱుదామరలకు
నభినవోల్లాసంబు ననునయించి
యాంతరజ్వలనసంక్రాంతిచేఁ దొరఁగెడు
చంద్రకళాసుధా సారధారఁ
దడిసి, యాత్మానుసంధాన తన్మయత్వ
నిశ్చలాంతరంగుండయి నిస్తరంగ
నీరనిధియునుబోలె నొప్పారుచున్న
మునివరేణ్యునిఁ బొడగంటి, మనుజనాథ.' (ఆ. 2-218)

పంచమాశ్వాసము నందలి 127 నుండి 135 వఱకుఁ గల పద్యములలో కవికిఁ గల అశ్వమేధయాగ నిధాన పరిజ్ఞానము నెఱింగించును.

## సంస్కృత కవిత్వము

ఈ క్రింది శ్లోకములు జక్కన సంస్కృత పద్యరచనా శక్తినిఁ దెలుపును.
విరూపాక్ష స్తుతి.

భుజతభవభుజఙ్గం, పాణిహేలాకురఙ్గం,
ప్రమదహృదయసఙ్గం, బాలచంద్రోత్తమాఙ్గమ్,
పరమకుటపిశఙ్గం. వాసకైలాసశృఙ్గం
జితమదనదపాఙ్గం, శ్రీవిరూపాక్షలిఙ్గమ్. (ఆ. 2-222)

దీని తరువాత నున్న 223, 224 కూడ విరూపాక్ష స్తుతిశ్లోకములే కాబట్టి యిటఁ జూపలేదు.

## కృతిపతి - బంధువులు

ఈ విక్రమార్క చరిత్ర కృతిపతి సిద్ధనమంత్రి యైనట్లు వెనుక సూచింపఁబడెను. ఇప్పు డతని వివరములు కొన్ని తెలుపఁబడును.

కృతిభర్తయగు సిద్ధనమంత్రి తండ్రి జన్నమంత్రి. తల్లి అక్కమాంబ. (జక్కనకవి తల్లి పేరు కూడ అక్కమాంబయే.) పెదతండ్రి భాస్కరమంత్రి. తాత మారనసోమయాజి. ఈ సిద్ధనమంత్రికి వెన్నెలగంటి సూర్యుఁడు పెదతండ్రిగా సన్నుతిగన్నవాఁ డని షష్ఠ్యంతముల చివరి పద్యము (ఆ. 6-2)లో చెప్పఁబడినది. వీరు హారీతస గోత్రులు. ఆపస్తంబసూత్రులు. (ఆ. 1-58, 59). బ్రాహ్మణ ప్రభువులు.

సూరన సోమయాజి :— కృతిభర్తయగు సిద్ధనమంత్రి తండ్రికి నితఁడు తాత. పరమశైవాచార పావనుఁడు. వేదశాస్త్ర పురాణ విజ్ఞానముచే ఎద్దనపూడి యను నగ్రహారమును, ఛత్రచామరాది రాజలాంఛనములను బడసినఁవాడు.

సిద్ధనమంత్రి :— ఇతఁడు సూరన సోమయాజి మనుమఁడు. తండ్రివలెనే యితఁడును వేదశాస్త్రవిజ్ఞాన విత్తముఁడు. మంత్రిగాఁ బ్రసిద్ధి కెక్కెను.

భాస్కరమంత్రి :— సిద్ధ మంత్రి జ్యేష్ఠపుత్రుఁడు. అమృతగిరీంద్రుఁ డను సంయమికి శిష్యుఁడు. సూర్యనమస్కార నియమవ్రతుఁడు. ఈశ్వరాగమ పరమార్థ వేది.

జన్నమంత్రి :- సి మంత్రి ద్వితీయసుతుఁడు. భాస్కరమంత్రికిఁ దమ్ముఁడు. కృతిపతి యగు సి నకు జనకుఁడు. ఈతని జక్కన యీ క్రింది పద్యమున (ఆ. 1-44) ప్రశంసించె .

విమలవర్తనమున వేదశాస్త్రపురాణ
వాక్యార్థసరణికి వన్నె వెట్టెఁ

బరమహృద్యంబైన పద్యశతంబున
దేవకీతనయు విధేయుఁ జేసె
రసికత్వమున దేవరాయమహారాయ
కరుణాకటాక్షవీక్షణముఁ గాంచెఁ
గర్ణాట కటకముల్ గలయంతయును మెచ్చ
గణకవిద్యాప్రౌఢి ఘనత కెక్కె
గురులఁ బోషించె సత్కవివరుల మనిచెఁ
బ్రజలఁ బాలించె భాగ్యసంపద వహించె
హారితమునిముఖ్యవంశరత్నాకరేంద్ర
చంద్రుఁడై యొప్పు సిద్ధయజన్నమంత్రి.

పై పద్యమువలన ముఖ్యముగా నీ జన్నమంత్రి శ్రీకృష్ణునిపై వంద పద్యముల శతకకావ్యమును రచించినట్లును, దేవరాయల కటాక్షమునకుఁ బాత్రుఁ డయ్యె ననియు, మఱియు గణకవిద్యయందు మిగులఁ బ్రసిద్ధిగాంచెననియుఁ దెలియుచున్నది. ఇందు స్పష్టముగఁ జెప్పఁబడకున్నను 'ప్రజలఁ బాలించె' ననుటచే నీ జన్నమంత్రి దేవరాయలకు మంత్రిగానుండినట్లు భావింపఁబడుచున్నది. (ఆ. 1.45) ఇతరమంత్రులు జన్నమంత్రికి సరిరారని కవినుడివియున్నాఁడు.

సిద్ధమంత్రి :- జన్నమంత్రి ప్రథమసుతుఁడు. ఈయనయే విక్రమార్కచరిత్రయొక్క కృతిభర్త. జక్కనకవి యితనిఁ బ్రశంసించినపద్యము దిగువ నుదహరింపఁబడుచున్నది.

చిత్రగుప్తునకైనఁ జింతింపనరుదైన
గణితవిద్యాప్రౌఢి ఘనత కెక్కె
నవరసంబులయందు నవ్యకావ్యంబులు
కవిజనంబులు మెచ్చగానొనర్చె
నాణిముత్తెముల సోయగము మించినవ్రాలు
వరుసతో నిరుగేల వ్రాయనేర్చె
నాత్మీయలిపులట్లు లన్యదేశంబుల
లిపులను జదువంగ నిపుణుఁ డయ్యె
దేవరాయమహారాయ ధీవిధేయ
మంత్రివల్లభ చామనామాత్యదత్త
చామరచ్ఛత్రశిబికాది సకలభాగ్య
చిహ్నములనొప్పె జన్నయసిద్ధమంత్రి. (ఆ. 1-50)

సిద్ధనమంత్రి తనతండ్రివలెనే గణితవిద్యయందుఁ బ్రౌఢిమముగలవాఁడనియు, కవులు మెచ్చునట్లు నవ్యకావ్యములు రచించిన సత్కవియనియు, (అట్టి కావ్యనామములు తెలుపఁబడలేదు ?); రెండు చేతులతోఁగూడ ఆణిముత్తెముల వంటి వ్రాలు వ్రాయనేర్చినవాఁడనియు, పరదేశలిపులను అవలీలగాఁ జదువుట యందు నిపుణుఁడనియు, మఱియు దేవరాయల మంత్రివల్లభుఁ డగు చామనామాత్యునిచేత దత్తములయిన రాజచిహ్నములు గలవాఁడనియుఁ దెలియుచున్నది.

పెదతండ్రియగు భాస్కరమంత్రివలెనే సిద్ధనమంత్రికూడ సూర్యనమస్కార వ్రతనియమయుతుఁడని 'దినకరదండనమస్కృతి దినదిన సంవర్ధమాన తేజోనిధికిన్' (ఆ. 1-59) అను కవివాక్యము తెలుపుచున్నది. మఱియు నితఁడు 'శ్రీనాథచరణయుగళ ధ్యానాధీనాంతరంగుఁడు' (ఆ. 2-.1), 'శివపద్వయీకీర్తనుఁడు' (ఆ. 2-262), కావున హరిహరభేదములేని అద్వైతి. బెల్లముకొండ భైరవస్వామి యితని యిలవేలుపు (ఆ. 2-26).

'శ్రీమద్వాణీవిలాసజిహ్వాగ్రతలా' (ఆ. 1-1.)
'కవితాకారా !' (ఆ. 8-124).
రామాయణసుప్రలాప్త రసికకలాపా ! (ఆ. 2-261)

అని కవి సంబోధించుటచేత సిద్ధనమంత్రి కవియైయుండెననుటలో సందేహము లేదు. కృత్యాద్యవతారికలో (ప. 50) నితఁ డనేక కావ్యములొనర్చినట్లును కవి చెప్పెను. కావున నీ 'రామాయణసుప్రలాప' అను సంబోధనము వలన నితఁడు 'రామాయణము'ను కావ్యముగా రచించి యుండెనేమో యని అనుమానింపఁదగి యున్నది(.?).

## కృతికర్త కృతిభర్తల కాలము

విక్రమార్క చరిత్ర కృతికర్తయగు జక్కన కవి యొక్కయు, కృతిభర్తయగు సిద్ధనమంత్రి యొక్కయు కాలమును గూర్చి యాలోచింపవలసి యున్నది. వీరి కాలమును దెలియుటకుఁ గావ్యాదిలో జక్కన పేర్కొనిన కొందఱు ప్రధాన వ్యక్తుల నామములే మనకు ముఖ్యాధారములు. అవి యివి.

1. రాజేంద్రచోడుని వలన సూరన సోమయాజి అగ్రహారమును పడసెను. సూరన సోమయాజి కృతిభర్త తాతకుఁ దండ్రి.

2. దేవరాయ మహారాయలకడ జన్నమంత్రి మంత్రిగా నుండెను. జన్నమంత్రి కృతిభర్తకుఁ దండ్రి.

3. కృతిభర్త యగు సిద్ధనమంత్రి దేవరాయ మహారాయల మంత్రివల్లభు డగు చామనామాత్యుని వలన రాజలాంఛనములు పడసెను. చామనామాత్యుఁడు దేవరాయల కడ 'దండనాయకుఁడు'గాఁ గూడ నుండె నని
శ్రీమ ద్వవల్లయ, వరసుత చామన దండాధినాథ సామ్రాజ్యరమా
సామగ్రీ సంపాదక........ (ఆ. 1-57)

4. జక్కన తాతయగు పెద్దయామాత్యుఁడు నెల్లూరి తిరుకాళవిభుని మెప్పించి యతనిచే బహూకృతుఁ డాయెను.

5. కవీంద్ర కుంజరుఁ డగు వెన్నెలగంటి సూరన రెడ్డి వేమ నరపాలకు చేత మహాగ్రహారములు పడసెను. ఈ సూరనకవి కృతికర్త యగు సిద్ధనకు 'పెదతండ్రిగా సన్నుతిగన్న'వాఁడు.

పైనిఁ జేర్కొనిన రాజేంద్రచోడుఁడు మున్నగు వారినిఁబట్టి కృతికర్త కృతిభర్తల కాలమును నిర్ణయింప వలెను. వీరేశలింగము పంతులుగారు మున్నగు వారిట్లే చేసిరి. కాని యీ విమర్శకుల యభిప్రాయములు పరస్పరము భేదించుచున్నవి. వారి వాదములను పునరుద్ధరించిన గ్రంథవిస్తరము కాఁగలదు. కావున వాదసారాంశములు మాత్రమే తెలుపఁబడును.

సూరన సోమయాజికి ఎద్దనపూడిని అగ్రహారము నొసఁగిన రాజేంద్ర చోడుఁడు క్రీ.శ. 1156 నుండి 1168 వఱకు నుండెనని శ్రీ వీరేశలింగం పంతులు గారు.

"ఈ రాజేంద్ర చోడరాజు వెలనాటి దుర్జయ వంశజుఁడు క్రీ.శ.1163 నుండి 1181 వఱకు పాలించిన రాజేంద్ర చోడరాజు అనుటకు సందియము లే"దని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు.

పలువురు వెలనాటి రాజేంద్రచోడులలో కడపటివాఁ డగు వెలనాటి కులోత్తుంగ రాజేంద్రచోడుఁడు మనుమసిద్ధికి సమకాలికుఁ డనియు (నితని శాసనములు 1171-1176 సంవత్సరములలో గన్పట్టుచున్నవి.) కావున నీ కులోత్తుంగ రాజేంద్రచోడుఁడే సూరన సోమయాజికి అగ్రహార మొసంగి యుండుననియు కవితరంగిణికర్త అభిప్రాయములు.

దేవరాయలు క్రీ.శ. 1406–1422 సంవత్సరము వరకు కర్ణాటక రాజ్యము పాలించె ననియు సిద్ధనమంత్రియు, నితని తండ్రి జన్నయయు నితని యొద్ద మంత్రులుగా నుండిరని శ్రీ వీరేశలింగం పంతులుగారు.

ఈ దేవరాయలు మొదటి దేవరాయలు, ఇతఁడే సిద్ధనకుఁ బోషకుఁడనియు, జక్కనయు నీకాలమువాఁడే అనియు శ్రీ శేషయ్యగారు కూడ వ్రాసిరి. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారును, శ్రీ కొ. వేం. లక్ష్మణరావుగారును జక్కన మొదటి దేవరాయల కాలమువాఁడే యని నిశ్చయించిరి.

చామనామాత్యుఁడు మొదటి దేవరాయలకు మఱియు రెండవ (ప్రౌఢ) దేవరాయల కడ మంత్రిగను, దండనాయకుఁడుగను నుండెననియు, కృతిపతియగు సిద్ధనమంత్రి చామనామాత్యునిచే చామరచ్ఛత్రాది రాజలాంఛనములు పొంది యుండిన వాఁడనియుఁ గావున జక్కన కవి కూడ ఉభయదేవరాయల కాలమున అనఁగా 1404–1447 సంవత్సరముల మధ్యకాలమున నుండి యుండుననియు, అందును ముఖ్యముగాఁ బ్రౌఢ దేవరాయల కాలమున విద్వత్ప్రశస్తి నొంది యుండుననియు శ్రీ ఉకుమళ్ళ అచ్యుతరావుగారి అభిప్రాయము.

తిక్కన పోషకుఁడగు (నెల్లూరి) మనుమసిద్ధికి తండ్రియైన తిక్కరాజే తిరుకాళచోడుఁ డనియు, నితఁడు కవిసార్వభౌమ బిరుదాంకితుఁ డగు పండితప్రభు వనియు, నీతఁడే జక్కన తాత యగు పెద్దయామాత్యుని గారవించి యుండుననియు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసిరి.

పెద్దయామాత్యుని గౌరవించినది మనుమసిద్ధి తండ్రి కాక మనుమసిద్ధి కుమారుఁ డగు ఇమ్మడి తిరుకాళ విభుఁడని శ్రీ చాగంటి శేషయ్యగారు తెలుపుచున్నారు.

కృతిపతి యగు సిద్ధన పెదతండ్రి యని చెప్పఁబడిన వెన్నెలగంటి సూరన కవికి అగ్రహారము లొసగిన రెడ్డి వేమనరపాలుఁడు శ్రీ వీరేశలింగము పంతులుగారు చెప్పినట్లు అద్దంకి ప్రభువగు ప్రోలయవేముఁడు (1320–1350) కాఁడనియు ఇతఁడు కోమటి వేముని కుమారుఁడగు రాచవేమారెడ్డి (1420–1424) అయి యుండునని శ్రీ అచ్యుతరావుగారి అభిప్రాయము.

సూరన కవికి అగ్రహార మొసఁగిన వాఁడు ప్రోలయ వేమారెడ్డియే అని కవితరంగిణికర్త.

పై విషయములను బట్టి పండితుల మధ్య ఏకాభిప్రాయము కుదరలే దనుట స్పష్టము. ఈ విషయ మింకను బరిశోధింపఁ దగియున్నది. కావున జక్కన కవి శ్రీనాథ మహాకవికి సమకాలికుఁ డనియు విక్రమార్క చరిత్రము పదునేడవ శతాబ్ది ప్రథమపాదాంతమున రచింపఁబడి సిద్ధనమంత్రికిఁ గృతి యొసఁగఁబడినట్లు స్థూలముగ మనము తలంపవచ్చును.

# విక్రమార్క చరిత్రము - కథాకావ్యము

విక్రమార్క చరిత్రము ప్రాచీనాంధ్ర కథాకావ్యములలో నొకటి. సంస్కృతమున దండిమహాకవి రచించిన వచన దశకుమార చరిత్రమును జంపూ కావ్యముగా నాంధ్రీకరించి కేతన కథాకావ్యప్రక్రియకు మార్గదర్శకుఁడాయెను. ఇందు రాజకుమారునితోఁ గూడ మంత్రికుమారాదులు పదుగురు ప్రదర్శించిన సాహసకార్యములను దెలుపు కథ లనేకము వర్ణింపఁ బడియున్నవి. గుణాఢ్య పండితుఁడు పైశాచీభాషలో నసంఖ్యాక కథలతో రచించిన బృహత్కథయే భారతదేశీయ కథాకావ్యములలో మొట్టమొదటి కథాకావ్యము మాత్రమే కాక తరువాత సంస్కృతి భాషయందును, దేశభాష లందును వెలువడిన యిట్టి పెక్కింటి కిదియే మాతృక. ఇది బృహత్కథ యగుట వలన దీనిని గ్రహింపక కేతన కవి లఘుకథాసంపుటి యనఁదగు దశకుమార చరిత్రమునే గ్రహించెను. కేతన యనంతరము మంచనకవి సంస్కృతమున రాజశేఖరకవి రచించిన "విద్ధసాల భంజిక" యను నాటికను గ్రహించి, మూలకథలోఁ గొన్ని మార్పులు చేయుచు, మూలాతిశాయిగా మధ్య మధ్య సుమారు ఇరువది నీతికథలను జేర్చి దీని నొక కథాకావ్యముగ నాంధ్రీకరించి కేయూరబాహుచరిత్ర మని పేరుంచెను. ఈ కేయూరబాహు చరిత్రము సంస్కృత నాటకములకు మొట్టమొదటి కావ్య రూపానువాదము; తెలుఁగులో రెండవ కథాకావ్యము. పిదపఁ బేర్కొనఁ దగినది యీ జక్కన విక్రమార్క చరిత్రమే. ఐన నిది పై రెంటికంటెను గొంత వైలక్షణ్యము గలదిగా నున్నది. సంస్కృతము నందును విక్రమార్కుని సాహసపరాక్ర మౌదార్యములను వర్ణించు పద్యకావ్యములు కలవు. విక్రమార్క చరిత్రము, బేతాళపంచవింశతి యనునవి యిట్టివి. నేను జూచినంతవరకు సంస్కృత విక్ర మార్క చరిత్రము నందలి కథలు స్వల్పముగ జక్కన విక్రమార్క చరిత్రము నందును గోచరించినను ఇందలి పెక్కు కథలందు లేవు. అందలి కథ లనేకములిం దగుపడవు. తెలుఁగు విక్రమార్క చరిత్రము నందలి కొన్ని కథలకు మూలము లనఁదగిన కొన్ని కథలు బృహత్కథ యందును దాని సంస్కృతాంధ్రానువాదము లగు "కథాసరిత్సాగర" సంపుటము లందును గోచరించును. ఆంధ్రదేశమునందుఁ దన కాలమునఁ బ్రజలలోఁ బ్రచారము నందున్న విక్రమార్కుని కథలను గూడ జక్కన తన కావ్యమునందుఁ జేర్చియుండు నని యూహింపఁ బడుచున్నది. "భట్టి విక్రమార్కుల కథ" లను వచన గ్రంథమొకటి యనేక కథలతోఁ గూడినది తెలుఁగులో నున్నను, నిది యత్యాధునికము. జక్కన కించుక తరువాత కొఱవి గోపరాజు రచించిన "సింహాసనద్వాత్రింశిక" యను పద్యకథా కావ్యము సంస్కృత విక్రమార్క చరిత్రమున కాంధ్రీకరణ మని చెప్పవచ్చును. ఏలయన నీ రెంటి యందును విక్రమార్కుని సింహాసనమున కలంకారముగ నుండిన ముప్పది

రెండు సాలభంజికలే విక్రమార్కుని సాహసౌదార్యాదులను ప్రశంసించు 32 కథలను భోజరాజుకు వినిపించును. ఈ కథలనే సందర్భానుసార వర్ణనాదులలో విస్తరించి గోపరాజు తెలుఁగున రచించె నని పై రెండు గ్రంథములను బోల్చిచూచినఁ దెలియనగును. ఇఁక బేతాళపంచవింశతిలోని 25 కథలు విక్రమార్కునకు బేతాళుఁడు స్వయముగాఁ జెప్పినవి. వాని ప్రణాళికయే వేఱు. జక్కన విక్రమార్క చరిత్రకు దానితో సంబంధము లేదు. గీర్వాణ విక్రమార్క చరిత్రము నందలి ప్రాస్తావిక నీతిశ్లోకములకుఁ గొన్నింటిని జక్కన తెనుఁగుచేసి యున్నను నిందలి కొన్ని కథలకు సంస్కృతమున సూచనలు కనవచ్చినను సంస్కృత విక్రమార్క చరిత్రమునకు జక్కన విక్రమార్క చరిత్ర మనువాదము కాక చాలవరకిది స్వతంత్ర్య గ్రంథ మనుట వాస్తవము. ప్రస్తుత విక్రమార్క చరిత్రకుఁ బిమ్మట గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, అనంతామాత్యుని భోజరాజీయము, కొవెల గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, కదరిపతి శుకసప్తతి మఱియు అయ్యలరాజు నారాయణకవి హంసవింశ మున్నగునవి యీ కోవకుఁ జెందిన కావ్యములలోఁ ప్రసిద్ధములు.

ఇట నొక్కమాట. విక్రమార్క చరిత్రము విక్రమార్కునికి సంబంధించిన కథలను వర్ణించునట్లే, అనంతామాత్యుని భోజరాజీయము కూడ భోజరాజు జీవితమునకు సంబంధించిన కథలను వివరించు కావ్యమయినట్లు తఱచు తలంపఁబడుచున్నది. కాని యిది సరికాదు. భోజరాజీయము నందు మొత్తమేడాశ్వాసములు కలవు. వీనిలో ద్వితీయాశ్వాసము నందు మాత్రము భోజరాజ జన్మవృత్తాంతము మఱియు నతఁడు ధారానగరాధిపతియయిన పిమ్మట సర్పటి యనునొక యౌషధసిద్ధుని మోసగించి "ధూమవేధి" యను రసవాద విద్యను గ్రహించి యతనిచే శప్తుఁడయి, యనంతర మతని యనుగ్రహమునకుఁ బాత్రుఁడయి సిద్ధుని భోజనము సేయు మని ప్రార్థించును. భోజరాజీయమునందు భోజరాజు కథ యేతన్మాత్రమే. తక్కిన ఐదాశ్వాసము లందును సర్పటి తాను "పంచభిక్ష" వ్రతనియమము కలవాఁడు కావున భోజునింట భుజింపజాల నని తెలిపి, భోజరాజ డడుగఁగా సిద్ధుఁడతనికి భిక్షాటన మహాత్మ్యము, అన్నదాన ఫలము మున్నగువానిని వివరించు పలుకథలను జెప్పి, పిమ్మట మఱి నాలుగిండ్లలో భిక్షగొని తెచ్చుకొని భోజరాజు సహపంక్తిని భుజించుటతో నీ కావ్యము సమాప్త మగును. కావున నిందలి ప్రధానేతివృత్తము భోజరాజునకు సర్పటి పంచభిక్ష మహాత్మ్యమును, అన్నదాన ఫలమును దెలుపు కథలను జెప్పుట. తెలుఁగులోని ప్రసిద్ధ కావ్యములలో నిదియు నొకటి.

## విక్రమార్క చరిత్రము నందలి కథలు

జక్కన విక్రమార్క చరిత్ర మెనిమిది యాశ్వాసముల మహాకావ్యము. ఇందలి పద్యగద్య సంఖ్య 1500 పైచిల్లర. ఇందు విక్రమార్కుని సాహసపరాక్ర మౌదార్యాదులను వివరించు నద్భుత కథ లనేకములు వర్ణింపఁబడినవి. ఆశ్వాసాను సారముగ నిందలి కథాంశములు రేఖామాత్రముగ నీ క్రిందఁ దెలుపఁబడు చున్నవి.

I. ప్రథమాశ్వాసము :–(1) కథానాయకుఁడగు విక్రమార్కుని యొక్కయు నితని సోదరులగు వరరుచి, భట్టి, భర్తృహరి యనువారి జన్మ వృత్తాంతము.

II. ద్వితీయాశ్వాసము :– (1) విక్రమార్కుఁడు దిగ్విజయ తత్పరుఁడయి వింధ్య కేఁగి వింధ్య వాసినికి నమస్కరించి, ఆలయబహిః ప్రదేశమున వాలిసుగ్రీవులను రక్కసులను వంచించి దివ్యప్రభావ మహితము లగు యోగదండము, పాదుకలు రత్నపాత్రి మఱియు దివ్యకంథను సంపాదించుట.

(2) విక్రమార్కుఁడు యోగదండ ప్రభావమున మేరు సమీపమునఁ జంద్రగిరి యను నగరమును నిర్మించి, పాలించుచుండుట.

(3) పాదుకల సహాయమున బ్రహ్మసభ కేఁగి, యతని మెప్పించి, బ్రహ్మాస్త్రమును బడసివచ్చుట.

(4) ఉజ్జయిని కేఁగి కాళికాలయము కెలని కొలనిపై వ్రేలాడు నుట్టి చేరుల నొక్క వ్రేటునఁ దెగ వేసి దేవిని మెప్పించి, భట్టితోఁ గూడ నుజ్జ యిని రాజ్యమును వేయేండ్లు పాలించునట్లు వరమును, విక్రమాంక సాహసాంకుఁ డను బిరుదమును బడసివచ్చుట; ఉజ్జయినికి రాజగుట.

(5) ఇంద్రుని యాహ్వానమున స్వర్గమున కేఁగి, యతనివలన "ద్వాత్రిం శత్సాలభంజికా రంజితంబగు దివ్యసింహాసనము" బహుమతిగాఁ బడసి, దాని నధిష్ఠించి రాజ్యమేలు చుండుట.

(6) కనకస్తంభము నెక్కి సూర్యమండలమున కేఁగి, యతని వలన బంగారము నొసంగు రత్నకుండలములను బడసివచ్చి, వానినొక యర్థికి దానమిచ్చుట.

(7) మాయావరాహమును వెంబడించి పాతాళబిలముఁ జొచ్చి బలి చక్రవర్తి వలన రస, రసాయనములు కానుకగాఁ బొందివచ్చి, వాని నొక వృద్ధవిప్రున కొసఁగుట.

(8) మధురకేఁగి రక్కసునితోఁ బోరి కమలావతి యను నచ్చరను రక్షించి, యామె యొసఁగిన దివ్యమణిని పురందరుఁ డను వైశ్య కుమారున కిచ్చుట.

III. తృతీయాశ్వాసము :- (1) భార్య చేసిన వంచన వలన విరక్తుఁ డయి తపస్సునకుఁ బోవ నిశ్చయించుట - అను భర్తృహరి వైరాగ్య వృత్తాంతము.

(2) భర్తృహరి విక్రమార్కునకుఁ జెప్పిన, బహుశ్రుతుఁ డను మంత్రి నందభూపతిని బ్రహ్మహత్యా దోషము వలనఁ గాపాడిన కథ.

IV. చతుర్థాశ్వాసము :- (1) నారదముని యాదేశమున సిద్ధపురరాజును యుద్ధమునం దోడించి, విక్రమార్కుఁడు విదర్భ రాజపుత్రిక యగు అనంగవతిని వివాహమాడి సుఖముండుట.

V. పంచమాశ్వాసము :- (1) చిత్రకూటాద్రి కేఁగి కాళికను మెప్పించి విక్రమార్కుఁడు మౌనవ్రతుఁ డగు మునికి వరము లిప్పించుట.

(2) విక్రమార్కుఁ డశ్వమేధయాగము చేయుట; సముద్రుఁడు కానుకగా బంపిన నాలుగు దివ్యరత్నములను విప్రున కిచ్చివేయుట.

(3) విక్రమార్కుని యౌదార్యగుణ పరీక్షకు సంబంధించిన కథ.

(4) నరమోహిని యను వారనారిని రక్షించి యామెను కమలాకరునకు వివాహ మొనరించిన కథ.

VI. షష్ఠాశ్వాసము :- (1) మౌనవ్రత యగు కళావతి యను పాతాళ రాజపుత్రి వృత్తాంతము

(2) కళావతి మౌనమును భంగము చేయుటకై "దీపకంబము" చేత విక్రమార్కుఁడు చెప్పించిన రాగమంజరీ సింహళ రాజకుమారుల కథ.

VII. సప్తమాశ్వాసము :- (1) కళావతి మౌనమును రెండవసారి భంగము చేయుటకై విక్రమార్కుఁడు కర్పూరకరండముచేతఁ జెప్పించిన "రాజశేఖరుఁ" డను రాజకుమారుని వివాహకథ.

(2) పైదానికి అనుబంధముగాఁ గల కీరశారికల వివాదమునఁ బుట్టిన రెండు చిన్నకథలు.

VIII. అష్టమాశ్వాసము :- (1) మూడవసారి కళావతి మౌనమును భంగము చేయుటకయి విక్రమార్కుఁడు సువర్ణకలశము చేతఁ జెప్పించిన పద్మావతి, గుణావతి, లీలావతి యను నక్కసెల్లెండ్రగు ముప్వురు రాజపుత్రికల యొక్క "అనంగశాస్త్ర వైదగ్ధ్యము"ను ప్రదర్శించు కథ. ఈ కథ మాత్రము అసభ్యము, అవినీతికరము కూడ, కాని కథాకావ్యములఁ గొన్నింటను క్షేత్రమహాత్మ్య కావ్యములందుఁ గొన్నింటను నిట్టి సభ్యేతర కథాంశములు గోచరించు చుండుట వలనను, లాక్షణిక శిఖామణి యగు దండి దశకుమార చరిత్రము నందును నిట్టి వుండుటవల్లను నీ కావ్యములలో నిట్టి వుండుటయు నొక సంప్రదాయ మని యూహింపవలసి యుండును (?). మఱియు నీ కథాకావ్యములు సాధారణముగా భారతాదుల వలె విజ్ఞానదాయకములుగా నుండుట కంటె వినోదదాయకములుగా నుండునవిగా నుద్దేశింపఁ బడినవగుటయు నిందులకుఁ గారణాంతరముగా నూహింపవచ్చునేమో !

పైఁ గథాంశములను బరిశీలించినచో నీ విక్రమార్క చరిత్రము నందు సుమారొక యిరువది కథ లున్నట్లు మనము తెలిసికొన గలము. అంతమాత్రము చేత దీని మహాకావ్యత్వమున కెట్టి లోపమును సంక్రమింపదు. మహాకావ్యము నందు భిన్నకథ లనేకము లుండుట దోషము కాదనుటకు మహాకవి కాళిదాసు "రఘువంశ"మే ప్రబల తార్కాణము. ఇంతేకాక రఘువంశము నందు ఒకే వంశమునకుఁ జెందిన 22రు రాజుల వర్ణనాంశములు కలవు. ఇందట్లు గాక ఈ యిరువది కథాంశములును నాయకుఁ డగు విక్రమార్కుని గుణౌదార్యాదులను బ్రశంసించునవే యగుట నిందు వస్త్వైక్యత కలదనుటలో సందేహము లేదు. హరవిలాసమును నిట్టిదే కదా !

## కథానాయకుని గుణగణములు

ఏతత్కావ్య నాయకుఁ డగు విక్రమార్కుఁడు పౌరాణిక పురుషుఁడు కాక చరిత్ర ప్రసిద్ధుఁడు. విక్రమ శక మితని పేరఁ బుట్టినదే. సాహసపరాక్రమౌదార్యాది గుణసంపత్తిచేత లోకోత్తరుఁడు. నిజఫాలతలాగ్ర చర్మమును ఖడ్గముతోఁ జీల్చి చూపిన విక్రమార్కుని సాహసమున కచ్చెరువంది బ్రహ్మ యిట్లు ప్రశంసించెను.

> "ఆర్వురు చక్రవర్తులు పదార్వురు రాజులు విశ్వధారణీ
> నిర్వహణ ప్రభావమున నేర్పరులైనను, వీని సాటియే
> సర్వఫల ప్రదానమున సాహసికత్వరమా సమగ్రతన్
> గర్విత పీఠవైరిచయ ఖండన మండన విక్రమ క్రియన్. (ఆ. 2-34)

మఱియు

"ఈ యిల ధర్మరక్ష వెలయింపఁ జనించిన యట్టి యాదినా
రాయణమూర్తివీవు, భవదంఘ్రి సరోరుహ సేవయ మై
జేయఁగ నాత్మఁగోరి సరసీరుహగర్భుఁడు పుట్టె భ ట్టయై;
పాయక జోఁడుగూడియిలఁ బాలనసేయుట మీకు న్యాయమా." (ఆ.2-64)

అని సర్వేశ్వరి యగు కాళికా వాక్యము. మఱియు బలిచక్రవర్తి కూడ

"బలము ప్రతాపమీగి దయ భాతి విభూతి వినీతి ధర్మని
శ్చలత కళావిశేషము నిజంబవధానము మాన మాదరం
బెలమి యనం బొగడ్తగల యిన్ని గుణంబులఁ గీర్తికెక్కు, నీ
విలభరియింపఁగా జనులకేల విచారము, భూతలేశ్వరా!" (ఆ. 2-147)

అని విక్రమార్కుని గుణగణమును గీర్తించెను. వేయేల ?

పాడిసమస్తముం బొగడఁ బాయక యాశ్రమవర్ణధర్మముల్
జాడలు దప్పకుండ మఱి సజ్జనరక్షణ దుష్టశిక్షణ
క్రీడలె భూషణంబులుగఁ గీర్తివహించె ధరిత్రి నవ్విభుం
డేడవచక్రవర్తి పదునేడవరాజునునై మహోన్నతిన్." (ఆ. 8-12)

అను కీర్తికిఁ బాత్రుఁడయినవాఁడు విక్రమార్క మహారాజు. మఱియు,

"కనుఁగొనినవేయి, మాటా
డినఁ బదివే, ల్గుడువలక్ష, డెందము ప్రమదం
బునఁ బొందినఁ గోటిధనం
బనయము నర్థులకు విక్రమార్కుం డొసఁగున్." (ఆ. 2-19)

ఇట్టి దాతృత్వ మనన్యసామాన్యముఁ గదా !

## విక్రమార్క చరిత్రము – ప్రబంధ రచనామార్గము

ఏవంవిధ గుణగణ విభూషితుఁ డయిన విక్రమార్కుని సమస్త జీవితవృత్తాంతమును వెనుక వివరింపఁబడిన యిరువది కథాంశముల వర్ణనముతో విక్రమార్క చరిత్రమును జక్కన యొక మహాకావ్యముగా సంతరించెను. ఇంతకుఁ బూర్వము దీనిని కథాకావ్య మంటిని. ఐనఁ బ్రమాదము లేదు. కథాకావ్యమును మహాకావ్యభేదమే. మహాకవి బాణుని కాదంబరి కథాకావ్యమే. కావున జక్కన విక్రమార్క చరిత్రమును మహాకావ్యమే. మహాకావ్యమే యననేల? దీని నతఁ డొక మహాప్రబంధ ప్రాయముగానే నిర్మించె ననుట సత్యదూరము కాదు.

## రసము - వర్ణనలు

ఇందలి కథ లన్నియును నాశ్చర్యాపాదకము లగుట నిందలి యంగిరస మద్భుతము. వీరశృంగారాదు లితరము లంగరసములు. విక్రమార్కుఁడు రక్కసు లతోఁ బోరిన సందర్భము లందు వీరము చవి చూపింపఁ బడినది. ద్రౌపదిని పాంచాలరాజు పార్థునకు భార్యగా యజ్ఞమునఁ బడసినట్లు, విక్రమార్కునకు భార్యగా నొసఁగుటకై విదర్భరాజు వరమునఁ బడసిన అనంగవతినిఁ బెండ్లాడఁ గోరి విదర్భపై దండెత్తిన ప్రతినాయకుఁ డగు సిద్ధపుర రాజుపై విక్రమార్కుఁడు దండెత్తిపోయినప్పు డుభయ సైన్యములకును జరిగిన సంకుల సమరమును జతుర్థాశ్వాసము (ప. 40-128) నందు సుమారు 90 పద్యములలో నతిదీర్ఘముగఁ దిక్కన మార్గము ననుసరించి వీరరసము తొణకాడునట్లు వర్ణించినాఁడు. పిదప నీ యాశ్వాసము నందే యుద్ధమున విజయలక్ష్మిని వరించిన విక్రమార్కునకును అనంగవతికిని జరిగిన వివాహమహోత్సవమును జక్కన సమస్తవైదిక లౌకిక సంప్రదాయానుసారముగా (ప. 131-200) సుమారు డెబ్బది పద్యములతోఁ గడు మనోహరముగా వర్ణించియున్నాఁడు.

వివాహానంతరము విక్రమార్కుఁడు భార్యతో నిజపుర ప్రవేశ మొనరింపఁగాఁ బురస్త్రీలు రాజును జూడవచ్చుట మున్నగునవి శృంగార ప్రధానముగా ప్రబంధ మార్గమున వర్ణింపఁ బడినవి. అనంతరము సూర్యాస్తమయ, చంద్రోదయ వర్ణనములు కలవు. పిమ్మట కేళీగృహ తల్పగతుఁ డయి రాజుండఁగా సఖు లనంగవతిని శయ్యాగృహమునకుఁ దోడి తెచ్చుట మొదలుకొని విక్రమార్క భూపతి 'సకలశాస్త్రమత కళా పారంగతత్వము' మఱియు 'చతురశీతికరణ ప్రౌఢి' వర్ణన పర్యంత (ప. 200-225) మభివర్ణింపఁ బడినది. పంచమాశ్వాసము నటి 60 పద్యములలో అనంగవతీ విక్రమార్కుల ప్రమదావనవిహార, లీలా శైలారోహణ, డోలారోహణ, పుష్పాపచయ, జలకేళీ వ నాదులు శృంగార ప్రధానముగ ప్రబంధఫక్కినిఁ గావింపఁ బడినవి; విక్రమార్కుఁడు యుద్ధయాత్రకు బయలుదేరుటకు ముందు చతుర్థాశ్వాసాదిలో అనంగవతి సౌందర్యవర్ణనము (ప. 16-19), వర్షర్తు (ప. 26-35), శరదృతు (36-39) వర్ణనలును, పంచమాశ్వాసము మొదట వసంతర్తు వర్ణనమును గావింపఁబడినది. ఇట్లేంచుమించుగా చతుర్థాశ్వాసము మొత్తమును మఱియుఁ బంచమాశ్వాసము మొదటి 60 పద్యములను గలిపి ముద్రించిన యెడల నిది యొక ప్రత్యేక ప్రబంధమే కాఁగలదు. కావున రాయల యుగపు ప్రబంధ రచనకు మార్గదర్శకు లయిన వారిలో జక్కనయు నొక్కఁ డనుట నిక్కము.

# 21

## విక్రమార్క చరిత్రము - మల్లన రాజశేఖర చరిత్ర కథకు మూలము

అష్టదిగ్గజ కవులలో నొకఁడుగాఁ బరిగణింపఁ బడుచున్న మానయగారి మల్లనకవి కృతమగు 'రాజశేఖర చరిత్ర' మొక ప్రబంధము. రాజశేఖరుఁ డను రాజకుమారుఁడు తాను గాంచిన కాంతిమతి యను రాజకన్యకను ప్రేమించి వివాహ మగుటయే యిందలి ప్రధాన కథావస్తువు. ఈ కథకు మూలము కలదా? లేక యిది కల్పితమా? యను విషయములను గూర్చి శ్రీ వీరేశలింగము పంతులు గారు ఆలోచించి యుండలేదు. ఈ విషయమును గూర్చి శ్రీ సేకుమళ్ళ అచ్యుత రావుగారు ప్రత్యేక శ్రద్ధ వహించి, పరిశోధించి, రాజశేఖర చరిత్రము కల్పిత ప్రబంధ మని నిర్ణయించిరి. కథాకల్పనమును గూర్చిన వారి యభిప్రాయ మిట పొందుపఱుపఁ బడుచున్నది.

"ఈ గ్రంథ మందలి కథేతివృత్తమే పురాణము నుండి గాని, ఏ కథాకోశము నుండి గాని తీసికొనఁ బడినదో తెలియరాలేదు. అనేక పురాణములను, కథాసరిత్సాగరాది కథాగారములను పరిశోధించితిని. కాని యీ కథను మాత్ర మెను గనుఁగొనలేక పోయితిని. బండారు తమ్మయ్యగారు సైతము దీని మూలకథ నెచ్చటను గానఁబడ లేదనియే తెలిపిరి. కావున నీ కథ కవికల్పితమనియే యిప్పటివఱకు నూహింప వలసియున్నది." (ఆంధ్రవాఙ్మయ చరిత్రము. భా.౨., పు-౩౦౮). 'ఈ కథ నీ కవి నూతనముగాఁ గల్పించినను ప్రశంసాపాత్రము లగు నంశములు గోచరింప'వని మఱొక వాక్య మిందే కలదు. ఇట్లు వీరు దీనినిఁ గల్పిత కావ్య మనిన నాటినుండియు రాజశేఖర చరిత్రము కల్పిత కావ్యమే యను నభిప్రాయ మాంధ్రసాహిత్య లోకమున స్థిరమయిపోయి నేటికి నిది యిట్టిదిగానే తలపఁ బడుచున్నది.

కాని వాస్తవమునకు రాజశేఖర చరిత్రము మూలరహితమైన కల్పిత ప్రబంధము కాదు. ఇందలి కథ మిగులఁ బ్రాచీనమే. కాని పౌరాణికము కాదు. మల్లన రాజశేఖర చరిత్ర కథకు మూలభూతమయిన చిన్న కథ యొకటి 'కథాసరిత్సాగరము' నందే కలదు. (లంబ. 12; తరం. 10; బేతాళుని కథ. 8) కాని ఈ రెండు కథలను మాత్రమే పోల్చి చూచినచో శ్రీ అచ్యుతరావుగారు వ్రాసినట్లు వీని పరస్పర సంబంధము గుర్తించుట యెవ్వరికిని సాధ్యము కాదు. వీని యందలి నాయికా నాయకుల పేళ్లు కూడ పూర్తిగ భిన్నముగ నుండుటయే యిందులకుఁ గారణము. కాని జక్కన విక్రమార్క చరిత్రము సప్తమాశ్వాసము మొదటఁ గల రాజశేఖరుని కథను జదివిన పిమ్మట కథాసరిత్సాగరము నందలి కథను గూడ పోల్చుకొనుటకు వలయు సాధారములు మనకు లభింపక పోవు. కావున విక్రమార్క చరిత్రము నందలి రాజశేఖరుని కథ దిగువ సంగ్రహింపఁ బడుచున్నది.

# 22

## విక్రమార్క చరిత్రమునందలి రాజశేఖరుని కథ

కథోత్పత్తి హేతువు :— కళావతి యను నాగలోక కన్యక యొక్క మౌన వ్రతమును భంగము చేసి, యామెచే రెండవసారి పలికించుటకయి విక్రమార్కుఁడు 'కప్పురపు బరణికి' నిజ మంత్రశక్తిచేఁ బ్రాణము పోసి యొక కథ చెప్పుమని కోరఁగా నది యీ క్రింది కథఁ జెప్పెను.

వంచక (అవంచక) మను బురమును విక్రమకేసరి యను రాజు పాలించు చుండెను. ఆయన రాణి ఉమావతీ మహాదేవి. వారికి రాజశేఖరుఁ డను పుత్రుఁడు కలిగెను. రాజశేఖరుఁడు పితృమార్గము ననుసరించు ఉత్తమ క్షత్రియుఁడు. ఒకనాఁ డతఁడు సైన్యముతో వేఁట కేగెను. వేఁటాడుచుఁ బోయి పోయి పార్వతీదేవి మందిరమును గాంచి, దేవికి మ్రొక్కి, యాచెంత నొక రాచిలుకతోఁడ సంభాషించుచున్న యొక యోగిని గని, సమీపించెను. ఆ చిలుక "యఱువది నాలుగు విద్యల నెఱవాది యనియుఁ, ద్రికాలవేది" యనియుఁ జెప్పి దాని నా యోగిని రత్నపంజరముతోఁ గూడ రాజశేఖరున కొసఁగెను.

అంత రాజశేఖరుఁడు దేవ్యాలయ సమీప లతాగృహమున విశ్రమించి, యా చిలుకను జూచి కుతూహలముతోఁ దన భావిఫలప్రాప్తినిఁ గూర్చి ప్రశ్నింపఁగా నది యిట్లు చెప్పెను. "సత్యధర్ముఁ డను అవంతీ పురాధీశుని కూఁతురగు కర్పూరమంజరి నీకు భార్య కాఁగలదు. వైవాహిక వార్తయు నిప్పుఁడే రాఁగలదు". అని చెప్పుచుండఁగనే చతురిక యను చెలికత్తె దూతికఁగా వచ్చి రాకుమారునకు మ్రొక్కి కూర్చుండెను. అంత నామెను జూచి, చిలుక

"పలుకులనేర్పునం జెవుల పండువు చేసితివింతసేపు నా
పలుకుశిలాక్షరంబుగ శుభంబది శీఘ్రముగాఁగ నంతయుం
దెలియఁగఁ జెప్పు మింక భవదీయ సమాగమన ప్రసంగముల్
జలజదళాక్షి యేమిటికిఁ జల్లకు వచ్చియు ముంతదాఁపఁగన్".

అని పలుకరింపఁగా విని యచ్చెరువంది యా సుందరి యిట్లు విన్నవించెను. "సత్యధర్ముఁ డవంతి దేశాధిపతి. అతని రాణి లీలావతి, వీరికిఁ గర్పూరమంజరి యను తనూజ కలదు. ఆమె సకల విద్యలు నేర్చిన యందకత్తె. ఒకనాఁడు చెలులతోఁ గూడి మన్మథ పూజకయి యామె శృంగార వనమున కరిగెను. అచ్చటఁ జిలుకకుఁ బురాణకథలు చెప్పుచున్న యొక శారికను జూచెను. రాజపుత్రిక సమీపింపఁగా నది యామె చేతఁజిక్కెను. రాజకుమారి దాని కళాకుశలత్వమునకుఁ గారణ మడుగఁగాఁ దాను సరస్వతీదేవి చేతి చిలుకచేతఁ బెంపఁ బడితి ననియుఁ, ద్రికాలవేది ననియుఁ జెప్పెను. అది విని కర్పూరమంజరి తనకుఁ గాఁబోవు పతినిఁ

గూర్చి ప్రశ్నింపఁగా నది యావంచక రాజసుతుఁ డగు రాజశేఖరుఁడు భర్త కాఁ గలఁడని తెలిపి యతని గుణరూపాదులను బ్రశంసించెను. ఇట్లు శారిక వలన మీ వృత్తాంతమును విని, రాజపుత్రి విరహబాధకుఁ గుఱి కాఁగా, చెలు లా విషయము నామె జనకున కెఱిఁగింప నా రాజు మిమ్ము తోడ్కొని తేర నన్నుఁ బంపె" నని చెప్పి చతురిక మిన్నకుండెను.

రాజశేఖరుఁడు సంతోషించి పరివారముతోఁ జతురిక ననుగమించి, అవంతి పురాంతి కోద్యానమున విడిసియుండఁగాఁ జతురిక యరిగి యా వార్త దెలిపి రాజకుమారిక నలంచెను. సత్యధర్మ విభుఁడు అల్లు నెదుర్కొని తెచ్చి పుత్రిక నొసఁగి వివాహ మొనరించెను. ఇట్లు వివాహితుఁ డయి రాజశేఖరుఁడు భార్యతో గూడ ఆవంచక పురి కరిగి సుఖముండెను.

ఇది జక్కన వర్ణించిన రాజశేఖరుని ప్రధాన కథ. దీని చివఱ శుకశారికల వివాదమునకు సంబందించిన మఱి రెండు చిన్న కథలు గలవు. అందుఁ బురుషులు పాపాత్ము లనుటకు నిదర్శనముగా శారిక చెప్పిన కథ మొదటిది. స్త్రీలే పాపాత్మ లనుటకు శుకము చెప్పిన కథ రెండవది. ఈ రెండును రాజశేఖరుని కథతో సంబంధించిన వే. రాజశేఖరుని వివాహ కథను మాత్రము జక్కన కవి చక్కని వర్ణన లతో శృంగారప్రధానముగా 74 పద్యములలో వ్రాసెను,

పరిశీలింపఁగా 'కథాసరిత్సాగము నందు త్రివిక్రమసేనునకు బేతాళుఁడు చెప్పిన సంగ్రహ కథనే గ్రహించి జక్కన దానినిఁ గొంత మార్చి, పెంచి విక్రమార్క చరిత్రమునఁ జేర్చెనని తోఁచును.

కథా సరిత్సాగము నందలి కథ :—

సందర్భము—'త్రివిక్రమసేనుని మౌనమును భంగము చేసి యతనితో మాట లాడించుటకు బేతాళుఁ డీ క్రింది కథఁ జెప్పెను.

కథ :- పాటలీపుత్రమును 'విక్రమకేసరి' యను రాజు పాలించుచుండెను. ఆయన యొద్ద 'దివ్యజ్ఞానము' కలదియు 'సర్వశాస్త్రకోవిద'యు నగు చిలుక 'విదగ్ధ చూడామణి' యనునది శాపవశమున నాజన్మ మెత్తినది యొకటియుండెను దాని యుపదేశమున నా రాజకుమారుఁడు తనకుఁ దగిన మగధరాజు పుత్రికను 'చంద్రప్రభ' యను దానిఁ బెండ్లాడెను. ఆమెయొద్దను 'సర్వవిజ్ఞానశాలిని' సోమిక యను పేరుఁగల గోరువంక యుండెను'. ఇది ప్రధాన కథ. దీని చివఱఁ గూడ శుకశారికల వివాదమునఁ బుట్టిన, పురుషులే పాపాత్ము లనుటకు గోరువంకయు, స్త్రీలే పాపాత్మ లనుటకుఁ జిలుకయుఁ జెప్పిన రెండు కథలును గలవు.

సామ్యము .- పై రెండు కథలును మౌనవ్రతమును భంగము చేయుటకు

నుద్దేశింపఁ బడినవి. ఈ రెంటి చివఱను శుకశారికల వివాదమునఁ బుట్టిన రెండను బంధకథలు నొకే విధమునఁ గలవు. ఇఁక కథాసరిత్సాగరము నందలి కథానాయకుఁడు విక్రమకేసరి యని యుండగా జక్కన కథానాయకునకు రాజశేఖరుఁ డను క్రొత్త పేరిడి, 'విక్రమకేసరి' నామము నతని జనకున కొసఁగె ననుట యూహ్యము. నాయకుని యొద్ద దివ్యజ్ఞానము గల చిలుకయు, నాయిక యొద్ద నట్టిదే యగు గోరువంకయు రెంటి యందును సమానముగాఁ గలవు. ఈ శుకశారికలు నాయికా నాయకుల వివాహ సంధానమునఁ బాల్గొనుట రెండు కథల యందును గనవచ్చును. ఈ పై సామ్యబాహుళ్యము ననుసరించి జక్కన రాజశేఖరుని కథకుఁ గథాసరిత్సాగము నందలి విక్రమకేసరి కథయే మూల మనుట నిస్సంశయము.

మల్లన రాజశేఖర కథలోని ప్రధానాంశములు :- జక్కన కథానాయకుఁడగు 'రాజశేఖరుఁడే' మల్లన రాజశేఖర చరిత్ర ప్రబంధ కథానాయకుఁడు. గ్రంథమునకును మల్లన నాయకుని నామమే పెట్టెను. రాజశేఖరుని పురనామము 'వంచక' యనియు 'అవంచక' యనియు నిరుతెఱఁగుల జక్కన పేర్కొనఁగా మల్లన దీనిని 'అవంచి అవంచిక' మని రెండు విధములఁ జెప్పెను. 'అవంచక' మనునది రెంటను సమానము. రాజకుమారి చెలికత్తె యగు దూతికకు జక్కన యొసఁగిన 'చతురిక' నామమునే మల్లన గ్రహించెను. పై నామములలో నెవ్వియును కథాసరిత్సాగర కథలో లేక, విక్రమార్క చరిత్రము నందే యుండుటవలన వాని నట నుండియే మల్లన గ్రహించినట్లు తలంచుటయే సమంజసము. వీనితో పాటు యోగినివృత్తాంతము, దివ్యజ్ఞానము గల శుకమును విక్రమార్క చరిత్రము నందు వలెనే రాజశేఖర చరిత్రము నందును గలదు. మఱియును జక్కన చెప్పిన రాజశేఖరుని కథయే కొలది భేదముతో రాజశేఖర చరిత్రము నందును సమగ్రముగాఁ గలదు. పైనిఁ దెలిపినవి కాక జక్కన కథలోని తక్కిన పేర్లను మల్లన పూర్తిగా మార్చివేసెను. ఇట్లే రాజశేఖరుని నామమును గూడ మల్లన మార్చియుండెనేని, యీ ప్రబంధ కథకు జక్కన వర్ణించిన రాజశేఖరుని కథ మాతృక యని గుర్తించుట సాధ్యము కాకుండెడిది.

ఈ రాజశేఖరుని కథను మల్లన దానొక ప్రత్యేక ప్రబంధముగాఁ బెంచి వ్రాయ సంకల్పించిన వాఁడు కావున కొన్ని నూత్న కథాంశములను గల్పించియు, వర్ణనాదులను జేర్చియు మూఁ డాశ్వాసములకుఁ బెంచి రాజశేఖర చరిత్ర ప్రబంధమును రసవంతముగా రచించెను. ఇది యొక ప్రత్యేక ప్రబంధ మగుట నిందలి సమస్త కథ నిట వివరించుట యనవసర మని తలఁచి విరమించితిని. ఇఁక సర్వసామాన్యముగఁ దలఁపఁ బడుచున్నట్లు మల్లన రాజశేఖర చరిత్ర కల్పిత ప్రబంధము కాదనియు, నిందలి కథకు మూలము జక్కన రాజశేఖరుని కథ యనియు,

మఱియు దానికి కథాసరిత్సాగరము నందలి విక్రమకేసరికథ మూల మనియు, మఱియు మనుచరిత్ర కథకు మార్కండేయ పురాణ మెట్టిదో మల్లన రాజశేఖర చరిత్రకు, జక్కన విక్రమార్క చరిత్రము నట్టిదే యని తెలుపుటయే యింత వఱకుఁ గావింపఁ బడిన కథావిషయ వివరము యొక్క ముఖ్యోద్దేశము.

## జక్కన చేసిన ప్రబంధ వర్ణనలు

ఈ విక్రమార్క చరిత్రము నద్భుతావహము లగు ననేక కథలచే నాకర్ష వంతముగఁ జేసి నవరసభరిత మొనరించి యాస్వాదనీయముగ నొనరించుటే కాక జక్కన దీనిని నానావిధ వర్ణనాదులచేఁ గడు మనోహరము గావించెను, ఇపు డిందలి వర్ణనములను గూర్చి కొంత దెలుపఁ బడును.

"నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్
ఉద్యానసలిలక్రీడా మధుపానరతోత్సవాః
విప్రలంభోవివాహాశ్చ కుమారోదయవర్ణనమ్,
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయా అపి.
ఏతాని యత్రవర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే,
ఏషామష్టాదశానాంయైః కైశ్చిదూన మపీష్యతే".

మహాకావ్య, మహాప్రబంధముల యందుఁ బై యష్టాదశ వర్ణనములలో నన్నిగాని, కొన్ని తక్కువగఁ గాని యుండవలె నని యాలంకారికుల మతము. విక్రమార్క చరిత్రము నందు జక్కన యించుమించుగా నుపర్యుక్త వర్ణనముల నన్నిఁటినిఁ జేయుట మాత్రమే కాక సందర్భానుసారముగ నితర సాధారణ వర్ణనము లనేకములు నిందుఁ జేర్చినాఁడు. అట్టి ప్రధానాప్రదాన వర్ణనలకుఁ గ్రమముగా గ్రంథసందర్భములు దిగువఁ జూపఁబడు చున్నవి.

అష్టాదశ వర్ణనములు :

1. పురవర్ణనము :- మథురానగర వర్ణనము నీకవి యత్యంతాసక్తితో సుమారు 44 పద్యములతోఁ గావించినాఁడు. (ఆ. 1. 64-100)

ఇంతటితోఁ దనివిసనక తర్వాతిదగు దీర్ఘవచనము (ప. 101) చేతను మధురాపురిని సాంగోపాంగముగ వర్ణించెను. ఈ వచనము నందు బాణుని కాదంబరి శైలి ననుసరించి శ్లేషానుప్రాణిత మగు ఉపమా, విరోధాభాసాద్యలంకారాదులు హృద్యముగాఁ గూర్పఁబడినవి. సంస్కృత గద్యకావ్యములు జటిలదీర్ఘసమాస ఘటితములయి యర్థావబోధమునఁ బండితులకే క్లేశదాయకములుగ నుండుటచేఁ గాబోలు; ప్రాచీనాంధ్ర కవులట్టివాని ననువదించుటకుఁ గాని, యట్టి గద్యకావ్యము

లను ప్రత్యేకముగ రచించుటకుఁ గాని పూనుకొనక తమ పద్యకావ్యముల యందే యెడనెడ నట్టి వచనఖండముల నభినివేశముతో రచించియుందురు.

మథురావర్ణనము గాక యిందు ఉజ్జయినీ (ఆ.2-41, ఆ.8-112); వంచక (ఆ. 7-7); అవంతి (ఆ. 7-47); కాంచీ (ఆ. 7-112-118); విక్రమసింహము (ఆ. 7-112) లను పురములును వర్ణింపఁబడినవి.

2. సముద్ర వర్ణనము : (ఆ. 5- 12).

3. శైలవర్ణనము : శ్రీశైలపర్వతము (ఆ. 1-196-201); మేరుశైలము (ఆ. 2-18) లిందు వర్ణింపఁబడినవి.

4. ఋతువర్ణనము : వర్షర్తువు (ఆ. 4-26)· శరద్వర్ణము (ఆ. 4-36-39); వసంతర్తు (ఆ. 5-3-16).

5. చంద్రోదయ వర్ణనము : చంద్రోదయము (ఆ. 6-67); చంద్రిక (ఆ. 6-69-71).

6. సూర్యోదయాది వర్ణనము : సూర్యోదయము (ఆ. 2-107, ఆ. 3-105); సూర్యాస్తమయము (ఆ. 3-8 ); సూర్యాస్తమయ తమోవర్ణనము (ఆ. 6-62-66); అంధకారము (ఆ. 7-150); సూర్యమండలతాప వర్ణనము (ఆ. 2-112).

7. ఉద్యాన విహారము . (ఆ. 5-13-35, ఆ. 8-32).

8. జలవిహారము : (ఆ. 5-38-64).

9. మధుపానము : (?)

10. రతోత్సవము : చతుర్థ, అష్టమాశ్వాసములు.

11. విరహము : (ఆ. 7-62, 64).

12. వివాహము : (ఆ. 4-181-200). అతిదీర్ఘమును, సాంగోపాంగ మయిన వర్ణనము.

13. సుతోదయము : (ఆ. 1-1 0-184).

14. మంత్రాలోచనము : (ఆ. 4-118-123).

15. దౌత్యము : (ఆ. 4- 53-73)

16. యుద్ధయాత్రావర్ణనము : (ఆ. 4- 75-83)

17. యుద్ధవర్ణనము : (ఆ. 4- 84-125)

18. నాయకాభ్యుదయము : (ఆ. 4- 126-129).

పై పట్టిక వలన అష్టాదశవర్ణనములను జక్కన సుమారు 360 పద్యములలో గావించినట్లు తెలియవచ్చును. వీని యందును వనవిహార, జలవిహార, ఋతు, యుద్ధ పుర, వివాహ వర్ణనలు క్రమముగా నుత్తరోత్తర దీర్ఘములు.

ఇతర వర్ణనములు :

స్త్రీ వర్ణనము ; ఆ. 1. 116-119; ఆ. 4. 16-19; ఆ. 5, 169-173; ఆ. 5. 44-49; ఆ. 7. 36; ఆ. 7. 40-46; ఆ. 7. 53-60; ఆ. 8. 42-46.

రాజవర్ణనము : ఆ. 1-102; ఎఱుకు వర్ణము ఆ. 1-23; వృద్ధబ్రాహ్మణ వర్ణనము ఆ, 2-117, 155; నారదవర్ణనము ఆ. 4-3; విప్రకుమార వర్ణనము ఆ. 7-43; విటవర్ణనము ఆ. 8-6,7; ఇవిగాక తాపసులు, రాక్షసులు మున్నగాఁ గల పురుషవర్ణన లనేకము గలవు.

వరాహవర్ణనము . ఆ. 2. 1 5, 126; 133; ఆ. 3-75
నాట్యవర్ణనము . ఆ. 2. 89, 91
అశ్వమేధయాగ వర్ణనము : ఆ. 5. 93-136
పరిమళవాయు వర్ణనము : ఆ. 6-63
కోడికూత . ఆ. 6-73
యోగినీవర్ణనము : ఆ. 7-14
శుకవర్ణనము : ఆ. 7-26
భోజనవర్ణనము . ఆ, 4-188
రోదనవర్ణనము : ఆ. 7-153

పుణ్యతీర్థక్షేత్ర దేవతావర్ణనము : కాశీవర్ణన ఆ. 2. 189 - 194; శ్రీశైలవర్ణనము ఆ. 2. 198-206; అహోబలము ఆ. 2. 208-212 మఱియు కాళహస్తి, శ్రీరంగము, అనంతశయనాది పుణ్యక్షేత్ర వర్ణనములిందు భక్తిరసప్రధానముగఁ జేయఁ బడినవి. హేమకూట విరూపాక్ష వర్ణనములు నిందు గలవు. ఇందలి యీ ఘట్టములు పండితారాధ్య చరిత్ర, నృసింహపురాణ, కాశీఖండ, కాళహస్తి మహాత్మ్య, పాండురంగ మాహాత్మ్యాదులలోని వర్ణనలను దలఁపునకుఁ దెచ్చును. ఇట్టి వర్ణనలచేత జక్కన తన కావ్యమునఁ బవిత్రవాతావరణమును సృష్టించెను. నన్నెచోడుని వలెనే దీనిని జక్కన శ్రీకారముతోఁ బ్రారంభించి 'మంగళమహాశ్రీ' వృత్తముతో ముగించుట గమనింపఁదగియున్నది.

ఇతర వర్ణనలలో ముఖ్యము లని భావించినవి మాత్రమే యిచటఁ దెలుపఁ

బడినవి. ఇక జక్కన యొక్క పద్యరచనా పాటవము, వర్ణనావైదగ్ధ్యము, పాండిత్యము, ప్రతిభ, భావనాశక్తి, శబ్దార్థాలంకార ప్రీతి, శ్లేషయమక ఘటనా నైపుణి మున్నగు కవితా గుణములను స్ఫురింపఁ జేయు కొన్ని పద్యములు మాత్ర మిట నుదహరింపఁ బడును. వానిఁ జదివి సహృదయు లగు పాఠక మహాశయులు జక్కన కవితాశక్తి నవగాహనము చేసికొందురు గాక!

వర్షర్తువర్ణము :

ప్రథమోదబిందులఁ బల్లవించె ననంగ
నింద్రగోపద్యుతి నిలఁ దనర్చె
భానుచంద్రుల మూడుపట్టె గెల్చెననంగఁ
గంధరపటలాంధకార మడరె
జలదానిలంబునఁ బులకించెనో యనఁ
గుటజభూజంబుల కోరగించె
స్తనితమర్దళరవంబునకు నాడెననంగ
వనమయూరములు నర్తనముచేసెఁ
బాంధజనచిత్త చిత్తసంభవ మహాగ్ని
ఘనతరజ్వాల జాలానుకరణ నిపుణ
వివిధవిద్యుత్పరంపరా విభ్రమంబు
లఖిలహరిదంతరంబుల నతిశయిల్లె. (ఆ. 4-31)

దళితానంతదిగంతమై ఘుమఘుమధ్వానంబు సంధిల్లగాఁ
గలయం బాములత్రేలఁ గట్టినటు, లుగ్రవ్యాగ్రకీల న్నిర
ర్గళధారాళకరాళమై కురిసెవర్షం బెందు నేయింటివా
రలుఁబొర్గింటికి నేఁగకుండఁగ నహోరాత్రంబుఁ జిత్రంబుగన్.
(ఆ. 4 – 32)

గగనరత్నముకట్టు మొగులుతో నుదయించెఁ
జరమదిక్కునఁ దోఁచె శక్రధనువు
పూర్వాపరవ్యాప్తిఁ బొలుపారె జలరేఖ
లాలోలగతివీచె మూలగాలి
మెఱుఁగు మొత్తంబులు మెఱసె నుత్తరమునఁ
గడఁగె దక్షిణపు మేఘముల గములు
ప్రాలేయభానుండు పరివేషగతుఁ డయ్యెఁ
జాతకంబులు నింగి సంచరించె

నెఱల పెనుపట్టె నేలపైఁ గొఱలఁ జొచ్చె
మొనసి చీమలగమి గ్రుడ్డు మోవఁ దొణఁగెఁ
గుజము కొనకొమ్మడిగి క్రిందికొమ్మ మీఁది
నిలువుఁ గైకొను పులుఁగుల యెలుఁగు లెచ్చె. (ఆ. 4-27)

శరదృతువు నందలి ఒక దృశ్యము :

బాలలు లీలతో బలుసుఁ బండులచాయఁ దనర్చి పండి కై
వ్రాలిన రాజనంబులకు వచ్చుశుకంబులఁ జేరనీక పోఁ
దోల రవంబుతోఁ జెఱకుఁదోఁటల నీడలనుండి పాడి రు
న్మీలిత హావభావరమణీమకరాంకుని సాహసాంకునిన్. (ఆ. 4-39)

వసంతర్తు వర్ణనము .

రాజకీరకుమారరాజి కతురశిత
యొసరింపవచ్చిన యొజ్జయనఁగఁ
గలకంఠ నికురంబకములకు వాకట్టు
విడిపింపవచ్చిన వెజ్జనంగఁ
దరులతాదులకు వార్ధకము మానఁగ మందు
సేయంగవచ్చిన సిద్ధుఁడనఁగ
సంప్రణయక్రోధ జంపతి నివహంబు
గలుపవచ్చిన చెలికాఁడనంగ
మందమారుతోద్ధూతమరందబిందు
సిక్తషట్పదఝంకారవ శ్రీవిలాస
మకరకేతుప్రతాప సమగ్రమై, వ
సంత మేతెంచె సంతతోత్సవ మెలర్ప. (ఆ. 5-3)

కాముకులుఁ గామినులుసుం
గామాతురు లగుట యరుదె? ఘనతరులతికా
స్తోమము ప్రేమము గైకొనె!
నామని నబ్జజునకైన నలవియె పొగడన్. (ఆ. 5-10)

ఉద్యానవిహారము :

మంజరీస-జాతమకరందమధుమత్త
చంచరీకద్వంద సంభ్రమములఁ
గోరకితానేక కోమలవల్లికా
వేల్లితభూజాత విలసనముల

సహకారఫలరసాస్వాదన సంతుష్ట
శుకసతీపతిరుతి ప్రకటనములఁ
గిసలయాంకుర రసగ్రసన సముత్కంఠ
కలకంఠ విటవిటీ కలకలములఁ
గనియు వినియు వసంతసంక్రాంతరాగ
సర్వసామాన్యమహిమ కాశ్చర్యమంది
చెలికెటింగించి కొనియాడి చెప్పి చెప్పి
ప్రమదవనకేళిఁ దేలిరి పతియు సతియు. (ఆ. 5-24)

పుష్పాచయము :

అందనిపువ్వుగుత్తు దెసకై యఱుసాపఁగనేల బాల ? కో
యందలపయ్యోనేని, నెగయ న్నిను నెత్తెదనంచు, సంతసం
బందఁగ నెత్తియెత్తి విభుఁ డందఱిముందఱ డించుచుండఁగా
నందినకంకె సంతసము నందె లతాంగియు మాటిమాటికిన్. (ఆ. 5-27)

జలకేళి :

ఆ నెలతల్ సరోజినికినై దిగునప్పుడు నూత్నరత్నసో
పానములం దదీయతను బంధురబింబము లుల్లసిల్లెఁ దే
జోనిధియైన యాన్నృపతి సోయగముల్ దరిసించు వేడుకం
బూని జలాధిదేవతల పూర్వగతిం జనుదెనించిరో యనన్. (ఆ. 5-45)

మృగమదపంకిలాంగు లొకమే నొకమే ఘనసార చందన
స్థగితలునైన కామినులు సాటిగ నొండొరుఁ జల్లి యాడుచో
సగమున నల్పు దెల్పులగు చాయలు నొందిఁ గళిందకన్యకా
గగననదీ సమాగమముకై వడిఁ బద్మిని యొప్పెన త్తరిన్. (ఆ. 5-47)

*నెలతలు కంఠదఘ్నమగు నీరవిహారమొనర్ప నిల్చినం
గొలను తదానన స్ఫురణఁ గ్రొత్తమెఱుంగు వహించెఁ బెక్కుత్రి

---

*ఒక్క చంద్రునిఁ గన్న సముద్రుని, ననేక చంద్రులఁ గని మించుట యను భావము సంస్కృత శాసన పద్యమునం గన్పట్టుచున్నది.

శ్లో॥ యః ప్రోత్తుంగతరంగ సంగతిభవద్డిండీరపిండచ్ఛలాత్
తీరేతారతరేందు మండలమయీంమాలాం సదోత్పాదయన్
భ్రామ్యన్ మందరమంథమంథన వశాదేకేందు సంభూతిజం
త్రీరాబ్ధేరధరీకరోతి పరతః కీర్తిం జగద్వ్యాపినమ్.

[కొండిపర్తి శాసనములు. 8. 33-37 పంక్తులు;
తెలంగాణా శాసనములు. భా. 1.]

ప్పులఁబడి యొక్కచంద్రుని నపూర్వముగాఁ గనుటెంతయంచు నో
జలనిధినెంచి ల బహుచంద్రులఁ దానొనరించెనో యనన్. (ఆ. 5-48)

చంద్రోదయము :

కై సేసి పూర్వదిక్కామినీమణి చూచు
పద్మరాగంపు దర్పణమనంగ
వేయిగన్నులుఁగల వేల్పు తొయ్యలిచేతఁ
జూపట్టు చెంబంట్టు సురటి యనఁగ
విరహులపై దండువెడలంగఁ దమకించు
నసమాయుధుని కెంపుటరిగ యనఁగఁ
గల్పకభూజశాఖాశిఖాగ్రంబున
భాసిల్లు పరిపక్వఫల మనంగ
నభ్రమాతంగకులపతి యఱుతనొప్పు
కనకఘంటిక యనఁగ, లోకముల కెల్ల
నుదయరాగంబు రాగంబు నొదవఁజేయ
నిందుఁ డుదయించె లోచనానందుఁ డగుచు. (ఆ. 6-67)

చంద్రికా వర్ణనము :

పసగల వెన్నెల మిసిమి పుక్కిటఁ బట్టి
పొసఁగఁ బిల్లలనోళ్ళఁ బోసి పోసి
నున్ననిక్రియ్యనుక్క వెన్నెల తుంపరల్
పొమ్మని చెలులపై నుమిసి యుమిసి
కమ్మని వెన్నెల కడుపునిండఁగఁ గ్రోలి
తెలివెక్కి గబ్బునఁ ద్రేన్చి త్రేన్చి
కన్నిచ్చలకు వచ్చు వెన్నెల గ్రొన్నురు
వేటి వే ప్రియురాండ్ర కిచ్చి యిచ్చి
తఱచు వెన్నెలగుంపులఁ దాటితాటి
యీఱమగు వెన్నెలలలోనఁ దూటి తూటి
పలుచనగు వెన్నెలలలోనఁ బాటి పాటి
మెలఁగెఁ బెక్కు చకోరంపుఁ బులుఁగుగములు. (ఆ. 6-71)

నక్షత్రోదయము :

మెఱవగ్గలింపఁ జుక్కలు
తఱచై పొడముటయు గగనతల మొప్పారెఁ

మెఱుగారు ముత్తెములచే
మెఱవడి యగు నల్లపట్టు మేల్కట్టు గతిన్. (ఆ. 6–64)

సూర్యతాప వర్ణనము :

*కల్పాంతదుర్దాంత కలుషాంతకస్వాంత
దుర్వారవహ్నికి నోర్వవచ్చు
నిష్ఠురనిర్ఘోషనిర్ఘాత సంఘాత
జాతమహావహ్ని సైఁపవచ్చుఁ
బ్రళయకాలాఖిలఫాలలోచనఫాల
భాగానలస్ఫూర్తి బ్రదుకవచ్చు
గాకోదరేంద్ర ఫూత్కారసంభవ తీవ్ర
కాకోల దహనంబుఁ గదియవచ్చుఁ
గాక సైరింపవచ్చునే లోకదహన
దర్పితంబైన యస్మత్ప్రతాపవహ్నిఁ
దావకోత్సాహ సాహసౌదార్య ధైర్య
గతికి మెచ్చితి విక్రమార్క క్షితీంద్ర ! (ఆ. 2-112)

సూర్యాస్తమయ వర్ణన :

పశ్చిమాంభోనిధి ప్రాంతదేశంబున
రంజిల్లు విద్రుమ కుంజమనఁగఁ
జరమాద్రిశిఖర దేశంబునఁ గనుపట్టు
కమనీయ ఘనరత్న గండమనఁగ
నపరదిక్కామిని యమరంగఁ గనుఁగొను
పద్మరాగంపు దర్పణమనంగ
పశ్చిమదిక్కుంభి ఫాలభాగంబునఁ
బొలుపొందు జేగురుబొట్టనంగఁ
బూర్వకంధి వేలావనభూమిఁ బండి
కాలశుకతుండహతి బిట్టుగదలి, యపర
జలధిలోఁ బడు దాడిమీఫల మనంగ
నబ్జినీవనబాంధవుఁ డస్తమించె. (ఆ. 3–85)

తపసి వర్ణన :

అచ్చవెన్నెలమించు నవహాసించు విభూతి
యంగరాగంబుగా నలవరించి

---

* పిల్లలమఱ్ఱి, భట్టుమూర్తి, అయ్యలరాజు మున్నగువారిలో నీ శైలియు, పదగుంఫనమును గోచరించును.

యాగమోచితముగా నవయవంబులయందు
లలితరుద్రాక్షభూషలు వహించి
పొంబట్టు పుట్టంబు పొట్టనందంబుగా
ఘనజటాజూటంబు గలయఁ బొదివి
యడుఁగుఁగెందమ్ముల బెడఁగు రెట్టింపఁగాఁ
గాంచనమణి పాదుకములు దొడిగి
జిలిబిలి మొలత్రాట నినుపకచ్చడ మమర్చి
కక్కపాలయుఁ గక్షభాగమునఁ బూని
తరుణ శశిమౌళి యపరావతార మనఁగ
ధరణిపతి పాలికేతెంచెఁ దపసి యొకఁడు. (ఆ. 2-97)

వృద్ధవిప్ర వర్ణన.

పటలికావృత నేత్రపర్యంత రేఖలు
పొదవికై వ్రాలిన బొమలతోడ
దంతపాతముల నెంతయు స్రుక్కిన కపోల
తలముల నెలకొన్న వలులతోడ
నవగత శిరోత్తమాంగంబు దెలఁకులం
దూఁగాడు నరప వెంట్రుకలతోడఁ
గ్రౌంచకంఠోపమాకారతఁ గనుపట్టు
నస్నిగ్ధమైన దేహంబుతోడ
శతశతచ్ఛిద్ర జీర్ణవస్త్రములతోడ
నల్పతర పర్వయుత వంశ యష్టితోడ
హరినమాస్ర నామోచ్చారణ రతితోడ
వచ్చె నొకవృద్ధ భూసుర వరుఁడు గదిసి. (ఆ. 2-117)

పలుకని మోముఁ దొట్రుపడు పాదములున్ వగరంపుటూర్పులున్
వలపలనైన దంతములు వంగిన మేను వణంకు మస్తమున్
నిలుపఁగరాని యుక్కసము నెమ్మెయి నెక్కొను దప్పి పెంపుఁ జే
వెలుఁగునఁ జూచుచూపుఁ గల వృద్ధమహీసురుఁ డమ్మహీశ్వరున్. (ఆ. 2-155)

పాంచాల రాజకన్యక వర్ణనము:

చిన్నారిపొన్నారి చెక్కుటద్దములపై
జిఱునవ్వు మొలకలు చెంగలింప
మదనుని తూపుల మఱపించు చూపుల
తెఱఁగుల మెఱుఁగులు తుఱఁగలింప

మొగమున కెగిరెడు బిగిచన్నుఁగవ మీఁద
మణిహారరోచులు మాఱుమలయఁ
గమ్మని నెత్తావిఁగ్రమ్ము క్రొమ్ముడి నుఁడి
యరవిరి విరవాది విరులుదొరఁగ
సాంధ్యరాగంబు వెడలిన చంద్రరేఖ
యెనకమునఁ బొప్ప మునుముట్ట ముసుఁగుపుచ్చి
యాకళావతి మృదుల పర్యంకతలము
నందుఁ గూర్చుండఁబడి సాహసాంకుఁ జూచి. (ఆ. 7-172)

యుద్ధయాత్రావర్ణన:

అతఁడుం దానును గార్య్గలబ్ధిగతి నేకాంతింబ యూహించి, స
మ్మతితో సిద్ధపురీశుఁపైఁ జనుటకు న్మొహూర్తికో త్తంస ని
శ్చితవేళన్ మొరయింపఁ బంచుటయు మించెన్ దండయాత్రా సము
ద్ధత నిస్సాణధణంధణంధణధణంధాణంధణన్వానముల్. (ఆ. 4-49)

పాలమున్నీటిలోఁ బవ్వళించిన యట్టి
నీలవర్ణుఁడు నిద్ర మేలుకొనియె
వెగడొంది రవితేజినొగలఁ గట్టినయట్టి
వాహంబు లణకలు వైచుకొనియె
సదరిపాటున బిట్టుబెదరి పర్వతపుత్రి
కందర్పదమనునిఁ గౌఁగిలించెఁ
బన్నగంబులకెల్ల భయము మిక్కుటముగాఁ
బాతాళలోకంబు బమ్మరిల్లెఁ
గమలజుని వేదపఠనంబు కవలువోయె
నద్రులెల్లను నచలత్వ మపనయించె
దిగ్గజంబులు జిఱజిఱఁ దిరిగిమొగ్గె
వారిరాసులు పిండఃలవండులయ్యె. (ఆ. 4-50)

వరాహ వర్ణన:

కోలముఁగాంచె నా నృపతికుంజరుఁ డంజనశైల విగ్రహ
ఖేలముఁ బోత్రసాధన విభేదిత భూవివరోరుజాల కో
త్తాలము, ఘుర్ఘురధ్వని విదారితఖాద్రి గుహాంతరాళమున్
లోలవిలోచనాంచల విలోకిత రోషమహాగ్నికీలమున్. (ఆ. 2-133)

కోడికూత:

రాయిడికత్తెలై పెనుఁ బ్రాయిడి యత్తలయిండ్లఁ గోట్రముల్
నేయువిలాసినుల్ ముసుకు నెందఁగ, వేశ్యల ప్రక్కదాపులం

బాయని కాముకుల్ వెలుకఁబాటి కలంగఁగ మ్రోసెఁ 'గొక్కొరో
కో'యని కుక్కుటస్ఫురదకుంఠితకంఠకఠోరనాదముల్. (ఆ. 6–73)

రోదన వర్ణన:

పుటపుటనగు చనుఁగవపై
బొటపొటఁ గన్నీరు దొరఁగఁ బురపురఁ బొక్కం
దటతట గుండియ లదరఁగఁ
గటకట యిది నోముఫలము గాకేమనుచున్. (ఆ. 7–153)

భోజనపదార్థ వర్ణన.

మించుకన్నులు గోరగించు రాజాన్నంబు
నుపమింపరాని సద్యోఘృతంబు
నమృతోపమానంబులగు పిండివంటలు
నుజ్జ్వలంబై యొప్పు నొలుపుఁ బప్పు
మదికింపుఁ బెంచు కమ్మని పదార్థంబులు
బహుపాకరుచులైన పాయసములుఁ
దగువాసనా వాసితములైన పచ్చళ్ళు
వడియఁ గట్టిన యానవాల పెరుఁగు
సరసమధుర రసావళి సముదయములు
పంచసార సమంచిత పానకములుఁ
గమ్మకస్తురి నెత్తావిఁ గైపుచేసి
యూరుఁగాయలుఁ జల్లని యుదకములును. (ఆ. 4–188)

ఇట్టి వర్ణన లెన్నేనియుఁ గలవు. ఇవి యన్నియు శ్రీనాథయుగ కావ్యము లన్నిఁటను సర్వసాధారణముగాఁ జూడనగును. పెద్దనాదు లగు ప్రబంధ కవులును వీని నాదరించి రని చెప్ప నవసరము లేదు. ఇట్టి వర్ణనమును జక్కని ప్రబంధ శయ్యతో నానాశబ్దాలంకార పౌష్కల్యముగా జక్కన గావించెను.

జక్కన రచనయం దెడనెడ కవిత్రయము కవితా ప్రభావము ముఖ్యముగ గోచరించును. నన్నెచోడ, నాచనసోమ, హుళక్కి భాస్కరుల పోకడలును గొన్ని కనవచ్చును.

పూర్వుల ప్రభావము జక్కనపై దోచునట్లే, తర్వాతి కవులు కొందఱపై జక్కన ప్రభావము స్పష్టముగా గోచరించు. జక్కన కవిత్వము చేతఁ బ్రభావితు లయిన వారిలోఁ బెద్దనామాత్యుఁ డును చేమకూర వేంకటకవియును ముఖ్యులు. కొన్ని సామ్యము లీ దిగువఁ జూపఁబడును.

అతివా! ముదియఁగ ముదియఁగ
మతి దప్పెనొ కాక నీకు, మనమున నియమ
వ్రతపరుల శూద్రరమణీ
రతికై బోధింపవత్తురా, యిది తగవా! (వి|క్ర.చ. ఆ. 1-144)

అనుటయుఁ బ్రవరుం డిట్లను
వనజేక్షణ యిట్లు పలుక వరుసయె, వ్రతులై
దినములు గడపెడు విప్రులఁ
జనుసే కామింపమది విచారము వలదే. (మను.చ. ఆ. 2-52)

పారాశర్యప్రముఖుల
పారకృపామహిమ తేటపడ నింతులదా
కోరిక దీర్పుట వినమే
వారిసదాచార గౌరవం బెడలెనొకో! (వి|క్ర.చ. ఆ. 1-153)

వెలివెట్టి రే బాడబులు పరాశరుఁ బట్టి
దాశకన్యాకేళి తప్పుసేసి
.... .... .... ....
వారికఁ జెలువు నీ మహత్వంబు ఘనమె? (మను.చ. ఆ. 2-73)

లలితకపోల మండలములన్ మణికుండలముల్ నటింప వి
చ్చలవిడిగా వినూత్న పురుషాయితకేలికి నగ్గలించు న
గ్గలికలు చెల్లకున్న, నధికవ్యథనొయ్యన మాటిమాటి కూ
ర్పులు నిగిడింపఁ జొచ్చిరి సరోరుహనేత్రలు గర్భ ఖిన్నతిన్.
(వి|క్ర.చ. ఆ. 1-168)

మనసుకక్కుఱితి మెల్లనలేచి చేతులఁ
గాంతుని జబ్బుగాఁ గౌఁగిలించు
.... .... .... ....
గాఢ తుత క్రీడకంగము పంపుసేయమి
నొద్దుగా నిట్టూర్పు లొరయఁ బొగులు
.... .... .... (మను.చ. ఆ. 3-123)

కీలుకొప్పునఁ గన్నె గేదంగి ఱేకులు
ఘనుఁగు సౌరభముల బుజ్జగింప
నలికభాగంబున నెలవంక తిలకంబు
కస్తూరివాసనఁ గుస్తరింప
సిరమైన పచ్చకప్పురముతో బెరసిన
తమ్ములమ్మునతావి గుమ్మరింపఁ

గుచకుంభములమీఁది కుంకుమ పంకంబు
పరిమళంబులతోడఁ బరిచరింప
గంధవహనామ విఖ్యాతి గణనకెక్కు-
నించువిలుకాని వేగువాఁ డేఁగుదెంచి
యుగురుఁబోఁడుల గమిరాక యెఱుకపఱిచె
సరసనుతుఁడైన యారాజచంద్రమునకు. (అ. 7–33)

పై పద్యమున జక్కన, తిలకంబు కస్తూరివాసన, సిరమైన పచ్చకప్పుర ఘుతో బెరసిన తమ్ములమ్ముల తావి, మఱియు గుచకుంభముల మీఁది కుంకుమ పంకంబు పరిమళంబు మున్నగువాని సామూహిక పరిమళముతో గంధవహుఁ డేఁగుదెంచి యా రాజచంద్రునకు ఉగురుఁబోఁడుల గమి రాక యెఱుక పఱచి నట్లు వర్ణించెను.

పెద్దన యిందలి కస్తూరి మఱియుఁ బచ్చకప్పురపుఁ బరిమళమును గ్రహించి తమ్ములమ్ములఁ గూర్చి యా తావిని మారుతమున కాపాదించి, 'మగువ పొలుపుఁ దెలుపు నొక్క మారుత మొలసెన' అని తక్కిన మూఁడు కంఠపాదములను జటిల సంస్కృత సమాస సంఘటిత మొనర్చి సాహిత్యమున సాటిలేని సౌరభములు వెద చల్లునట్లు క్రింది పద్యమును రచించి మించెను.

మృగమద సౌరభవిభవ
ద్విగుణిత ఘనసార సాంద్రవీటీగంధ
స్థగితేతర పరిమళమై
మగువపొలుపుఁ దెలుపు నొక్క మారుత మొలసెన్. (మను.చ. అ.2–24)

జక్కన చేసిన ఈ క్రింది పర్వత వర్ణన :

కనిరెయె నతండు శంకరశిఖాశశిరంజిత చంద్రకాంత సం
జనితజలార్ద్రకల్పతరుజాలముఁ గిన్నరకన్యకా ప్రమో
దనమణిశృంగసంగతలతావనజాలము దివ్యవాహినీ
వనజవనీతటద్రుహిణవాహమరాళము మేరుశైలమున్. (అ. 5–74)

లోలతఁ గాంచె నాసుగుణలోలుఁడు చారుశిలానిషణ్ణకి
జాలతటీప్రవాహ ఘనసత్తరువాటముఁ బార్శ్వస్థితుంగశృంగ
ద్రాలపకీవినోదవిసంభ్రమశీకర నిర్గతశ్రమో
ద్వేలపరిభ్రమామతి దీపితకూటము హేమకూటమున్. (అ. 2–218)

అనవిని విక్రమార్కవిభుఁ డప్పుడు చారుఁడు మున్నుగాఁగ వే
చనికని రెయెన్ సమాధిగత సంయమిరత్న వినూత్న పేటముఁ
ఘనమదహస్తిహస్త పరికంపిత సానుగతాగవాటముం
గనదురు రత్నదీప్తిభాగ్మకిరీటముఁ జిత్రకూటమున్. (అ. 5–74)

పద్యములు మనుచరిత్రము నందలి

అటఁ జనికాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ

గటక చరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్. (మను.చ. ఆ.2–3)

కల్పనకు గొంతవఱకు ప్రేరకములనఁ దగియున్నవి. మఱియు జక్కన చేసిన యీ క్రింది వరాహవర్ణనము :

కొండొకవాలముం గుఱుచకొమ్ములు, నన్నువలైన వీనులున్

.... ... .... ... .... ...

తొండములేని భద్రకరితో నెనయైన వనీవరాహమున్. (ఆ. 3–75)

బలమిఁక నేమిసెప్పవిను పందువెదుళ్ళవలీల మోరత్రో

.... .... .... ....

.... .... .... చప్పరించు, న

ప్పోలము వరాహపోతములు భూవరతొండములేని యేనుఁగుల్.

(మను.చ. ఆ. 4–18)

అను పెద్దన పద్యమునకు మూలప్రాయముఁగ నున్నది.

పనుబొత్తుకురాక యెన్నఁడు నారగిం

పనియట్టి భక్తిమజ్జనకుఁ దలఁచి

చెమట నెత్తురుగాఁగఁ జిత్తమ్మునఁ దలంచి

యర్మిలిఁ బెనుచు మదంబఁ దలఁచి

నిముసంబుననుఁబాసి నిలువక యొడఁగూడి

చరియించు మిత్రప్రాణసఖులఁ దలఁచి

గంధసింధురసైంధవోత్కరముఁ దలఁచి

సతతసేవాగతనరేంద్ర వితతిఁ దలఁచి

వనట యొదవిన నింత యొప్పని మనమున

నున్నచందంబుగాని వేఱొండులేదు. (వి.చ. ఆ. 6–59)

ననునిముసంబు గానకయున్న నూరెల్ల

నరయు మజ్జనకు డెంతడలునొక్కొ !

యెపుడు సంధ్యలయందు నిలువెళ్ళనీక న

న్నోమెడుతల్లి యెంతొఱలు నొక్కొ !

యనుకూలవతి నాదు మనసులో వర్తించు

కులకాంతమదినెంత కుందునొక్కొ !

కెడఁదోడు నీడలై క్రీడించు సచ్ఛాత్రు

లింతకు నెంత చింతింతురొక్కొ !

(మను.చ. ఆ. 2–17)

పై పద్యములకుఁ బోలిక స్పష్టము. దీనితో మనుచరిత్రము, ఆశ్వాసము, 3-98, 99 పద్యములను గూడ చదివినచో సందర్భము కూడ సరిపోవును.

ఇవికాక విక్రమార్క చరిత్రము సందలి 'దేవియుఁ దేవరయుఁబోలె, సెలవి పాఱఁగ నవ్వుచు, బంగారు సకినెల భంగి మెఱయ, యతులకైనఁ దెమలి యునుప కచ్చడము లూడిపడునన్న; జాజిపక్కెరలతో, చిలుకగుఱ్ఱపుఁ బౌజు' మున్నగు యపూర్వ పదప్రయోగములు మనుచరిత్రము నందును గోచరించును. ఆంధ్రకవితా పితామహుని యాదరమునకుఁ బాత్రుఁడైన జక్కనకవి నిక్కముగాఁ బ్రశంస నీయుఁడు.

అర్థాలంకారము లందువలెనే జక్కనకు శబ్దాలంకారాదుల యందు మక్కువ యెక్కువ. అనుప్రాస, అంత్యానుప్రాసాదులే కాక ఈ కవి శ్లేషయమకముల నధిక ముగ గూర్చియున్నాఁడు. అవి కొన్ని యీ దిగువ సూచింపఁ బడుచున్నవి.

శ్లేషలు : ఆ. 1. ప.65, 101 (వచనము); ఆ. 4. 143 మున్నగునవి చూడ నగును.

అంత్యానుప్రాసలు : ఆ. 2. ప. 133, 198, 200, 218, 220, 210 చూడఁ దగును.

యమకములు : ఇవి చేమకూర వేంకటకవిపై జక్కన ప్రభావము నూహించుటకుఁ దోడ్పడును.

1. 'ని, న్నేమనుదాన నింకనెటు లేమనుదాన మహోదరిద్రతన్.
(ఆ. 3-8)

2. 'విజయపాలుని నెమ్మోము విన్నవోయి
తెల్లవాఱినకైవడి తెల్లవాఱె' (ఆ. 3-102)

3. ఏకతంబున నిది యేకతంబున వచ్చెనో' (ఆ. 3. వ. 106)

4. 'కరము కరమునఁ గీలించి కరముప్రీతి' (ఆ. 3-127)

5. 'తమ్ములాకొమ్మ నెమ్మోవితమ్ములనఁగ
బింబ మా యింతి కెమ్మోవి బింబ మనఁగ
జాతి యానాతి లేనవ్వు జాతి యనఁగ
రామ యొప్పారు లోకాభిరామ యగుచు'. (ఆ. 4-18)

6. ఏకాంత కాంతరూపమొ
యీకాంతుని నయనవీథి కిరవైనది గా
కేకాంతంబునఁ గాంతల
కేకాంతులు నోఱపునడల నిట్లుండుదురే ! (ఆ. 6-54)

7. పగతెల్లను దమునేచిన
పగతెల్లఁ దలంచి యిరులపౌజులు .... (ఆ. 6-63)

నుండె ననుటకు శ్రీనాథకవి ద్విపద 'పల్నాటి వీరచరిత్రము' వలన నూహింప వచ్చును. కావున నీ కవి తన కాలమునఁ గడు ప్రసిద్ధములయిన నీ రెండు విషయముల నిందేదో విధమునఁ జేర్చి సూచింప యుండనోపు నని తోఁచును. – ?

జక్కన తన కావ్యము నందు భర్తృహరి రచించిన సంస్కృతగ్రంథముల నే కారణముననో యిందుఁ బేర్కొనలేదు. కాని వరరుచి కృతులను నొక పద్యమునఁ ప్రత్యేకముగా నిట్లు పేర్కొనియున్నాఁడు.

వచియించెఁ బ్రాకృత వ్యాకరణాగమం
బభినవంబుగ భోజవిభుఁడు మెచ్చ
సకలవర్ణాశ్రమాచార నిర్ణయమొప్ప
ధర్మశాస్త్ర మొనర్చెఁ దజ్ఞు లలర
ధీయుక్తి మెరయ జ్యోతిశ్శాస్త్ర మొనరించె
సకల లోకోపకారకము గాఁగఁ
గాళిదాసుని నవ్యకావ్య విద్యాప్రౌఢి
వరకవీశ్వర చక్రవర్తిఁ జేసె
భవ్యనారాయణీయ ప్రపంచసార
శారదాతిలకాది ప్రశస్తమంత్ర
శాస్త్రసర్వంకషజ్ఞాన సరణిమించె
శీలవతిపట్టి సర్వజ్ఞశేఖరుండు. (ఆ. 1-188)

'సంస్కృత కవి జీవితము' (మల్లాదివారు) నందు భర్తృహరి విషయము కలదు గాని అందు 'వరరుచి' ప్రసక్తి కానరాదు. భోజుఁడును గాళిదాసును సమ కాలీనులే కాక వరరుచియు వారి కాలమువాఁడే యయినట్లు పై పద్యము వలన తోఁచును. ఇందు జక్కన తెలిపిన గ్రంథములు వరరుచి కృతములు ప్రాకృత గ్రంథము లగుట మల్లాదివారు వీనిని గూర్చి తెలిపియుండరు. ఈ కవి కృత్యాది సంస్కృత (ప్రాకృత) కవిస్తుతిలోఁ గూడ వరరుచి, శాతవాహనులను బ్రశం సించెను.

ఇందలి తుది యాశ్వాసము నందు విక్రమార్కునిచేఁ బ్రాణముపోయఁ బడిన 'సువర్ణ కలశము' తన కథాకథన దక్షత నిట్లు తెలిపెను.

శృంగారాదిరసప్రసంగములుగాఁ జెప్పంగనేర్తుం గథల్
సాంగోపాంగముగాఁగ, నొక్క కథ సువ్యక్తంబుగా నవ్వయిం
పంగాఁ జెప్పెదఁ జిత్తగింపుమని చెప్పం జొచ్చె భూపాలుతో
సంగోత్పాదక వాగ్విశేషరచనా సామర్థ్యమేపారఁగన్. (ఆ. 8-4

ఇందుఁ జెప్పినట్లు శృంగారాది రసప్రసంగములుగా, సాంగోపాంగముఁగా, సువ్యక్తముగా నన్వయించునట్లు వాగ్విశేష రచనా చాతుర్య మేపారఁగాఁ గథలు చెప్పు నేర్పు జక్కన కవి కెక్కువ యనుట నిక్కువము. విక్రమార్క చరిత్రమను ప్రౌఢ కథా కావ్యమును సలక్షణమును సాలంకారమును సరసవర్ణనాసహితమును సంస్కృతాంధ్రభాషా పాండిత్య స్ఫోరకమును నగు చక్కని శైలితో సరసప్రబంధ రచనకుఁ జక్కని రాజమార్గమును సంఘటించిన జక్కనకవి కీర్తికినిఁ గృతికిని మంగళమహాశ్రీ.

ఉత్తమ కావ్యములలో నొక్కటి యైన విక్రమార్క చరిత్ర మిప్పుడు క్రయమునకు లభించుట లేదు. ప్రసిద్ధ గ్రంథాలయముల యందు మాత్రమే దీని ప్రతు లొకటి రెండు దొరికిన దొరకును. పూర్వ ముద్రణముల వివరములు దిగువ నొసఁగఁ బడుచున్నది.

| | ప్రకటన కర్తలు | సంవత్సరము | పరిష్కర్తలు |
|---|---|---|---|
| 1. | ఆనంద ముద్రాక్షరశాలాధిపతులు, (చెన్నపురి) | క్రీ.శ. 1895 | శ్రీ కొమాండూరు అనంతాచార్యులు మఱియు శ్రీ రాయదుర్గము నరసయ్యగారు. |
| 2. | వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు. (మద్రాసు) | ,, 1913 | — — |
| 3. | ,, ,, ,, | ,, 1926 | శ్రీ బులుసు సీతారామశాస్త్రిగారు. |

పై వానిలో ఆనంద ముద్రాక్షర శాలాధికారులు ప్రకటించిన విక్రమార్క చరిత్ర ముద్రిత ప్రతి యందు ముద్రణ దోషములును పరిష్కరణ దోషములును కోకొల్లలు. దీనినిఁ బరిశీలించి అప్పుడు చెన్నపురి క్రిస్టియన్ కాలేజి సంస్కృత ప్రధాన పండితులుగా నుండిన శ్రీ వేదము వేంకటరామ శాస్త్రులవారు "శారదాకాంచిక ప్రథమకింకిణి" అను విక్రమార్క చరిత్ర ముద్రణ విమర్శనమును వ్రాసిరి. ఇందు వారు గ్రంథము నందలి పరిష్కరణ దోషములను శతాధికముగ నెత్తిచూపుచు వానికి సవరణలను గూడ తెలిపిరి. ఈ "విక్రమార్క చరిత్ర విమర్శనము" (60 అచ్చు పుటల వ్యాసము). అముద్రిత గ్రంథ చింతామణి యందుఁ దదనుబంధముగ క్రీ.శ. 1898 సంవత్సరములోఁ బ్రకటింపఁ బడినది.

తరువాత శ్రీ శాస్త్రులవారి 'విమర్శనము' ననుసరించి కొంత సంస్కరించి ఈ కావ్యమును క్రీ.శ. 1913లోఁ బ్రకటించిరి. కాని యిందును తప్పులు దొరలని పుట లేదని చెప్పవచ్చును. మఱల క్రీ.శ. 1926 సంవత్సరములో నీ కావ్యమును

8. చల్లనిమందని పైపైఁ
జల్లనిమందొకటి లేదు, సతిడెందమునన్
జల్లఁదన మందదయ్యెను
జల్లనిమందులను దాపసంపద మించెన్. (ఆ. 1-138)

9. కదళికాకాండకాంతవర్గములతోడి
పెందొడలు కాంత పెందొడ లెందునరయ. ఆ. 1-119

ఇట్లనేకార్థములు గల సంస్కృతాంధ్ర పదముల నేక వాక్యము నందు భిన్నార్థ ప్రతిపాదకములుగ సంఘటించి చమత్కరించు యమకమార్గమునకు మొదట నాచనసోముఁడునుబిదప జక్కనాదులును బునాదులు వేయఁగా చేమకూర వేంకటకవి దీని నాంధ్రమున విస్తరించి వ్యాప్తికిం దెచ్చెనుగాని, యీ మార్గమున నాఁటికిని నేఁటికినిఁ జేమకూర కవియే సిద్ధహస్తుఁడు.

జక్కన కవి తెలుఁగు నుడికారములను, సామెతలను దన కావ్యమున విరి విగఁ బొందుపఱచెను. అట్టివి కొన్ని దిగువఁ జూపఁబడును.

పసిఁడిపళ్లెరమైనన్ జేరుపఁగఁ జోటుపఱెను
ములుముంటఁ బుచ్చుటయె కార్యము
తెడ్డునాకి యుపవాసము మాన్పికొనంగ నేటికిన్
ఎందు గుడి మ్రింగువానికి నంది పిండివడియము
ముందట నుయ్యి వెనక లోతగు గొయి
పులిమీసముల నుయ్యేల లూగవచ్చునే?
ఏమిటికి నేనుఁగు నెక్కియు దిడ్డిదూరగన్
'తనయింటి దీప మనుచును
వినుముద్దిడుకొనఁగఁ దలఁచు వీఁడిఁడి గలఁడే?'
ఏమిటికిఁ జల్లకు వచ్చియు ముంతదాపఁగన్
వంకలొత్తఁ దిలకఁబులె రాజుల చిత్తవృత్తముల్?
వే, కరుగవె యగ్గిపొంత వెన్నయుఁ బోలెన్
ఆఁడువారల దిట్టతనం బెఱుఁగ బ్రహ్మదేవుని వశమే?
నీడయు రూపంబుఁ బోలె నెయ్యం బలరన్
సింహము మెడగంటవోలె యభయంబునఁ బొఁదె
తామరపాకు నీటిక్రియఁ దల్లడమందెను
సూదిపిఱుంద తాటిక్రియఁ జొచ్చిన చోట్లులు సొచ్చు
జడవిడిచి వదరుపట్టుట;
కమ్మెండఁగఁ గనుపాపను గొన్నవిధంబున

మొగురం గూర్చిన ముండదైవము
బిగిచన్నుల నడిమి మణుల పేరుం బోలెన్
మరువము మొలవంగఁ దోడనె పరిమళ ముదయించినట్లు
పచ్చపయికంబు లేకుండ వెచ్చపఱచి

పలుకుఁబడులు: పూసగ్రుచ్చినగతి; కరతలామలకముగా; ఆమూలచూడముగ; పల్లవిపాటగా; ...వాడకయుండఁగ; చెక్కడచిన వసరాలెడు; మొలపూసలు ద్రెవ్విన నాఁటనుండియున్; పులుగడిగిన ముత్యమువిరి; దేవియుం దేవరయుఁబోలె; తాళము వైచినగతి; నెలవిపాఱఁగనవ్వుచు; పులకండపుఁ బొమ్మ; నివాళిసేయునగవులు; ముంగిలెఱుఁగని ముద్దరాలు-; పగలుచాటు; కాలుద్రవ్వు; వక్కరించు; మగమాటలాడు; బొమ్మవెట్టు; తూ పొడుచు; కొల్లకోటుసేయు; త్రోద్రోపులాడు; తూఱుదుంకెనలాడు; చాటునకెక్కు; కర్ణపారణమొనరించు; గిరవులుపుత్తెంచు; ఇల్లడపెట్టు; వారకంబిచ్చు; పులుకడుగు; కనుఁబాటుదాఁకు; కరసానఁ బట్టించు; కార్యఖడ్గములు — ఇట్టి వడుగడుగునఁ దడఁబడుచుండును.

కొన్ని ప్రత్యేక పదములు: పొతముగ; వాలాయించి; ఒడమి; విల్వకాఱు; ఉత్తులు; ఆందోళము నొందు; నేలమాలె; పుడుకువేదుఱు; కొలువుసాల; తెరవాఱు; రిత్తకురిత్త; సునాయాసముగా; నీరామని; అణకలువైచుకొను; కవలుపోవు; గాందము; కంచులి; రజ్జులాట; మొక్కలంబుగ; పుతపుతవోవు; ఖధునీ; నమ్మునం గలియు; పిల్లుగట్టు; తోడుకొనివచ్చు; పక్కెర; పౌజు; మజా; బైసుకపెట్టు; ఇసిరింతలువాఱు; కొలుకాఁడు; ఈలవెట్టు; బళాయివెట్టు; డాగు; జరి; కుంచెనీలు; కోడిగీలు; జుమ్మికాంద్రు; ఇచ్చగొండులు; ఉచ్చమల్లులు; (బంగారు) సకినలు; (అంగన) నడపు; గిరవుపట్టు; గిలవుపట్టు; బాగాలు-మున్నగు దేశ్య, అన్యదేశ్య పదజాలము నీ కవి యిందు విశేషముగఁ బ్రయోగించియున్నాఁడు.

విక్రమార్కుఁడుజ్జయిని యందలి కాళికామందిరమునఁ బ్రవేశించిన సందర్భమున నందలి వివిధ విచిత్ర విషయములను వర్ణించుచు ద్వితీయాశ్వాసమున నొక దీర్ఘవచనమును [51] రచించెను. అందలి మణిమండపములు "ప్రసిద్ధసిద్ధజనకథిత నవనాథ చిత్ర చరిత్ర వర్ణన ప్రమోదహృదయ సామాజిక విరాజమాన"ము లయినట్లును; మఱియు నందొకచోట "నిరవధికభక్తిరసాతిశయ ప్రాణోపహార సమర్పణ మహావీర శిలాప్రతిరూపంబు"లు నుండినట్లును జక్కన కవి వర్ణించెను. జక్కన కాలమునందు 'నవనాథసిద్ధుల' కథలు ప్రచారమున నుండె ననుట కీ కాలముననే గౌరనకవి రచించిన ద్విపద 'నవనాథ చరిత్ర' కావ్యమే తార్కాణము. ఇట్లే పలనాటి మహావీరుల కథలును బ్రహ్మార్థమున

శ్రీ శాస్త్రిలవారి సూచనల ననుసరించి చాలవఱకు దోషములను బరిష్కరించి పునర్ముద్రించిరి. ఈ ప్రతి యందును దోషము లున్నను జాల తక్కువ.

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షమున ఈ విక్రమార్క చరిత్రము శుద్ధప్రతిని సిద్ధము చేయుటకు నేను వావిళ్ళవారి 1926 సంవత్సరము ముద్రిత ప్రతిని అతికష్టముతో సంపాదించఁ గలిగితిని. దీనిని శ్రీ శాస్త్రిలవారి విమర్శన సహాయముతో యథాశక్తిఁ బరిష్కరించితిని. స్వల్పముగాఁ గొన్ని సవరణలు చేయవలసి వచ్చినది. పై గ్రంథములే కాక, (1) శ్రీ వీరేశలింగము పంతులుగారి ఆంధ్ర కవుల చరిత్రము (భా. 1); (2) శ్రీ శేకుమళ్ళ అచ్యుతరావుగారి విజయనగర సామ్రాజ్య మందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము(భా.1 ); (3) శ్రీ చాగంటి శేషయ్యగారి ఆంధ్రకవి తరంగిణి (సం. 4) యును ముఖ్యముగాఁ దోడ్పడినవి. ఏతత్కర్తలకు నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథమును బరిష్కరించుటలోఁ బూర్వముద్రణ మందలి ముద్రణ దోషములు కనఁబడినంత వఱకు సవరింపఁ బడినవి. ఉన్న పాఠాంతరములలో సరసములును సముచితములు నని తోఁచినవి సరియైన పాఠములుగా గ్రంథము నందు గ్రహింపఁ బడినవి. పూర్వ పాఠములు వావిళ్ళ. 1926. అను సూచనతో పుట యడుగునఁ జూపఁబడినవి. కొన్ని పదములకు మాత్రము అర్థము తెలుపఁ బడినది. ఇఁక యతిప్రాసలు మున్నగు వానిలోఁ జేయఁబడిన ముఖ్యమగు సవరణలు కొన్ని యిటఁ దెలుపఁ బడుచున్నవి.

సవరణలు :

1. ఆశ్వాసాంత గద్య.

"ఇది శ్రీమదఖిల కవిమిత్ర పెద్దయన్నయామాత్రపుత్ర
.... .... జక్కన నామధేయ.... ...."

అని పూర్వ ముద్రిత గ్రంథముల ఆశ్వాసాంత గద్యలో కలదు. వావిళ్ళ వారి ముద్రణ ప్రతి పీఠికలో శ్రీ బులుసు సీతారామ శాస్త్రిగారు "జక్కన పేరయాన్నయామాత్యుని కొడు" కని వ్రాసిరి. ఈ పొరపాటు ఆంధ్రకవుల చరిత్రములోని "ఈతని తండ్రి పేర న్నయామాత్యుఁ" డను దానివలన కలిగిన ట్లూహింప వచ్చును. కాని, యీ రెండును సరియైనవి కావు. కృత్యాదిలో జక్కనయే స్వయముగాఁ జెప్పిన యీ పద్యమును గమనింపుఁడు.

అండడు మయూరరేఖను
గాఁడఁ బాఱండు బాణకోటి మన మెఱియఁగ

బ్రోడగు పెద్దయయన్నన
మాడకు మాఱెత్త యతని మాటలు జగతిఁ. (ఆ. 1-21)

దీనినిఁ బట్టి పెద్దయ పుత్రుఁడగు అన్నయ జక్కన జనకుఁ డని స్పష్టపడు చున్నది. కావున ఆశ్వాసాంత గద్యలలో 'పెద్దయ యన్నయామాత్య పుత్ర'యని సవరింపఁ బడినది.

2. కృతిపతి యగు సిద్ధనమంత్రి తాత యగు సూరన సోమయాజికిఁ దనయుఁ డని ముద్రిత గ్రంథములోఁ గలదు.

అమ్మహితాత్ముని తనయుఁడు
సమ్మాన దయానిధాన సౌజన్యరమా
సమ్మోదిత బాంధవుఁడై
యిమ్మహిలో సిద్ధమంత్రి యెన్నఁగ కెక్కెన్. (ఆ. 1-134)
(వావిళ్ళ ప్రతి. 1926).

దీనికి

"అమ్మహితాత్ముని మనుమఁడు
.... .... .... ...." (ఆం.క.చ. పుట. 384)

అని పంతులుగారి పాఠము. మనుమఁ డనఁగా సంతతివాఁ డని పంతులుగారు దీనిని సమన్వయించి, కవితరంగిణి కర్తయును 'మనుమఁ' డను పాఠమునే గ్రహించుటే కాక కొన్ని తాళపత్ర ప్రతులందును 'మనుమఁ' డనియే యున్నదని వ్రాసిరి. (క.త.సం. 4. పుట, 218). కావున దీనివల్ల విశేష ప్రయోజనము కన బడకున్నను తాళపత్ర ప్రతి పాఠమే గ్రంథమున గ్రహింపఁబడినది.

3. పూర్వ ముద్రిత ప్రతులలో 5 కందపద్యముల చివర నొక ఉత్పలమాలతో షష్ఠ్యంతములు ముగింప బడియున్నవి. చివరి పద్యము :

"వెన్నెలగంటి సూర్యుఁడు వివేక గుణాఢ్యుఁడు ...." (ఆ. 1-62)

అనునది యీ యుత్పలమాల ప్రక్షిప్త మనియు, నొకవేళ కవియే రచించియుండి నచో నిది షష్ఠ్యంతములలోఁ గాక కృతిపతి వంశవర్ణనలోఁ జేరియుండదగిన దనియుఁ గవి తరంగిణి కర్త యభిప్రాయము. ఇది చాలవఱకు వాస్తవ మనియే తోఁచును. ఐదు కందముల పిమ్మట నీ యుత్పలమాల యేల ? అందును అంత గొప్ప కవీంద్ర కుంజరుని దెచ్చి షష్ఠ్యంతములలోనా యిఱికించుట ! ఈ పద్యము యొక్క కూర్పు ప్రక్షిప్త మని తీసివేయ రానంతగా బాగున్నది. కాని షష్ఠ్యంతము లలో నుంట వంశావళి వర్ణనలో సులభముగాఁ జేర్ప రాకున్నది. ఆలోచింపఁగా

దీనిని 51వ పద్యము పిమ్మటఁ జేర్చిన బాగుండు నని తోచినది. తర్వాత పద్యము మొదటి సగమును షష్ఠ్యంతముగా నుండి దీనితోఁ గలిపి చదివికొనఁ దగియుండుట యిది 51వ పద్యమునకు పిమ్మటఁ జేర్పఁబడినది.

4. ముద్రిత గ్రంథములో నీ క్రింది పద్యమున యతి భంగము కలదు.

కనుఁగొని నెమ్మనం బలరగాఁ బులి జున్నును నేదుకన్ను దె
మ్మనినను దెచ్చువాఁడఁ బ్రియమైనవి యెల్లను జెప్పఁడంచు గో
బ్బునహృదయానువర్తియయి(?) పల్లును బంతము నొక్కభంగిగాఁ
దనియఁగ నిచ్చు నవ్విభుఁడు తామరసాక్షులు గోరఁకోరికల్.

(ఆ. 1-169)

ఇందలి తృతీయ పాదమున యతిభంగము గోచరించు చున్నది. ఇది సవరింపఁ బడక ప్రశ్న (?) గుర్తు వేసి వదలివేయఁ బడినది. గొబ్బున అనఁగా శీఘ్రముగా అని యర్థము. 'గొబ్బున' అని దిద్దిన యతి సరిపోవును. కాని ఈ రూపము గల పదము శబ్దరత్నాకరము నందు లేదు. కాని జక్కన కవి అన్యత్ర 'గొబ్బన'యని ప్రయోగించుట గమనింపఁ దగియున్నది.

జనవర ! నీ పురోహితుల శాస్త్రరహస్య నిరూపణక్రియా
వనజభవప్రభావులగు వారి ముహూర్తము నిశ్చయించఁగాఁ
బనుపు "శుభస్యశీఘ్ర" మను పల్కు నిజంబొనరింపు మన్న, గొ
బ్బనఁ బతిచిత్తవృత్తిఁగని భట్టి విదర్భుఁడుఁ దాను వేడుకన్.

(ఆ. 4-134)

కావునఁ బూర్వ (169) పద్యము నందును దీని ననుసరించి 'గొబ్బన' అని సవరింపఁ బడినది.

5. ప్రాస (?) ఈ క్రింది పద్యమును గమనింపుడు.

ఇది శిల వ్రాసిన యది యని
చతురత విప్రుఁడొకఁడు ప్రసంగవశమునం
జదివెను నొగినీ పద్యము
నదియొటుఁగఁగవలయు, నచటి కరిగెద భట్టీ ! (ఆ. 2-45)

పై పద్యమునందు 'ద'కార 'త'కారములకుఁ బ్రాసము కలదు. త, ద, లు రెండును స్వవర్గాక్షరములు కాబట్టి కొందఱు దీనిని "స్వవర్గజప్రాసము"గా చెప్ప వచ్చును. ప్రాసభేదములను జెప్పుచు "స్వవర్గజప్రాసము"ను జెప్పినవాఁ డప్పకవి యొక్కఁడే. అప్పకవి యైనను,

"గ్రంథ మంధశబ్దంబులఁ గల ద్వితీయ
వర్ణములు రెండును నఘోషవర్ణములగు
నైన నిజవర్గభవ చతుర్థాక్షరములఁ
గలియుఁ బ్రాసంబులును స్వవర్గజములనఁగ."

అని యిట్లు తవర్గ ద్వితీయ చతుర్థాక్షరములకు థ, ధ, లకుఁ బ్రాసమైత్రి జెప్పెను. మఱియు కవిత్రియము వారి పద్యములలో తవర్గ తృతీయ చతుర్థాక్షరము లనఁగా ద, ధ లకుఁ బ్రాసము గూర్పఁబడి యుండుటచే థ, ధ లకును, ద, ధ లకు బ్రాసము చెల్లుననుట ప్రసిద్ధము. కాని వీనికి వర్గప్రథమాక్షరముతోఁ గూడ ప్రాసము చెల్లునని చెప్పఁబడలేదు. థ, ధ లకును, ద, ధ లకును బ్రాసము చెల్లునపుడు త, ద లకు నేల చెల్లకుండవలె ననుట వేఱు విషయము. ఇందులకుఁ బూర్వకవి ప్రయోగము లేవి యున్నట్లు లేవు. కావునఁ బై పద్యము నందలి ద్వితీయ చరణాదినిఁ గల 'చతురత' యనునది యర్థభేదము లేకుండ "చదురున" యని నాల్గు పాదము లందును (ద) ప్రాసము కుదురునట్లు సవరింపఁ బడినది. పూర్వప్రతి పాఠము గూడ పుట యడుగున నీయఁబడినది. చిన్నచిన్న సవరణలు పెక్కు లున్నను బైనిఁ దెల్పఁబడినవి ప్రధానమయినవి.

విక్రమార్క చరిత్రము వంటి యుత్తమ ప్రాచీన కావ్యముల ముద్రిత ప్రతుల కీ నాఁడు అంజనము వేసి చూడవలసిన దురవస్థ యేర్పడినది. ఇట్టి పరిస్థితిని గమనించి ప్రాచీనాంధ్ర కావ్యములను పాఠక లోకమునఁ బునః ప్రచారమునకుఁ దెచ్చుటకు ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ దీక్షాకంకణముఁ గట్టుకొన్నది. అకాడమీ వారి యీ ఉపక్రమము నిజమున కొక సాహిత యజ్ఞము. ఏతదధ్యక్షుడు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు యీ సారస్వతే కి యజమానులు. కళాభవనము చత్వర వేదిక. కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు యాజ్ఞికులు. సహృదయ పాఠకులు సదస్యులు. సాహిత్య ప్రచారము సవనఫలము. ఈ క్రతునిర్వహణ కార్యక్రమమున నొక ఋత్విక్కుగా వరించి, నాకును యత్కించిద్భాగ స్వామిత్వము నొసంగిన అకాడమీ వారికిని ముఖ్యముగా శ్రీ రామానుజరావు గారికిని కృతజ్ఞతలు.

పల్లా దుర్గయ్య

హైదరాబాదు
1-9-1967

శ్రీ ర స్తు

# విక్రమార్క చరిత్రము

## ప్ర థ మా శ్వా స ము

### ఇ ష్ట దే వ తా ప్రా ర్థ న ము

శ్రీ గౌరీకుచనీలమౌక్తికమణిశ్రేణీవిభూషాఘృణి
ప్రాగల్భ్యంబులు గృష్ణపాండురతనుప్రౌఢిం బ్రతిష్ఠింపఁ దే
జోగణ్యుండయి యొప్పు శ్రీహరిహరేశుం డెప్డు రక్షించు వి
ద్యాగంభీరుని జన్నమంత్రిసుతు సిద్ధామాత్యచూడామణిన్. 1

చ. కనకనగంబు బొమ్మరముగా, భుజగేంద్రుఁడు జాలెగా నమ
ర్చిన, గిరిపుత్రిగాంచి యివి రెండును దేవధనంబు లన్న; న
జ్జననిహితోపదేశమున సన్మతి వానిఁ బునఃప్రతిష్ఠ చే
సినగణనాయకుండు కృప సేయుత సిద్ధనమంత్రికోరికల్. 2

ఉ. ఆనతులై నుతించు చతురాననముఖ్యులకోర్కిఁ దీర్పఁ బం
చాననదివ్యమూర్తికి షడాననుఁడై జనియించి యాసహ
స్రాననుసంస్తవంబులకు నందని శక్తిధరుండు సానుకం
పాననుఁడై నృపేంద్రసచివాగ్రణిసిద్ధనఁ గాచుఁ గావుతన్. 3

చ. హరిహరసంగమంబున మహాద్భుతభంగిఁ జరించి చేతులం
బరశుపినాకఖడ్గఫణిపాశ కపాల వరత్రిశూలముల్
కరమనురక్తిఁ బూని నుతిఁ గాంచిన బెల్లముకొండభైరవుం
డురుమహిమాఢ్యుఁ జేయు సుగుణోన్నతు జన్నయసిద్ధధీమణిన్. 4

ఉ. రాజు సహోదరుండు, రతిరాజు తనూజుఁడు, తండ్రి వాహినీ
రాజు, వరుండు లోకములరాజుగ రాజితలీల నొప్పు నా

రాజమరాళయాన సిరి, రాజ్యరమారమణీయుఁ జేయుతన్
రాజనుతప్రతాపగుణరమ్యుని జన్నయసిద్ధధీమణిన్. 5

క. శ్రీరామృత శశి శారద
నీరద నీహారహార నిర్మలశోభా
గౌరవ కళావిశారద
శారద సతతంబుఁ బ్రోచు జన్నయసిద్ధున్. 6

చ. హరిహరనీరజాసనసుఖావహమై నిమిషార్ధమాత్రలో
నిరువదిరెండునూఱులకు నెక్కుడు నిర్వదియోజనంబు లే
యరదము లీలవోలెఁ జను నంబరవీథి ననారతంబు నా
సురథము సన్మనోరథము చొప్పడ నీవుత సిద్ధమంత్రికిన్. 7

సీ. మకరందనిష్యందమందారమాలిక
కబరీభరంబున సొబగుమీఱ
రమణీయమౌక్తికరత్నహారంబులు
కుచకుంభములమీఁదఁ గొమరుమిగులఁ
గాంచనాంచలదివ్యకౌశేయచేలంబు
ఘనకటీతటమునఁ గరము మెఱయ
ఘనసార కాశ్మీర గంధసారోదార
మృగమదపంకంబు మెయిఁ దనర్ప
తే. మఱియు బహువిధశృంగారమహిమ మించి
హాటకోన్నత దివ్యసింహాసనమునఁ
దేజరిల్లెడు పార్వతీదేవి కరుణ
మంత్రిజన్నయసిద్ధుని మనుచుఁగాత. 8

## సంస్కృత కవిస్తుతి

చ. అచిరములైన యన్యరుచు లన్నియు నావలఁ బోవఁ ద్రోచి వా
క్సుచయమనోహరం బయిననేర్పు త్రికాలముఁ బ్ర  తింపఁగా
సుచరిత రామసంస్తవనసూక్తిసుధారస మాను నె  ఁ డా
ప్రచురకవిత్వతత్త్వనిధి భక్తి భజించెదఁ బుట్టపుట్టువు . 9

ఉ. ఆది ననంతసంఖ్యఁ దనరారుచు నేరి కగమ్యమైన యా
వేదము నెల్ల విప్రులుఁ బ్రవీణతతోఁ బఠియించునట్లుగా
శ్రీ దనరార నాలుగుగఁ జేసినపుణ్యుఁ బరాశరాత్మజున్
మోదముతో నుతింతు మునిముఖ్యుని నేకముఖాబ్జసంభవున్. 10

సీ. శ్రీహర్షు శివభద్రుఁ జిత్తపు శివదాసు
సౌమిల్లిని సుబంధు సార్వభౌము
కర్ణామృతకవీంద్రుఁ గామందకుఁ గళింగుఁ
గవిరాక్షసుని భాసుఁ గాళిదాసు
మల్హాణు బిల్హాణు మాఘు మయూరుని
వామను వరరుచి హేమచంద్రు
భవభూతి భారవి భట్టనారాయణు
భట్టగోపాలకుఁ బ్రవరసేను
తే. రాజశేఖరు హర్షు మురారిఁ జోరు
వరగుణునిదండి నాశాతవాహనుని వి
నాయకుని జయదేవు దిఙ్నాగు భద్రు
హరిని భామహుఁ గవిరాజు నాత్మఁ దలఁచి. 11

## కవిత్రయ ప్రశంస

ఉ. వేయివిధంబులందుఁ బదివేవురు పెద్దలు సత్ప్రబంధముల్
పాయక చెప్పి రిట్లు రసబంధురవాగ్విభవాభిరామధా
రేయులు శబ్దశాసనవరేణ్యులునాఁగఁ బ్రశస్తికెక్కరే
యేయెడ నన్నపార్యుగతి నిద్ధర ? నట్టిమహాత్ముఁ గొల్చెదన్. 12

చ. పరువడి భారతాఖ్యగల పంచమవేదము నాంధ్రభాష సు
స్థిరత రచించుచోఁ గృతిపతిత్వముఁ గోరి ప్రసన్నుఁ డైన యా
హరిహరనాథుచేఁ బడసె నవ్యయసౌఖ్యపదంబు నెవ్వఁ డా
పురుషవరేణ్యుఁ దిక్కకవిఁ బూని నుతింతుఁ గృతాధ్వరోత్సవున్. 13

ఉ. ఈత్రయిఁ దాఁ బ్రబంధపరమేశ్వరుఁడై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వమున శేషము, శ్రీనరసింహ రామచా
రిత్రములున్ బుధవ్రతగరిష్ఠత నెఱ్ఱయశంభుదాసుఁ డా
చిత్రకవిత్వవాగ్విభవజృంభితుఁ గొల్చెద భక్తియుక్తితోన్. 14

## కుకవి నిరసనము

మ. నవశబ్దార్థ రసానుబంధపదవిన్యాసక్రియా భావగా
రవ పాకధ్వనిరీతిశయ్యలఁ గవీంద్రశ్రేణి కావ్యాళిఁ జె
ప్ప వృథామత్సర మూని దుష్కవులుఁ జెప్పంజూతు రక్లేకదా!
శివుఁడుం దాండవమాడ నాడవె పిశాచీభూతబేతాళముల్. 15

మ. నవనానారసభాస్వ రార్థపదవిన్యాసక్రియాలంక్రియా
శ్రవణానందకథాసుధామయ మహాసారస్వతాంభోధిలో
నవలీలన్ విహరించుతజ్జ్ఞులు గతాహంకారులై యుండఁగాఁ
గవితాప్రౌఢిమలేనియజ్ఞులు వృథా గర్వాంధులే లౌదురో! 16

క. ప్రతిపద్యముఁ జోద్యముగాఁ
గృతిఁజెప్పిన నొప్పుఁగాక కృతి నొకపద్యం
బతిమూఢుఁడైనఁ జిత్రతఁ
బ్రతిపాదింపఁడె ఘుణాక్షరన్యాయమునన్? 17

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును శిష్టకవిజనకీర్తనంబును దుష్టకవినిరస
నంబునుం జేసి యపూర్వకథాబంధుర ప్రబంధరచనాకౌతుకుండనై
యుండునంత,

## కృతికర్త సభావర్ణనము

సీ. నవరసోజ్జ్వల కావ్యనాటకాలంకార
[1]నికషోపలవివేక సుకవివరులు

1. నికషోపలము=సాన.

శ్రీమహాభారత రామాయణాదిపు
రాణపారీణ పౌరాణికులును
వేదాంత వైశేషి కాదిషడ్దర్శన
తర్కకర్కశులైన తార్కికులును
దత్తిలభరతమతంగకోహాళమత
ప్రముఖసంగీతపారంగతులును
తే. మహిమఁ గొలువంగ నాస్థానమండపమున.
జనితసాహిత్య[1]సౌహిత్యసరసగోష్ఠిఁ
జిత్త మిగురొత్త జన్నయసిద్ధమంత్రి.
కొలువుగూర్చుండి నను వేడ్కఁబిలువఁబంచి. 19

## కవి వంశప్రశంస

సీ.మా. సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల
ఘటికలో నొకశతకంబుఁ జెప్పఁ
బ్రహసన ప్రకరణ భాణాది బహువిధ
రూపకంబు లయందు రూఢి మెఱయఁ
జక్ర చతుర్భద్ర చతురుత్తరాధిక
క్షుద్రకావ్యములు పెక్కులు రచింప
నాంధ్రకవిత్వంబునందుఁ బ్రబంధంబు
మేలుగాఁ దజ్ఞులు మెచ్చఁ జెప్ప
నిమ్మల నేరీతి నేధాతువుల నేమి
రసమున నైన వర్ణనము సేయ
సరి యేకసంధా ద్విసంధా త్రిసంధలఁ
దొడరినఁ బొరిబొరిఁ గడవఁ జదువ
నెవ్వఁ డేయవధాన మెఱుఁగు నయ్యవధాన
మున వాని కించుక ముల్లుసూప
వృత్తకందముఁ గందవృత్తంబునుం జతు
ష్కందంబు మొదలుగాఁ గలుగుగర్భ

1. సౌహిత్య=తృప్తి.

కావ్యవర్గముఁ జెప్పఁగాఁ బ్రబంధంబులుఁ
గ్రొత్తలు పుట్టించుకొని లిఖింపఁ
గా; నక్షరచ్యుతకంబు మాత్రాచ్యుత
కంబు బంధచ్యుతకంబు నామ
గోప్యంబులుం గ్రియాగోప్యంబులును భావ
గోప్యంబులును జెప్ప, గోష్ఠియందుఁ
బద్యంబు గీతికార్భటి నొగిఁ జదువంగ,
నెల్లవిద్యల సంచు లెఱుఁగనేర్తు
తే. ననుచు. నెల్లారితిరుకాళమనుజవిభుని,
సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసి
మహిమ గాంచిన పెద్దయామాత్యసుకవి
మనుమఁడవు నీవు నీవంశమహిమయొప్పు. 20

క. ఆఁడఁడు మయూరరేఖను
గాఁడం బాఱందు బాణగతి మన మెరియన్,
బ్రోడగు పెద్దయయన్నయ
మాడకు మాడెత్త యతనిమాటలు జగతిన్. 21

క. అని మీతండ్రిమహత్త్వము
జనవినుతరసప్రసంగసంగతకవితా
ఘన తేజులు కవిరాజులు
గొనియాడుదు, రఖిల రాజకుంజరసభలన్. 22

జక్కన కవితాప్రశస్తి

క. చక్కన నీవైదుష్యము
చక్కన నీకావ్యరచనచాతుర్యంబుల్
చక్కన నీవాగ్వైఖరి
చక్కన నీవంశమహిమ జక్కనసుకవీ! 23

క. స్వాభావిక నవకవితా
ప్రాభవముల నుభయభాషఁ బ్రౌఢిమఁ జెప్పన్
భూభువనంబున సరి లే
రాభారతి నీవుఁ దక్క నన్నయజక్కా! 24

వ. అనిసంభావించి. 25

## కావ్యకరణ హేతువు

తే. వనము నిధియును నల్లిల్లు వరసుతులును,
దెలువు గుడియును ధరఁ బ్రతిష్ఠితములయ్యెఁ
గృతియుఁ గైకొన్న సప్తసంతతులవలనఁ,
గీర్తిసుకృతంబులకును నేఁ గర్త నగుదు. 26

సీ. ప్రతిభాగుణధురీణ పౌరాణికత్రాణ
సకలపురాణ శాస్త్రములయందుఁ
బరమార్థ చరితార్థ భారతరామాయ
ణాదిప్రబంధ కావ్యములయందుఁ
గల్పాంతరస్థాయి గద్యపద్యప్రాయ
కమనీయ చిత్రకావ్యములయందు
రసికజనానందరససుధానిష్యంద
విలసిత నాటకావలులయందు
తే. సకల దేశభాషా విశేషములయందు
వరుసఁ బ్రఖ్యాతమనఁగ నుత్పాద్యమనఁగ
మిశ్రమన నొప్పు సత్కథామేళనంబు
లెన్నియన్నియు విన్నాఁడఁ బిన్ననాఁడ. 27

చ. [1]తలఁపఁ దదీయ నాయకవితానముకంటెను, సాహసక్రియా
కలితవదాన్యతాది గుణగౌరవరేఖల విక్రమార్కభూ
తలపతి యెక్కుడై నెగడెఁ దచ్చరితంబుఁ బ్రబంధశయ్యగాఁ
దెలుఁగున జెప్పి. యాకృతిపతిత్వము మా కొడఁగూర్పు నేర్పునన్. 28

వ. అని సవినయంబుగాఁ గనక మణి భూష ణాంబర తాంబూలంబు లొసంగి
గారవించినం బ్రమోదించి, తత్ప్రబంధమునకు ముఖాకల్పంబుగా,
నాప్రధానోత్తము వంశంబుఁ బ్రశంసించెద. 29

---

1. తలఁపఁ దదీయ యేకకవితానముకంటెను....అని వావిళ్ల. 1926.

## కృతిపతి వంశశంసనము

ఆ. జలజనాభు నాభిజలజంబున జనించె
బ్రహ్మ, యతని వదనపంకజమున
జనిత మైన విప్రజాతికిఁ దొడవుగా
హారితమునివరేణ్యుఁ డవతరించె. 30

మ. ఇనకోటి ప్రతిమాన తేజుఁ డభవుం డీశానవక్త్రంబుచేఁ
దనకుం దీక్ష యొసర్పఁగా, మెఱసె నుద్యద్ధర్మశాస్త్రక్రియల్
మను కాత్యాయన దక్ష గౌతముల సామర్థ్యంబునన్ మించె, స
న్మును లెవ్వారును నేర్తురే హారితునిన్ బోలం బ్రభావోన్నతిన్ ? 31

వ. తదీయగోత్రంబున నూత్నరత్నంబై జనియించి. 32

సీ. వేద శాస్త్ర పురాణ విజ్ఞానసరణిమై
నధిగత పరమార్థుఁడై తనర్చె
నెద్దనపూడి రాజేంద్ర చోడక్షమా
రమణుచే నగ్రహారములు వడసెఁ
గనకదం డాందోళికా చ్ఛత్ర చామర
ప్రముఖ సామ్రాజ్యచిహ్నముల నొప్పె
సర్వతోముఖ ముఖ్యసవన క్రియాప్రౌఢి
నుభయవంశంబుల నుద్ధరించె
తే. నన్నదానాది దానవిద్యావనుఁడు
పరమశైవ సదాచార పావనుండు
హారితవంశాంబునిధిసుతుఁ డార్యనుతుఁడు
సుగుణవిభ్రాజి సూరనసోమయాజి. 33

క. *అమ్మహితాత్ముని మనుమఁడు
సమ్మాన దయానిధాన సౌజన్యరమా

*అమ్మహితాత్ముని తనయుఁడు సమ్మాన దయానిధాన........
సిద్ధమంత్రి యెన్నికకెక్కెన్. వావిళ్ల. 1926.

సమ్మోదిత బాంధవుఁడై
యిమ్మహిలో సిద్ధమంత్రి యెన్నిక కెక్కెన్. 34

మ. శ్రుతులన్ వన్నియకెక్కె, శాస్త్రములచే సొం పగ్గలించెన్, మహో
న్నతిఁ బోషించెఁ బురాణ కావ్యరస నానా నాటకాలంకృతుల్,
క్రతువర్గంబుల సుప్రయోగమహిమన్ గాంచెన్, విరించాన్వయో
ర్జితపుణ్యుండగుసిద్ధమంత్రి సుగుణశ్రీమించి సేవించినన్. 35

చ. వనరుహనాభు కుద్ధవుఁడు, వజ్రికి జీవుఁడు, వత్సధారణీ
శునకు యుగంధరుండు, దితిసూతికి దైత్యగురుండు, విక్రమా
ర్కునకును భట్టిరీతి; నధికుండగు నన్నయగంధవారణం
బునకుఁ బ్రధానుఁడై నుతులఁ బొందెను సిద్ధనమంత్రి యిద్ధరన్. 36

వ. అమ్మహాప్రధానోత్తముండు, 37

చ. పరిణతనవ్యకావ్య రసభావవిజృంభణ భూరివిక్రియా
స్ఫురిత చరిత్రతత్త్వసరసుం డగు పేరయనన్ననార్యసో
దరి యగు సూరమాంబిక ముదం బలరంగఁ బరిగ్రహించె, భా
స్వరకమలాజనార్దన వివాహమహోత్సవలీల మీఱఁగన్. 38

క. ఆదంపతులకు సుకృత
ప్రాదుర్భావమున మంత్రిభాస్కరుఁడు, దయా
పాదితబాంధవనికరమ
హోదయుఁడగు జన్నమంత్రియునుఁ గల్గిరొగిన్. 39

వ. అందగ్రజుండు. 40

చ. అమృతగిరీంద్రసంయమి పదాంబుజషట్పదనాయకుండు నా,
నమితరవిప్రణామనికరాంచితపుణ్యుఁడు నాఁగ, నీశ్వరా
గమపరమార్థవేదియనఁ గంజభవాన్వయవర్ధనుండు నాఁ
బ్రమహితకీర్తిఁ బెంపెసఁగె భాస్కరమంత్రి ప్రతాపధాముఁడై. 41

తే. సుజనమిత్రుఁ డాదిత్యుఁడు సుతుఁడుగాఁగ
మనుమఁడై నారధీమణి మహిమమెఱయ
భాగ్యనిధియైన భాస్కరప్రభువరుండు
పుత్రపౌత్త్రాభివృద్ధిచేఁ బొలుపుమిగిలె. 42

వ. తదనుసంభవుండు. 43

సీ. విమలవర్తనమున వేదశాస్త్రపురాణ
వాక్యార్థసరణికి వన్నెవెట్టెఁ
బరమహృద్యంబైన పద్యశతంబున
దేవకీతనయు విధేయుఁ జేసె
రసికత్వమున దేవరాయమహారాయ
కరుణాకటాక్షవీక్షణముఁ గాంచెఁ
గర్ణాటకటకముల్ గలయంతయును మెచ్చ
గణకవిద్యాప్రౌఢి ఘనతకెక్కె
తే. గురులఁ బోషించె, సత్కవివరుల మనిచెఁ
బ్రజలఁ బాలించె, భాగ్యసంపద వహించె
హారితమునిముఖ్యవంశరత్నాకరేంద్ర
చంద్రుఁడై యొప్పు సిద్ధయజన్నమంత్రి. 44

మ. అరసెన్ బంధుల వైభవోన్నతులఁగా, నాదిప్రధానావళిన్
దొరసెన్ నీతివివేకవిస్ఫురణచేఁ దోరంపుసత్కీర్తులన్
బరసెన్ బూర్వవదాన్యవర్గముల; నోహో ! యెందు నేమంత్రులున్
సరియే సిద్ధయజన్నమంత్రికి మనీషాదేవతామంత్రికిన్ ? 45

వ. అమ్మహామంత్రీశ్వరుని కులపాలికారత్నంబు, 46

సీ. పరమపతివ్రతాగరిమ నీసతి కెన్నఁ
బ్రతిలేరు ధర నరుంధతియ దక్కఁ
బుత్త్రులఁ గాంచినపోల్కి నీకాంతకుఁ
జింతింప సరిలేరు గొంతి దక్కఁ

చాలిమి పేర్మి నీతరుణీలలామకు
నెన లేరు ధారుణీవనిత దక్క
సౌభాగ్యగరిమ నీసాధ్వికి నుపమింప
లక్ష్యంబు లేరు శ్రీలక్ష్మి దక్క
తే. రూపమున నీవధూమణిఁ జూపి చెప్ప
జోడు లేరు సురాధిపుసుదతి దక్క
ననఁగఁ బుణ్యపుముడి మోచి యక్కమాంబ
బంధువులపాలిసురభినాఁ బరఁగె ధరణి. 47

క. ఆరమణీరమణులకును
శ్రీరంజిల్లంగ నవతరించిరి విభవో
దారుఁడు సిద్ధనమంత్రియు
నారూఢయశుండు భైరవామాత్యుండున్. 48

సీ. సొబగుమైఁ గనువిచ్చి చూడ నేర్చిననాఁడె
సుజనులఁ గరుణతోఁ జూడ నేర్చె
మవ్వంబు దళుకొత్త నవ్వ నేర్చిననాఁడె
నయమార్గహీనుల నవ్వ నేర్చె
నడుగెత్తి యల్లన నడవనేర్చిననాఁడె
ననిచి ధర్మముత్రోవ నడవ నేర్చె
లలిఁ దొక్కుఁబల్కులు పలుకనేర్చిననాఁడె
పరికించి సత్యంబు పలుక నేర్చె
తే. వ్రాయ నేర్చిననాఁడె సద్వర్ణసమితి
నర్థి నర్థము ప్రబల వ్రాయంగ నేర్చె
బాల్యమునయంద బహుకళాప్రౌఢి మించెఁ
జిరయశోహారి జన్నయసిద్ధశౌరి. 49

సీ. చిత్రగుప్తునకైనఁ జింతింప నరుదైన
గణితవిద్యాప్రౌఢి ఘనత కెక్కె
నవరసంబులయందు నవ్యకావ్యంబులు
కవిజనంబులు మెచ్చఁగా నొనర్చె

* నర్థి నర్థులు ప్రబల వ్రాయంగ నేర్చె, అని వావిళ్ల. 1926.

నాణిముత్తెములసోయగము మించినవ్రాలు
వరుసతో నిరుగేల వ్రాయ నేర్చె
నాత్మీయ లిపియట్లు లన్యదేశంబుల
లిపులను జదువంగ నిపుణుఁ డయ్యె
తే. దేవరాయమహారాయధీవిధేయ
మంత్రివల్లభచామనామాత్యదత్త
చామర చ్ఛత్ర శిబికాది సకలభాగ్య
చిహ్నములనొప్పె జన్నయసిద్ధమంత్రి. 50

ఉ. చంద్రుఁడు కాంతి, నర్జునుడు శౌర్యమునన్, హరి సంపదన్, హరి
శ్చంద్రుఁడు సత్యవాక్యమున, శంభుఁడు భూతి, గురుండు నీతి, దే
వేంద్రుఁడు వైభవంబున, ధనేంద్రుఁడు దానమునందు నీ డనన్
సాంద్రయశోవిశాలుఁ డగుజన్నయసిద్ధయ యొప్పు నెప్పుడున్. 51

ఉ. వెన్నెలగంటిసూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రసం
పన్నుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్నకవీంద్రకుంజరుఁ డకుంఠితతేజుఁడు పెద్దతండ్రిగా
సన్నుతి గన్నసిద్ధునకు, సంతతదానకళావినోదికిన్. 52

ఉ. నైజకళా వివేకగుణ నవ్యవిలాస సమగ్రవిత్త వి
భ్రాజితవైభవంబుల తరంబుల జన్నయసిద్ధమంత్రికిన్
రాజును భోజరాజు రతిరాజును గిన్నరరాజు దేవతా
రాజును బోల రండ్రు కవిరాజులు రాజసభాంతరంబులన్. 53

క. చందురుఁ గన్నపయోనిధి
చందంబున సిద్ధమంత్రి జనతానయనా
నందనుఁడు తిప్పధీమణి
నందనుఁడుగ నిత్యసేవనస్థితి మించెన్. 54

వ. తదీయానుజుండు, 55

సీ. చెలిమిచేఁ గలిమిచేఁ జెన్నొందఁగ నొనర్చి
హితుల నిత్యానందయుతులఁ జేసె
శక్తిచే భక్తిచే సేవన మొనరించి
గురుల సమ్మదరసాకరులఁ జేసె
సమతచే మమతచే సంతర్పణ మొనర్చి
జనుల సంపూర్ణజీవనులఁ జేసె
నయముచేఁ బ్రియముచే నానాట నలరించి
కవుల వైభవరమాధవులఁ జేసె
తే. నీతిచేత వినీతిచే నేర్పు మెఱసి
గరిమఁ దనరాజు ధనరాజుగా నొనర్చె
సుగుణచంద్రికానందితసుజనహృదయ
కైరవుండగు జన్నయభైరవుండు. 56

వ. ఈ దృగ్వంశవర్ణనాసముదీర్ణకీర్తినిధానంబైన యమ్మంత్రినిధానంబు
నకును. 57

## షష్ఠ్యంతములు

క. శ్రీమద్వల్లయవరసుత
చామనదండాధినాథసామ్రాజ్యరమా
సామగ్రీసంపాదక
సామాదికచతురుపాయసంపన్ననకున్. 58

క. సముచితయజనాదివిధి
క్రమనిపుణున, కుభయవంశఘనకీర్తిసము
ద్యమనియమాచారునకును
విమలాపస్తంబసూత్రవిఖ్యాతునకున్. 59

క. దినకరదండనమస్కృతి
దినదినసంవర్ధమానతేజోనిధికిన్

వినుతహారితాన్వయాంబుధి
జనితకళానిధికి, సుకవిజనవరనిధికిన్. 60

క. జన్నామాత్యునిసుతునకు
సన్నిహిత సరస్వతీప్రసాదోదయసం
పన్నచతుష్షష్టికళా
సన్నాహస్ఫురితకీర్తిసౌభాగ్యునకున్. 61

క. అక్కాంబానందనునకు
ధిక్కృతసురరాజమంత్రిధీవిభవునకున్
దిక్కూలంకషకీర్తికి
జక్కనకవికావ్యకరణసత్ప్రియమతికిన్. 62

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నారచియింపం బూనిన, నవ్యకావ్యకథా
లక్ష్మికి సుధాసాగరంబయిన మధురానగరం బెట్టి దనిన. 63

## కథా ప్రారంభము

## మధురాపుర వర్ణనము

చ. ధరణికిఁ గోటచక్రగిరి, దాని కగడ్తలు వారిరాసు, లా
పరిఖలు కోటలోనునికి భావ్యము గాదని యబ్జసూతి భా
సురముగఁ జక్రభూధరముచుట్టును వార్థులు నిల్పె నాఁగ; శ్రీ
కరమగుకోటచుట్టును నగడ్తలు చెల్వగు నప్పురంబునన్. 64

తే. అడుగుఁ జెంది భోగావతి యతిశయిల్లఁ
బరిఖ లక్ష్మీకరణిఁ జూపట్టె ననియొ,
దాను బురికోట యాకాశతటిని మోచి
సమధికోన్నతి గౌరీశుచంద మొందె. 65

క. పురివప్రఖచిత మణిగణ
సురుచిరదీధితులవలన, సొరిదిని దివియల్
సరకుగొన రెట్టిరాత్రులఁ
గరమరు; దప్పురముకోటకావలివారల్. 66

చ. వరకనకప్రభాతివిభవంబున మేరుమహీధరంబు లై
నిరుపమవజ్రమౌక్తికవినిర్మలకాంతుల వెండికొండ లై
సురుచిరరత్నదీధితులసొంపున రోహణపర్వతంబు లై
పురమున దేవగేహములు పొల్పెసలారును వైభవోన్నతిన్. 67

క. అప్పురిసౌధములం గల
యొప్పును, బొడవును, దనర్పు, నూహించుచు వా
తప్పఁడె కలరూపెల్లను
జెప్పెడుచో రెండువేలజిహ్వలవాఁడున్. 68

తే. భూమిఁ దనతోడియిరువురుఁ బూజగొనఁగ
ధాత యాచందమునఁ బొందఁ దానుగోరి
వివిధభూసురాకారత వెలసె ననఁగ
బ్రహ్మసంఘంబు వెలయు నప్పట్టణమున. 69

సీ. వేదశాస్త్రపురాణ విద్యానవద్యులు
మంత్రతంత్రాగమ మర్మవిదులు
నానావిధాధ్వర నైపుణ్యగణ్యులు
సాధుసంరక్షణాచరణపరులు
నిఖలధర్మాధర్మ నిశ్చితహృదయులు
పరమకారుణికత్వ భవ్యమతులు
నిజకులాసారైక నిష్ఠాగరిష్ఠులు
నిత్యసత్యవ్రత నిరతవచను
తే. లర్కతేజులు, సువ్రతు, లకుటిలాత్ము
లమలచరితులు, దైవజ్ఞు, లలఘుయశులు
విప్రు లొప్పుదు, రెప్పు డవ్వీటిలోనఁ
జిత్సదానందసంపూర్ణ చిత్తు లగుచు. 70

చ. దొరఁకొని పూర్వజన్మమున దుర్జనశిక్షయొనర్పఁ గామి, సు
స్థిరమతి రాజ్యభోగములు చేకొనఁగాఁ దటిలేమి నాత్మలో

హారి తలపోసి, సౌఖ్యముల నందఁగఁ దత్పురిఁ బెక్కురూపులై
పొరిది జనించెనా, నృపతిసూనులు పొల్తురు శ్రీ సమేతులై. 71

ఉ. ఇంకనివారిధుల్, ధరణి నెవ్వరివేఁడనియింద్రు, లెన్నఁడున్
బొంకనిధర్మనందనులు, పొంకముగందనిచంద్రబింబముల్,
శంకరుకింకలోఁబడనిశంబరసూదను, లాహవంబునన్
గొంకనిపార్థులై నృపతికుంజరసూనులు పొల్తు రప్పురిన్. 72

చ. కరమున నున్నపుర్రయును, గామునిభూతియు, నుగ్రఫాలమున్,
గరివరచర్మమున్ దొలఁగి, గ్రక్కున లేమికి బొమ్మగట్టఁడే
హరుఁడు, కుబేరుచె ల్మెడలి యాదట మాసఖుఁ డైన నంచు న
ప్పురమున వైశ్యులాడుదురు పుణ్యముపేర్మిఁ బ్రతాపధాములై. 73

చ. పొడవుగ నెల్లయంగడులఁ బ్రోవులు వోసిననూత్నరత్నముల్
కడఁక ననేకవేషములు గైకొని వచ్చినయర్థికోటికిన్
బిడికిళులాదిగాఁగ బలిపెట్టుదు రెప్పుడు వైశ్యభామిను
ల్కడవక హస్తకంకణకలధ్వను లొప్పఁగ నప్పురంబునన్. 74

ఆ. లెక్కలెక్కుడైన మిక్కిలిసిరి గల్గి
నెన్ని, కోట్లపడగ లెత్తరామి
నపరిమితధనంబులను ప్రాలి పడగలు
గట్టు వైశ్యజనము పట్టణమున. 75

చ. చెఱకును రాజనంబుఁ గృషిచేయుచు నుండెడునేర్పుకల్మియున్
దఱుఁగని ధాన్యముల్ పసులదాఁటులు దోఁటలుఁ గట్టుబండులున్
గుఱు తిడరాక యుండెడునగోచరవస్తుచయంబుఁ దేజులన్
దఱచుగ నీనుగోడిగలుఁ దత్పురిశూద్రుల కొప్పు నెప్పుడున్. 7

సీ. క్రొవ్వులి నైన నుక్కునఁబట్టి, మీసాల
నుయ్యెలలూఁగెడునోపికలును

మదహస్తి నయినను నెదిరి, కొమ్ములువట్టి
చదికిలఁబడఁ ద్రోచుసత్వములును
గంఠీరవము నైనఁ గడిమికిఁ బెడఁబాపి
సటలు వెఱుక జాలుసాహసములు
శరభంబు నైనను సరభసంబునఁ గిట్టి
మూటకట్టుగఁ గట్టుమొక్కలములు
తే. గలిగి, శస్త్రాస్త్రనిపుణులై కరము మెఱసి
యతిభయంకరాకారత నతిశయిల్లి
ధీరతాసముద్భటులైన వీరభటులు
వరఁగుచుండుదు రప్పురవరమునందు. 77

సీ. మృగరాజమధ్యలై మిక్కిలి మెఱసియు
వక్షోజకరికుంభరక్ష సేసి
చంద్రబింబాస్యలై చాల రాగిల్లియు
నలకాంధకారంబు వెలయఁజేసి
పికనాదకంఠలై పెంపువహించియు
నధరపల్లవముల ననునయించి
కలహంసగమనలై కడు బెడఁగారియుఁ
గరమృణాళంబులఁ గరము మనిచి
తే. నవ్యకౌముదీస్మితలయ్యు నయనపాద
సారసంబుల నెంతయు గారవించి
చిత్రసౌందర్యధుర్యలై చిగురుఁబోఁడు
లప్పురిఁ దనర్తు రెక్కుడు నొప్పిదముల. 78

చ. తెలికనుదోయి మించులును, దిన్నని నవ్వులు, ముద్దు మోములున్
బలుచని చెక్కులుం, జిలుకపల్కులు, మెత్తనిమేనుఁదీఁగలున్,
గలుగుట సందియం బయినకౌనులు, వట్రువలైన చన్నులున్
గలిగి, పురిం జెలంగుదురు కామునిదీమములట్ల కామినుల్. 79

ఉ. భూమిఁ గవీంద్రవాక్యములఁ బొచ్చెము సేయఁగ జెల్లెఁగాక, యా
తామరసాక్షులైన పురితన్వులకాతకటాక్షముల్ విట

స్తోమము మర్మదేశములఁ దూఱి కలంపఁగఁ జాలుపోలికన్
గాముని పుష్పబాణములు కాముకుల న్నెటినాఁటఁ జోలునే? 80

క. అసమశరుఁ డించువిల్లును
గుసుమశరంబులును విడిచి, కొమ్మలభ్రూనే
త్రసమృద్ధిచేతఁ దత్పురిఁ
బసగలవిలుకాఁ డనంగఁ బరఁగుచు నుండున్. 81

క. యోషిజ్జనసౌందర్యవి
శేష మశేషంబు, వాగ్విజృంభణమహిమన్
భాషాపతి నిర్జరగురు
భాషాశేషులకు రాదు ప్రస్తుతి సేయన్. 82

ఉ. ఎత్తులయొప్పుకంటె సరమెత్తుట యొప్పఁగఁ, జొక్కి విల్వకా
ఱొత్తడిఁ బుష్పముల్ కొసర కూరక యున్కికి నల్లనవ్వుచున్
విత్తముతోన చిత్తములు వేగ హరింతురు నేర్పుమీఱఁగాఁ
జిత్తజువేఁటదీమములచెల్వునఁ దత్పురిఁ బుష్పలావికల్. 83

చ. చిలుకల తేరుఁ గోయిలలసేనలుఁ దుమ్మెదపిండునారియున్
గలువలయమ్ములుం బ్రసవకార్ముకమున్ మగమీనుటెక్కెమున్
మలయసమీరుఁ ప్రాపుఁగని మన్మథుఁ డప్పురిలోనఁ ద్రిమ్మరున్
లలనలఁ బ్రాణనాథు లెడ లజ్జల నుజ్జగిలంగఁ జేయుచున్. 84

సీ. నడయాడ వరములు వడసి మోదమ్మునఁ
గూడియాడెడు నడగొండ లనఁగ
వర్ష ధారలు దానవారియై తొరఁగంగ
ధర వసించిన యంబుదంబు లనఁగ
నాశాగజాకృతు లలవడ జనులకుఁ
జూప వచ్చిన బహురూపు లనఁగఁ
దిమిరారి దోఁచిన దీనత పెంపునఁ
దెమలిన చీఁకటిగము లనంగ

తే. వాలి చరియించుఁ బురి మదవారణములు
దారుణాహవాంభోనిధితారణములు
కదనవిజయరమాధారకారణములు
పృథులరాజన్యశౌర్యసంప్రేరణములు. 85

చ. సురపతిదాడి నంబునిధిఁ జొచ్చినయద్రులు, నిచ్చ లప్పురిన్
దిరుగఁగ నాత్మఁ గోరి, శరధిన్ బరిఖాకృతిఁ గాపువెట్టి, తా
రరుదుగ భద్రసామజములై, సెలయేఱులు దానధారలై
తొరఁగుచు నున్నమాడ్కి, నతిదుస్సహతం గరులొప్పు నప్పురిన్. 86

సీ. పవమాను నైనను నవమానయుతుఁ జేయుఁ
జటులజవోపేతసత్త్వగరిమ
సింహగర్జల నైన జీరికిఁ గొనకుండుఁ
బృథులహేషాఘోషభీషణముల
నాంజనేయుని నైన నపహసింపఁగఁ జాలు
నతిదూరలంఘనాహంకృతులను
విక్రమార్కుని నైన వెఱఁగొందఁగాఁ జేయుఁ
జండతరాఖీలసాహసముల
తే. భరతమునినైన నొచ్చెంబు పట్టుచుండు
వివిధనర్తనచాతుర్యవిక్రమముల
జిత్రరూపము మెచ్చవు చెలువులందు,
వలను మీఱిన యప్పురివారువములు. 87

సీ. శుకమంజులాలాపశుభకరస్థితి మించి
పల్లవసందోహభాతిఁ దనరి
కలకంఠకూజితవిలసనంబుల నొంది
రంభానురేఖలరమణ మెఱసి
హరిచందనస్ఫూర్తి ననిశంబుఁ దనరారి
పుష్పసౌరభములఁ బొలుపుమిగిలి
సరసాలిమాలికాసంసక్తి విలసిల్లి
విషమబాణాసనవృత్తిఁ జెంది

తే. లలితమాకందవైభవంబుల దనర్చి
యతిమనోహరాకారత నతిశయిల్లి
యుద్యదుద్యానవాటిక లుల్లసిల్లు
వారవనితలు నాఁ బురవరమునందు. 88

సీ. సరసపుష్పపరాగసైకతంబులు దీర్చి
తేనియకాలువల్ తెరలిపాఱ
రమ్యమయూరసంభ్రమలీలఁ గల్పించి
ఘనతమాలాంబుదకాంతిఁ దనర
లతికావిలాసినీలాస్యంబు ఘటియించి
చతురమారుతనటస్వామి వోలయఁ
జారుపల్లవరాగసంధ్యామహిమఁ జూపి
విమలకోరకతారకములు మెఱయ
తే. సతతవిహరణదంపతిచారుదేహ
రత్నభూషారుచిస్తోమరమ్య మగుచుఁ
బొలుచు నారామసమితి తత్పురమునందుఁ
గల్పకావలి భువిమీఁదఁ గలిగె ననఁగ. 89

శా. ఆరామంబులు పెక్కుగల్గును సునాయాసంబుగా నేచి ము
క్కారుం బండును రాజనంబుఁ జెఱకున్ గప్పారువుఁ దేనియన్
నీ రెల్లప్పుడు నిండియుండుఁ జెఱువుల్ నిర్మించు చెల్లన్ బురిం
బౌరశ్రేణికి గోకదంబమునకున్ బాధోవిహారార్థమై. 90

చ. కరిమకరాలయాఢ్యతఁ, బ్రకామగభీరత, నచ్యుత స్థితిన్,
వరకమలోదయస్ఫురణ పొలుటఁ బన్నగలోకసంగతిన్,
ధరఁ గలవారికెల్లఁ బ్రమదంబున నాశ్రయమై తనర్చుటన్,
బరఁగుఁ బురిం దటాకములు పాలసముద్రముతో సమంబులై. 91

చ. సరసిజనాభుఁ డట్టె హరి, సారససంభవుఁ డట్టె బ్రహ్మ, యా
సిరియును నబ్జవాస యటె, చిత్తమునం దలపోసి చూడఁగా

దొరయునె యీప్రసూనములతో నితరప్రసవవ్రజంబు నాఁ,
బురముఁ బద్మషండములు పొల్పెసలారు మనోహరంబులై. 92

సీ. కామశాస్త్రంబులు వేమాఱు నియతిమైఁ
జదువకుండినఁ బుష్పశరునియాన
మన్మథాగమములమర్మంబు లెల్లను
జూడ కుండిన రమాసుతునియాన
సూనాస్త్రతత్త్వ విజ్ఞానంబు గడముట్టఁ
గనుఁగొన కున్న నంగజునియాన
మకరకేతనమంత్ర సుకరాక్షరము లను
ష్ఠింపకుండిన మనసిజునియాన
తే. యనుచు, జనులెల్ల వినఁ జాటుననువు దోఁప
మత్తకోకిలనిస్వన మధురకీర
భాషణంబులు వీనులపండు వగుచుఁ
దనరుఁ దత్పురి నుపవనాంతరములందు. 93

ఉ. చిత్తజురాజ్యసంపద యశేషము గైకొని సౌఖ్య మందఁగా
[1]నుత్తులు దార నాఁ బురవరోపవనంబులు సొచ్చి యిచ్చఁ బూ
గుత్తుల వ్రాలి, తేనియలు కుత్తుగబంటిగఁ గ్రోలి, లీలమై
నొత్తిలి మ్రోయు చింపుదళుకొత్తుచు నుండు మదాళిదంపతుల్. 94

సీ. విరజాజివిరులపై విహరించు, విహరించి
సొబగు నెత్తావులు చూఱలాడు
బొండుమల్లియలపైఁ బొరలాడుఁ బొరలాడి
పుష్పంధయంబులఁ బోవఁజోపుఁ
గన్నె గేదఁగు లొయ్యఁ గదలించుఁ గదలించి
చదలఁ బుప్పొడి వెదచల్లియాడు
జలజ వనంబులోఁ జరియించుఁ జరియించి
దొరఁగుపూఁదేనెలఁ దొప్పఁదోఁగు
తే. సతతబహువిధరతపరిశ్రాంతి నొంది
యున్న వనపాలదంపతు లొడల నున్న

1. అర్థులు.

చెమటలల్లనఁ బాయంగఁ జేయుచుండు
నప్పురంబునఁ బ్రమదవనానిలుండు. 95

శా. వేమాఱు న్మలయానిలుం డడరి, యావీటం బ్రసూనాన్వితా
రామంబుల్ వెస ముట్టి, యందలి యలివ్రాతంబుఁ బోఁజోపి, తా
నామోదంబులు చూఱవట్టి బలియుండై యొప్పి, పౌరాంగనా
సీమంతంబులఁ బుష్పరేణు వునుచున్ సిందూరరేఖాకృతిన్. 96

సీ. కమలాగృహకవాటకలితకుంచిక నాఁగ
జలజకోరకరాజిఁ గలయఁ దెఱచి
మధుకరాకర్షణమంత్రసిద్ధుఁడు నాఁగఁ
గుసుమరజోభూతి దెసలఁ జల్లి
సుభగలతానటీసూత్రధారుఁడు నాఁగఁ
నృత్యవిద్యాప్రౌఢి నెఱయనేర్పి
సకలజీవోన్మేషసంజీవని యనంగఁ
బ్రకటనిద్రాముద్రఁ బాయఁజేసి
తే. మందిరోద్యానవాటికలందుఁ బొలసి
వేఁగుబోఁకలఁ దత్పురి విభ్రమించు
శైత్యమాంద్యకసౌరభ్యసహితమైన
మలయపర్వతసంజాత మారుతంబు. 97

చ. సిరి యుదయంబు నొందినవిశేషమున న్నవదుగ్ధవార్ధి యై
కర మరుదైనముత్యములు గల్గుట నూతనతామ్రపర్ణియై
వెరవున సత్పథస్థితి నవీనవియన్నది యై తనర్చి, యా
పురి బహుజీవనంబులఁ బ్రపూర్ణత నొందె జగన్నుతంబుగన్. ౯౮

ఉ. భామిను లెల్లఁ బద్మినులు, బ్రాహ్మణు లెల్లఁ గృతాధ్వరోత్సవుల్,
భూమిపసూను లెల్లఁ బటుభూరిభుజాబలవిక్రముల్, విట

గ్రామణు లెల్లఁ గామరసకావ్యకళాకలనావిశారదుల్,
కోమటు లెల్ల నర్థపులు, గుజ్జము లెల్లను దేజు లప్పురిన్,

తే. సకలకళలకు సుఖగోష్ఠి సలుపునెలవు
మగతనంబుల కేకాంతమందిరంబు
పచ్చవిల్తుని కాయుధాభ్యాసశాల
యనఁగ, నొప్పారు నెప్పుడు నప్పురంబు. 100

వ. మఱియు నప్పురవరంబు సరోవరంబునుం బోలె బహుజీవన పరిపూర్ణంబును గమలావాసవిలసితంబును గంకణగణకలితంబును రాజహంస సేవ్యంబును గువలయానందభవ్యంబును నై. వసంతసమయంబునుంబోలెఁ బల్లవోల్లాసహృద్యంబును మదనవిహారానవద్యంబును సుమనోవికాసమహనీయంబును శుకశారికాలాపరమణీయంబును సకలజనమనఃప్రసాదంబును గలకంఠమృదులగానసంపాదంబునునై, రామాయణంబునుం బోలె రామాభిరామంబును భరతగోష్ఠీసీమంబును సుమిత్రాత్మజ జనకతనయానందగమ్యంబును శత్రుఘ్నవ్యాపారరమ్యంబును నంగదకటకాలంకారకీర్తనంబును మహాబలకుమారోదారవర్తనంబునునై, మహాభారతంబునుం బోలె ధర్మనందనాచారప్రకారంబును శిఖండివిహారస్ఫారంబును భీమబలోద్దామంబునునర్జునకీర్తిస్తోమంబును జాపాచార్యహస్తలాఘవప్రశస్తిభరితంబును గృపానూనచరితంబును నై, పయఃపారావారంబునుంబోలెఁ బురుషోత్తమవాసయోగ్యంబును లక్ష్మీజనిసౌభాగ్యంబును ననంతభోగిపరివృతకులగోత్రాలవాలంబును సకలరత్నోద్భవమూలంబునునై మెఱసి; మాతంగవారంబయ్యును మాతంగనివారంబై, పుండరీకమండనం బయ్యును బుండరీకఖండనంబై, పుణ్యజనభయంకరం బయ్యును బుణ్యజనశివశంకరంబై, మధుపకులనిరసనం బయ్యును మధుపకులవిలసనంబై, యనంగవిహారసహితం బయ్యును ననంగవిహారరహితంబై తనరి; తను కృశత్వంబు మానినీమధ్యంబులయంద, చంచలత్వంబు మృగేక్షణాకటాక్షంబులయంద, కుటిలస్వభావంబు కాంతాకుంతలంబులయంద, అన్యోన్యసంఘర్షణంబు ప్రమదాపయోధరంబులయంద, ఆలస్యంబు నితంబినీగమనంబులయంద, క్రూరత్వంబు సుముఖీ నఖముఖంబులయంద, కలహంబు మానినీప్రణయప్రసంగంబులయంద, రాగాతిశయంబు బింబాధరామధురా

చెమటలల్లనఁ బాయంగఁ జేయుచుండు
నప్పురంబునఁ బ్రమదవనానిలుండు. 95

శా. వేమాఱు న్మలయానిలుం డడరి, యావీలం బ్రసూనాన్వితా
రామంబుల్ వెస ముట్టి, యందలి యళివ్రాతంబుఁ బోఁజోపి, తా
నామోదంబులు చూఱవట్టి బలియుండై యొప్పి, పౌరాంగనా
సీమంతంబులఁ బుష్పరేణు వునుచున్ సిందూరరేఖాకృతిన్. 96

సీ. కమలాగృహకవాటకలితకుంచిక నాఁగ
జలజకోరకరాజిఁ గలయఁ దెఱచి
మధుకరాకర్షణమంత్రసిద్ధుఁడు నాఁగఁ
గుసుమరజోభూతి దెసలఁ జల్లి
సుభగలతానటీసూత్రధారుఁడు నాఁగఁ
నృత్యవిద్యాప్రౌఢి నెఱయనేర్పి
సకలజీవోన్మేషసంజీవని యనంగఁ
బ్రకటనిద్రాముద్రఁ బాయఁజేసి
తే. మందిరోద్యానవాటికలందుఁ బొలసి
వేఁగుఁబోఁకలఁ దత్పురి విభ్రమించు
శైత్యమాంద్యకసౌరభ్యసహితమైన
మలయపర్వతసంజాత మారుతంబు. 97

చ. సిరి యుదయంబు నొందినవిశేషమున న్నవదుగ్ధవార్ధియై
కర మరుదైనముత్యములు గల్గుట నూతనతామ్రపర్ణియై
వెరవున సత్పథస్థితి నవీనవియన్నదియై తనర్చి, యా
పురి బహుజీవనంబులఁ బ్రపూర్ణత నొందె జగన్నుతంబుగన్.

ఉ. భామిను లెల్లఁ బద్మినులు, బ్రాహ్మణు లెల్లఁ గృతాధ్వరోత్సవుల్,
భూమిపసూను లెల్లఁ బటుభూరిభుజాబలవిక్రముల్, విట

ణప్రకీర్తితబుధజనానందుఁ డగుచుఁ
దనరె శృంగారశేఖర ధరణివిభుఁడు. 102

క. శోభాగణనీయ యశో
లాభాగమ నాఖిలాషలంపటుఁ డగుచున్
భూభాగ మేలె నాతఁడు
నాభాగ దిలీప రంతి నహుషులమాడ్కిన్. 103

క. ఆరాజురాజ్యమున ధర
నారూఢివహించెఁ జిరతరాయు రనేక
శ్రీరుచిర పుత్త్రపౌత్త్ర స
దారోగ్య సుభాగ్య సంతతానందంబుల్. 104

వ. అమ్మహీశ్వరుం డొక్కనాఁడు, 105

సీ. సకలభాషాకావ్య సత్కవిరాజులు
నుభయపార్శ్వంబుల నుల్లసిల్ల
సంగీతవిద్యాప్రసంగ పారంగత
గాయకేంద్రులు సమ్ముఖమున మెఱయఁ
జరమభాగమునందుఁ జామరగ్రాహిణీ
కంకణఝుణఝుణత్కార మెసఁగఁ
బదపీఠిచెంగటఁ బ్రణతరాజకిరీట
నవరత్న నీరాజనములు నిగుడ
తే. సహజకరుణాకటాక్షవీక్షణవిశేష
దీపితాశేషధనకృతార్థీకృతార్థి
కలితచాటుసుధా పూర్ణకర్ణుఁ డగుచు
నిండువేడుకతోఁ గొలువుండునపుడు. 106

## చంద్రగుప్తుఁడను విప్రకుమారుని రాక

ఉ. క్రొన్నసవింటివాఁడొ నలకూబరుఁడో నలుఁడో జయంతుఁడో
యున్నరమూర్తి, యంచుఁ గొలు వెల్లను నచ్చెరువొంది చూడఁగా,

విన్నను వొప్ప నొక్కరుఁడు విప్రకుమారకుఁ డేఁగుదేర, న
త్యున్నతరత్నపీఠమున నుంచి నృపాలకుఁ డిచ్చె నర్చనల్. 107

ఆ. ఇచ్చి యాదరించి, యెయ్యది నీనామ
మెచటనుండి యిచటి కేటి కిప్పు
డేఁగుదెంచినాఁడ ? వెఱిగింపు మనుటయు
నిట్టులనియె భూసురేశ్వరుండు. 108

క. నాపేరు చంద్రగుప్తుఁడు
భూపాలక ! సకలకళలఁ బొగడొందినప్ర
ద్యోపాధ్యాయులశిష్యుఁడ
నాపుణ్యాత్ముల కృపాకటాక్షమువలనన్. 109

మ. చతురామ్నాయములున్ దదంగములుఁ దూచాతప్పకుండ న్గ్రహిం
చితి, వేదార్థరహస్యముల్ దెలిసితిం, జేకొంటి న్యాయక్రమో
న్నతి, శీలించితి ధర్మశాస్త్రముఁ బురాణప్రౌఢిమన్ మించితిన్,
మతిలో నీవదునాల్గువిద్యలును సమ్మానంబునం బూనితిన్. 110

క. గౌరవమున సకలకళా
పారీణుఁడ నైతిఁ, బసిఁడిపళ్లెరమైనన్
జేరువగఁ జోటు వలె నని
చేరితి నిను, నాదుకోర్కిఁ జింతింపు మదిన్. 111

తే. అనుచుఁ దత్కాలయోగ్యంబు లైనయట్టి
భాషణంబుల బహుకళాప్రౌఢి దోఁపఁ
జంద్రగుప్తుండు గావించె సరసగోష్ఠి
పట్టి క్రమాఁకులఁ జిగుళులు పుట్టునట్లు. 112

ఉ. ఆ లలితప్రసంగమున కాత్మదలిర్చిన, ఛత్రచామరాం
దోళిక లాదిగాఁగలుగు తోరవుసంపద లిచ్చి, యమ్మహీ
పాలుఁడు సత్కరించె ద్విజబాలకముఖ్యు ననేకభంగి, ను
న్మీలితబంధుపంకజవనీకమలాప్తునిఁ జంద్రగుప్తునిన్. 113

రకీర్తిప్రథమానదానకలనా శృంగారశృంగారశే
ధాత్రీరమణుండు నిత్యమును వేడ్కన్ దన్ను మన్నింప, సు
లక్ష్మీరతి నుల్లసిల్లె ధరణీదేవోత్తముండుం బురిన్,
శిష్యప్రకరప్రబోధనకళా వ్యాఖ్యానసౌఖ్యాత్ముఁడై. 114

మదనరేఖ వృత్తాంతము

క. అంతట నొకనాఁడు జర
త్కాంతామణి యొర్తు గదిసి, ఘనతరవినయా
నంతభయభక్తి నతనికి
నెంతయుఁబ్రియ మొదవ మ్రొక్కి, యిట్లనిపలికెన్. 115

రమ్యగుణధామ శృంగారనిస్సీమ
తోయజభవవంశతుహినధామ!
మధురాపురాధీశుఁడై విలసిల్లు
శృంగారశేఖరక్షితిపుపాల
పలోత్తముండైన వీరవర్మ్మం డను
దండనాయకుఁ డాత్మజుండు నాకు
లిగాదిలివట్టి యభినవతారుణ్య
మహనీయతాస్పద మదనరేఖ,
గమంజరి యన నొప్పురాజసుతయుఁ
ము నొకయీడుగాఁగ, నెంతయును వేడ్క
శ్రీపతి యక్కువ బొమ్మనందుఁ
ంకొని యొక్కలాగునఁ బెనుపఁ బెరిఁగి. 116

క. కామితఫలదము లనఁ దగు
నోములు సర్వమును నోఁచి, నుతదానకళా
శ్రీమించె. బహుస్యందన
సామజహయహోహణప్రశస్తి వహించెన్. 117

మదనరేఖ సౌందర్యము

క. ఆ రమణి రూపరేఖా
చారువిలాసము లనన్యసాధారణముల్
శ్రీరమణీతనయరమా
ధారణము లు, ప్రథమరసకథాకారణముల్. 118

సీ. అతివ తిన్ననిమాట లమృతంపుఁదేటలు
హారినీలమణులమై నలరుకురులు
వనజాతిచూపులు వలరాజుతూపులు
క్రొత్తవెన్నెలలోనిక్రొవ్వు నవ్వు
మెఱఁతమేనిమెఱుంగు మెఱయుకారుమెఱుంగు
చిగురుకెంపులక్రోవిచిన్నిమోవి
కోమలిచనుదోయి కొదమజక్కవదోయి
శృంగారవీచులు చెలువవళులు
తే. గంధసిందురకుండాగ్రప్రకాండ కరభ
కదళికాకాండ కాంతవర్గములతోడి
పెందొడలు కాంతపెందొడ లెందు నరయ
మదనరేఖకు సరియైనమగువగలదె ? 119

మదనరేఖ చంద్రగుప్తునియం దనురక్త యగుట

క. అన్నెలఁత నిన్న నున్నత
సన్నుతమణిచంద్రసౌధశాలలలోనన్
గ్రొన్ననవిలుతుని నోముచు
వెన్నెల నెచ్చెలులుఁ దాను విహరించుతఱిన్. 120

క. చిలుకల తేరును, గోకిల
బలములు, లేఁజెఱకువిల్లుఁ బ్రసవాస్త్రములున్
దొలఁగించినమరుఁడో ! యన
విలసితగతి నీవు రాజవీథిఁ జరింపన్. 121

సీ. ఎలమితోఁ గోరిక లీరిక లెత్తిన
పరఁగ మేఁ బులకలు జాదుకొనఁగ
వలువులువాతెడు ననురాగరసలీల
నానందబాష్పంబు లగ్గలింప
మఱుఁగువెట్టక డెంద మెఱిఁగించుకై వడి
గొబ్బునఁ బయ్యెదకొంగు సడలఁ
గమఁగొన్నమాత్రానఁ గరఁగినగతి దోఁపఁ
జెమటుచిత్తడిపోన చిప్పతిలఁగఁ

తే. దమకమును సిగ్గుఁ దమలోనఁ దడఁబడంగ
మఱపుఁజెయ్వులుఁ దమలోన మాఱుమలయ
సొలపుఁ జూపులుఁ దమలోన సూడుపట్ట
సహజశృంగారచేష్టలు సందడింప. 122

క. లీలాతరంగితం బగు
లాలితభవదీయరూపలావణ్యరసం,
బాలోలనయననలినీ
నాళంబులఁ గ్రోలుచుండె నలినాక్షి తగన్. 123

వ. అంత. 124

క. తరుణారుణారుణాంబుజ
శర మిక్షుశరాసనమున సంధించి మరుం
డరవిందనయనడెందము
కరమరుదుగ నుచ్చిపోవఁగా నేసె వెసన్. 125

క. అగ్గజగామిని, కాముని
యగ్గలికకు బెగ్గడిల్లి, యాళిజనములన్
దిగ్గునఁ గను మొఱఁగి, కడున్
సిగ్గున నేకాంతసదనసీమకుఁ జనియెన్. 126

వ. అట్లు చనుటయు, 127

ఆ. సకియ లత్తెఱంగు సకలంబు నూహించి
కార్యగతిఁ దలంచి కడుఁ జలించి
యిందువదన యున్నకందువ కేతెంచి
పొంచి నిలిచి, యాలకించునపుడు. 128

## మదనరేఖ వలవంత

సీ. తల్లిదండ్రులమాట చెల్లనిచ్చెద నన్నఁ
దగు లుజ్జగింప నాతరముగాదు

సహకారఫలరసాస్వాదన సంతుష్ట
శుకసతీపతిరుతి ప్రకటనములఁ
గిసలయాంకుర రసగ్రసన సముత్కంఠ
కలకంఠ విటవిటీ కలకలములఁ
గనియు వినియు వసంతసంక్రాంతరాగ
సర్వసామాన్యమహిమ కాశ్చర్యమంది
చెలికెఱింగించి కొనియాడి చెప్పి చెప్పి
ప్రమదవనకేళిఁ దేలిరి పతియు సతియు. (ఆ. 5-24)

పుష్పాపచయము :

అందనిపువ్వుగుత్తు దెసకై యఱుసాపఁగనేల బాల ? కో
యందలవయ్యోనేని, నెగయ న్నిను నెత్తెదనంచు, సంతసం
బందఁగ నెత్తియెత్తి విభుఁ డందఱిముందఱ డించుచుండఁగా
నందినకంటె సంతసము నందె లతాంగియు మాటిమాటికిన్. (ఆ. 5-27)

జలకేళి :

ఆ నెలతల్ సరోజినికి నై దిగునప్పుడు నూత్నరత్నసో
పానములం దదీయతను బంధురబింబము లుల్లసిల్లెఁ దే
జోనిధియైన యానృపతి సోయగముం దరిసించు వేడుకం
బూని జలాధిదేవతల పూర్వగతిం జనుదెంచిరో యనన్. (ఆ. 5-45)

మృగమదపంకిలాంగు లొకమే నొకమే ఘనసార చందన
స్థగితలునైన కామినులు సాటిగ నొండొరుఁ జల్లియాడుచో
సగమున నల్పు దెల్పులగు చాయలు నెందెఁ గళిందకన్యకా
గగననదీ సమాగమముకై వడిఁ బద్మిని యొప్పెన త్తరిన్. (ఆ. 5-47)

*నెలతలు కంఠదఘ్నమగు నీరవిహారమొనర్ప నిల్చినం
గొలను తదానన స్ఫురణఁ గ్రొత్తమెఱుంగు వహించెఁ బెక్కుత్రి

---

*ఒక్క చంద్రునిఁ గన్న సముద్రుని, ననేక చంద్రులఁ గని మించుట యను భావము సంస్కృత శాసన పద్యమునం గన్పట్టుచున్నది.

శ్లో॥ యః ప్రోత్తుంగతరంగ సంగతిభవద్ది ండీరపిండచ్ఛలాత్
తీరే తారత రేందు మండలమయీంమాలాం సదోత్పాదయన్
భ్రామ్యన్ మందరమంథమంథన వశాదేకేందు సంభూతిజం
వ్రీడాభేదధరీకరోతి పరతఃకీర్తిం జగద్వ్యాపినమ్.

[కొండిపర్తి శాసనములు. 8. 33-37 పంక్తులు;
తెలంగాణా శాసనములు. భా. 1.]

కర్ణి కారముఁ బొడగన్న మాటాడదు
సిందువారముమీఁదఁ జేర్ప దూర్పు
తే. ననుచుసురపొన్నఁ గనుఁగొన్న నవ్వ దెపుడు
పొగడఁబుక్కిటిమధువునఁ బ్రోదిసేయ
దిందుముఖ దోహదక్రీడ లీడ విడిచె
నలరువిలుకానిములుకుల కాత్మ నులికి. 133

## చెలులు శీతలోపచారము లొనరించుట

వ. అప్పుడు.

క. పొదలిన యారామములోఁ
గదళీతరుమధ్యదీర్ఘి కాతటభూమిన్
బొదలిన గురువిందలలో
విదితంబగు చంద్రకాంతవేదికమీఁదన్. 135

చ. దలమగు పచ్చకప్పురపుఁదావులు పైపయి పోడుముట్టఁ జెం
గలువలపాన్పుపై నునిచి, కాంతకు గొజ్జఁగినీటి తేటచే
జలకము లార్చి, మైఁ గలయఁ జందనపంక మలంది, యెంతయుం
బలుచనిసన్నగావివలివంబులు గట్టఁగ నిచ్చి, నెచ్చెలుల్. 136

వ. వెండియు. 137

క. చల్లనిమం దని పైపైఁ
జల్లని మందొకటి లేదు, సతిడెందమునన్
జల్లఁదన మంద దయ్యెను
జల్లనిమందులను దావసంపద మించెన్. 138

సీ. అఱుతఁ దగిల్చిన యాణిముత్తెపుఁ బేర్లు
హరినీలహారంబులై తనర్చెఁ
దనువల్లి నంటిన ధవళచందనచర్చ
లీలఁ గాలాగరులేప మయ్యెఁ
గరముల మెత్తిన కర్పూరరేణువుల్
కస్తూరికాగురుకణము లయ్యెఁ

మెఱుఁగారు ముత్తెములచే
మెఱవడి యగు నల్లపట్టు మేల్కట్టు గతిన్. (ఆ. 6-64)

సూర్యతాప వర్ణనము :

*కల్పాంతదుర్దాంత కలుషాంతకస్వాంత
దుర్వారవహ్నికి నోర్వవచ్చు
నిష్ఠురనిర్ఘోషనిర్ఘాత సంఘాత
జాతమహావహ్ని సైఁపవచ్చుఁ
బ్రళయకాలాఖిలఫాలలోచనఫాల
భాగానలస్ఫూర్తి బ్రదుకవచ్చు
గాకోదరేంద్ర ఫూత్కారసంభవ తీవ్ర
కాకోల దహనంబుఁ గదియవచ్చుఁ
గాక సైరింపవచ్చునే లోకదహన
దర్పితంబైన యస్మత్ప్రతాపవహ్నిఁ
దావకోత్సాహ సాహసౌదార్య ధైర్య
గతికి మెచ్చితి విక్రమార్క క్షితీంద్ర! (ఆ. 2-112)

సూర్యాస్తమయ వర్ణన :

పశ్చిమాంభోనిధి ప్రాంతదేశంబున
రంజిల్లు విద్రుమ కుంజమనఁగఁ
జరమాద్రిశిఖర దేశంబునఁ గనుపట్టు
కమనీయ ఘనరత్న గండమనఁగ
నపరదిక్కామిని యమరంగఁ గనుఁగొను
పద్మరాగంపు దర్పణమనంగ
పశ్చిమదిక్కుంభి ఫాలభాగంబునఁ
బొలుపొందు జేగురుబొట్టనంగఁ
బూర్వకంధి వేలావనభూమిఁ బండి
కాలశుకతుండహృతి బిట్టుగదలి, యపర
జలధిలోఁ బడు దాడిమీఫల మనంగ
నబ్జినీవనబాంధవుఁ డస్తమించె. (ఆ. 3-85)

తపసి వర్ణన :

అచ్చవెన్నెలమించు నపహసించు విభూతి
యంగరాగంబుగా నలవరించి

---

* పిల్లలమఱ్ఱి, భట్టుమూర్తి, అయ్యలరాజు మున్నగువారిలో నీ శైలియు, పదగుంఫనమును గోచరించును.

పుత్రునిఁ దగురీతి వీడుకొని, భూపతిపాలికిఁ బోయి పూసగ్రు
చ్చినగతిఁ గార్యనిర్ణయ మశేషము తిన్నగ విన్నవించినన్. 145

మదనరేఖను పెండ్లాడుమని రాజు చంద్రగుప్తు నర్థించుట

చ. విని కడుసంభ్రమించి యతివేగమ కంచుకిఁ బంచి చంద్రగు
ప్తునిఁ బిలిపించి, యాదరముతోడ సమున్నతనూత్నరత్నకాం
చనమయరమ్యపీఠ మిడి, సారగభీరవచోనిరూఢి నా
య్యన వినయంబు తేటపడ నమ్మనుజేంద్రకులేంద్రుఁ డిట్లనున్. 146

ఆ. నిరుపమానమైన నీ మోహనాకార
రేఖ చూచె మదనరేఖ యనుచు
నదియ తప్పుచేసి, యలరంపగము లేసి
యలంతఁబెట్టఁ దొణఁగె నంగభవుఁడు. 147

క. మరుచేఁ దొడిఁబడకుండఁగఁ
గరుణింపు, సరోజనేత్రఁ గావు, 'మహింసా
పరమోధర్మ' యనం గల
పరమార్థనిరూపణంబు భావించి మదిన్. 148

వ. అనవుడు నబ్భానురుండు 149

మ. సచ్చరితానువర్తనము సాధుజనంబులు సమ్మతింపఁగా,
నచ్చపుబ్రహ్మచర్యము ప్రయత్నమునం జరియించుచుండి, నేఁ
డొచ్చెల శూద్రభామినికి నువ్విళులూరి పథంబు దప్పఁగా
వచ్చునె తెద్దునాకి యుపవాసము మాన్పికొనంగ నేటికిన్? 150

క. వర్ణాశ్రమధర్మంబుల
నిర్ణయములు దొలఁగకుండ నియమించుయశః
పూర్ణులు, మీరలె యీయది
నిర్ణయమని పలుకఁ దగునె నిండినసభలోన్? 151

వ. అనిన నమ్మహీశ్వరుం డిట్లనియె 152

క. పారాశర్యప్రముఖు ల
పారకృపామహిమ తేటపడ నింతులచే
కోరిక దీర్చుట వినమే ?
వారిసదాచారగౌరవం బెడలెనొకో ! 153

## చంద్రగుప్తుని ప్రత్యుత్తరము

క. నావుడు, భూసురుఁ డిట్లను
దేవరయానతియు నస్మదీయనియమమున్
భావించి యుభయసమ్మతి
గావించునుపాయ మొకటి గాంచితి, వినుఁడీ ! 154

చ. వరుసను బ్రాహ్మణోత్తముఁడు వర్ణచతుష్టయజాతకన్యలన్
బరిణయమౌట ధర్మ, మని పల్కుదు రాదిమునీంద్రముఖ్యు, ల
వ్వెర వొడఁగూడునేని, బృథివీవర ! యీవరవర్ణినీమణిన్
గరమనురాగలీలఁ బ్రియకామిని గాఁగఁ బరిగ్రహించెదన్. 155

వ. అనిన నమ్మహీపాలుండు తదనులాపానురూపప్రవర్తితకార్యుండగుటయుఁ దద్వృత్తాంతం బంతయు మదనరేఖ కాంతాజనంబులవలన నెఱిఁగి, 156

క. కాదంబినీసముద్గత
నాదంబున నీపలతిక ననిచినభంగిన్
జాదుకొని పులకకలికా
శ్రీ దనువల్లికకుఁ జాలఁ జెన్నొదవింపన్. 157

సీ. చెదరినయలకలచిక్కు చక్కఁగఁదీర్చి
జాఱినగనయంబు సవదరించి
తనువునఁ బైకొన్నతాప ముజ్జనచేసి
తొరఁగెడికన్నీరు తొలఁగఁ ద్రోచి
చెక్కుటద్దములపైఁ జిఱునవ్వు చిలికించి
చిన్నవోయినమోము నేద దీర్చి
తలఁకుడెందముతోడఁ దాలిమి గీలించి
పయ్యెదఁ జనుదోయిఁ బదిలపఱిచి

తే. పంచబాణుఁడు కరసానఁబట్టినట్టి
రత్నపుత్త్రికవోలె వినూత్నరత్న
కాంతి నెంతయు మోదించి, కమలవదన
సఖుల కెల్లను లోచనోత్సవము చేసె. 158

తే. అంత నిజపురి శృంగార మాచరింపఁ
బనిచె శృంగారశేఖరమనుజవిభుఁడు
హితపురోహితమంత్రిసమ్మతముగాఁగఁ
దత్తదనుకూలశుభముహూర్తములయందు. 159

చంద్రగుప్తుఁడు మదనరేఖాదుల నలువురను వివాహమాడుట

సీ. తనపురోహితుఁడు నాఁ దగువిష్ణుశర్మని
వరపుత్త్రియగు శీలవతిలతాంగిఁ
దనతనూజాతయై తారుణ్యమున నొప్పు
రాగమంజరియను రాజవదనఁ
దనదుభాండాగారమున కధీశ్వరుఁ డైన
ధనగుప్తుఁడను వైశ్యుతనయ సుమతిఁ
దనదండనాయకోత్తమునిగాదిలికూఁతు
మదవతీమణియైన మదనరేఖఁ

తే. గ్రమము దప్పకయుండ నారాజవరుఁడు
సకలలౌకికవైదికాచారసరణిఁ
బ్రియముతో విప్రవరునకుఁ బెండ్లిసేసె
వేఱుసేయక వారికి వేఱువేఱ. 160

క. నానామణిగణ కాంచన
చీనాంబర బహుసుగంధశృంగారవతీ
దానానేకప రథతుర
గానేకగ్రామసమితి నరణం బిచ్చెన్. 161

క. ఆ వివిధ వినుత విభవ
శ్రీవిలసన భాగ్యరస విశేష స్ఫురణః

దేవేంద్రునిగతి ధరణీ
దేవేంద్రుఁడు సకలభోగదీపితుఁ డగుచున్. 162

సీ. శీలవతీనిత్యశృంగార రేఖావ
నాంతర క్రీడావసంతుఁ డగుచు
మంజులతర రాగమంజరీవక్షోజ
మంజరీ మధుపకుమారుఁ డగుచు
సుమతిసీమంతినీకమనీయశశికాంత
పాంచాలికా శీతభానుఁ డగుచు
మదనరేఖావధూ మానసాంతరరాజ
హంసావతంసవిహారుఁ డగుచు
తే. వరుస దక్షిణనాయకత్వమున మించి
యొక్కతెఱఁగున ననురాగ మొదవఁ జేసి
యుచితరతిరాజలీలల నోలలార్చెఁ
జంద్రగుప్త మహీసురచక్రవర్తి. 163

క. ఇత్తెఱఁగున నన్నలువురు
మత్తచకోరాక్షులకుఁ గ్రమక్రమముమెయిన్
జిత్తజకేళీనిపుణతఁ
జిత్తానందంబు లొదవఁజేయుచు నుండెన్. 164

వ. అంతఁ గొంతకాలంబునకును.

## మదనరేఖాదులు గర్భవతు లగుట

సీ. చూపుల నిగురొత్తుసోలంబుతోడన
సోలంబు తనువున మేళవింప
విలసిల్లుత్రివళులవిరివితోఁ గూడంగ
విరివి నెమ్మనముల విస్తరిల్ల
జడిగొన్నచెయ్వులజడనుతోడను గూడ
జడను నెన్నడలను జాదుకొనఁగ
బొలుపారునారులనలుపుతోడనుగూడ
నలుపు చన్మొనలందు నాటుకొనఁగ

తే. గమనములఁ జాల నలసత గానఁబడఁగ
నెమ్మనంబులు మృత్సారభమ్ము గోర
మిగులఁ బ్రేఁకని తొడవులమెచ్చు సడల
గర్భసంపద నొప్పి రక్కమలముఖులు. 166

సీ. వేదవేదాంగాదివిద్యలు శీలింప
శీలవతీకాంత చింతసేయు
ధరణి నేకాతపత్రముగ నేలుకొనంగ
సతతంబు రాగమంజరి తలంచు
రాజరంజనరీతి రసికతామహిమల
సుమతియై వెలుఁగంగ సుమతి గోరు
సగుణనిర్గుణములసంబోధనాపేక్ష
మదిలోన భావించు మదనరేఖ
తే. యాత్మగర్భాంతరాళంబులందు నున్న
యర్భకులయందు నందమై యతిశయిల్లు
గుణము లన్నియు నిచ్ఛానుగుణము లగుచు
నాఁటినాఁటికిఁ దమయందునాటుకొనఁగ. 167

చ. లలితకపోలమండలములన్ మణికుండలముల్ నటింప, వి
చ్చలవిడిగా వినూత్నపురుషాయిత కేలికి నగ్గలించు న
గ్గలికలు చెల్లకున్న, నధికవ్యథ నొయ్యన మాటిమాటి కూ
ర్పులు నిగిడింపఁ జొచ్చిరి సరోరుహనేత్రలు గర్భఖిన్నతన్. 168

చ. కనుఁగొని, నెమ్మనం బలరఁగాఁ బులిజున్నును నేదుకన్ను దె
మ్మనినను దెచ్చువాఁడఁ, బ్రియ మైనవి యెల్లను జెప్పుఁడంచు, గొ
*బ్బన హృదయానువర్తి యయి, పల్లును బంతమునొక్క భంగి గాఁ
దనియఁగ నిచ్చు నవ్విభుఁడు తామరసాక్షులు గోరుకోరికల్. 169

*గొ, బ్బన హృదయానువర్తి యయి పల్కును. పావిళ్ల. 1926. యతి(?)

## వరరుచి విక్రమార్కాదుల జననము

క. అంత నవమాసము లతి
క్రాంతము లగుటయును, విమలకైరవహితసి
ద్ధాంతమతి వెలుఁగు తేజో
వంతుఁడగు సుతుఁడు శీలవతి కుదయించెన్. 170

తే. తత్సుతోదయవార్తామహోత్సవమునఁ
జంద్రగుప్తుండు పూర్ణిమాచంద్రుఁ గనిన
సంద్రమునుబోలె నానందసాంద్రుఁ డగుచు
మఱి యథావిధి జాతకర్మం బొనర్చె. 171

చ. అరు దగుచున్న జన్మసమయగ్రహయోగబలంబు పెంపునన్
వరరుచియై దిగంతముల వాలుఁ జతుర్దశసంఖ్యవిద్యలన్,
వరరుచి యైనమూర్తి నవవారిజమిత్త్రునిఁ బోలునంచుఁ దా
వరరుచినామవిస్ఫురణవంతునిఁగా నొనరించెఁ బుత్త్రికున్. 172

వ. ఒనరించి తోడ్తోన నిరతిశయలీలాలోకసరిరంసామాంగల్యమిళిత మనోహ
రాంగుండై యుండె నంతఁ గొన్నిదినంబులకును. 173

మ. దినకృద్వాసర చైత్రశుక్లనవమిం దిష్యం దృతీయాం॰ సం
జననం బొందెను రాగమంజరికి రాజద్భాగ్యసౌభాగ్యసూ
చనలగ్నంబునఁ బుత్త్రిరత్నము, నిజోచ్చక్షేత్రసందీప్తులై
యున *మందార సురాసురేజ్య బుధు లా యిందు న్విలోకింపఁగన్ 174

వ. అమ్ముహూర్తంబు మౌహూర్తికోత్తములు నిరూపించి. 175

శ్లో. కుముదగహనబంధౌ వీక్ష్యమాణే సమస్తై
రగనగగృహవాసై ర్దీర్ఘజీవీ సతుస్యాత్
యదసదశుభజన్యం యచ్చకీదృద్వి మోదం
సభవతి నరనాథస్సార్వభౌమో జితారిః. 176

వ అని హోరాస్కంధబంధురం బైన యీ పద్యంబు నుపన్యసించి, యిక్కు
మారుండు దీర్ఘాయురుపేతుండును, జితారిసంఘాతుండును, జక్రవర్తి
పదఖ్యాతుండును నగునని విన్నవించిన. 177

---

* మంద + ఆర = శనికుజులు.

క. ఆ వార్త లమృతవారీ
ప్లావంబునఁ గర్ణవీథిఁ బ్రవహించి, తను
ప్లావనము చేసి, ధరణీ
దేవకులాగ్రణిమనంబుఁ దెప్పలఁదేల్చెన్. 178

వ. అయ్యవసరంబున. 179

మ. కురిసెం గల్పతరుప్రసూనములు దిక్కూలంకషప్రాయ మై
మొఱసెం దివ్యమృదంగనిస్వనము సమ్మోదానుసంపాదియై
బెరసెన్ జందనశైలమారుతము గంభీరాప్సరోనృత్యముల్
దొరసెన్ గన్నులపండువై జనులు సంతోషించి ఘోషింపఁగన్. 180

క. ఆ జగతీసురుఁ డప్పుడు
రాజోచిత బహుతురంగ రథ ధేను మహీ
రాజముఖి ధన ధాన్య స
మాజమహాదానగుణసమగ్రత మెఱయన్. 181

వ. జాతకర్మంబు యథోచితక్రమంబున నిర్వర్తించి, యనంతరంబ 182

తే. విక్రమంబున నాదిత్యువిధము దోఁప
సుప్రతాపానురూప తేజోవిశేష
కలితుఁ డగునని, తజ్జన్మఫల మెఱింగి
తనయు విక్రమాదిత్యాభిధానుఁ జేసె. 183

తే. అంత సుమతికి సంజాతుఁ డైనయట్టి
పట్టి ని భట్టియని పేరువెట్టి. పిదప
మదనరేఖావిలాసిని కుదయమైన
తనయునకు భర్తృహరినామ మొనరఁ జేసె. 184

వ ఇత్తెఱంగునఁ బుత్త్రోదయోత్సవానందబునం దృప్తుండై చంద్ర
గుప్తుండు. 185

క. సముచితకర్మక్రియలను
సముచితసంవర్ధనముల, సముచితవిద్యా
సముదయసంశిక్షణములఁ
గ్రమమున నందనుల ఘనులఁగాఁ జేయుటయున్. 186

క. లోకహితకావ్యరచనా
సాకల్యప్రౌఢి వేద శాస్త్ర పురాణ
వ్యాకరణసరణి, వరరుచి
యేకముఖబ్రహ్మ యనఁగ నెన్నికకెక్కెన్. 187

సీ. వచియించెఁ బ్రాకృత వ్యాకరణాగమం
బఖిలశంబుగ భోజవిభుఁడు మెచ్చ
సకలవర్ణాశ్రమాచారనిర్ణయ మొప్ప
ధర్మశాస్త్ర మొనర్చెఁ దద్జ్ఞు లలర
ధీయుక్తి మెఱయ జ్యోతిశ్శాస్త్ర మొనరించె
సకలలోకోపకారకము గాఁగఁ
గాళిదాసునినవ్యకావ్యవిద్యాప్రౌఢి
వరకవీశ్వరచక్రవర్తిఁ జేసె
తే. భవ్యనారాయణీయ ప్రపంచసార
శారదాతిలకాదిప్రశస్తమంత్ర
శాస్త్రసర్వంకషజ్ఞానసరణి మించె
శీలవతివట్టి సర్వజ్ఞ శేఖరుండు. 188

శా. శ్రౌతస్మార్తరహస్యవేదులు గురుస్థానంబుగాఁ జూడ, వి
ఖ్యాతప్రౌఢి మహాకవీశ్వరులు సాక్షాద్భారతీమూర్తిగాఁ
జేతోవీథిఁ దలంపఁగా, నతఁడు మించెన్ ధర్మమర్మజ్ఞతా
చాతుర్యోన్నతు లై నరాజులకుఁ బూజాలింగమై పెంపునన్. 189

సీ. వేదశాస్త్రపురాణవివిధాగమంబులు
కరతలామలకంబుగా నెఱింగె

నవరసోజ్జ్వలకావ్యనాటకాలంకార
సమితి నామూలచూడముగఁ జూచె
ధర్మార్థకామశాస్త్రప్రపంచంబులు
*పల్లవిపాటగాఁ బరిచయించె
వారణస్యందనవాహనారోహణ
క్రమమున మర్మకర్మములు దెలిసె

తే. నృత్యగీతవిద్యాప్రౌఢి నిర్వహించె
సకలదివ్యాస్త్రశస్త్రప్రశస్తి మించెఁ
దేజమున నొప్పి భట్టిద్వితీయుఁ డగుచు
విక్రమాదిత్యుఁ డసమానవిక్రముండు. 190

క. మరువము మొలవఁగఁ దోడనె
పరిమళ ముదయించినట్లు, పరమజ్ఞాన
స్ఫురణము బాల్యమునప్పుడె
పరిణతమై భర్తృహరికిఁ బ్రభవించుటయున్. 191

ఉ. ఎంతయు వేడ్కతోఁ బరిచయించినవిద్యలయట్ల, వేదవే
దాంతరహస్యమర్మములు నమ్మహితాత్ముని కాత్మఁ దోఁచె, న
త్యంతము చోద్యమై మెఱయు నంజనమబ్బినవానికిన్ ధరా
క్రాంతము లైనపెన్నిధులు కన్నులకుం బొడచూపుకైవడిన్. 192

ఉ. అందఱు నన్నివిద్యల మహామహులై విలసిల్లుచుండఁగా,
నందనులం గనుంగొని మనంబునఁ బొంగుచుఁ జంద్రగుప్తుఁ డా
నందమహాంబుధిన్ దినదినంబును దెప్పలఁదేలుచుండె, సం
క్రందనుకంటె వైభవపరంపర మించి యనేకకాలమున్. 193

శా. తారుణ్యంబున నమ్మహీసురుఁ డొగిన్ ధర్మార్థకామక్రియా
చారంబుల్ సరిగాఁ జరించి, తుద మోక్షశ్రీ నపేక్షించి, సం
సారాంభోనిధియానపాత్రమగు శ్రీశైలంబుమీఁదం దపం
బారంభింపఁ దలంచి, నందనుల డాయం బిల్చి తా నిట్లనున్. 194

---

*పల్లెపాఠంబుగాఁ బరిచయించె, అని పాఠాంతరము

## శ్రీ శై ల మా హా త్మ్య ము

తే గయ సహస్రయుగంబులు, కాశియందు
యుగసహస్రంబు, వింశతియుగము లధిక
నిష్ఠఁ గేదారమున నున్ననియతఫలము,
నొక్కదినము శ్రీనగమున నున్నఁ గలుగు 195

సీ. శ్రీశైల మాత్మలోఁ జింతించినంతన
జాతిస్మరత్వంబు సంభవించు
వేడ్కఁ దచ్ఛిఖరంబు వీక్షింపఁగోరిన
సప్తజన్మాఘనాశంబు చేయు
నాత్రోవ రెండుమూఁడడుగు లేగినమాత్ర
సకలజన్మములదోషములు పాయు
నత్యంతనియతిమై నగ్గిరి కేగినఁ
బరమసాయుజ్యంబుఁ బడయవచ్చు
తే కెన్నిభంగుల శ్రీగిరి కేగువాఁడు
ధన్యుఁ డగు, నబ్బు నశ్వమేధంబుఫలము,
నట్టిశ్రీగిరి కర్థిమై నరుగ లేని
గుణవిహీనుండు పిచ్చుకకుంటుగాఁడె 196

సీ ఏకొండశిఖరాగ్ర మీక్షించినంతన
భవబంధములఁ బెడఁబాపఁ గల్గు
నేకొండ యిల్లుగా నీశానుఁ డేప్రొద్దుఁ
బార్వతీసహితుఁడై పాయకుండు
నేకొండసన్నిధి నెల్ల తీర్థంబులు
పాతాళగంగాఖ్యఁ బరఁగుచుండు
నేకొండమీఁద బ్రహ్మేంద్రాదిదివిజులు
శబర వేషంబుల సంచరింతు
తే ర శ్రీపర్వతము చూచినట్టివారు
గ పుణ్యంబు చేసినయట్టివారు
ఘ తపఃఫలసిద్ధులు గన్నవారు
హరుని కత్యంతనిజభక్తు లైనవారు. 197

క. ఏ పాపము లొనరించిన
నా పాపము లణఁచుచుండు నటమీఁద, నరుం
డోపికమీఱంగాఁ జని
శ్రీపర్వతదర్శనంబు చేసినయేనిన్. 198

చ. శిల లఖిలంబు లింగములు, చెట్లు సమస్తము గల్పభూజముల్,
జలములు దేవతానదిజలంబులు, మానవులెల్ల సంయముల్,
పలికినపల్కులెల్లను జపంబు, చరించుట సత్ప్రదక్షిణం
బులు, నిదురల్ సమాధి, తలపోయఁగ శ్రీగిరిమీఁదఁ జోద్యముల్! 199

ఉ. వారణసీపురంబున నవారణ మేను దొఱంగనేల? కే
దారజలంబు లర్థి మెయిఁ ద్రావి శరీరము కోరవోవఁగా
నారడి వొంద నేల? యొకయప్పుడు జన్మము లేకయుంటకై
యారయ శ్రీనగంబుశిఖరాగ్రము చూచినఁ జాలు నెమ్మదిన్. 200

మ. క్రతువిధ్వంసము, బ్రహ్మహత్యయును, ధర్మద్వేషమున్, సోదరీ
సుతసంహారము, నాదియైనదురితస్తోమంబులం బాసి, శా
శ్వతపుణ్యోదయుఁ డయ్యె నగ్గిరి నివాసంబొట రుద్రుండు, దు
ష్కృతముల్ వాయుట లేమిచోద్యము జనుల్? శ్రీపర్వతం బెక్కినన్.

క. కావున శ్రీనగమునకేఁ
బోవఁగ నూహించి, మిమ్ము బోధించుటకై
రావించితి, నావాక్యము
భావింపఁగ వలయు నిపుడు పరమార్థముగన్. 202

చ. బ్రదుకుము విక్రమార్కనరపాలక! దిగ్విజయంబు చేసి, య
భ్యుదయముఁ బొందు భట్టి! నిజబుద్ధి నియోగితనంబునందు, స
మ్మదమున మించు భర్తృహరి! మా ధనమెల్లను నీకు నిచ్చితిన్,
హృదయ మెలర్పఁగా వరరుచీ! సుఖయింపుము వంశకర్తవై. 203

తే. అనుచు నొడఁబడ వారికి నానతిచ్చి
యాత్మరమణీసమేతుఁడై యాక్షణంబ

నుద్దేశింపఁ బడినవి. ఈ రెంటి చివఱను శుకశారికల వివాదమునఁ బుట్టిన రెండను బంధకథలు నొకే విధమునఁ గలవు. ఇఁక కథాసరిత్సాగరము నందలి కథానాయకుఁడు విక్రమకేసరి యని యుండగా జక్కన కథానాయకునకు రాజశేఖరుఁ డను క్రొత్త పేరిడి, 'విక్రమకేసరి' నామము నతని జనకున కొసఁగె ననుట యూహ్యము. నాయకుని యొద్ద దివ్యజ్ఞానము గల చిలుకయు, నాయిక యొద్ద నట్టిదే యగు గోరువంకయు రెంటి యందును సమానముగాఁ గలవు. ఈ శుకశారికలు నాయికా నాయకుల వివాహ సంధానమునఁ బాల్గొనుట రెండు కథల యందును గనవచ్చును. ఈ పై సామ్యబాహుళ్యము ననుసరించి జక్కన రాజశేఖరుని కథకుఁ గథాసరిత్సాగము నందలి విక్రమకేసరి కథయే మూల మనుట నిస్సంశయము.

మల్లన రాజశేఖర కథలోని ప్రధానాంశములు :- జక్కన కథానాయకుఁడగు 'రాజశేఖరుఁడే' మల్లన రాజశేఖర చరిత్ర ప్రబంధ కథానాయకుఁడు. గ్రంధమునకును మల్లన నాయకుని నామమే పెట్టెను. రాజశేఖరుని పురనామము 'వంచక' యనియు 'ఆవంచక' యనియు నిరుతెఱఁగుల జక్కన పేర్కొనఁగా మల్లన దీనిని 'అవంచి ఆవంచిక' మని రెండు విధములఁ జెప్పెను. 'ఆవంచక' మనునది రెంటను సమానము. రాజకుమారి చెలికత్తె యగు దూతికకు జక్కన యొసఁగిన 'చతురిక' నామమునే మల్లన గ్రహించెను. పై నామములలో నెవ్వియును కథాసరిత్సాగర కథలో లేక, విక్రమార్క చరిత్రము నందే యుండుటవలన వాని నట నుండియే మల్లన గ్రహించినట్లు తలంచుటయే సమంజసము. వీనితో పాటు యోగినివృత్తాంతము, దివ్యజ్ఞానము గల శుకమును విక్రమార్క చరిత్రము నందు వలెనే రాజశేఖర చరిత్రము నందును గలదు. మఱియును జక్కన చెప్పిన రాజశేఖరుని కథయే కొలది భేదముతో రాజశేఖర చరిత్రము నందును సమగ్రముగాఁ గలదు. పైనిఁ దెలిపినవి కాక జక్కన కథలోని తక్కిన పేర్లను మల్లన పూర్తిగా మార్చివేసెను. ఇట్లే రాజశేఖరుని నామమును గూడ మల్లన మార్చి యుండెనేని, యీ ప్రబంధ కథకు జక్కన వర్ణించిన రాజశేఖరుని కథ మాతృక యని గుర్తించుట సాధ్యము కాకుండెడిది.

ఈ రాజశేఖరుని కథను మల్లన దానొక ప్రత్యేక ప్రబంధముగాఁ బెంచి వ్రాయ సంకల్పించిన వాఁడు కావున కొన్ని నూత్న కథాంశములను గల్పించియు, వర్ణనాదులను జేర్చియు మూఁ డాశ్వాసములకుఁ బెంచి రాజశేఖర చరిత్ర ప్రబంధమును రసవంతముగా రచించెను. ఇది యొక ప్రత్యేక ప్రబంధ మగుట నిందలి సమస్త కథ నిట వివరించుట యనవసర మని తలఁచి విరమించితిని. ఇఁక సర్వ సామాన్యముగఁ దలఁపఁ బడుచున్నట్లు మల్లన రాజశేఖర చరిత్ర కల్పిత ప్రబంధము కాదనియు, నిందలి కథకు మూలము జక్కన రాజశేఖరుని కథ యనియు,

శ్రీ ర స్తు

# విక్రమార్క చరిత్రము

## ద్వి తీ యా శ్వా స ము

శ్రీనాథచరణయుగళ
ధ్యానాధీనాంతరంగ, తరుణీజనచే
తోనందన, నిజమూర్తి
శ్రీనందన జన్ననార్యసిద్ధనమంత్రీ ! 1

చ. అరుదుగ విక్రమార్కవసుధాధిపచంద్రుఁడు, కీర్తిచంద్రికల్
ధరఁ బరఁగింప దిగ్విజయతత్పరుఁడై, యొకరుండు వింధ్యభూ
ధరమున కేఁగి, యందుఁ బ్రమదంబు మది న్విలసిల్లఁ గాంచె నీ
శ్వరవరవామభాగసహవాసవిలాసిని వింధ్యవాసినిన్. 2

వ. కాంచి, లలాటాంబకకుటుంబినీపదాంభోరుహారోలంబకదంబాయితచికుర
నికురుంబలాంఛన లపనచంద్రమండలుండై, యమ్మండలాధీశ్వరుండు
తదీయమందిరద్వారంబు నిర్గమించి, తత్ప్రదేశంబున.

### కంథామణి పాత్రాదుల వృత్తాంతము

క. ప్రబలాసురవరసూనులు
సుబలమహాబలులు వాలిసుగ్రీవులు నా
నిబిడాంగరక్తధారా
శబలితభూభాగమయిన సమర మొనర్పన్. 4

వ. కాంచి తత్కలహంబు వారించి, తత్కారణం బడుగుటయు వార
లిట్లనిరి. 5

చ. హరునిగుఱించి వత్సరసహస్రము ఘోరతపంబుచేసి, త
త్కరుణ దుకూలకంథయును దండముఁ బావలు రత్నపాత్రముఁ

పరమునఁ గాంచె మద్గురుఁ డవారణమైఁ బ్రబలాభిధానుఁ; డీ
[1]యురువిడిచేత నయ్యెడుప్రయోజన మెల్లను జిత్తగింపుమా. 6

శా. ఈలాతంబున వ్రాయఁ బట్టణములౌ, నీపాదుకల్ మెట్టఁగా
నేలోకంబున కైన నేగ సులభం, బీపాత్ర దివ్యాన్నముల్
చాలంగా సమకూర్చుఁ, గోరినతఱిన్ సంధిల్లు నీకంథచే
వేలక్షల్ కనకంబు రాలు విదుపన్ విశ్వంభరాధీశ్వరా! 7

తే. తండ్రిపిమ్మట నివి యేము తగినభంగిఁ
బంచుకొననేర కిమ్మెయిఁ బ్రతిదినంబు
బోరుచున్నార మిట, నీవు పొందు వొసఁగఁ
బంచి పెట్టిరక్షింపుమీ పార్థివేంద్ర! 8

వ. అనవుడు. 9

క. జనపతులకుఁ బాపాత్ముల
ధన మెమ్మెయి నైనఁ గొనుట ధర్మం, బనఁగా
వివి యున్నవాఁడు గావున
ధనసంగ్రహణంబునందుఁ దత్పరమతియై. 10

## విక్రమార్కుఁడు కంథాదులు సంగ్రహించి యేగుట

చ. అనఘుఁడు విక్రమార్కవసుధాధిపచంద్రుఁడు, మందహాస మా
ననము నలంకరింపఁ గుహనాచతురుండయి బుజ్జగించి, నా
పనుపున మీఱుచేసఱచిపాఱుఁడు, మీఱినయట్టివాఁడ యీ
ధనమున కెల్లఁ గర్త యగుఁ దప్పదు పొ, మ్మని యానతిచ్చినన్. 11

చ. పనివడి యొండొరుం గడవఁ బాఱెడియానను వారు దవ్వుగాఁ
జనుట యెఱింగి, కంథయును సన్మణిపాత్రయు యోగదండముం
గొని వెసఁ బాదుకల్ దొడిగికొంచు, వియచ్చరవాహినీకన
త్కనకసరోజగంధవహకౌతుకుఁడై వినువీథి కేగుచున్. 12

1. వస్తు సమూహము

పై పట్టిక వలన అష్టాదశవర్ణనములను జక్కన సుమారు 300 పద్యములలో గావించినట్లు తెలియవచ్చును. వీని యందును వనవిహార, జలవిహార, ఋతు, యుద్ధ పుర, వివాహ వర్ణనలు క్రమముగా నుత్తరోత్తర దీర్ఘములు.

ఇతర వర్ణనములు :

స్త్రీ వర్ణనము ; ఆ. 1. 116-119; ఆ. 4. 16-19; ఆ. 5, 169-173; ఆ. 5. 44-49; ఆ. 7. 36; ఆ. 7. 40-46; ఆ. 7. 53-60; ఆ. 8. 42-46.

రాజవర్ణనము : ఆ. 1-102; ఎఱుకు వర్ణము ఆ. 1-23; వృద్ధ బ్రాహ్మణ వర్ణనము ఆ, 2-117, 155; నారదవర్ణనము ఆ. 4-3; విప్రకుమార వర్ణనము ఆ. 7-43; విటవర్ణనము ఆ. 8-6,7; ఇవిగాక తాపసులు, రాక్షసులు మున్నుగాఁ గల పురుషవర్ణన లనేకము గలవు.

వరాహవర్ణనము . ఆ. 2. 1 5, 126; 133; ఆ. 3-75
నాట్యవర్ణనము . ఆ. 2. 89, 91
అశ్వమేధయాగ వర్ణనము : ఆ. 5. 93-136
పరిమళవాయు వర్ణనము : ఆ. 6-63
కోడికూత . ఆ. 6-73
యోగినీవర్ణనము : ఆ. 7-14
శుకవర్ణనము : ఆ. 7-26
భోజనవర్ణనము . ఆ, 4-188
రోదనవర్ణనము : ఆ. 7-153

పుణ్యతీర్థక్షేత్ర దేవతావర్ణనము : కాశీవర్ణన ఆ. 2. 189 - 194; శ్రీశైలవర్ణనము ఆ. 2. 198-206; అహోబలము ఆ. 2. 208-212 మఱియు కాళహస్తి, శ్రీరంగము, అనంతశయనాది పుణ్యక్షేత్ర వర్ణనములిందు భక్తిరసప్రధానముగఁ జేయఁ బడినవి. హేమకూట విరూపాక్ష వర్ణనములు నిందు గలవు. ఇందలి యీ ఘట్టములు పండితారాధ్య చరిత్ర, నృసింహ పురాణ, కాశీఖండ, కాళహస్తి మహాత్మ్య, పాండురంగ మాహాత్మ్యాదులలోని వర్ణనలను దలఁపునకుఁ దెచ్చును. ఇట్టి వర్ణనలచేత జక్కన తన కావ్యమునఁ బవిత్ర వాతావరణమును సృష్టించెను. నన్నెచోడుని వలెనే దీనిని జక్కన శ్రీకారముతోఁ బ్రారంభించి 'మంగళమహాశ్రీ' వృత్తముతో ముగించుట గమనింపఁదగి యున్నది.

ఇతర వర్ణనలలో ముఖ్యము లని భావించినవి మాత్రమే యిచటఁ దెలుపఁ

క్కన విదిలించి, యందుఁ బదికోటులు మాడలు రాలఁ గ్రోవుగా
ననయము నెల్లయర్థులకు నన్నరపాలకుఁ డిచ్చు నిచ్చలున్. 18

క. కనుఁగొనిన వేయి, మాటా
డినఁ బదివే, ల్గుడువ లక్ష, డెందము ప్రమదం
బునఁ బొందినఁ గోటిధనం
బనయము నర్థులకు విక్రమార్కుం డొసఁగున్. 19

వ. ఇవ్విధంబున ననన్యసామాన్యవదాన్యుం డైన యారాజన్యుండు, పేరో
లగంబున రత్నసింహాసనాసీనుం డై యున్నయవసరంబున, వైహాయస
మార్గంబున ననర్ఘ్యమణిమరీచిమాలికా దేదీప్యమానంబు లైన దివ్యవిమా
నంబుల నవలోకించి, యాత్మీయమిత్త్రుం డైనచిత్రరథుం డనుగంధర్వ
పతి, నివి యెందుఁ జనుచున్న వని యడుగుటయు, నతం డాతని
కిట్లనియె. 20

ఆ. సకలజీవలోకసజ్జనానందన
ప్రౌఢుఁ డైనపద్మభవునిఁ గొల్వ
ననుదినంబు నరుగునమరేంద్రముఖ్యుల
మణివిమానము లివి మనుజనాథ 21

వ. అనవుడు. 22

## విక్రమార్కుఁడు బ్రహ్మసభ కేగుట

మ. జగదుత్పత్తివిశారదుం డయిన భాషాజానియాస్థానిసో
యగ మీక్షించున పేక్ష, నాక్షణమ భృత్యామాత్యు లంగీకరిం
ప, గుణాలోలుఁడు సాహసాంకధరణీపాలుండు, లీలాగతిన్
గగనాభోగ మలంకరించె మణిరంగత్పాదుకాపాదుఁ డై. 23

వ. ఇవ్విధంబునం జని యమ్మహామహుండు, పితామహాలోకాలోకనోత్సవం
బంగీకరించి, తదాస్థానమండపంబు ప్రవేశించి. 24

సీ. మౌద్గల్య మాతంగ మౌంజాయన మరీచి
మైత్రేయ మాండవ్య మందపాల

కపిల కశ్యప కౌత్స కామంద కణ్వాత్రి
కౌశిక కౌండిన్య కలహాభోజ
వాత్స్యాయన వ్యాస వాల్మీకి వరతంతు
వాలఖిల్య వసిష్ఠ వామదేవ
శరభంగ శుక శక్తి శార్ఙ్గ శారద్వత
శౌనక శాండిల్య శాలిహోత్ర
తే. జడభరత జహ్ను జాబాలి జామదగ్న్య
పులహ పిప్పల పర్వత పుండరీక
గార్గ్య గౌతమ గాలవ గణక ముఖ్యు
లైనయాసంయమీశ్వరు లర్థిఁ గొలువ. 25

క. యాగములు యాగకర్తలు
యోగములును యోగివరులు, నుచితాచార
ప్రాగుణ్యవిధులు నదులును
సాగరములు గిరులు దరులు సంసేవింపన్. 26

సీ. తనతనుప్రభలతో నెనవచ్చుపటికంపు
జపమాల యొకకేల నవదరించి
తనముద్దుమోముచందమున నందము నొందు
నరవింద మొకకేల నలవరించి
తనమంజులాలాపతతిఁ గూడి భాషించు
కీరంబు నొకకేల గారవించి
తనగాననినదంబు నెనయఁ జాలువిపంచి
కేలిమై నొకకేలఁ గీలుకొల్పి
తే. ప్రణతదిక్పాలబాలికాఫాలఫలక
తిలకమృగనాభిచిహ్న దేదీప్యమాన
చరణనఖచంద్రమై పూర్ణచంద్రవిమల
కమలకర్ణిక నుండి వాగ్రమణి కొలువ 27

క. కొలువున నెలవువహించిన
నలువకు సాష్టాంగ మెరఁగి, నరవరుఁడు రసా

కలితమృదుసారసౌరభ
సలలితవాక్పుష్పపూజ సమ్మతిఁ జేసెన్. 28

వ॰ అప్పుడు ప్రసన్నతాచతురాననుం డైన చతురాననుం డిట్లనియె 29

క॰ ఎయ్యది కుల, మెయ్యది నెల
వెయ్యది నీనామ, మిప్పు డేచందమునన్
ఇయ్యెడకు వచ్చి ? తనవుడు
నయ్యంబుజసూతితోడ నతఁ డిట్లనియెన్. 30

ఆ॰ చంద్రగుప్తసుతుఁడ, చంద్రపురీశుండ
విక్రమార్కుఁ డనఁగ వెలయువాఁడ
దివ్యపాదుకాగతిప్రౌఢి వచ్చితి
నిచ్చ మిమ్ముఁ జూడ నిష్ట మగుట.

క॰ నావుడు, నతనిమహత్త్వము
భావించి విరించి చోద్యపడి సదయుండై
భూవర యేవర మడిగిన
నావర మే నిత్తు నీకు, నని పల్కుటయున్. 32

ఉ. ఫాలతలాగ్రచర్మము కృపాణమునం గొని చీరి యెత్తి, యీ
వ్రాలకు మీఁద నెక్కు డగువ్రా లొకకొన్ని లిఖింప నోపుదో ?
యీలిపితోడఁ గొన్ని వెర వేర్పడ నిప్పుడు చక్క బెట్టఁగాఁ
జాలుదొ ? యానతిమ్మనిన సారసగర్భుఁడు విస్మితాత్ముఁడై. 33

ఉ॰ అర్వురుచక్రవర్తులు పదార్వురురాజులు విశ్వధారణీ
నిర్వహణప్రభావమున నేర్పరు లైనను, వీనిసాటియే
సర్వఫలప్రదానమున సాహసికత్వరమా సమగ్రతఁ
గర్వితవీరవైరిచయఖండనమండనవిక్రమక్రియన్ ! 34

క. ఇచ్చెద నొకవర మనినను
వెచ్చెర నామాట కులుచ సేసెను సభ, నీ

పొచ్చెము వాయుట కొఱకై
యిచ్చెద బ్రహ్మాస్త్రమైన నీతని కనుచున్. 35

## బ్రహ్మ విక్రమార్కునకు బ్రహ్మాస్త్రి మొసంగుట

సీ. సిద్ధాదు లగుకోష్ఠసీమలు పరికించి
నామానుగుణము నిర్ణయము చేసి
యుచితదీక్షాకాల మూహించి యభిషిక్తుఁ
జేసి జితస్థానసిద్ధి దెలిపి
కూర్మాసనాదులమర్మంబు లెఱిఁగించి
యష్టాంగవివరణం బాచరించి
భూతశుద్ధితెఱంగు బోధించి మాతృకా
విన్యాసనరణి యుపన్యసించి
తే. యావరణశక్తిబీజాధిదైవతములు
బలులు జపహోమతర్పణాపశులు సెప్పి
సప్రయోగోపసంహారణప్రవీణుఁ
జేసి, బ్రహ్మాస్త్ర మిచ్చె నజ్ఞాసనుండు. 36

వ. ఇచ్చి మఱియు నిట్లనియె. 37

క. మానుషశక్తి జయింపఁగ
రానిమహావీరులైన రణశూరులపై
దీనిఁ బ్రయోగింపుము, బల
హీనులపై మఱచి యైన నేయకు మధిపా! 38

క. అని బ్రహ్మ యానతిచ్చిన
జనపతి సాష్టాంగ మెరఁగి, సంభావితుఁడై
తనపురికి నరిగి జగతీ
జనరక్షణ చేయుచుండె సత్వరమతియై. 39

వ. అంత, నాచంద్రపురంబునఁ జంద్రగుప్తాన్వయవార్ధిచంద్రుం డైనరాజేంద్రుఁడు కీర్తిచంద్రికాసాంద్రుండై యుల్లసిల్లు చెఱింగి, త్రిజగదాశ్చర్య

చాతుర్యసకలకళా సంవిధానుండైన సుమతిసూనుండు చనుదెంచి,
యుచితప్రకారంబునం బ్రవేశించి దండప్రణామంబు లాచరించిన, నుచి
తోపచారంబుల సంభావించి మధురానిర్గమనం బాదిగాఁగల యాత్మీయ
ప్రయోజనంబు లఖిలంబులు నెఱింగించి, యిట్లనియె. 40

## విక్రమార్కుఁడు భట్టికి నుజ్జయని విశేషము లెఱిఁగించుట

సీ. చెలువొందు నేపురి శృంగారముగఁ గాల
కంఠుఁ డెప్పుడు మహాకాలసంజ్ఞఁ
గోటిలింగంబులు కొమరారు నేవీట
సంధ్యాత్రయమహోపచారగరిమ
విలయాంబునిధిపూరములయందు డిందక
పెనుపొందు నేపుటభేదనంబు
యుగయుగంబునయందు నొక్కొక్కదివ్యాభి
ధానంబు నేరాజధాని పూను
తే. నంబికాదేవి యేపట్టణంబునందు
శ్రీమహాకాళినా నుతి శ్రీవహించు
నట్టియుజ్జని యోగపీఠాభిరామ
మైహికాముష్మికప్రదానాద్యక్షేమ. 41
ఆ. ద్వారవతి యవంతి వారణాసి యయోధ్య
మధుర పుణ్యకోటి మాయ యనఁగ
నలఘుముక్తిదమ్ము లగుపట్టణములందు
నగ్రగణ్య యుజ్జయనిపురంబు. 4
వ. అని పురాణప్రోక్తంబులగు సూక్తంబు లుపన్యసించి వెండియు. 43
సీ. సర్వసర్వంసహాచక్రావతంసమై
జయలక్ష్మి వెలయు నుజ్జయినియందు
శ్రీమన్మహాకాళికామందిరాంగణ
స్థలి నగాధంబై నకొలనికెలన
నశ్రంకశాఖాగమగు నుట్టికొమ్మను
గట్టినప్రేలెడునుట్టి యెక్కి

చిత్రంబుగఁ దదీయసూత్రంబు లైదును
ఘోరాసిచేఁ ద్రెవ్వఁ గోసి వైచి
తే. యాజలాశయమధ్యంబునందు నున్న
యుగ్రశూలాగ్రమునఁ బడనోపువాఁడు
సకలసామ్రాజ్యవైభవోత్సవమునొంది
తత్పురం బేలు, నిది దేవతావరంబు. 44

క. ఇది శిలవ్రాసినయది యని
*చదురున విప్రుం డొకఁడు ప్రసంగవశమునం
జదివెను నొగి నీపద్యము
నదియొఱుఁగఁగ వలయు, నచటి కరిగెద భట్టీ ! 45

తే. ఉట్టిచేరులు గోయంగ నుత్సహించి
యొకటి దెగఁగోసి వెండియు నొకటిఁగోయ
మునుపుగోసినయది యంటుకొనుచునుండు
నను విన్నార మిట్టిచోద్యములుగలవె ! 46

క. అన సుమతిసూనుఁ డిట్లను
జననాయక దీనికై విచారంబేలా ?
విను ముట్టిచేరు లొక్కటఁ
బెనుపొతముగఁ గోయరాదె ప్రిదులక యుండన్. 47

## ఉజ్జయినికేగి కాళిని మెప్పించి విక్రమార్కుఁడు వరముపొందుట

మ. అనినం దత్ప్రతిభావిశేషమున కత్యాశ్చర్యముం బొంది, య
మ్మనుజాధీశుఁడు భట్టిఁ జంద్రపురిసామ్రాజ్యంబున న్నిల్పి, భూ
జనసంరక్షణమార్గసమ్యగుపదేశం బిచ్చి, తానేగె ను
జ్జనికిన్ సమ్మతిఁ బాదుకంబువలనన్ సంతోషితస్వాంతుఁడై. 48

వ. అరిగి యనేకప్రసూనసుగంధవహ బంధురోపవనాపాదితసముత్తరంబయిన
యన్నగరోపకంఠంబున. 49

---

* చతురత. వా. 1926.

ఉ. మోహనమూర్తి యానృపతిముఖ్యుఁడు, గాంచె సువర్ణకుంభస
న్నాహము దుంగశృంగపరిణాహము, దర్పణరత్నతోరణో
త్సాహము చంద్రికాధవళసౌధసమూహము, శ్రీమదంబికా
గేహము గోపురాగ్రతల ఖేదవినోది దినేంద్రవాహమున్. 50

వ. కని తదీయరామణీయకంబునకు నాశ్చర్యధుర్యుండై యక్కుమార వర్యుండు, వందారుబృందారకసుందరీసందోహ సీమంతసింధూరపరాగ పాటలిత స్ఫటికమణికుట్టిమంబులవలనను, నటనఘటనారంభ రంభా పదాంభోజవిగళ దలక్తసంధ్యారాగరంజిత రంగస్థలీనభోంతరాళ తార కాయితముక్తాఫలోపహారంబులవలనను, సఖీజనసమాందోళిత డోలాసమా రూఢ గంధర్వకామినీజేగీయమాన మధురగీతికాతిస్వనంబులవలనను, ప్రసిద్ధసిద్ధజనకథిత నవనాథచిత్రచరిత్ర వర్ణనప్రమోదహృదయ సామా విరాజమాన మణిమంటపంబులవలనను, విటంకవిహరణపారావత కీర జిక శారికాపఠిత దేవస్తుతికథాగాధ శ్రవణప్రహృష్టహృదయ జనసముద యంబులవలనను, ప్రాకారసమీపసంజాత కరంజనికుంజ గంజామంజు మంజరీకుంభసంభృత మకరందమధురసాస్వాదమత్త మధుకరీగానతానా నుకూల శాలిపాలికాబాలికానవరాగగీత ప్రసంగంబులవలనను, నిరవలంబ నాంబరచరద్రమణరమణీసురతశ్రమసంజాత ఘర్మాంబుబింద్వపనోదన చతురశీతలసమీరణసంజననకారణ పతాకానికాయంబులవలనను, జవల కపికంపితరసాలశాఖాపతిత పరిపక్వఫలవాంఛాసంచరణ పౌరభామినీ నివహంబులవలనను, నానాభివాంఛితశయితశాతోదరీసంపాద్యమాన జల ధరోపమవిశాలనీలమణికుట్టిమప్రదేశంబులవలనను, నిరవధికభక్తిరసాతి శయ ప్రాణోపహారసమర్పణమహావీరవర శిలాప్రతిరూపంబులవలనను, గామితామితఫలోదయానందకందళితమనో మనోహర మానవానీత మహారంభగుంభితకుంభాంచిత కర్షణవ్యథానీయమాన స్వర్ణకోటివల్గనా ఫల్గుశోభాకర పురోభాగంబులవలనను, నతిమనోహరంబై, సార్వకాలిక సమర్పితానేక పుష్పగంధబంధురంబై, యగురుగుగ్గులుప్రముఖధూప వాసనావాసిత దశదిశాభాగంబై, శాతకుంభస్తంభసంభృతానేక నూతన రత్నప్రదీపికాదేదీప్యమానంబై, మహోపహారసమయసముచిత పంచ మహాశబ్దసంభావ్యమానంబయిన యాదివ్యమందిరంబు ప్రవేశించి. 51

సీ. నిర్జరవరవధూనేత్రకైరవములు
చిఱునవ్వువెన్నెలచేత నలర
గోపతిసుతసతీ కుంతలభ్రమరంబు
లడుగుఁదమ్ములఁ జెంది యతిశయిల్ల
వరుణాంగనామనోవల్లీవితానంబు
పలుకుఁదెమ్మెలచేతఁ బల్లవింప
ధనదకాంతాహర్ష తటినీనికాయంబు
విశదకృపారసవృష్టిఁ బెరుగ
తే. హారికిన్నరకన్యకాహస్తజలజ
కలితచామరపవమాన కంప్యమాన
చికురనికురుంబయై యొప్పుసకలజనని
కర్థి దండప్రణామంబు లాచరించి. 52

వ. నిర్గమించి తదాలయపురోభాగంబున. 53

సీ. సికతాతలంబున శివలింగపూజన
పరులైన సన్మునివరులవలనఁ
బరిసరసహకారపాదపచ్ఛాయల
గోష్ఠిసల్పెడి సిద్ధకోటివలన
నంతర్జలంబుల నఘమర్షణస్నాన
మాచరించుచు నున్నయతులవలన
సిరులు నిండారంగ దరుల నోములు నోము
మానవతీలలామమునవలన
తే. సుకృతముల కెల్ల నెల్లయై సొంపు మీఱి
యపరమణికర్ణిక యనంగ నతిశయిల్లి
కమలకైరవమధురస కలితలలిత
వైభవాకరమగుసరోవరము గాంచి. 54

ఉ. ఆసరసీతటాంతిక శిలాక్షురవంక్తిఁ బఠించి చూచి, యీ
వ్రాసినవ్రాఁత యుజ్జయిని రాజ్యముచేరుటఁ జాటిచెప్ప సం

త్రాసముఁ బొందనేల ? యని తత్క్షణమాత్రన యుట్టియెక్కి, బా
హాసిఁ దదీయసూత్రముల నన్నిటి నొక్కటఁ గోసె వ్రేల్మిడిన్. 55

వ. తదీయసాహసోత్కర్షంబునకు హర్షించి. 56

సీ. వికచనీరజపత్త్రిమకరందరసభాతిఁ
బసని చూపులఁ గృపారసము దొలఁకఁ
జంద్రమండలసాంద్రచంద్రికాద్యుతిభంగి
నాననంబున మందహాస మొప్పఁ
గనకకుంభవినూత్నఘనరత్నరుచిలీలఁ
జాలిండ్లఁ గుంకుమపంక మలరఁ
గాంచనపాంచాలికాకీర్ణహిమలీల
లలితాంగవల్లి దువ్వలువ దనర
తే. నొప్పులకు నెల్ల నెల్లయై యుల్లసిల్లు
నమ్మహాకాళి ప్రత్యక్షమై నరేంద్రు
శూలముఖమునఁ బడకుండఁ గేలఁ బట్టి
నిజచరణపీఠిచెంగట నిలుపుటయును. 57

వ. రాగరంజితుఁడై యారాగమంజరీనందనుండు కృతాభివందనుండై, యంజలిపుటంబు నిటలతటంబున ఘటియించి, నిష్యందమానానందబాష్పకణికాప్రసారుండును, రోమాంచకంచుకితాకారుండును, సముద్గతగద్గదవ్యాహారుండును నై యిట్లని స్తుతియించె. 58

దండకము. జయజయ జగదంతరానందమూర్తే, శతానందసంస్తుత్యకీర్తే, నమద్దివ్యసీమన్తినీకాంతసీమన్తసంక్రాంత సిందూరబాలాతపప్రస్ఫురత్పాదపంకేరుహే, హేమకుంభీలసత్కుంభవక్షోరుహే, నూత్నరత్నప్రభామండలీమండితానేక భూషావిశేషాప్రతీపప్రతీకే, కృపాజాగరూకే, రణారంభసంరంభశుంభన్నిశుంభాది దేయారి దుర్వారగర్వాంధకారచ్ఛిదాచండమార్తాండరూపే, సుధాసుప్రలాపే, కిరీటాగ్రజాగ్రత్సుధాభానుఖండద్వితీయార్ధశంకాసమాపాదిఫాలస్థలన్యస్తకస్తూరికాపట్టభాస్వల్లలామే;మ

హామంత్రయంత్రాభిరామే, సుధాసాగరాంతర్మణిద్వీపనీపాటవీపాటలీ
వాటికాకల్ప కల్పద్రుమప్రాంతచింతామణిశ్రేణికాగేహసీమా శివాకార
మంచాగ్రభాస్వత్పరబ్రహ్మశయ్యాశిరం సే ప్రభాసాంద్రచంద్రావతంసే,
నవీనేక్షుకోదండనానాప్రసూనాస్త్రపాశాంకుశోల్లాసహస్తారవిందే, సదా
సేవనాసన్నసన్మౌనిబృందే, నవాశోకబంధూకసౌగంధికాలక్తకస్యంద సిం
దూరరేణు ప్రవాళప్రతీకాశమూర్తిప్రకాశే, వినీలాలినీకేశపాశే,
సముద్దామసౌదామనీధామ బాలారుణేందుప్రతీకాశ బీజత్రయీవిద్య
మానాఖిలైశ్వర్యచింతామణే, లోకరక్షామణే, నిర్మలజ్ఞానవిద్యామహా
యోగవిద్వన్మహాభాగ్యసౌభాగ్యవిద్యే, ప్రభావానవద్యే, నమస్తే,
నమస్తే, నమస్తే నమః. 59

శా. ఓ సర్వేశ్వరి, యోమహేశ్వరసతీ, యోదివ్యమూర్తిత్రయీ
యోసిద్ధాంబిక, యోకదంబవనలీలోద్యానహృద్యా, శివా!
యోసంసారరుజాపహారనిపుణా, యోమంత్రతంత్రాత్మికా
నాసంసేవను జిత్తగించి, దయతో నన్నుం గటాక్షింపవే! 60

వ. అనిస్తుతియింప నమ్మహీపతిపై నపారకృపారసతరంగంబగు నపాంగంబు
నిగిడించి, యమ్మహాదేవి యిట్లని యానతిచ్చె. 61

ఉ. తొల్లి, యనేకభూపతులు దుర్లభ మంచు నుపక్రమింప భీ
తిల్లినయట్టికార్య మిది, తెంపున నీవొనరింపఁ జూచి యే
నుల్లములోన మెచ్చి, యిపు డుజ్జయినీపురరాజ్యవైభవం
బెల్ల సహస్రవత్సరము లేలఁగ నిచ్చితి నీకుఁ బుత్త్రికా! 62

క. అనితరసాధారణ మగు
ఘనతరసాహసము నీవు గావించుట, నో
మనుజేంద్ర! సాహసాంకుం
డనఁగాఁ జిరకీర్తిఁ బొందు మాకల్పముగాన్. 63

ఉ. ఈయిల ధర్మరక్ష వెలయింప జనించినయట్టి యాదినా
రాయణమూర్తి వీవు, భవదంఘ్రిసరోరుహసేవ యర్థిమైఁ

జేయఁగ నాత్మఁ గోరి సరసీరుహగర్భుఁడు పుట్టె భట్టియై;
పాయక జోడుగూడి యిలఁ బాలనసేయుట మీకు నైజమౌ. 64

చ. వదలక మీచరిత్రములు వర్ణనచేసిన, సంస్మరించినం,
జదివిన, వ్రాసినన్, విని ప్రసంగవశంబునఁ బేరుకొన్నఁ బె
ల్లొదవు మనుష్యకోటికి సముజ్జ్వలరాజ్యరమాసమృద్ధియున్,
సదమలధర్మబుద్ధియును సంవిదుదంచితమోక్షసిద్ధియున్. 65

మ. అని, సర్వేశ్వరి యానతిచ్చినఁ బ్రియం బారంగ సాష్టాంగదం
డనమస్కారముఖోపచారములు నానాభంగులం జేసి, య
జ్జననాథాన్వయచక్రవర్తి తదనుజ్ఞాసిద్ధిపూర్వంబుగాఁ
దనయిచ్చం జరియించుచుండె నికటోద్యానాంతరాళంబునన్. 66

## విక్రమార్కుఁ డుజ్జయినికి రాజగుట

ఉ. అట్టియెడన్, బ్రసేనుఁ డనునప్పురమేలెడురాజు చన్న, నా
పఁపుదంతి మంత్రులయుపాయమునం జనుదెంచి, కీర్తికిం
గఁనుఁగైన హారలతఁ గంఠమునం దిడ; రాజ్యలక్ష్మికిం
బఁముగట్టి రాప్తులును బంధులు భృత్యులు నన్నరేంద్రునిన్. 67

వ. ఇత్తెఱంగున నుజ్జయినీరాజ్యసింహాసనాసీనుండై. 68

సీ. భరతునిలాగునఁ బరశురామునిభాతి
రంతిదేవునిభంగి రాముగరిమ
[1]నంగునిరేఖ యయాతిభావంబునఁ
బృథువిధంబున భగీరథునిమాడ్కి
గయులీల మాంధాతకైవడి నంబరీ
షునిరీతి శశిబిందుసోయగమున
శిబిపోలిక మరుత్తుచెల్వునను దిలీపు
కరణి సుహోత్రునిగారవమున

1. ఒకరాజు, కాంచనాలంకారములతోఁ గూడిన గజాదులను దానముచేసి, యర్థులకు బంగారమొసఁగి యనేకయాగము లొనరించెను. దైవబ్రాహ్మణ భక్తినిరతుఁడు.

తే. సగరువెరవునఁ బురుకుత్సుసరణి నలుని
రమణ నర్జునుక్రియఁ బురూరవునిచంద
మున హరిశ్చంద్రుతెఱఁగున వినుతికెక్కి
సాహసాంకుండు వసుమతీచక్రమేలె. 69

చ. కుదురుకొనెన్ గిరీంద్రములు, కూర్మకులాగ్రణి జీవనస్థితిం
బొదలె, ఫణీశ్వరుండు బహుభోగసమున్నతి నుల్లసిల్లె, స
మ్మదము వహించె దిక్కరిసమాజము, క్రోడము చాలఁ గ్రొవ్వె, నొ
ప్పిదముగ నన్నరేంద్రుభుజపీఠిక యుర్వర నిర్వహించినన్. 70

చ. అరిజనపాలకాననతృణాంకురవృద్ధి యొనర్చు, విద్విష
త్సరసిజలోచనాస్యజలధారలవర్ధన మొందు, నెప్పుడుం
జరణసమీపవర్తులకుఁ జల్లఁదనం బొదవించు, నమ్మహీ
వరునిప్రతాపవహ్ని జనవర్ణితచిత్రచరిత్రలీలలన్. 71

ఉ. పాదుక లాదటం జరణపద్మములం దిడి, ముజ్జగంబులన్
మోదముతోడ నానృపతిముఖ్యుఁడు త్రిమ్మర, ముఖ్యకాంతయున్
సూదిపిఱిందిత్రాటిక్రియఁ జొచ్చినచోటులు సొచ్చు, నెన్నఁడేఁ
బైదలి ప్రాణవల్లభునివజ్జఁ జరింపక పాయనేర్చునే? 72

సీ. ప్రకటప్రతాపాతపముచేత వైరుల
కన్నులఁ జీఁకట్లు గ్రమ్మఁజేసి
ఖడ్గహాలాహలగరిమచే నహితుల
నమృతాశనులుగాఁగ నలవరించి
సలలితసత్కీర్తిచంద్రికఁ బగతుర
మనములతాపంబు మట్టుకొల్పి
సముదగ్రఘోరాశశరవృష్టి విమతుల
తనువులఁ జెమటలు దలముకొలిపి
తే. చిత్రచారిత్రవిక్రమశ్రీవహించి
సాహసాంకమహీపాలచక్రవర్తి

జలధివలయిత వసుమతీచక్రవహన
చండభుజదండకలితుఁడై యుండునంత. 73

వ. పాకశాసనుశాసనంబునం దదీయసూతుండగు మాతలి దివ్యరథంబు
తోడం జనుదెంచి కృతాంజలి యగుటయు. 74

చ. అతనికి సాహసాంకవిభుఁ డాసనపాద్యము లాదియైన స
త్కృతు లొనరించి, నేఁ డిచటికిం దనదివ్యరథంబుతోడ సా
కతమునఁ బంపె నెంతపని గల్గెనొగాక! శచీవిభుండు ని
న్నితరములైనకార్యముల కిమ్మెయిఁ బంచుట మున్ను వింటిమే! 75

వ. అనినవిని మాతలి సాహసాంకమహీపాలునితో నిట్లనియె. 76

క. జంభాహితుఁ డూర్వశిపై
రంభపయిం గరుణకలిమి, రహిఁ దన్నటనా
జృంభణల తారతమ్యము
సంభావించుటయ కాని; చాలఁడు తెగడన్. 77

క. కావున వారల నటనా
ప్రావీణ్యము హెచ్చుఁ గుందుఁ బ్రకటించుటకై
దేవరఁ దోడ్కొని రమ్మని
దేవేంద్రుఁడు పనిచె వసుమతీవర! నన్నున్. 78

క. పాయక పెక్కుతపంబులు
సేయుతపోధనుల కైనఁ జేర నశక్యం
బీయరద మెక్కి విజయం
చేయుము జగతీశ! తడవుసేయక యనినన్. 79

## ఇంద్రుని రథమెక్కి విక్రమార్కుండు నాకమున కేగుట

సీ. నిజతపోమహిమచే నిరుపమానంబుగా
విరచించె నేతీరు విశ్వకర్మ
జంభాదిదనుజేంద్రసంగరాంగణముల
శక్రున కేతేరు జయ మొసంగెఁ

గౌరి ముప్పదిమూఁడుకోటులదివిజులు
కొలువంగ నేశేరు కొమరు మిగిలెఁ
బటుజవస్ఫురణమై పదివేలహయములు
పూనంగ నేశేరు పొలుపు మిగిలె
తే. నట్టిదివ్యరథంబు నెయ్యమున నెక్కి
సాహసాంకమహీపాలచంద్రుఁ డరిగె
గరుడపవమానమానసాక్రమణనిపుణ
బహుగతిప్రౌఢి కుల్లంబు పల్లవింప. 80

వ. ఇట్లు చనిచని. 81

ఉ. నాకముఁ గాంచె నట్టియెడ, నందనమందచరన్నితంబినీ
లోకము, సంయమీంద్రధృతిలోపక లోలవిలాసమేనకా
లోకము, వాసవేభమదలోలుప చంచలచంచరీకమున్
స్వీకృతసత్తపఃఫలవిశేషవిపాకముఁ బుణ్యలోకమున్. 82

వ. కని తదీయవిలాసోత్కర్షంబునకు హర్షించుచు, సకలజగన్నయనపర్వం బగు సుపర్వాధీశ్వరునగరంబు చొచ్చి రథావతరణంబు చేసి, దివ్యసభా మండపంబు ప్రవేశించి. 83

చ. కనియె నతండు, దివ్యగణికాజననేత్రచకోరికానురం
జన హాసచంద్రికాలపనచంద్రునిఁ, జారుపులోమజాఘన
స్తన పరిరంభసంభ్రమవశస్ఫుట కుంకుమపంకసౌరభాం
జనతనుకాంతిరుంద్రుని, భుజాబలసాంద్రుని నిర్జరేంద్రునిన్. 84

క. కని వందన మొనరించిన
జననాథున కెదురు వచ్చి, సరసాశ్లేషం
బొనరించి యతని గద్దియ
నునిచికొనెన్ దివిజనాథుఁ డుచితప్రౌఢిన్. 85

వ. ఇట్లయ్యిరువురు నేకాసనాసీనులై, సముచితసంభాషణంబు లొనరించు

సమయంబున, సమయజ్ఞతావిశారదుండగు నారదుం డన్నరేంద్రున
కిట్లనియె. 86

క. నటనాహంకృతిఁ దమలోఁ
జిటిపొటిజగడంబు లూర్వశీరంభలకుం
బొటమిన, మేలేర్పఱుపఁగ
నిటనిను రప్పించె నిర్జరేశ్వరుఁ డధిపా! 87

వ. అని యెఱింగించి, యమరపతి యనుమతి నమ్మరవతీమణుల రప్పించి, నర్తనప్రవర్తనంబునకు నియోగించుటయు, సంకార్యాలింగోర్ధ్వకాద్యవయవంబులగు చతుర్విధవాద్యంబులకు ననువుగాను, గానంబునకు ననుతానంబుగాను నుపక్రమించి. 88

## విక్రమార్కుఁ డూర్వశీరంభల నాట్యతారతమ్యమును నిరూపించి చెప్పుట

సీ. కలికికన్నుల సోయగముమించుఁదళుకులు
చెలఁగెడు మగమీలచెలువు నొంద
నభినవస్ఫురణమై నభినయించుకరంబు
లలరుఁగెందమ్ముల ననుకరింప
నిటలంబున నటించు కుటిలకుంతలకాంతి
కొదమతుమ్మెదల యొప్పిదము చూప
వలిపకంచెలలోని వలిచనుంగవ మించి
జక్కవకవభంగి సంభ్రమింప
తే. మంజుమంజీర కంకణ శింజితములు
సమదకలహంస కలనినాదముల దొరయ
సరసిగతిఁ బూచి సరసులు సరి యనంగ
రంభ సురరాజుమ్రోల నర్తన మొనర్చె. 89

వ. అంత. 90

సీ. శృంగార మేపార రంగవల్లికయందు
గీతసామగ్రి యంగీకరించి
కరతలామలకంబుగాఁ గరాంబుజముల
నర్థమాద్యంతంబు నభినయించి

భావింప నరుదైన భావమర్మంబులు
మెఱుఁగుఁజూపులలోన మేళవించి
తానమానములతోఁ దాళనిర్ణయలీలఁ
జరణపల్లవముల సంగ్రహించి
తే. యఖిలమును మెచ్చఁ బ్రత్యక్షమైనయట్టి
నాట్యవిద్యాధిదేవత నాఁ దనర్చి
భరతశాస్త్రమర్మజ్ఞతాప్రౌఢి మెఱసె
నూర్వశీకాంత వేల్పుఁబేరోలగమున. 91

వ. ఇట్లిరువురుం బ్రవర్తించిన నర్తనంబులు గనుంగొని. విక్రమార్కుం
డిట్లనియె. 92

ఉ. సర్వజగంబుల న్నటనచాతురిఁ దాఁ గడుఁబ్రోడ నంచు, దు
ర్గర్వము పూని శాస్త్రగతిఁ గైకొననొల్లక రంభ యాడె, నీ
యూర్వశి శాస్త్రసమ్మతసముజ్జ్వలమార్గము దప్పకుండఁగాఁ
బర్వ మొనర్చె నిచ్చటి సుపర్వులకెల్లఁ గళాప్రవీణతన్. 93

దేవేంద్రునకు విక్రమార్కునకు దివ్యసింహాసనంబు బహూకరించుట

వ. అనిన, నమ్మహీనాథుని వివేకపరిపాకంబునకుఁ బాకశాసనుండు ప్రముది
తాంతఃకరణుండై దివ్యమణిభూషణాంబరాదు లొసంగి, మఱియును నిజ
తపోవిశేషతోషితాంతరంగంబును, సర్వమంగళాస్పదంబును, నృపసింహా
సనద్వాత్రింశత్సాలభంజికా రంజితంబునునగు దివ్యసింహాసనంబు నొసంగి,
తద్దివ్యపీఠంబుఁ బురంబునకు భరించికొనిపోవఁ ద్రిదశకింకరసహస్రంబు
సమర్పించి, గారవించి వీడ్కొలిపిన, దివ్యమణిపాదుకాప్రభావ సులభగ
మనుండై యజ్జనపాలుం డుజ్జయినీపురంబున కరుగుదెంచి. 94

సీ. శ్రుతిమతంబునఁ బురోహితసమ్మతంబునఁ
బుణ్యాహవాచనపూర్వకముగ
జలజబాంధవముఖ్య సకలగ్రహంబుల
కభిమతంబగు హోమ మాచరించి
యన్నదానాది సమస్తదానంబుల
బ్రాహ్మణవ్రతతికిఁ బ్రమద మొసఁగి

యుచితంబులగు షోడశోపచారంబుల
నాగద్దె కతిభక్తి నాచరించి
తే. పౌరవృద్ధపుణ్యాంగనాపాణిపద్మ
ముక్తమౌక్తిక శేషాసముజ్జ్వలావ
తంసుఁడై, యెక్కె శుభవేళ ధరణినాథుఁ
డమరపతిదత్త దివ్యసింహాసనంబు. 95

వ. ఇట్లు తేజోవిరాజితుండై యఖిలప్రజాపాలనంబు సేయుచున్నంత, నొక్కనాఁడు. 96

సీ. అచ్చవెన్నెలమించు నపహాసించువిభూతి
యంగరాగంబుగా నలపరించి
యాగమోచితముగా నవయవంబులయందు
లలితరుద్రాక్షభూషలు వహించి
పోంబట్టుపుట్టంబు పొట్ట నందంబుగా
ఘనజటాజూటంబు గలయఁ బోదివి
యడుగుఁగెందమ్మిల బెడఁగు రెట్టింపఁగాఁ
గాంచనమణిపాదుకములు దొడిగి
తే. జమిలిమొలత్రాట నినుపకచ్చడ మమర్చి
*కక్కపాలయుఁ గక్షభాగమునఁ బూని
తరుణశశిమౌళి యపరావతార మనఁగ
ధరణిపతిపాలి కేతెంచెఁ దపసి యొకఁడు. 97

క. ఏతెంచి 'శివునికృప'యని
ప్రీతిమెయిన్ భూతి యొసఁగఁ, బృథివీరమణుం
డాతతభక్తిని గైకొని
యాతాపసవరు భజించె నర్ఘ్యార్చనలన్. 98

వ. ఇత్తెఱంగున నత్తపోధనసత్తమునకు, సపర్యాపర్యాయంబునం బ్రమోదం బాపాదించి, యన్నరేంద్రుం డిట్లనియె 99

---

* ఘనకపాలంబు కక్షభాగమునఁ బూని.

క. ఈచక్రవాళపరివృత
భూచక్రమునందు, నొకయపూర్వం బేదేఁ
జూచినయది గలిగిన, నది
యేచినకృప నాకు నానతిమ్ము మహాత్మా. 100

వ. అనిన, యోగీశ్వరుం డిట్లనియె. 101

## కనకస్తంభ వృత్తాంతము

సీ. సర్వపర్వతకులసార్వభౌముం డనఁ
గొమరొందు పడమటికొండ దండఁ
గనకగోపురవప్రఘనసౌధసదనమై
రాజిల్లు కనకపురంబు కెలన
రోహణకుధరప్రరోహణగతి నొప్పు
మార్తాండదేవసద్మంబుచెంత
నఖిలతీర్థస్వామియగు పాపనాశన
నామతీర్థమునందు నట్టనడుమ
తే. నగ్రకీలితమణిపీఠ మైనయట్టి
శాతకుంభమయోజ్జ్వలస్తంభ మొకటి
సంభవమునొందు వాసరారంభవేళ
కర్ణికోదీర్ణసౌవర్ణకమల మనఁగ. 102

తే. ఆది దినేంద్రునికొలఁదినే యతిశయిల్ల
యామయుగళంబునకు నుష్ణధాముఁ గదియు
నపరదిశఁ గూర్చి కమలాప్తుఁ డల్ల వ్రాలఁ
గ్రుంకు బంగారుకంబ మాకొలఁదిగాను. 103

క. వారుణదిగ్వారాకర
వారి నరుణుఁ డస్తమింప, వర్ణితతీర్థో
దారమగు పాపనాశన
పూరములో మునుఁగుఁ గంబమును దినదినమున్. 104

చ. అన విని, యత్తపోధనునియానతికిం దగ సంతసిల్లి, య
త్యనుపమభక్తియుక్తి మెయి నమ్మహితాత్ముని వీడుకొల్పి, గు

బ్బనఁ బతి దివ్యభవ్యమణిపాదుక లంఘ్రుల సంఘటించి, య
క్కనకపురంబు చొచ్చి తమకంబున నన్నిసి వుచ్చి, వేకువన్. 105

చ. వెల వెలఁబాఱుదివియలు, వింతరుచిం గలిగించుతమ్ముల
మ్ములు, నతిశీతలమ్ము లగుముత్తెపుఁ బేరు, లఖర్వపద్మినీ
విలసితగంధవాతములు వేకువఁ దెల్ప, నరేంద్రముఖ్యుఁ డు
జ్జ్వలగతిఁ బాపనాశనముసన్నిధికిం జని, యుండునంతటన్. 106

సీ. కైరవకాననోత్కరములు కడుఁ గుందఁ
గంజపుంజంబులు కణఁక నొంద
లలిఁ జకోరంబులతలఁపులు గంపింపఁ
జక్రవాకంబులు సంతసింప
సాంద్ర చంద్రికల యుజ్జ్వలభావములు దిగ
నరుణోదయప్రభాస్ఫురణ లెదుగ
జారచోరులమతిసంభ్రమంబులు చిక్క
జనులకుఁ జిత్తప్రసాద మెక్కఁ

తే. దారకంబులకాంతి యంతయుఁ దొలంగ
ధరణిదివిజార్ఘ్యబిందుసంతతి సెలంగఁ
బూర్వపర్వత మెక్కె నపూర్వదీప్తి
మండలంబైన మార్తాండమండలంబు. 107

## కనకస్తంభము నెక్కి విక్రమార్కుఁడు సూర్యమండలమున కేఁగి వచ్చుట

శా. క్షోణీనాథుఁడు తీర్థవారిపయి వక్షోజస్ఫురత్కాంచన
స్థూణాశృంగము గానవచ్చుటయు, మెచ్చుల్మీఱఁగాఁ జొచ్చి త
న్మాణిక్యోజ్జ్వలపీఠ మెక్కె. మురజిన్నాభీసరోజస్ఫుర
ద్వాణీవల్లభుఁ గ్రేణిసేయుచుఁ బ్రభావస్ఫూర్తిమన్మూర్తియై. 108

వ. తదనంతరంబ. 109

క. అంబరమణి యల్లల్లన
నంబరమధ్యమున కరుగునంతటిలోనన్
జాంబూనదకలితం బగు
కంబము నరనాథుతోడ ఖరకరుఁ గవిసెన్. 110

వ. కదిసిన, నత్యంతసంతాపకరంబై నిజప్రతాపాటోపంబునకు మిసిమింతుం డుగాని యమ్మహీకాంతునిం జూచి, విస్మితస్వాంతుండై భాస్వంతుం డిట్లనియె. 111

సీ. కల్పాంతదుర్దాంత కలుషాంతకస్వాంత
దుర్వారవహ్నికి నోర్వవచ్చు
నిష్ఠురనిర్ఘోష నిర్ఘాతసంఘాత
జాతమహావహ్ని సైఁపవచ్చుఁ
బ్రళయకాలాఖిల ఫాలలోచనఫాల
భాగానలస్ఫూర్తి బ్రతుకవచ్చుఁ
గాకోదరేంద్ర ఫూత్కారసంభవ తీవ్ర
కాకోలదహనంబుఁగదియవచ్చుఁ
తే. గాక, సైరింపవచ్చునే లోకదహన
దర్పితంబైన యస్మత్ప్రతాపవహ్నిఁ
దావకోత్సాహ సాహసౌదార్య ధైర్య
గతికి మెచ్చితి, విక్రమార్కక్షితీంద్ర ! 112

## విక్రమార్కుని సాహసమునకు మెచ్చి సూర్యుఁడు కుండలముల నొసఁగుట

క. అనుదినము రెండుబారువు
అనుపమ కాంచనము నొసఁగు నాశ్చర్యముగా
నని, పద్మరాగరంజిత
ఘనకుండలయుగము ధరణికాంతుని కొసఁగెన్. 113

వ. ఇత్తెఱంగున నరుణమండలప్రభానిధానంబగు బహుమానంబుంగాంచి. 114

మ. చరమాశాంతరవీథిఁ గైకొని సరోజాతప్రియుం డేగఁగా.
సరి నంతంతకుఁ గ్రుంగి క్రుంగి కనకస్తంభంబు చిత్రంబుగా
సరసీపూరసమస్థితం బగుటయున్, సర్వంసహాధీశుఁడున్
వెరవారం దిగివచ్చి, యప్పురిని దా విశ్రాంతచేతస్కుఁడై. 115

వ. అమ్మఱునాఁ డుజ్జయనీపురంబున కరుగునప్పుడు, తత్పురోపకంఠంబున. 116

## వృద్ధవిప్రుఁడు వచ్చి విక్రమార్కు నాశీర్వదించి కుండలములు పడయుట

సీ. పటలికావృత నేత్రపర్యంతరేఖలు
పొదివి క్రైవాలిన బొమలతోడ
దంతపాతముల నెంతయు స్రుక్కినకపోల
తలముల నెలకొన్న వలులతోడ
నపగతకేశో త్తమాంగంబు కెలఁకులం
దూఁగాడు నరపవెండ్రుకలతోడఁ
గ్రౌంచకంఠోపమాకారతఁ గనుపట్టు
నస్నిగ్ధమైన దేహంబుతోడ
తే. శతశతచ్ఛిద్ర జీర్ణవస్త్రములతోడ
నల్పతరపర్వయుత వంశయష్టితోడ
హరిసహస్రనామోచ్చారణరతితోడ
వచ్చి యొకవృద్ధభూసురవరుఁడు గదిసి. 117

సీ. బ్రహ్మాయురస్తు, విప్రప్రసాదోఽస్తు, క
ల్యాణపరంపరావాప్తిరస్తు
దేవేంద్రభోగోఽస్తు, దిగ్విజయోఽస్తు, సు
స్థిరకీర్తిరస్తు, వాక్సిద్ధిరస్తు
సౌభాగ్యమస్తు, శాశ్వతసమున్నతిరస్తు,
సంగరవిజయోఽస్తు, సౌఖ్యమస్తు
వస్తువాహనసంపదస్తు, చింతితమనో
రథసిద్ధిరస్తు, సామ్రాజ్యమస్తు
తే. సప్తసాగరపరివృతసకలభూమి
మండలైకాధిపత్యసమాగమోఽస్తు
పుత్త్రపౌత్త్రాభివృద్ధివిస్ఫూర్తిరస్తు
మంగళాని భవంతు తే మనుజనాథ ! 118

వ. అని యాశీర్వాదంబు చేసి. 119

క. అర్థించినబ్రాహ్మణునకు
నర్థి నొసఁగెఁ గనకకుండలాభరణము, న

త్యర్థమును రెండు భారువు
లర్థము ప్రతిదినము నొసఁగు, నని చెప్పి దయన్. 120

వ. ఇవ్విధంబున 121

మ. అరిభూనాథవరూథినీ మదభరాహంకార దుర్వారకో
పరసాటోప పటుప్రతాప పటలప్రధ్వంసకౌక్షేయభా
స్వరబాహాబలశాలి, సాహస సముత్సాహైక సంసేవి యై,
ధరణీచక్రము విక్రమార్కవిభుఁ డుద్యల్లీలఁ బాలించుచోన్. 122

ఒక చెంచు విక్రమార్కుని వేఁటకుఁ బురికొల్పుట

సీ. తలమీఁదఁ జెరివినఁ దనరారు నునుఁజెంక
యమృతాంశురేఖ చందమున నమర
మేదినీరేణువు మెయినిండఁగాఁ బర్వి
భసితాంగరాగసంపద వహింప
బుంజువెంద్రుక లెత్తి చుట్టినలేఁదీఁగ
పన్నగాధీశ్వరు పగిది మెఱయఁ
గరమొప్పు నుదుటిపై గైరికతిలకంబు
ఫాలలోచనభాతిఁ బరఁగుచుండ
తే. శబరుఁ డొక్కరుఁ డేతెంచె సంభ్రమమున
శంకరుఁడు తొల్లి శబరవేషము వహించె
నంచు మదిలోన నీసుఁ ధరించి తాను
నీశునాకృతిఁ గైకొన్నయెలు కనంగ. 123

ఉ. వచ్చినచెంచుఱేనిఁ గని వాకిటివాఁడు నృపాలుపాలికిం
బొచ్చెములేక తోకొనుచుఁ బోవఁగ, వన్యములైనకానుకల్
మెచ్చుగ నిచ్చి, యంగములు మేదినిసోఁకఁగ మ్రొక్కి లేచి, తా
వచ్చినకార్య మంతయును వావిరిఁ జెప్పఁ దొణంగి, యిట్లనున్. 124

సీ. ప్రళయకాలాఖిల భైరవోదగ్రత
సూకరాకృతిఁ బొడసూపె నొక్కొ!
యత్యంతకుపి తాంతకాంత కాకారంబు
క్రోడరూపంబుఁ గైకొనియె నొక్కొ!

పటుభయంకర వీరభద్రాతిరేకంబు
భూదారవేషంబు పూనెనొక్కొ!
చండభుజాదండ దండధరస్ఫూర్తి
కిరి ఘోరమూర్తిని బరఁగెనొక్కొ!
తే. యనఁగ, నతిభీకరాకార మైనయట్టి
యేకలం బెల్లయెడలను నెదురు లేక
ఘోరసత్త్వసమగ్ర కాంతారజలధిఁ
దిరుగుచున్నది మందరగిరియుఁ బోలె. 125

క. నరవర తాను భరించిన
ధర, నీవు భుజాగ్రపీఠిఁ దాల్పఁగ సుఖయై
తిరిగెడునాదివరాహము
గరిమం, దత్కిటి నటించుఁ గాననసీమన్. 126

క. ధర నాది శబరుఁ డొకకిటి
శరనిహతిం గూల్చె ననుచు, శబరుల నెల్లన్
బరిమార్పఁ బట్టెనో? యన
నురుకోలము చెంచుకొలము నొడుచు మహీశా! 127

వ. ఇట్లు మహామహీధరపరిణాహంబైన యావరాహంబు. 128

చ. మునిజనపర్ణశాలలు సముద్ధతిమైఁ గలగుండు వెట్టుచున్
గునగున వచ్చి లావరుఁ గొమ్ముల వ్రక్కలు వాఱఁ జీఱుచున్
మునుకొని సస్యసంఘముల మోరను గుద్దలిగొంచు నెల్లెడం
దనరుపుమైఁ జరించు నతిదారుణలీల వనాంతరంబునన్. 129

చ. జనవర! సాహసాంకుఁ డన సన్నుతి కెక్కిననీవు దక్క, నా
ఘనతరకోలముం గదిపి గర్వ మడంపఁగ నన్యభూపతుల్
గొనకొన లేమి, దేవరకుఁ గు య్యొఱఁగింపఁగ వచ్చినాఁడ, వే
గన మృగయావినోదమును గౌతుక మార నొనర్పు నేర్పునన్. 130

## విక్రమార్కుఁడు వేఁటకేఁగుట

తే. అనిన, నిష్టార్థముల వాని నాదరించి
వలయు సవరణతోడ భూవల్లభుండు
వెడలె వేఁటకు, మృగయాప్రవీణు లైన
శబరనాయకు లుభయపార్శ్వములఁగొలువ. 131

వ ఇవ్విధంబున సర్వసన్నాహంబు మెఱయ, సాహసాంకుండు కృతపవన జవనవాహనుండై చని, శరభ శార్దూల ప్రముఖ నిఖిలమృగవర శరణ్యం బైన యరణ్యంబుఁ బ్రవేశించి, బహుప్రకార మృగయావినోదంబు లొన రించు సమయంబున. 132

## వరాహము విక్రమార్కు నలయించి భూగర్భముఁ జొచ్చుట

ఉ. కోలముఁ గాంచె నానృపతికుంజరుఁ, డంజనశైలవిగ్రహో
త్కీలముఁ, బోత్రసాధనవిభేదిత భూవివరోరుజాలకో
త్తాలము, ఘుర్ఘురధ్వనివిదారిత ఖాద్రిగుహాంతరాళమున్,
లోల విలోచనాంచల విలోకిత రోషమహాగ్నికీలమున్. 133

వ కని యతఁడు మున్ను శబరునిచేత విన్న తెఱంగునకు మెఱుం గిడినయ ట్లున్న, యున్నతోదార భూదారంబు నిటలవీథికిం గడియుటయును. 134

సీ. అంతంత నగపడినట్ల చేరఁగ నిచ్చుఁ
బైకొనఁజూచినఁ బరువువెట్టుఁ
బటుపరిశ్రాంతి లోఁబడినలాగు నటించు
కైదువునేయ డగ్గఱిన సురుఁగుఁ
బొదలమాటున నుండి యదలించుచును ఱొప్పి
కదియంగఁ జూచినఁ బెదరి తొలఁగు
నవనీతలము మోర నలవోకఁ గోరాడుఁ
ద్రోవఁ గట్టినఁ దప్పుఁద్రోవ నుఱుకుఁ

తే. జేరఁ దవ్వగఁ బాఱును, జేరనీక
యల్లనల్లన నడపాడు, నానగొలుపు;
మనుజపతి నిట్టు తెలయించుకొనుచు నరిగి
యమ్మహాకోల మవనిగహ్వరముఁ జొచ్చె. 135

వ. చొచ్చిన, నూది పిఱింది త్రాటిక్రియ నచ్చోటం జొరం దలంచి, ఘోటక తిలకంబుఁ దిలకభూజంబున బంధించి. 136

## విక్రమార్కుఁడు పాతాళమును జేరి బలినిఁ గాంచుట

క. చెచ్చెరఁ బతియును దోడన
చొచ్చి, రసాతలముదాఁక సూకరమార్గం
బెచ్చో వదలక వెనుచన
నచ్చెరువుగ మాయమయ్యె నది యచ్చోటన్. 137

వ. అతం డత్తెఱంగునకు విస్మయతరంగితాంతరంగుండై కొంతదవ్వు చని ముందట ననంతవిభవోదారం బగు నొక్క పురంబు గని, యాత్మగతంబున. 138

క. ఈ పురము నామ మెద్దియొ
యీ పట్టణ మేలున్నృపతి యెంతటివాఁడో,
యీపుటభేదన విభవము
గోపురమున లేదు, వళమె కొనియాడంగన్. 139

చ. అని, యటపోవఁ బోవఁ బణిహారియొకం డరుదెంచి, విక్రమార్కునిఁ బొడగాంచి, మిమ్ముఁ దొడుకొంచు వెసం జనుదేర దైత్యు నొక్కనిఁ గిటిమూర్తి నైకొని తగం జనుమన్నను, వచ్చి తమ్ముఁ దెచ్చినవిధ మంతయుం దెలియఁ జెప్పిన, ముప్పిరిగొన్న వేడుకన్. 140

క. తలఁచిన తలఁపుకొలందిన
యలఘు నుదారునిని విక్రమార్కవిభు రసా
తలమునకుఁ దెచ్చి, తనుచును
బలి మెచ్చెం దనదు భృత్యుఁ బరహితకృత్యున్. 141

క. అని చెప్పి, మిమ్ముఁ దోడ్తేఁ
బనిచినఁ బని వింటి, ననినఁ బణిహారిబడిఁ
దనుజేంద్రుని సన్నిధికిని
మనుజేంద్రుఁడు వచ్చి, వినయమహనీయుండై. 142

క. కాంచిన, నతఁడును బెన్నిధిఁ
గాంచినగతి నలరి, యెదురుగా వచ్చి సమా
కుంచితశరీరవినయో
దంచితుఁ డై కౌఁగిలించి, తాత్పర్యమునన్. 143

క. ఆసాహసాంకు మణిసిం
హాసనమున నిలిపి, సముచితార్ఘ్యప్రియపూ
జాసత్కారమున సుఖా
వాసునిఁగాఁ జేసి, దనుజవరుఁ డిట్లనియెన్. 144

శా. భూలోకంబున సర్వసంపదలు సంపూర్ణంబులై యుండునా,
కాలాతిక్రమణం బొనర్ప కిల మేఘశ్రేణి వర్షించునా,
చాలంగాఁ బసిపాఁడిసొంపు గలదా సస్యంబు లేపారునా,
వాలాయించి యొనర్తురా జనులు దేవబ్రాహ్మణారాధనల్ ? 145

క. ఏనును జనవత్సలతన్
మానవలోక ప్రసంగమతిచేతను గా,
కేనివ్విచార మడుగం
గానేటికి ? నీవు గలుగఁ గారుణ్యనిధీ ! 146

చ. బలము ప్రతాప మీగి దయ ఖ్యాతి విభూతి వినీతి ధర్మని
శ్చలత కళావిశేషము నిజం బవధానము మాన మాదరం
బెలమి యనం బొగడ్త గలయిన్నిగుణంబులఁ గీర్తికెక్కు. నీ
విల భరియింపఁగా జనుల కేల విచారము ? భూతలేశ్వరా. 147

వ. అనిన సాహసాంకమనుజేంద్రుండు బలీంద్రున కిట్లనియె. 148

క. సురపతి పిలువఁగఁ బంపిన
నరిగితి నమరావతికిఁ బ్రియంబున, నది నీ
పురికిని రమాసమగ్రత
సరిరాదన కానఁబడియె సౌజన్యనిధీ ! 149

క. పదునాలుగులోకంబులు
నుదరస్థములుగఁ జరించుచుండెడు లక్ష్మీ
హృదయేశుఁడు నిను వేఁడఁగ
బ్రదికితి, నీబ్రదుకు బ్రదుకు బలిభూపాలా! 150

క. 'దేహి' యనువాఁడు, వగగొని
'దేహి' యనఁగ నుండువాఁడు తెల్లంబగ లే
డూహించిన నీరాజ్యము
లో, హరిహర చిత్రమహిమ లుంటాక బలీ! 151

క. అని మధురవచనరచనల
దనుజేంద్రుని నలరఁజేసి, తగ మజ్జనభో
జనవిధు లతండు వేడుక
లొనరింపఁగఁ దృప్తిఁ బొంది, యుండెడు వేళన్. 152

## బలి విక్రమార్కునకు రసరత్నముల నొసఁగుట

ఆ. రస రసాయనాఖ్యరత్న ద్వయము దెచ్చి
యందు ముదిమి నొకటి యపనయించు,
నొకటి చాలసిరుల నొందించు, నని చెప్పి
యిచ్చి యనుప నిలకు వచ్చె నృపతి. 153

ఉ. వచ్చి రయంబునం దనదువారువముం బ్రియమార నెక్కి, ము
న్నచ్చట నచ్చటం జెదరినట్టిబలంబును దన్నుఁ గూడి రాఁ
జొచ్చిన; వారితో బిలముఁ జొచ్చినలాగును, గన్నలాభమున్
జెచ్చెరఁ జెప్పుచున్ బురముఁ జేరఁగఁ బోయెడునంత, ముందటన్. 154

## విప్రునకు విక్రమార్కుఁడు రసరత్నముల నిచ్చుట

చ. *వలుకనిమోముఁ దొట్రుపడుపాదములున్ వగరంపుటూర్పులున్
వలవలనైనదంతములు వంగినమేను వణంకుమస్తమున్
నిలువఁగరానియుక్కిసయు నెమ్మొయి నెక్కొను దప్పిపెంపుఁ జే
వెలుఁగునఁ జూచుచూపుఁగల వృద్ధమహీసురుఁ డమ్మహీశ్వరున్. 155

* వివర్ణమయిన.

వ. కాంచి, బహువిధాశీర్వాదంబులఁ బ్రముదితహృదయునిం జేసిన, సాహ సాంకనృపోత్తముండు కరుణాయత్తచిత్తుండై, యమ్మహీసురవరుని జరాభార దారిద్ర్యభారంబు లపనయించు తలంపునఁ, తత్ప్రయోజనంబు లెఱింగించి రస రసాయనాఖ్యరత్న ద్వయంబు నొసంగుటయును. 156

క. రససేవనంబునం దన
ముసలితనం బుడిగి, తరుణమూర్తియుతుండై
వసుధామరుఁ డింటికిఁ జని
రసాయనాన వరవిభవరమ్యుం డయ్యెన్. 157

క. మనుజేంద్రుఁడు నిజపురమున
కనురాగముతోడ నరిగె, నఖిలజనములుం
దనదానధర్మ పరహిత
ఘనసాహసనైపుణములు కఱఁక నుతింపన్. 158

వ. మఱియును. 159

పురందరుఁడను వణిక్కుమారుని వృత్తాంతము

తే. భద్రనామాభిధానుఁ డఁభద్ర సంప
దాఢ్యుఁ, డుజ్జయినీపురి నధికలోభ
గర్హితుం డైన యొకవణిగ్వరుఁడు గలఁడు
అతనికిఁ బురందరుండను సుతుఁడు గలఁడు. 160

తే. ఆపురందరుఁ డధికభోగానుభవ మ
హావిభూతిఁ బురందరు నతిశయించి
భూరివితరణశ్రీఁ గల్పభూజ శిబి ద
ధీచి ఖచర కర్ణాదుల ధిక్కరించె. 161

వ. ఇట్లు వణిక్కుమారుండు మహోదారుండై. 162

క. క క కుడువక యొరులకుఁ
బె క తమతండ్రి గూడఁబెట్టినసిరిఁ దాఁ
గ యుఁ గుడిచియు నొరులకుఁ
బె యుఁ దనయిచ్చ వెచ్చపెట్టఁ దలంచెన్. 163

క. శ్రీమంతుఁడె కులవంతుఁడు
శ్రీమంతుఁడె సుభగరూపజితకంతుఁడు సూ!
శ్రీమంతుఁడె గుణవంతుఁడు
శ్రీమంతుఁడె సిద్ధశేముషీమంతుండున్. 175

క. 1ఒడమి గలవెడఁగు నైనను
బుడమిం గలవారలెల్ల భూషింతురు, శ్రీ
పెడఁబాసిన దూషింతురు
కడుఁ బేదఱికంబుకంటెఁ గష్టము కలదే? 176

వ. కావున, నీవు మా బుద్ధులు విని, నీతివిరుద్ధవర్తనం బుడిగి కులం బుద్ధరింపు, మనిన సుజ్ఞానసుందరుండగు పురందరుండు పురాణసిద్ధంబులగు నీతివచనంబుల కార్యంబు లని నిర్దేశించి, వణిగ్వంశవర్యుల నుద్దేశించి ప్రియపూర్వకంబుగా నిట్లనియె. 177

## ధనమునకు సద్వినియోగమే ఫలమని పురందరుఁడు తెలుపుట

క. నేలం బాఁతిన, నన్యుల
పా లవు ధన, మొండె ముచ్చుపా లవు, ధరణీ
పాలునిపా లవుఁ గావున
వాలాయముఁ గుడువ విడువ వలయున్ ధనముల్. 178

క. నెఱ వగుసంపద గలిగిన
నెఱి దానం గుడువఁ గట్ట నేరనిమనుజుం,
డఱిముఱిఁ జేనికిఁ గట్టిన
వెఱబొమ్మయె కాఁడె? యెన్నివిధములఁ జూడన్. 179

క. కొలఁదికి మీఱినలక్ష్మికి
నలరెడుభోగంబె రక్ష, యారసిచూడన్
జలపూర్ణ తటాకమునకు
నలవడఁగా వాట మైనయలుఁగుం బోలెన్. 180

---

1. ధనము.

పాలసుం డగు నయ్యర్థపాలుఁ డైన
పలదు, మామాట వినవన్న చలము విడిచి. 168

తే. అలహరిశ్చంద్రుఁ డనుచితవ్యయ మొనర్చి
యాలుబిడ్డల విడిచి యంత్యజునిఁ గొలిచె,
సంచితార్థంబు నిష్ప్రయోజనము గాఁగ
నల వెలుంగక వెచ్చించునతఁడు చెడఁడె ? 169

తే. పుట్ట లిసుమంత లిడనిడఁ బొదలుచెఱఁగి
పుడుకఁ బుడుకంగఁ గాటుకపోకఁ జూచి
విత్తసముపార్జన వ్యయవృత్తులందుఁ
జిత్త మిడిన వర్తకునకుఁ జేటు గలదె ? 170

ఆ. పిల్లుగట్టు నలకుబేరుండు దానైన
నాయమునకు వెచ్చ మధిక మైనఁ
బేద యైన ధనదుపెన్నుద్దియై చను
నాయమునకు వెచ్చ మల్ప మైన. 171

క. తనయొడలం గలనెత్తురు
ధనహీనుని విడిచిపోవు, దారాది సుహ్రు
జ్జనములు విడుచుట యరుదే ?
మనుపీనుఁగు నిర్ధనుండు మదిఁ బరికింపన్. 172

క. పాసినయప్పుడు పాయుదు
రాసలఁ జేరుదురు చేరినప్పుడు చుట్టల్
డాసినచుట్టము సుమ్మీ
శ్రీసతి యెవ్వారి కైన సిద్ధము జగతిన్. 173

క. ధనమూలము జగ మంతయు
ధనవంతుని కిష్ట మగుపదార్థము లెల్లం
దనచేతిలోని వగుటను
ధన మార్జింపంగ నెవ్విధంబున వలయున్. 174

క. వరసతులఁ గవయుశక్తియు
సరసాహారములు గుడుచుశక్తియు, సిరికిం
దరమైన దానశక్తియు
నొరులకు లే వధికభాగ్యయుతులకుఁ దక్కన్. 181

క. వే మింటిదాఁకఁ బెరిఁగిన
దీమసమున నతలమునకు దిగఁబడి చనినన్
భూమి గలయంత దిరిగినఁ
దా మునుపెట్టనిది రిత్త దన కే లబ్బున్. 182

ఆ. సంపదలు తరంగసంచలంబులు, రెండు
మూఁడునాల్గుదివసములది ప్రాయ,
మాయు వరయ శారదాభ్రపటల మని
యెఱిఁగి సేయుఁడు పరహితము హితము. 183

క. ఏలా దాఁచెద రర్థము
లేలా యర్థులకుఁ బెట్ట, రేలా కుడువం
జాలరు ? నిలువదు సిరి పెను
గాలికిఁ గంపించు దీపకళికయుఁ బోలెన్. 184

క. సిరియును నాయువుఁ గడు న
స్థిరములు, జముఁ డదయుఁ, డిది మదిం దెలిసియుఁ జే
యరు ధర్మము, 'ధర్మస్య
త్వరితా గతి' యను పురాణవచనము వినరే ! 185

క. తనచేసిన పురుషార్థము
తనసొమ్ముగ నెఱిఁగి నరుఁడు దానపరుండై
యనుభవి యై మన వలదా ?
దినములచే మోసపో కతిస్థిరబుద్ధిన్. 186

క. ఇచ్చి చను నర్థ మెల్లను
విచ్చలవిడి నప్రదాత వితరణి గాఁడే

చచ్చియు విడువం డర్థము
నచ్చెరువుగ దాత లోభి యౌనో కాఁడో ! 187

వ. అని యనేకవిధంబుల దానధర్మపరోపకారంబులు సత్కర్మంబు లగుట దేటపడంబలికి, కులవృద్ధు లుపదేశించుబుద్ధులు వినక వీటింబుచ్చి, విచ్చల విడి నిచ్చలు వెచ్చంబులుసేయం జేయ, నకించనత్వంబు ప్రాపించి, క్రమ క్రమంబున నఖిలజన నింద్యమానంబుగా నిత్యాశన శూన్యంబగు దైన్యంబు వచ్చిన. వచ్చినచుట్టంబులు నెవ్వగలనొవ్వ, నొవ్వనివార లవ్వల నివ్వల నవ్వం, దల యెత్తుకొని నడవ రామికిం, దొలంగఁ ద్రోవరాని లేమికి, నొండొకయుపాయంబు మదిం దోఁపమికిం గొండొకచింతించి, ధీరతావధీ రత మందరుండగు పురందరుండు ధైర్యం బవలంబించి, సకలతీర్థదర్శ నార్థం బుజ్జయినీపురంబు వెడలి, యనేకపురవర గ్రామంబులును గిరి వన దుర్గంబులును నిర్గమించి, కతిపయ దినంబులకుం బ్రతోళికాసముత్సేధసౌధ చంద్రశాలావిలసిత లీలావతీవిలసన వియచ్చరప్రమోదంబైన మధురా పుటభేదనంబు చేరి, తదీయ విభవవిశేషంబులకుం బరితోషంబు నొంది యనంతరంబ. 188

## పురందరుని తీర్థయాత్రాగమనము

ఉ. కాశికి నేగి, యందు మణికర్ణికలోపలఁ దీర్థమాడి, వి
శ్వేశుపదాంబుజంబులకు నెంతయు భక్తి నమస్కరించి, తాఁ
జేసినకర్మబంధముల చిక్కెడలించి, విముక్తికన్యకకా
డాసెద నంచు నెమ్మనమునం బ్రమదంబు వహించి వెండియుఁన్. 189

క. చిరనిద్ర యొందుచోటుల
నరయంగా దుఃఖహేతు వనఁగాఁ బరఁగుం,
బరమానందప్రద మా
చిరనిద్రయ కాశి, నిట్టిచిత్రముగలదే ! 190

చ. చెలు వగుకాశికామహిమ చిత్రము; బెబ్బులి లేడి మ్రింగి యాఁ
కలిచెడ కెద్దుఁ బట్టఁ, బులికాటున నెద్దును నెద్దుపోటునన్
బులియు శరీరమున్ దొరఁగ బోరున లే డొకలేడిఁ బట్టుటల్
పులి పులితోలు గప్పటయుఁ బోల్పగునె ద్దొకయెద్దు నెక్కుటల్. 191

సీ. రూప మొక్కటి రెండురూపులై చెలువొందు
మూఁడుమొనలపోటుముట్టుఁ బట్టి
బాహుచతుష్కంబుఁ బంచాస్యములుఁ బూను
షణ్ముఖుపైఁ బ్రేమ సలుపుచుండు
సప్తాశ్వచంద్రు లీక్షణములుగా నొప్పు
నెనిమిదిమూర్తుల వినుతి కెక్కు
నవనిధీశసఖుం డనంగఁ గీర్తివహించుఁ
బదికొంగులైన యంబరముగట్టుఁ
తే. బదునొకండు విధంబులఁ బ్రణుతి కెక్కు
వెలయఁ బండ్రెండుగనుపులవిల్లుఁ బట్టుఁ
గర్మపాశలవిత్రవిఖ్యాతి మెఱయుఁ
గాశిలో మేను దొఱఁగినఘనయశుండు. 192

వ. అని యప్పురంబునకుం జని. 193

తే. అర్థి భాగీరథీస్నాన మాచరించి
బహుళవిశ్వేశపదభక్తి భజన చేసి
శ్రీవిశాలాక్షి దర్శించి చిత్త మలర
వప్రగోపురభైరవస్వామిఁ గొలిచి. 194

వ. మఱియుఁ దత్తదుచితకరణీయంబు లనుసంధించి యప్పురంబు వెడలి
గయా ప్రయాగప్రభృతి పుణ్యభూములం దిరిగి, దక్షిణదిశాభాగ భాగ
ధేయంబులగు పుణ్యతీర్థంబులు నిరీక్షించునపేక్షం దిరిగి, శ్రీపర్వతదర్శ
నంబు సేయం బూని. మహాయుగసహస్రానశ్వరంబగు నేలేశ్వరంబను
తదీయపశ్చిమద్వారంబుచెంగటి యోగిపుంగవహృదయంగమంబగు నివృ
త్తిసంగమంబునకుం జని. 195

చ. దురితనివృత్తికై వినయదోహలవృత్తి, నివృత్తిసంగమే
శ్వరు నిఖిలేశ్వరుం ద్రిపురసంహరు హైమవతీమనోహరున్
హరికమలాసనాదివరదాభయపాణిఁ ద్రిశూలపాణి శం
కరు నసుహృద్భయంకరుఁ ద్రికాలముఁ బూజయొనర్చి. పిమ్మటన్. 196

వ. అటఁ జని చని.

## శ్రీశైల మల్లికార్జున క్షేత్ర ప్రశంస

ఉ శ్రీలలితుండు దానగుణశీలి పురందరుఁ, డంతఁ గాంచె శ్రీ
శైలము, రుగ్జరామరణసంక్షయకారిఫలౌషధీలతా
జాలము, సార్వకాలికవసంతనితాంతలతాంతవిస్ఫుర
త్సాలము, సానుసంగతలసన్మణిదీప్తదిగంతరాళమున్. 198

వ. కని, మహోత్కర్షహర్షభర విగళదశ్రుపూరపరిపూరిత లోచనయుగళుండును, సముదీర్ణసంకీర్ణసముత్పులకాంకురప్రపంచ కంచుకితశరీరుండును, నిరంతరానందరసభరితాంతరంగుండునునై, సర్వాంగసంగతమహీతలంబులగు సాష్టాంగదండప్రణామంబు లాచరించి లేచి, యంజలిపుటంబు నిటలతటంబున ఘటియించి, బహువిధంబులఁ బ్రస్తుతించుచు నమ్మహామహీధరంబు నారోహణంబుచేసి, శశిశేఖరదర్శనపూర్వకంబుగా నపూర్వలక్ష్మీసుందర మణికందరమధ్యభాగస్థిత మహాదేవమందిరముఖ మండపంబుం బ్రవేశించి. 199

ఉ. ముందటఁ గాంచె నాశుభసముజ్జ్వలమూర్తి పురందరుండు, ని
ష్యందకృపాతరంగముఁ, బిశంగకపర్దసురంగము, న్విని
ష్యందితభక్తలోకహృదపాంగము, సుందరరత్నకందరా
మందిర మల్లికార్జునసమాహ్వయజృంభితసిద్ధలింగమున్. 200

క. కని, వినయంబున సాష్టాం
గనమస్కృతు లాచరించి, కరపుట మలికం
బునఁ జేరిచి, యిట్లని వా
రనివేడ్క నుతించె భక్తిరసతన్మయుఁడై. 201

తే. దేవ, శ్రీమన్మహాదేవ, దేవదేవ
నాగమణిహార, కృష్ణవేణావిహార
సత్కృపాపాంగ, శాంభవీసంగతాంగ
పాలితాఖిలజగదీశ, పార్వతీశ ! 202

క. ఆశాలతాలవిత్రక
యాశాధిపమకుటమణిసమభ్యర్చితశో
భాశోభితపదపంకజ
శ్రీశైలగుహావిహార, సింహాకిశోరా ! 203

క. శరణాగతభయహరణా
పురదానవహరణ, భూరిభుజగస్ఫురణా,
గురుకరుణాంతఃకరణా
సరసిజభవవినతచరణ, చంద్రాభరణా ! 204

క. శైలాసనానుసంగత
కేళీవనకేళిలోల, కిన్నరనారీ
లీలాగీతరసప్రియ
శైలసుతానందజలధిసంపూర్ణశశీ ! 205

వ. అని స్తుతించుచు, సవ్యాపసవ్యాంగప్రదక్షిణంబులును, సాష్టాంగదండ ప్రణామంబులు ననేకంబు లాచరించి, మహోపచారంబులు సమర్పించి, యనంతరంబ కోటపీఠేశ్వర దేవాయతనంబునకుం జని. 206

క. సాష్టాంగనమస్కారము
లష్టోత్తరశత మొనర్చి, గణాదేవునిపై
దృష్టియుఁ జిత్తము నిడి, వి
స్పష్టముగా భక్తితోఁ బ్రశంస యొనర్చెన్. 207

## శ్రీమదహోబల పుణ్యతీర్థ ప్రశంస

చ. ఒనరిచి, యావణిగ్జనకులోత్తముఁ డాగిరిమీఁద డిగ్గి, తాఁ
జని చని ముందటం గనియె సాల రసాల తమాల కుంద చం
దన హరిచందన క్రముక దాడిమ నింబ కదంబ పాటలీ
పనసవనీ కృతార్థమును భాస్వదహోబలపుణ్యతీర్థమున్. 208

క. కని, దానిమహత్త్వమునకు

పేర్కొనుచుం జని భవనాశనిఁ
గని తజ్జలమజ్జనాపకల్మషుఁ డగుచున్. 209

ఉ. కాంచెఁ బురందరుం డెదురఁ గన్నులపండువుగా, సమాధిని
శ్చంచలసత్స్వభావ దివిషన్మునిరాజమనస్సరోజ లీ
లాంచితరాజహంసు, సుజనావన దేవశిఖావతంసునిం,
బ్రాంచితఘోరవీరరసభావుని, శ్రీనరసింహదేవునిన్. 210

క. కని, దండనమస్కారము
లొనరించుచు, భక్తిరససముత్సాహమునం
గొనియాడుచుఁ దళుకొత్తెడు
ననురాగముతోడ జయజయధ్వను లెసఁగన్. 211

ఉ. శ్రీమదహోబలేశ్వరుఁ డశేషజగన్నిధి, భక్తలోకచిం
తామణి, వైరిదానవవిదారణదారుణనారసింహలీ
లామహనీయమూర్తి, కమలారమణీరమణీయుఁ డబ్జజేం
ద్రామరబృందవంద్యుఁడు, నిజాశ్రితలోకముఁ గాచుఁ గావుతన్. 212

వ. అని కీర్తించి, పురందరుండు పురాణసిద్ధంబగు సిద్ధపట్టణస్థానంబునకుం
జని. 213

## సిద్ధపట్టణ సిద్ధేశ్వర ప్రశంస

క. మున్నొనరించినపాపము
లన్నియుఁ బెనువఱుతఁగలయు నవగాహన సం
పన్నుల, కని సద్భక్తిని
బెన్ననదిం దీర్థమాడి ప్రీతి దలిర్పన్. 214

వ. సిద్ధేశ్వరునగరు సొచ్చి. 215

క. కని, సాష్టాంగనమస్కృతు
లనేకమొనరించి, ముకుళితాంజలియై భ
క్తి నుతించెఁ దనమనమ్మున
ననురాగరసంబు నిండి, యలుపులువాఱన్. 216

వ. ఇవ్విధంబున నప్పరమేశ్వరుం బరితుష్టహృదయునిం గావించి. తదీయాయతనశిఖర మహోన్నత ధ్వజ ప్రదక్షిణపరిణద్ధ మహోత్సవసమయ సమాగత భ్రమరరూప దివ్యసంయమిసముదయంబును నక్షీణపరమ తపోధన ప్రత్యక్షపరంజ్యోతిస్స్వరూపంబును నద్భుతాయత్తచిత్తుం డయి యవలోకించి, దక్షిణకైలాసం బనం బ్రశస్తి వహించిన కాళహస్తి మహాస్థానంబును, ననంతభోగికటకోత్కటకంబగు వేంకటాచలంబును, సర్వలోకలోచన సముత్సేధసౌధగోపురంబగు కాంచీపురంబును, ననవరతపరిస్ఫుటకావేరీసముత్సంగంబగు శ్రీరంగంబును, నక్షీణదురితాక్షేపణప్రారంభధురీణంబగు కుంభఘోణంబును, శ్రీరామప్రతిష్ఠాభిరామంబగు రామేశ్వరంబును, జననిరీక్షణాపేతదుష్కర్మబంధంబగు సేతుబంధంబును, సందర్శనసంచలీకృతజగజ్జనసయనంబగు ననంతశయనంబును జూచి, యుత్తరేశ్వరదిశాభిముఖుండై, మోక్షదానదీక్షాసమక్షంబగు విరూపాక్షంబునకుం జని. 217

### శ్రీ విరూపాక్ష క్షేత్ర ప్రశంస

ఉ. లోలతఁ గాంచె నాసుగుణలోలుఁడు, చారుశిలాగళజ్ఝరీ
జాలతటీప్రవాళఘనసత్తరువాటముఁ బార్శ్వతుంగభ
ద్రాలహరీవినోదవిహారజ్జలశీకరనిర్గతశ్రమో
ద్వేలహరప్రణామమతిదీపితకూటము, హేమకూటమున్. 218

వ. కని, యటఁజని తదగ్రభాగంబున. 219

ఉ. ఇక్షుధనుర్విపక్షుని, రవీందుకృశానుని, సర్వదేవతా
ధ్యక్షుని, నాదిభిక్షుని, హతప్రతిపక్షుఁ, గృతాంతదంతివా
ర్యక్షు, మహాముముక్షుశరణాగతరక్షణదక్షు, [1]శ్రీవిరూ
పాక్షుని, నానతేంద్రకమలాక్షునిఁ గాంచెఁ గృపాకటాక్షునిన్. 220

చ. కని, యతిభక్తిపూర్వకముగా ధరఁ జాఁగి నమస్కరించి, లే
చి నిలిచి ఫాలభాగమునఁ జేతులు సేరిచి, సమ్మదాశ్రువుల్

---

1. శ్రీవిరూపాక్షుని, నానతేంద్రకమలాక్షునిఁ గాంచెఁ-అని వావిళ్ల. 1926.

కనుఁగవఁ దొంగలింపఁ, బులకమ్ములు నంగము విస్తరింప, న
త్యనుపమలీలతోడఁ గొనియాడెను భక్తిరసార్ద్రచిత్తుఁడై. 221

శ్లో. భజతభవభుజఙ్గం, పాణిపేలాకురఙ్గం
ప్రమదహృదయసఙ్గం, బాలచన్ద్రోత్తమాఙ్గమ్
పరమకుటపిశఙ్గం, వాసకైలాసశృఙ్గం
జితమదనదపాఙ్గం, శ్రీవిరుపాక్షలిఙ్గమ్. 222

శ్లో. స్మరత సదమలాఙ్గం, మౌళిగఙ్గాతరఙ్గం
సదయ లసదపాఙ్గం, శైలజాత్మాబ్జభృఙ్గమ్
నయనవిధుపతఙ్గం, నాగభూషోజ్జ్వలాఙ్గం
త్రిపురదనుజభృఙ్గం, శ్రీవిరూపాక్షలిఙ్గమ్. 223

శ్లో. నమత సుమతిసఙ్గం, నాట్యలీలాప్రభఙ్గం
కరధృతశయనాఙ్గం, కాలకూటాభిషఙ్గమ్
నిగమతరువిహఙ్గం, నిత్యయుక్తాన్తరఙ్గం
సితభసితసురఙ్గం, శ్రీవిరూపాక్షలిఙ్గమ్. 224

వ. అని యిట్లు స్తుతిపూర్వకంబుగాఁ బరమేశ్వరుం బరమానంద భరితాంతః
కరణుంగావించి, యనంతరంబ స్వదేశగమనచింత యంతరంగంబుపట్టు
దవిలిన, నప్పట్టు గదలి పురందరుండు. 225

## పురందరుఁడు తీర్థయాత్ర ముగించి నిజపట్టణముఁ జేరుట

క. పుట్టినపెరిగినదేశం
బెట్టిజనులకైనఁ జూడ నిచ్చగుటను, నే
పట్టునఁ గాలూఁదక నిజ
పట్టణమున కరుగుదెంచి, పార్థివుఁ గాంచెన్. 226

చ. కని, ప్రణమిల్లి, సేమ మడుగంబడి, వైశ్యుఁడు తాను బోయి వ
చ్చినకథ యెల్లఁ దెల్లముగఁ జెప్పిన, రాజు రసైకలోలుఁడై
విని, యట నీవు గన్నవియు విన్నవిఁ జోద్యము లెవ్విఁ గల్గిన
న్మన మలరంగఁ జెప్పు, మనినన్ వినయం బెసఁగంగ నిట్లనున్. 227

క. ధరయెల్లఁ దీర్థసేవా
పరతమెయిఁ బరిభ్రమించి, బహువిధవిభవ
స్ఫురణ విలసిల్లుమథురా
పురి కేఁ జని, యందు నొక్కభూసురునింటన్, 228

వ. కృతశయనుండనై యున్న, నిశాసమయంబున నప్పురోపకంఠంబునందు, వితతనిర్ఘాతపాతంబులగు కశాఘాతంబులకుం గా కాతురయగు నొక్క కాంతయార్తనాదంబు కర్ణగోచరం బగుటయు; నత్తెఱం గందులగృహమేధిం బ్రబోధించి యడుగుటయు, నతం డిట్లనియె. 229

ఉ. ఏమినిమిత్తమో యెఱుఁగ. మీపురిచేరున బిల్వవాటికా
సీమఁ బ్రతిక్షపంబు, సరసీరుహలోచనయోర్తు దానవ
స్తోమకశాభిఘాతములఁ దోరపువేదన నైఁపలేక యు
ద్దామత నార్తనాదపరతం బ్రలపింపఁగ విందు మెప్పుడున్. 230

క. అనియె, నని విన్నవించిన
విని, యత్తెఱఁగెల్ల నెఱుఁగువేడుక మదిలో
జనియించి, వైశ్యయుతుఁడై
మనుజాధీశుండు చనియె మథురాపురికిన్. 231

విక్రమార్కుఁడు పురందరయుతుఁడయి మథురపురి కేఁగుట

క. అందుఁ బురందరదర్శిత
మందిరమున విశ్రమింప, మధ్యమనిశయం
దిందుముఖియార్తనాదము
నందంద వినంగఁబడియె నధిపతి, కంతన్. 232

వ. వినంబడినయాధ్వనియెఱుంగుచక్కటికిం జని. 233

ఆ. కనియె నృపుఁ డఖర్వగర్వాంధదైతేయ
ఘనకశాభిఘాతకాతరాత్మఁ
దీవ్రవేదనాప్రదీపితార్తస్వన
నిబిడితాస్య నొక్కనీరజాస్య. 234

క. కనుఁగొని, వెఱవకు వెఱవకు
మని యూఱడఁ బలికి సతికి నభయప్రదుఁడై,
మనుజేంద్రుఁడు గర్వితుఁడై
దనుజేంద్రుల కనియె సత్త్వదగ్రస్ఫురణన్. 235

## రాక్షసులను సంహరించి విక్రమార్కుఁడు కమలావతిని రక్షించుట

ఉ. ఓరి దురాత్ములార! దళితోత్పలలోచన నేల యీక్రియన్
ఘోరకశాభిఘాతములఁ గుందఁగఁ జేసెద, రింత కోర్తురే
యారయఁ బుష్పకోమల? లహంకృతు లిం కిట మాన కున్న, మ
ద్ఘోరకరాసిపత్త్రికి మునకున్ బలిసేయుదు నీక్షణంబునన్. 236

వ. అనిన నన్నిశాచరులు సాహసాంకునకు నిట్లనిరి. 237

సీ. కైకొందు మమరేంద్రుఘనరాజ్యపదరమా
ధీనత నేకధాటీనిరూఢి,
దండింతు మతిదుర్మదస్ఫూర్తి నంతకు
నిజభుజాగర్వంబు నిమిషమాత్ర,
భంజింతు మపరదిక్పాలకుచతురంగ
బలగర్వములు తృణప్రాయములుగ,
హరియింతు మే ముత్తరాధీశపాలిత
నవనిధానములు ప్రాభవ మెలర్ప,

తే. నంతలేని మహాత్ముల నింతసేయు
మాకు, నిను సంహరించుటమాత్ర మెంత?
'యెందు గుడిమ్రింగువారికి నంది పిండి
పడియ' మనువ ట్లుఁగవే పుడమిలోన! 238

చ. అనవుడు, మందహాసరుచి యాననపద్మమునం దలిర్పఁ జ
య్యన నిశితాసిపత్త్రిక కరాంబురుహంబున సంతరించి, య
ద్దనుజబలంబుపై నడచె, దారుణవారణసైన్యయోధమ
ర్దనవిభవాభిరాముఁ డగు రామనృపాలునిఁ గ్రేణిసేయుచున్. 239

క. సురరిపులుఁ బ్రాస పట్టిస
పరిఘ క్షుర చర్మ బాణ బాణాసన తో
మర ముఖ్యసాధనంబులు
కరముల విలసిల్లఁ గదనకాంక్షితమతులై. 240

వ. మార్కొనుటయుఁ బ్రతాపార్కుండైన విక్రమార్కుండును. 241

ఉ. కొందఱకంఠదేశము లకుంఠితశక్తి మెయిన్ హరించుచుం,
గొందఱ రక్తమాంసములు కుంభినికిన్ బలిగా నొనర్చుచుం,
గొందఱ గాత్రఖండములు కుప్పలు సేయుచు, దైత్యకోటిఁ దా
నందఱ సంహరించె విలయాంతకుభంగి నరేంద్రుఁ డుగ్రతన్. 242

వ. ఇత్తెఱంగున లబ్ధవిజయుండై, యక్కామినీరత్నంబు నత్యాదరంబునం
గనుఁగొని. 243

## కమలావతియను నచ్చరలేమ వృత్తాంతము

క. ఎయ్యది నీవుండెడు నెల
వెయ్యది నీనామ, మిప్పు డీయసురులచే
నియ్యలజడిఁ బడఁ గారణ
మెయ్యది ? యనవుడు లతాంగి యిట్లని పలికెన్. 244

క. అమరావతిఁ గలవేలుపుఁ
గొమిరెలలో నెల్ల, రూపగుణశీలములం
గొమరారుదు, నానామము
కమలావతి, మీఁదికార్యగతి విను మధిపా ! 245

క. అవిరళసమాధియుతుఁడై
భువనత్రయభయదభంగిఁ బూనినయుగ్ర
శ్రవసునితపంబు, వృద్ధ
శ్రవసుఁడు మాన్పంగ మది విచారించి వెసన్. 246

వ. తదీయనియతిప్రతివిధానంబునకు నాజ్ఞాపించినం దదనుజ్ఞ గైకొని తపో
వనంబునకుం జని. 247

మ. వినఁ జూడం గొఱగానిచేష్టలఁ దపోవిఘ్నంబు గావింపఁ బూ
నినదోషంబున, భీషణాసురకశానిర్ఘాతపాతవ్యథా
జనితాక్రోశరవంబుతోడ, మథురాసామీప్యబిల్వాటవీ
వనికాసీమఁ బ్రతిక్షపంబు తరుణీ! వర్తింపు దీనాస్యవై. 252

క. అనుడును, శాపాలాపము
లనుతాపము సేయ, మునికి సాష్టాంగముగా,
వినతి యొనరించి, యెంతయు
వినయంబున శాపముక్తివిధ మడుగుటయున్. 253

మ. క్షితిసంరక్షణ మాచరించుటకునై, శ్రీకామినీనాయకుం
డతులోదారుఁడు విక్రమార్కుఁ డన బ్రహ్మక్షత్త్రితేజోమయా
కృతి నావిష్కృతి నొందువాఁ, డతనియంగీకార మీశాపదు
ష్కృతికి న్నిష్కృతి సేయుఁ బొమ్మని కటాక్షించెం బ్రసన్నాత్ముఁడై. 254

క. ఆమునిశాపానుగ్రహ
సామర్థ్యమువలన నసురజనితవ్యథయున్
భూమీశ! యిట్లు పొరలఁగ
నీ మహిమ విముక్తి గలిగె నిది విదితముగన్. 255

వ. అని వినిపించి కమలావతీవధూరత్నంబు. 256

క. దానసమగ్రత వేలుపు
మానికముం బోలుననుచు, మహనీయమణిం
గానుక యిచ్చి, నరేంద్రుని
వేనోళ్లం బ్రస్తుతించి, వీడ్కొని చనియెన్. 257

మ. ధరణీశుండును వీడుపట్టునకు నుద్యత్ప్రీతి నేతెంచి, య
త్తరుణీరత్నముశాపముక్తికిని జిత్తంబందు హర్షించుచుం,
దరుణాదిత్యప్రభన్ వెలుంగు సురకాంతాదత్తరత్నంబు స
త్కరుణన్ వైశ్యున కిచ్చెఁ దద్వితరణౌదార్యంబు నగ్గించుచున్. 258

సీ. బద్ధసిద్ధాసనపరిణతిఁ గూర్చుండి
హృదయసమాధాన మొదవఁజేసి
మూలాలవాలసమున్నతిఁ గైకొని
యనిలు మధ్యమనాడియందు నిలిపి
యంతర్గతములైన యాఱుదామరలకు
నభినవోల్లాసంబు ననునయించి
యాంతరజ్వలనసంక్రాంతిచేఁ దొరఁగెడు
చంద్రకళాసుధాసారధారఁ
తే. దడిసి, యాత్మానుసంధానతన్మయత్వ
నిశ్చలాంతరంగుం డయి, నిస్తరంగ
నీరనిధియును బోలె నొప్పారుచున్న
మునివరేణ్యునిఁ బొడగంటి, మనుజనాథ ! 248

వ. కని, సభక్తికంబుగా దండనమస్కారంబు లాచరించి, పుష్పాపచయవ్యాజంబున సఖీజనసమాజంబుతోఁ దత్ప్రదేశంబున. 249

సీ. నవలతాడోలనోత్సవకేళినెపమున
సరససంగీతమాధురి నటించి
చతురచిత్రకథాప్రసంగంబునెపమునఁ
బరిహాసభాషణప్రౌఢి సూపి
ప్రమదనర్తనకేళిబాహాసముల్లాస
సరసతఁ జాతుర్యసరణిఁ దెల్పి
పలుమాఱు నేమేనిఁ బరికించువిధమునఁ
గలికిచూపులమించు చిలికి చిలికి
తే. చెలఁగి యిట్లేము చేసినచేఁత లెల్ల
మునితపోభంగ మొనరించుననువు దక్క
యప్రయోజనచతురంబులై తనర్చె
వనమహీసాంద్రచంద్రికావలులకరణి. 250

వ. అంత నంతరాత్మధ్యానావసానసమున్మీలితనేత్రుండై, యమ్మహాసంయమీంద్రుండు, తనవిజ్ఞానప్రభావంబున నన్నెఱింగి, యవలోకించి. 251

వ. ఇత్తెఱంగున లబ్ధవిజయుండై, యమూల్యవస్తుప్రదానవర్ధితపురందరుం డగు నన్నరేంద్రపురందరుండు పురందరసహితుండై యుజ్జయినీపురంబునకు వచ్చి, నిరంతరౌదార్యంబును, బరమసాహసకార్యంబును, దనకు నియతకార్యంబులుగా సప్తసాగరపరివృత విశ్వవిశ్వంభరాభరణపరాయణుండై మఱియును. 259

శా. శ్రీమద్వెల్లముకొండభైరవకృపాశ్రీనిత్యసామ్రాజ్యల
క్ష్మీమాధుర్యగృహాంతరాంతరసదాకేళీనటన్నందన
స్తోమాశేషవిశేషరత్నకలికాకుంభద్విభూషావలీ
సామగ్రీకృతలోచనోత్సవలసత్సౌభాగ్యభాగ్యోదయా! 260

క. రామాకరచామీకర
చామరసంజాతవాతచంచలదలక
స్తోమాభిరామసుమహిత
రామాయణసుప్రలాప రసికకలాపా! 261

ధృ తి య ను వృ త్త ము

ప్రతాపగుణభూషణా, పరహితార్థసంభాషణా
వితీర్ణిరవినందనా, విభవనూత్నసంక్రందనా
శ్రుతిస్మృతివిచక్షణా, సుకృతకీర్తిసంరక్షణా
క్షితీంద్రసుతవర్తనా, శివపదద్వయీకీర్తనా. 262

గద్యము ఇది శ్రీమఖిలకవిమిత్త్రి పెద్దయయన్నయామాత్యపుత్త్రి శారదా
దయావిధేయ జక్కయనామధేయప్రణీతంబైన విక్రమార్క
చరిత్రం బనుమహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

తే. మలయపవనుండు పలుమాఱు మలయకుండ
నలరుటింటిగవాక్షంబు లరసి యరసి
యెందుఁ గందర్పతాపంబు డిందుపడమిఁ
జెలువ నీరాక మది నపేక్షించుచుండె. 162

క. ఆవేళఁ దిభాగ్యదేవత
యావిర్భావంబుఁ బొందిన, ట్లిచ్చటికిన్
దేవర విజయంచేసిరి
గావునఁ దత్తపముఫలము గానఁగవచ్చెన్. 163

క. ముట్టడి మాన్పి విదర్భకుఁ
బట్టముగట్టితి విదర్భపతి, నతనిసుతం
గట్టుము మరురాజ్యమునకుఁ
గట్టిగఁ బట్టం, బవశ్యకర్తవ్య మగుణ. 164

క. ననుఁ బాసి యొక్కనిముసము
తనయంతన యుండ దావిదర్భేశ్వరునం
దన, నేను నట్లకావున
నను ననుపఁగ, నవధరింపు నయతత్త్వనిధీ! 165

వ. అని విన్నవించుచకోరికం గనుంగొని, సాహసాంకనరేంద్రచంద్రుం డిట్ల
నియె. 166

ఉ. నారదమౌనిచేత నొకనాఁడు వినోదముపోలె విన్నమీ
నీరజనేత్రసోయగము, నేఁడును నామదిఁ బాయదన్న, ని
చ్చారతిఁ గూడిమాడి యనిశంబును నొక్కెడ నున్నయట్టినీ,
కారమణీవియోగమున కాత్మ యొడంబడునే చకోరికా! 167

చ. అని సరసప్రసంగముల నమ్మదిరాక్షిని గారవించి, కాం
చనమణిభూషణావళు లసంఖ్యము లిచ్చి, ప్రియంబు మీఱఁగా

శ్రీ ర స్తు

# విక్రమార్క చరిత్రము

## తృ తీ యా శ్వా స ము

శ్రీకంఠకంఠనీల
ప్రాకామ్య ప్రశమనప్రభాసితకీర్తీ !
శ్రీకాంతాధిప, విద్యా
సాకల్యవివేకనిపుణ జన్నయసిద్ధా ! 1

ఆ. మథురనుండి వచ్చి మదనరేఖాసూనుఁ
డన్నరేంద్రుఁ గాంచె నర్థ్యాభంగి
నిరుపమాన యైననిజలతాంగి యనంగ
నేనతోడ నాత్మ నేనతోడ. 2

క. ఆభర్తృహరి నపార కృ
పాభావన విక్రమార్కపతి పాలింపం
బ్రాభవమునఁ గార్యరమా
వైభవుఁడై ప్రతిదినప్రవర్ధన మొందెన్. 3

క. తద్రాజ్యమ్మున నధిక ద
రిద్రుం డగువిప్రుఁ డొకఁడు, శ్రీకాంతు మహేం
ద్రాద్రిపయిఁ దపము సేయఁగ
రుద్రుఁడు ప్రత్యక్షమయ్యె రుచిరాకృతియై. 4

తే. ఇట్లు ప్రత్యక్షమై నీయభీష్ట మెద్ది
వేఁడు మిచ్చెద ననిన, నవ్విప్రవరుఁడు
సచ్చిదానందనిశ్చలస్వాంతుఁడై, ని
జాయురభివృద్ధి యగు వర మడుగుటయును. 5

ఉ. ఒక్కఫలంబు చేత నిడి, యుత్తమ మీఫల మేకభక్ష్యమై
మిక్కిలి యాయు విచ్చు, నిది మృత్యుహరం బటుగాక తక్కినన్
ఒక్కఫలంబునుం గలుగకుండుఁ జుమీ యని యానతిచ్చి తా
గ్రక్కున రాజతాద్రిమణికందరమందిరసీమ కేగినన్. 6

ఉ. భూసురవర్యుఁడున్ ఫలముఁ బొంది మహాప్రమదంబు నొంది, యా
వాసముఁ గూర్చి వచ్చి, నిజవల్లభ కత్తెఱఁ గెల్లఁ జెప్పినన్
గాసిలి భర్తవంకఁ గొఱగాములు పల్కి 'యిదేమి సిద్ధి' యా
భానున కేల చొప్పడుఁ దపఃఫలసంచితభాగ్యసంపదల్ ! 7

ఉ. లేమిఁ దొలంగఁ ద్రోవఁగ నిలింపశిఖామణి నార్తలోకర
క్షామణిఁ గోరి ఘోరతరకాననభూమిఁ దపం బొనర్చి, నీ
వేమిఫలంబు వేఁడితి ? వభీష్టఫలం బిది నిష్ఫలంబు, ని
న్నేమనుదాన ! నింక నెటు లే మనుదాన మహాదరిద్రతన్. 8

వ. అని యత్యంతచింతాక్రాంత యైననిజకాంతం జూచి, యమ్మహీసురోత్త
ముండు దన చిత్తంబున. 9

ఉ. నిక్కమ యట్ల లేమిఁ గడు నివ్వెఱ నివ్వర మేల వేఁడితిం
దక్కక యేను శంకరు, నతం డిది యేటికి నిచ్చె, నాతలం
పెక్కడ వమ్మునం గలసె, నేమిటికై తపమాచరించితిం,
బెక్కుదలంపు లేల నిఱుపేదల కబ్బునె యిష్టసంపదల్ ? 10

చ. ఇదిగొనిపోయి భర్తృహరి కిచ్చెద, నిచ్చిన నాతఁ డాయుర
భ్యుదయముఁ బొంది యుండు నది యొప్పదె, దాతలు వృద్ధిఁబొందఁగా
మదిఁ దలపోయునాశ్రితసమాజము నొందదె యిష్టసంపదల్,
హృదయ మెలర్ప నిట్టిఫల మిచ్చిన, నిచ్చునతం డభీష్టముల్. 11

చ. అని తలపోసి, భర్తృహరి నంచితకీర్తినిధానుఁ గాంచి, యా
వినుతఫలప్రభావము సవిస్తరతం దగ విన్నవించి యి
చ్చిన, నతఁ డిచ్చె విప్రున కచింత్యము లైన ధనంబు లిమ్ములం,
*దనపురి కేగి యాతఁడు ముదంబున నుండె రమాసమగ్రతన్. 12

---

* దనపురి కేగెఁ గైకొనుచుఁ దద్ధన మంతయు వేడ్కమీఱఁగన్.
అని పాఠాంతరము.

వ. అమ్మదనరేఖానందనుండును దనసమీపంబున సమాసీనయైన యనంగసేనం గనుంగొని.

క. కూరిమి మీఱఁగఁ జేరం
జేరిచి, సర్వజ్ఞకరుణఁ జేరె నటంచున్
ధారుణిసుపర్వుఁ డొసఁగె, న
పారతపోలబ్ధ మైనఫల మిది మనకున్. 14

[1]క. నరుఁ డొకఁ డిది సేవించిన
మరణజరాదులు దొఱంగి మను సంపదలన్
అరు దిట్టిఫలము, గన నీ
పరిపక్వఫలంబు భాగ్యఫలము లతాంగి! 15

క. కావున నాకుఁ బ్రియంబుగ
నీ వీ ఫల మనుభవింపు, మిదె కొమ్మని సం
భావన నిచ్చినఁ గొని చని
యావనితయు నిచ్చెఁ గూర్చుహయపాలునికిన్. 16

క. అమ్మందురకుఁడుఁ దద్గృహ
సమ్మార్జన కిచ్చె, సంతసంబున నదియున్
గ్రమ్మన గోపున కిచ్చెఁ, బ్రి
యమ్మున వాఁడును గరీషహారిణి కిచ్చెన్. 17

ఆ. ఆలమందనుండి యది మఱునాఁడు ప్ర
త్యూషవేళఁ దాఁ గరీషపూర్ణ
వేణుపాత్రమీఁద వెలయఁ బండిడుకొని
యాత్మగేహమునకు నరుగునపుడు. 18

---

1 క. హరుకృపఁ గలిగినయది యిది
ధరణీదేవుండు మనకు దయచేసినవాఁ
డరు దెం దియ్యరుఫల మీ
పరిపక్వఫలంబు భాగ్యఫలము లతాఁగి. అని పా.

వ. సకలసైన్యసమేతుండై వాహ్యాళివిహారంబున కరుగుచున్నభర్తృహారికిం
దత్ఫలంబు దృష్టిగోచరం బగుటయు. 19

ఆ. దానిఁ జేరఁ బిలిచి, తత్పాత్రలోనున్న
పండు పుచ్చుకొని యతండు నగుచు.
వెండి యొక్కపండు విప్రుఁ డెప్పుడో తెచ్చి
తనకు నీక, యమ్మికొనియె ననుచు. 20

ఉ. అప్పుడు విప్రు రాఁ బనిచి యవ్విభుఁ డిట్లను, రెండుపండ్లు నీ
వప్పరమేశుచేఁ బడసి యందొకఁ డిచ్చి యొకండు దాఁచుకో
నిప్పుడ కానవచ్చెఁ, జనునే యిటు వంచనసేయ ? నన్న వా
*తప్పక యాఫలంబె, వసుధావర దీనికి నెట్లు చేరెనో ! 21

వ. అనిన విని యన్నరేంద్రుండు. 22

క. గోమయహారిణిఁ గనుఁగొని
యేమిగతిన్ దొరకెనీకు నీఫల ? మనుడున్
ఆమగువ దెలుపఁ గ్రమమున
నామర్మము దెలిసెఁ దత్తదంతరసరణిన్. 23

వ. అత్తెఱం గంతయుఁ గరతలామలకంబుగా నెఱింగి. 24

క. తనప్రియకాంత యొనర్చిన
యనుచితకర్మశిఖ, యంతరంగము నంగం
బునఁ బరితాపము సేయఁగ
వనజాతేక్షణల రోసి, వసుధేశుఁ డనున్. 25

†మ. హరిణీలోలవిలోచనామధురలీలాలాపరీతుల్, మనో
హరకేళీనవరూపయౌవనమదవ్యాపారముల్, రాగసా
గరనిర్మగ్నులఁ జేయవే మగలఁ ! దత్కౌతూహలంబు న్మదో
ద్ధురదంతిశ్రవణానిలం, బని తలంతు ర్గాదె మేధానిధుల్. 26

---

* తప్పక తత్ఫలం బొకటి తప్పదు లే దితరంబు నావుడుఁ. అని పా.

† మ. కరకాబద్ధసురాలయంబులు, మహాకాండోపరిం జిత్రతా
స్ఫురణల్, స్వప్నసువస్తులబ్ధినిరతుల్, కుంభత్ఫలాలేపముల్
కరికుంభస్తనిచిత్తవృత్తములు, దత్కౌతూహలంబు న్మదో
ద్ధురదంతిశ్రవణానిలం బని తలంతుం బూర్వవాక్పద్ధతిన్. అని పా.

క. గురుపాతకములగురువులు
పురుషులునరకములు చేరఁబోయెడు తెరువుల్
పరిభవము నసుఁగుఁబోరువులు
తరుణుల మైసిరుఁజయురులు తగునచ్చెరువుల్. 27

క. జాతులు నాతుల కెందున్
నీతము లేనిక్కుఁ 'గామినీలోకానాం
జాతిఃప్రకల్పితా' యను
నీతి పురాతనమె కాక ! నేఁటిదె యరయఁగా. 28

ఉ. మక్కువ తీపులుట్టిపడుమాటలుఁ, జొక్కుల తేలగింపులుం
ద్రెక్కొను చూపు, లాసతరితీపులు, కోరిక లార్తియారికల్
మ్రొక్కులు కూర్మిచిక్కు, లతిమోహ మపోహము, రూపశీలముల్
తక్కులయాలవాలములు, దాయదురే తరుణీజనంబులన్ ? 29

ఆ. అని తలంచి, భర్తృహరి విరక్తివహించి
యోగమార్గసంప్రయోగమునకు
ధరణివిభునిచేతఁ దగ ననుజ్ఞాతుఁడై
యేగుచుండి, యతని కిట్టు లనియె. 30

## భర్తృహరి విక్రమార్కునకు బహుశ్రుతుఁడను మంత్రి వృత్తాంతము చెప్పుట

క. కృతయుగకలియుగములలో
మతిఁ దలఁపఁగఁ గలియుగంబ మానితధర్మ
స్థితి నెక్కుడు, భవదవన
వ్యతికరమున సాహసాంక వసుధాధీశా ! 31

క. తనబుద్ధి యొక్కకన్నును
నొనరినహితమంత్రిబుద్ధి యొకకన్నునుగాఁ
గని సంచరింప నేరని
జననాథుని జగము దెగడు జాత్యంధునిఁగాఁ. 32

తే. మహితమతిబహుశ్రుతుఁడనుమంత్రియొకఁడు
తనవిభుఁడునందుఁడనఁబడుధరణిపతికి

బ్రహ్మహత్యవచ్చిన నది పరిహరించె
బతికిఁ గడుమంత్రికంటెను హితుఁడు గలఁడె ? 33

క. నావుడు నందమహీపతి
కేవెరవున బ్రహ్మహత్య యేతెంచెఁ ? దుదిన్
శ్రీవిలసితుఁడు బహుశ్రుతుఁ
డేవెరవునఁ బరిహరించె నెఱిఁగింపు తగన్. 34

వ. అనిన నతం డతని కిట్లనియె. 35

క. లాలితమణిమయగోపుర
సాలప్రాసాదసదనసంశోభితమై
భూలోకనాక మనఁగ, వి
శాలాపుర మొప్పు విబుధసంభావితమై. 36

క. ఆ నగర మేలు నందుఁడు
భానుమతీదేవి తనకుఁ బ్రాణేశ్వరిగా
ధీనిధి బహుశ్రుతుండు ప్ర
ధానుఁడుగా, గురుఁడు శారదానందుఁడుగన్. 37

క. ఆనందమహీవల్లభుఁ
డానందరసార్ద్రహృదయుఁ డై, యేప్రొద్దుం
దా నగరువెడల కుండును
భానుమతీమోహపాశబద్ధుం డగుటన్. 38

క. జక్కవకవ పెక్కువయగు
మక్కువతో, రేయుఁ బగలు మనుజాధీశుం
డక్కాంత దక్క నొర్వక
దక్కటికార్యంబు లెల్లఁ దక్కి చరించున్. 39

శా. ఆరామామణితోడఁ గూరిమి నతం డత్యాస్థఁ గ్రీడించు సం
సారస్ఫారసుఖైకసారసురతేచ్ఛాపూరనిర్మగ్నుఁడై,

యారామాంతరకేళిపర్వతగుహాహర్మ్యాంతరాళంబులం
గిరాలాపము దాలిగీతవిలసత్క్రీడానివాసంబులన్. 40

సీ. ఆత్మావనీమండలాసక్తిఁ బెడఁబాసి
లలనానితంబమండలముఁ బొదువు
భద్రేభకుంభసంస్ఫాలనం బొల్లక
భామవక్షోజకుంభములఁ బుణుకు
బాణప్రయోగపారీణత యొల్లక
నారీకటాక్షబాణముల సొగయు
నిజరాజ్యతంత్రైకనిష్పత్తి యొల్లక
భామినీరతితంత్రపరతఁ బొరలు
తే. శిష్టజనసూక్తు లవి పెడచెవులఁ బెట్టి
తెరవసురతప్రియోక్తుల తీపి గోరు
నఖిలభూభారవహనకృత్యములఁ దొఱఁగి
నందుఁ డంగనాధీనమనస్కుఁ డగుచు. 41

వ. అంత బహుశ్రుతుండు తనమనంబున. 42

ఉ. మేదినిఁ దొంటిరాజులు రమింపరె యింతులయందు సక్తులై,
యాదశ రాజ్యతంత్రరహితేచ్ఛ రమింపరుగాక; యట్లె కా
యేదెసనిల్చిన న్నిలిచె నేదెసఁ బాఱినఁ బాఱెఁ గాక, యాఁ
గాదని వంకలొత్తఁ దిలకంబులె రాజులచిత్తవృత్తముల్. 43

చ. అని తనయిచ్చలో వగచి, యన్నరపాలునితో వినీతిగో
పనమతి మంత్రి యిట్లనియె, భానుమతీరతిమోహపాశబం
ధనములఁ జిక్కి యిట్లునికి ధర్మమె ? కొల్వున కేగుదెంచి మ
న్ననఁ బ్రజవిన్నపంబులు వినంగదవయ్య నృపాల వేఁడెదన్. 44

చ. అమలసమస్తవస్తునిచయాస్పద మైనధరిత్రి, రాణివా
సమును, సుతుల్, సురత్నములు, సాధుజనస్తుతుఁ డైనభూవరో
త్తమునకు నాదిరాజచరితల్ జవరాలు వరాలుఁ గూడ నా
ల్గుమణులటంట సిద్ధ, మిది లోకవిరుద్ధము గాదె యియ్యెడన్ ? 45

ఉ. నావుఁడు మంత్రివర్యునకు నందమహీపతి ప్రీతి నిట్లనున్
దేవిఁ దొఱంగి యొంటిఁ జనుదెంచి వెలిం గొలువుండ నోప, నా
దేవియు నేను గూడఁ జనుదెంచుట యుక్తము గాదె, పాసినన్
జీవముఁ బాయువాఁడఁ, గట చిత్తజుబారికి నోర్వవచ్చునే ! 46

క. ఒకరే యొక్కమహాయుగ
మొకదిన మొకబ్రహ్మకల్ప, మొకగడె యొకయేఁ
డొకనిమిషం బొకదిన మ
వ్వికచాబ్జముఖివియోగవేదన నాకున్. 47

సీ. కై సేసి చెలువ నాకడ నల్ల నిలిచిన
నంగజశ్రీఁ జూఱలాడఁ జూతు
నలపోక నువిద న న్నరగంటఁ జూచిన
నీరేడుజగముల నేలఁ జూతు
నింతి కౌఁగిట నున్న నిందిరావల్లభు
సౌభాగ్య మలఁతిగా సంస్మరింతు
కొమ్మ తేఁజిగురాకుఁ గెమ్మోవి చవిగొని
యమృతంబు నీరస మని తలంతు
తే. జలజనేత్రపైఁ గూర్మి సంసారఫలము
చంద్రముఖితోడికూటమి జన్మఫలము
లలనరతిరాజసామ్రాజ్యలక్ష్మితోడ
రాజ్యలక్ష్మీవిలాసగౌరవము సరియె ? 48

ఉ. కన్నులు గండుమీలుఁ దొలుకారుమెఱుంగులుఁ గాముబాణముల్
చన్నులు కుంభికుంభములు సంపెఁగబంతులు జక్రవాకముల్
క్రన్ననిమేను పుష్పలత పైఁడిసలాక ప్రసూనసాయకం
బన్నలినాక్షిఁ బాసి విరహవ్యథ నొంటిఁ జరింపవచ్చునే ! 49

క. ఏనొక నిమిషంబైనను
భానుమతీదేవిఁ బాసి ప్రాణముఁ బట్టం
గానోప, నీవిచారము
మాను, మనిన మంత్రి యనియె మనుజేశ్వరుతోన్. 50

ఉ. విన్నప మావరింపు పృథివీవర ! దేవిఁ దొఱంగ నోపవే
నన్నలినాయతాక్షిరుచిరాకృతి చిత్రపటంబునం గడుం
జెన్నెసలార వ్రాసి యది చేరువ నుంచినఁ దద్విలాసరే
ఖోన్నతిఁ జూచుచున్ దినము నొక్కముహూర్తము నిల్వకొల్వునన్. 51

చ. అని నరనాథుసమ్మతి మహామతి మంత్రి బహుశ్రుతుండు స
య్యన నొకచిత్రకారుని మహాలఘుహస్తునిఁ బిల్చి, వ్రాయఁగాఁ
బనిచిన వ్రాసె నత్తరుణిభావము కర్వునఁబోసినట్లు పే
ర్కొనఁదగురూపమైన యనురూపమనోహరచిత్రరూపమున్. 52

తే. ఇట్లు చిత్రకారుఁడు రచియించినట్టి
చిత్రరూపమాలోకించి, చిత్రరూప
విభ్రమాసక్తచిత్తుఁడై వెఱఁగునొంది
తాను జిత్రరూపాకృతిఁ దాల్చె విభుఁడు. 53

ఉ. ఇమ్మెయి విస్మయాకులితహృత్క్రమలుం డయి, చిత్రరూపమున్
గ్రమ్మఱఁ జూచి చూచి పులకంబులు దాల్చి చెమర్చి, కన్నుల
న్సమ్మదవారి గ్రమ్మ, వదనంబున లేనగ వంకురింపఁగా
నెమ్మిఁ దదీయరూపరమణీయత వెండియుఁ జూచు నాదటన్. 54

వ. ఇట్లు చిత్రరూపావలోకనవినోదంబు సలిపి, యందుఁ దనడెందంబు పరమానందంబు నొందఁ, దన కౌతూహలంబు గురున కెఱింగింపఁ దలంచి తత్పటంబుఁ బంచిన, నాచిత్రసౌందర్యంబుఁ గనుంగొని శారదానందుండు, 55

క. ఈచిత్రరూపరేఖా
వైచిత్రి ప్రశంససేయ వశమే ? దీనిం
జూచినను భానుమతినిం
జూచినయట్లయ్యె, నిట్టిచోద్యము గలదే ! 56

చ. అని కొనియాడి, దేవిరుచిరాకృతియం దొకమచ్చ పెందొడం
గనుఁగొన నొప్పు నీలమణికాంతి బెడంగయి, చిత్రకార ! యీ

యనుపమచిత్రరూపమున యందు లిఖింపుము దాని నొప్పుగా,
ననవుడు నట్లచేసి లఘుహస్తుఁడు కస్తురితోడఁ దూలికన్. 57

తే. శారదానందగురుఁడు సుజ్ఞానపరుఁడు
వీడుకొలువఁగఁ జని, నందవిభునిఁ గాంచి
చిత్రకారుఁడా తెఱఁ గెల్లఁ జెప్ప, విభుఁడు
వెలఁదితొడమచ్చ యేకాంత వేళఁజూచి. 58

## రాజు గురుని అంతఃపుర ద్రోహిగా శంకించి చంపఁ బనుచుట

క. నందమహీపతి డెందం
బాందోళము నొంద, శారదానందుఁడు మ
చ్చం దగ నిలిపెం గదె, మ
త్సుందరితోడ నుని కెట్లు చొప్పడ నెఱిగెన్ ? 59

ఆ. అంతిపురములోని కన్యల పేరిటి
పోతుటీఁగనైనఁ బొలయకుండ
నాజ్ఞ వెట్టి, శారదానందగురు నాజ్ఞ
వెట్ట నేరనైతి శేలనైతి. 60

క. ఎంతజితేంద్రియు లైనను
నెంతసదాచారు లైన, నేకాంతమునం
గాంతలసంగతి నుండినఁ
గంతునికొంతాలపాలు గాకుండుదురే ! 61

క. ఏకాంతంబునఁ గదిసిన
యాకాంతుం డల వసిష్ఠుఁడైనం గానీ
యాకాంత సీత గానీ
వేఁకరుగదె యగ్గిపొంత వెన్నయుఁ బోలెన్. 62

చ. అని తలపోసి నందవిభుఁ డప్డు బహుశ్రుతుఁ బిల్వఁ బంచి, య
య్యనఘచరిత్రుతోడ హృదయవ్యథ యెల్ల నెఱుంగఁ జెప్పి, చ
య్యనఁ గొనిపోయి యీ యఘమయాత్ముని ఘోరవిధిన్ వధించి ర,
మ్మనవుడుఁ బారుషార్థముగ నవ్విభుతోడ బహుశ్రుతుం డనున్. 63

తే. ఎంతపాపాత్ముఁడైన మహీసురుండు
హింస కర్హుండు గాఁడని యెఱిఁగి యెఱిఁగి
మహితచారిత్రు గురుఁ బరామరిక లేక
చంపుమనిపంపఁదగునయ్యసదయహృదయ! 64

తే. అనిన నెయ్యివోసినయగ్గియట్ల మండి
యవుడుకఱచి కోపారుణితాక్షుఁ డగుచు
నుగ్రదృష్టిఁ జూచిన, నాబహుశ్రుతుండు
వెఱచి వేగమ గురుఁ బట్టి విఱచికట్టి. 65

క. పురజనులెల్లఁ గనుంగొని
పురపురఁ బొక్కంగ, వధ్యభూమిస్థలికిం
ద్వరితగతిం గొనిచని, య
గ్గురు హింసయొనర్ప మనసు గొలుపమిఁ దనలోన్. 66

తే. దేవితోడమచ్చ నిజదివ్యదృష్టి జూచి
చిత్రరూపమునం దది చెలువు మిగుల
వ్రాయఁ బంచిన, నీచేటు వచ్చెఁగాక
యితని సుచరిత్ర మెవ్వరు నెఱుఁగ రెట్లు. 67

ఉ. రా జవివేకియై, నిరపరాధు మహీసురవర్యునిన్ జగ
త్పూజితుఁ బుణ్యవర్తను విధూతనమజ్జనకల్మషుఁ వధూ
వ్యాజమునఁ వృథా కుపితుఁడై వధియింపఁగఁ బంపె, దీని నే
యోజఁ దొలంగఁ ద్రోతు గురు నుత్తము నెమ్మెయిఁ గాతు దైవమా. 68

క. ఏమియుఁ గానఁడు పతి కాం
తామగ్నుఁడు గానఁ, గార్యతతి యెట్టిదియో
*'కామాంధోహి నపశ్యతి'
నా మును వినఁబడినపలుకు నైజము కాదే! 69

---

* కామాంధోఽపి — వా. 1926.

చ. పతి మతిమాలి, కానిపనిఁ బంచినఁ జేయఁగ నుత్సహించినన్,
హితమతియై యమాత్యుఁడు సహింపఁ గుదించియు నడ్డగించియుం
బతియపకీర్తిదోషములు పాపి చరించుట నీతి గాన; నే
నితని నిగూఢవృత్తి భరియించెదఁ గాకని నిశ్చితాత్ముఁడై. 70

## మంత్రి గురువును దాచియుంచి రాజుతో జంపితినని చెప్పుట

ఉ. క నకట్టు లూడ్చి, యనుకంప దలిర్పఁగ భూగృహంబునం
బె , ప్రియోక్తులన్ గురు సభీతమనస్కునిఁ జేసి, పాపమే
ప న లేమిఁ దేటపడ బల్కి మనోవ్యథఁ బాపి, సర్వముం
గ డచేసి పెట్టి, నృపకాళికుఁ డున్నెడ కేగి యిట్లనున్. 71

క. దేవరయానతి జగతీ
దేవనిధానంబు వసుమతీనాథ ! కృతాం
తావాసవాసుఁ జేసితి
నావుడు, విని నందవిభుఁడు నందితుఁ డయ్యెన్. 72

## రాజపుత్రుఁడు వేఁటకేగుట

క. ఆలో నొకనాఁడు, మహీ
పాలుని ప్రియసుతుఁడు, విజయపాలుం డను దు
శ్శీలుఁడు, మృగయాలోలత
వ్యాలమృగాఖిల మైనవనమున కరిగెన్. 73

తే. ఏగు నెడ దుర్నిమిత్తంబు లెన్ని యేనిఁ
గనియు వినియు నిశ్శంకతఁ, జనకు మనుచు
దొరలు నిల్పిన నిల్వక. దుర్నిమిత్త
ఫలము ముందటి కెఱఁగికోవలయు ననుచు. 74

వ. ఇట్లు నీతిదూరుం డగు నా కుమారుండు దురహంకారుండై, యపార సత్త్వభయంకర సంచారం బగుకాంతారంబు దఱిసి. బహుప్రకార మృగయావిహారంబు లొనరించు చున్నసమయంబున. 75

ఉ. కొండొకవాలముం, గుఱుచకొమ్ములు, నన్నువలై నవీనులున్,
నిండిననీలమేఘరుచి, నెక్కొను నున్నతదీర్ఘదేహముం,
జండతరాస్యమండలము సర్వభయంకరలీలఁ గ్రాలఁగాఁ
దొండము లేనిభద్రకరితో నెన యైనవనీవరాహమున్. 76

ఉ. ముందట దవ్వులం గని, సముద్ధతి నశ్వముఁ దోలుకొంచు నా
వందిపిఱుందఁ బోవ, నది పాఱి లతాగహనంబు చొచ్చినన్,
మందవిచారుఁడై నృపకుమారుఁ డొంటఁడును నేగి దాని నం
టం దలఁచెన్, వరాహము కడంకఁ దిరోహిత మయ్యె నయ్యెడన్. 77

ఉ వంది మొఱంగిపోయిన, నృపాలతనూజుఁడు చిన్నవోయి, మ
ధ్యందినవేళ నొక్కసలిలాశయము౯ గని వాజి డిగ్గి, తా
నందుఁ గృతావగాహుఁడయి, యాగళపూరితతోయమందుఁ దృ
ప్తిం దురగంబు తాను వడఁ దేఱి; మహాతపభీతి నయ్యెడన్. 78

ఉ. కొండొకసేపు నిల్చి చనుకోరిక, రాకొమరుండు పద్మినీ
షండసుగంధమారుతవశస్ఫుటశీకరసిక్తమంజరీ
మండితభూరిభూరుహసమావృతమైన వటంబునీడఁ గూ
ర్చుండె, ఖలీనరజ్జువున నొక్కెడ నశ్వముఁ గట్టి యిమ్ములన్ 79

వ. అయ్యవసరంబున, సర్వజగదాఖిలం బగునొక్కశార్దూలంబు, తత్సమీప తరులతాకుంజపుంజంబుననుండి యమ్మనుష్యగంధం బాఘ్రాణించి, రౌద్రరసోద్రేకంబునం జనుదెంచి, బలువిడి లంఘింప నుంకించుటయు, బిట్టు పొడగని యిట్టు నట్టు నెగసి, వెనుకకు నీల్గి కుప్పించి దాఁటిన ఖలీనంబు లూనం బగుటయు, హయంబు రయంబునం దనవచ్చినతెరువునం బడి పరువునం జనియె. నంత నక్కుమారుం డతి భీతుండై పరిసరమహీరుహంబు నారోహణంబు చేసె, నట్టియెడ. 80

సీ. అమ్మహోగ్రవ్యాఘ్ర మమ్మహీజముక్రింది
కుద్వృత్తి నేతెంచి, యొడుపు దప్పి
నప్పటిభుజగంబుననువున మ్రోఁగుచు
వాల మల్లార్చుచు, వాఁడికోఱ
నదరులువాఱ నోరంతయుఁ దెఱచుచుఁ
గన్నులఁ గోపాగ్నికణము లురల
మీఁదు సూచుచు మ్రానుమీఁదికి నుఱుకంగ
జంకించు చుగ్రవిస్ఫారఘోర

తే. వజ్రనిర్ఘాతపాతరవమ్ము గొలువఁ
గాలుద్రవ్వుచు నుండెఁ దత్సాలమూల
మున, మొగంబున రౌద్రంబు మునుకొనంగ
విజయపాలుని చిత్తంబు విహ్వలింప. 81

చ. దిగు లడరంగ నిట్లు, జగతీవరసూతి కుజంబు నెక్కుచోఁ
దగ నొకవృద్ధభల్లుకము తా నటమున్న వసించి యుండ న
య్యగవిపులాగ్రశాఖః నతఁ డప్పుడు 'ముందట నుయ్యి వెన్క లోఁ
తగుగోయి' యున్నలా గయినఁ, దల్లడ మందె వణంకుమేనితోన్. 82

వ. ఇట్లు దిగులువడి యున్నయన్నరేంద్రనందనుం గనుంగొని, యతనినుద్దే
శించి కారుణ్యబుద్ధి నా వృద్ధభల్లుకంబు మనుష్యభాషణంబున మెల్లన
నిట్లనియె. 83

చ. వెఱవకు రాకుమార, పులి వెన్దగులం బఱతెంచి నన్ను నే
త్తైఱ శరణంబు చొచ్చి తతిదీనత, నిట్టిమహాభయార్తులం
గుఱుకొని యెంతనిర్దయులుఁ గ్రూరత కోర్చి వధింప నేర్తురే ?
తొఱఁగుము చింత వంత, నను దుష్టుఁగఁ జూడకు మన్న నెమ్మదిన్. 84

వ. అని పెక్కుభంగుల నక్కుమారుని భయంబు దీర్చి, తనసమీపంబునకుఁ
జేర్చి యుచితోపచారంబు లొనర్చి, సారంబు లగు వన్యఫలాహారంబుల
నాఁకలిదీర్చి, యనునయించి యున్నంత. 85

సీ. పశ్చిమాంభోనిధిప్రాంతదేశంబున
రంజిల్లు విద్రుమకుంజ మనఁగఁ
జరమాద్రిశిఖరదేశంబునఁ గనుపట్టు
కమనీయఘనరత్నగండ మనఁగ
నపరదిక్కామిని యమరంగఁ గనుఁగొను
పద్మరాగంపుదర్పణ మనంగ
పశ్చిమదిక్కుంభిఫాలభాగంబున
బొలుపొందుశేగురుబొట్టనంగఁ

తే. బూర్వకంధి వేలావనభూమిఁ బండి
కాలశుకతుండహృతి బిట్టుగదలి యపర
జలధిలోఁ బడుదాడిమీఫల మనంగ
నబ్జినీవనబాంధవుఁ డస్తమించె. 86

క. తదవసరంబునఁ జుక్కలు
చదలం గలయంగ నొప్పెసఁగి నిగిడెఁ, గడుం
గదిరినగగనశ్రీమెయి
నొదవినఘర్మాంబుకణసముత్కర మనఁగన్. 87

క. అంతటఁ జీఁకటి యఖిలది
గంతంబుల నిండఁ బర్వ, నయ్యెలుఁగు పరి
శ్రాంతుఁ డగునతనిభావం
బంతయు వీక్షించి, మది దయారస మొదవ౯. 88

ఆ. మేను బ్రామనువడఁగ, మీలితోన్మీలిత
లోచనాంబుజయుగళుండ వగుచుఁ
దూఁగ నేల నాదుతొడలపై నెమ్మది
నిదురవోదు రమ్ము నృపకుమార! 89

చ. అని, తనయంకపీఠిపయి నాతనిఁ జేరిచి నిద్ర పుచ్చె, నం
త నది యెఱింగి బెబ్బులి ముదం బెసలారఁగ నెల్గుతోడ ని
ట్లను, మది విశ్వసింపఁ జనునయ్య మనుష్యుల, నందు రాజనం
దనుల నొకింత యేనియు మనంబున నమ్మదురయ్య యెయ్యెడన్? 90

క. తనకొక యాపదవచ్చినఁ
గనికరమున దానిఁ బాసి కాచినయప్పు
ణ్యునకుం దుదిఁ గీ డొనరిం
పనె చూచుఁ గృతఘ్నుఁ డెన్నిభంగుల నైనన్. 91

ఉ. కావున, నిన్నరాధమునిఁ గైకొని నా కహితంబు సేయ నే
లా ? వనసాహచర్యబహుళంబుగ బాంధవ మెట్లుఁ జూడ వే
లా ? వధియించి వీనిపలలంబు సమాంశము నీకు నిచ్చెదం
గ్రోవుము సేలఁ గూల, నతిధూర్తుతోడిసఖిత్వ మేటికిన్ ? 92

చ. అని విని, వృద్ధభల్లుకము వ్యాఘ్రకులోత్తముతోడ నిట్లనుఁ
వెనుకొని నీవు చంపఁ దఱిమేఁచి వడిం జను దేర, భీతిమై
నను శరణంబు వేఁడిన సనాతనబుద్ధిఁ బరిగ్రహించితిన్
విను, మనఘుండు పట్టి మఱి విడ్వఁగ నేర్చునె యెట్టివారలఁ ? 93

తే. మరణభయమున వచ్చి నామఱువు సొచ్చెఁ
జంప నొప్పింపఁ గోపింపఁ జాల వీని
శరణువొందిన రక్షింపఁజాలియుండి
మనువకుండినకంటెఁ గల్మషము గలదె ? 94

మ. అనినం, బెబ్బులి చిన్నవోయి మఱి యొండాలాపము ల్మాని యుం
డె, నరేంద్రాత్మజుఁ డంత మేలుకొనియెన్; డెందంబునన్ రాజనం
దనుచో ప్పారయ వేఁడి పేరెలుఁగు 'నిద్రఁ మేను తూఁగాడెడున్
నను నీయంకతలంబున న్నిదుర నూనం జేయవే వేఁడెదఁ' ? 95

చ. అనవుడు, నిందు రమ్మని ధరాధిపసూతి నిజాంకపీఠియం
దునిచిన, నిద్ర వోయినటు లుండెఁ జలింపక భల్లుకంబు శా
ర్దూనిరతి, నంతఁ గ్రోల్పులియు నానృపనందనుతోడ నల్ల ని
ట్లను, నిది యేఁ దొలంగి చనునప్పుడు నిన్వధియించు నెమ్మెయిఁ. 96

చ. హితవరిమాట లాడి తుది సెగ్గొనరింపనె కాఁచియున్న, యీ
కితవపువృద్ధభల్లుకము కృత్రిమమైత్త్రి నిజంబుగాఁ దలం
చితి, నరమాంసభక్షణము జీవికగా మనుకష్టజీవి న
మ్మితి, వనుకూలశత్రు లగు మిత్త్రుల నమ్ముదురయ్య యెవ్వేడఁ ? 97

తే. తొడలపై నిద్రవోయెడుమృష్టమృగముఁ
గొంకుకొసరు లే కిటు సేలఁ గూలఁద్రోవు

దీనిరక్తమాంసంబులఁ దృప్తిఁ బొంది
తొలఁగిపోయెద, నీవుఁ బో దొసఁగు మాలి. 98

ఆ. అనినఁ జపలబుద్ధి యానృపాలకసూతి
పులిదురుక్తు లాత్మఁ గలఁపఁ గలఁగి;
భల్లుకంబుఁ బట్టి పడఁద్రోసె, నదియును
బడక యొక్కశాఖఁ బట్టి నిలిచె. 99

చ. పరహితకారి కెందు ననపాయశుభంబులు పొందుఁ, జాల ము
ప్కరు లగుక్రూరకర్ము లపకారము సేయఁ దలంచిరేని న
ప్పురుషవరేణ్యుఁ గీ డొకటి పొందునె? తేజము దక్కఁ ద క్కిరుల్
పొరయునె లోకబాంధవు నపూర్వమనోభవు సప్తసైంధవున్? 100

ఆ. అంత విజయపాలుఁ డతిభీతచిత్తుఁడై
వెల్లఁబాఱు టెఱిఁగి, భల్లుకంబు
కరుణ నిన్ను మున్ను గాఁచితి నింక నీ
వెట్టివాఁడవైన నెగ్గు దలఁప. 101

క. వెఱవకు నెమ్మది నుండుము
వెఱువారలబుద్ధు లాత్మఁ బెట్టునె యనఘుం
డొఱపిఁడిచాడ్పున, నామది
నఱమర లేదొండు నమ్ము మనియె నరేంద్రా! 102

తే. అంతఁ జీఁకటి బెబ్బులియాసలెల్లఁ
బాసి పోయినకైవడిఁ బాసి పోవ
విజయపాలుని నెమ్మోము విన్నఁబోయి
తెల్లవాఱినకైవడిఁ దెల్లవాఱె. 103

క. అప్పట్టు విడిచి యప్పుడ
చప్పుడు గాకుండఁ బులియుఁ జనె వేగమ దా
నెప్పుడు నుండెడు నెలవున
కప్పుడె యానృపతిసుతుఁడు హర్షము నొందెన్. 104

వ. అంత. 105

సీ. సకలలోకంబులుఁ జక్రవాకంబులు
నుల్లాసవారాశి నోలలాడ
నంధకారంబులు నలచకోరంబులు
సొబగేది గొందులు సొచ్చి డాఁగ
నయనకంజంబులు నలినపుంజంబులు
సువికాసనంపద సొంపుమిగుల
రాయంచదాఁటులు ప్రోయుఁలేఁదేఁటులు
గృహసరోవరములఁ గేలిసలుప
ఆ. విమలతారకములు వివిధకోరకములు
నచ్చటచట నల్లనల్ల విరియ
హల్లకములు బుధులహస్తముల్ మొగుడంగఁ
బూర్వశిఖరిమీఁదఁ బొలిచెనినుఁడు 106

## భల్లూకము శాపమున రాజకుమారునకు మతిభ్రమ కలుగుట

వ. అట్టియెడ నన్నరేంద్రనందనుండు మున్నుగా ఋక్షంబు వృక్షంబు డిగ్గి, వానిచేసిన యపకారంబునకుఁ దగినశాపం బొసంగి, యివ్వనాంతరంబున నిరంతరంబును 'ససేమిరా' రావముఖరముఖుండవై పరిభ్రమించుచుండు నది, యెన్నండే నెవ్వఁడే నేతద్వృత్తాంతంబు బహిర్భావాయత్తంబు గావించు, నప్పుడ విగతశాపుండవై యెప్పటియట్ల సుస్థిరత్వంబున వర్తింపఁ గలవాఁడ, వని వరం బిచ్చి భల్లుకంబు చనియె. తదనంతరంబ విపినాంతరంబున నక్కుమారుండు ప్రభూతశాపవికారుండై పరిభ్ర మించుచుండె; నట రాకుమారుని యశ్వరత్నంబు పల్యాణంబుతోడన పఱతెంచినం జూచి పౌరజనం బచ్చెరువడి, యేకతంబున నిది యేకతంబున వచ్చెనో? నిన్న విజయపాలుండు వేఁటవెడలినప్పు డనేక దుర్నిమిత్తం బులు దోఁచెఁ, దన్నిమిత్తంబున నిట్లయ్యె నింక నెట్లయ్యెడునో, యని దిగులుమిగులం జని నందభూమీశ్వరునకుం దగుతెఱంగున నత్తెఱం గెఱిం గించిన, నతండు ధైర్యంబు పెల్లగిల్ల నుల్లంబు దల్లడిల్లఁ గుమారాన్వే షణతత్పరుండై వాహనారోహణంబు చేసి, సముత్సాహసన్నాహవా హినీ సమేతుండై పురంబు నిర్గమించి, నిసర్గధార్త్యమృగవర్గనిరర్గళస్వన

మ. వినఁ జూడం గొఱగానిచేష్టలఁ దపోవిఘ్నంబు గావింపఁ బూ
నినదోషంబున, భీషణాసురకశానిర్ఘాతపాతవ్యథా
జనితాక్రోశరవంబుతోడ, మథురాసామీప్యబిల్వాటవీ
వనికాసీమఁ బ్రతిక్షపంబు తరుణీ! వర్తింపు దీనాస్యవై. 252

క. అనుడును, శాపాలాపము
అనుతాపము సేయ, మునికి సాష్టాంగముగా,
వినతి యొనరించి, యెంతయు
వినయంబున శాపముక్తివిధ మడుగుటయున్. 253

మ. క్షితిసంరక్షణ మాచరించుటకునై, శ్రీకామినీనాయకుం
డతులోదారుఁడు విక్రమార్కుఁ డన బ్రహ్మక్షత్త్రతేజోమయా
కృతి నావిష్కృతి నొందువాఁ, డతనియంగీకార మీశాపదు
ష్కృతికి న్నిష్కృతి సేయుఁ బొమ్మని కటాక్షించెం బ్రసన్నాత్ముఁడై. 254

క. ఆమునిశాపానుగ్రహ
సామర్థ్యమువలన నసురజనితవ్యథయున్
భూమీశ! యిట్లు పొరలఁగ
నీ మహిమ విముక్తి గలిగె నిది విదితముగన్. 255

వ. అని వినిపించి కమలావతీవధూరత్నంబు. 256

క. దానసమగ్రత వేలుపు
మానికముం బోలుననుచు, మహనీయమణిం
గానుక యిచ్చి, నరేంద్రుని
వేనోళ్లం బ్రస్తుతించి, వీడ్కొని చనియెన్. 257

మ. ధరణీశుండును వీడుపట్టునకు నుద్యత్ప్రీతి నేతెంచి, య
త్తరుణీరత్నముశాపముక్తికిని జిత్తంబందు హర్షించుచుం,
దరుణాదిత్యప్రభన్ వెలుంగు సురకాంతాదత్తరత్నంబు స
త్కరుణన్ వైశ్యున కిచ్చెఁ దద్వితరణౌదార్యంబు నగ్గించుచున్. 258

పరపురుషేక్షణపరిహృతవ్రతశీల
కల దొక్క ర్తది తిరస్కరణిలోన
తే. నుండి విజయపాలునితోడ నుచితభంగి
మాటలాడిన వేఁదుఱు మాన నోపు!
నని హితంబుగఁ జెప్పి, నీవా నృపాలు
నట్లు సేయ నియోగింపు మనఘచరిత! 109

చ. అనిన బహుశ్రుతుండు చని, యత్తెఱఁ గెల్లను విన్నవించి, యా
జనపతి యన్నియోగకోలువుసాలవెలిం దెరవాఱి, యగ్గురున్
గొనిచని యుంచె, నందనుఁడు కోరి నిరంతరముగ్, "ససేమిరా"
యని పలవించుచుండఁ గొలువై నృపుఁడుండ నిజాప్తకోటితోన్. 110

వ. అట్టియెడ శారదానందుం డమందానందకందళితహృదయారవిందుఁడై
నృపనందనునపస్మారంబు దిరస్కారంబుసేయందలంచి, హృద్యంబు లయి
పూర్వోక్తచతురక్షరాద్యంబులై తదీయ విపినవృత్తాంతసూచనాద్యం
బులైన పద్యంబులు నాల్గు నిట్లని పఠియించె. 111

* తే. సకలలోకోపకారసంచారులైన
సాధుజనుల వంచించుట జాణతనమె?
తొడలపై నమ్మి నిద్రవోయెడువయస్యుఁ
బగతుపాలను ద్రోయఁ బాపంబు గాదె! 1̇2

తే. అనిన నా"సకారంబు" నుజ్జన మొనర్చి
యక్కుమారుఁడు "సేమిరా" యనుచు నుండె
నందనృపుఁ డాప్తులైనజనంబు లెల్ల
దాన నద్భుతానందచేతస్కులైరి. 113

*క. సజ్జనభావము గల్గును
హృజ్జనులను మోసపుచ్చుటిది వేరుపె నీ
పజ్జందొడపైఁ గూర్కిన
యజ్జంతువుఁ జంపఁ జూచుటది పౌరుషమె. పా.

వ. తదనంతరంబ. 114

క. సేతువుదర్శింప మహా
పాతకములుఁ బాసిపోవుఁ, బ్రాణసఖునకుఀ
ఘాతుకమతి నొనరించిన
పాతక మేతీర్థసేవఁ బాయునె నరునిఀ. 115

క. అన విని "సే" యనునక్షర
మనుగతముగఁ బలుకు టుడిగి, యటమీఁద "మిరా"
యనుచుండె నక్కుమారుఁడు
జనపతి నెమ్మొగము హర్ష జలధిం దేలెఀ. 116

వ. శారదానందుండు మఱియును. 117

క. మిత్త్రద్రోహి, కృతఘ్నుఁడు
ధాత్రీసురహంత, హేమతస్కరుఁడు, సురా
పాత్రీఘాతుఁడు, నిందా
పాత్రులు వీరెల్ల నరకభవనావాసుల్. 118

క. అనిన "మివర్ణము" నుజ్జన
మొనరించి, నరేంద్రసూతి యుడుగక "రా, రా"
యని పలుకఁ జూచి, యప్పుడు
మనుజేశ్వరుఁ డుత్సహించె మంత్రులుఁ దానున్. 119

వ. మఱియు శారదానందుం డిట్లనియె. 120

*క. రాజేంద్ర విజయపాలుని
రాజితశుభమూర్తి జేయ రతిగలదేనికిఀ

---

*క. రాజులు మెచ్చఁగ దిక్కుల
రాజులను జయిఁచి, ధనము రాజులచేతన్
ఓఁజగొని, విప్రకోటిం
బూజింపు మమానదానభోజనవిధులఀ. వా. 1926.

బూజార్హుల వీరెల్లరఁ
బూజింపు మనూనదానభోజనవిధులన్. 121

ఆ. అనిన, విజయపాలుఁ డపుడ యాశాపవి
కార మానుపూర్వికముగ విడిచి
స్వస్థుఁడై, యరణ్యవాసవర్తన మెల్ల
విభున కెల్లవారు వినఁగఁ జెప్పె. 122

ఉ. చెప్పిన, నందభూవిభుఁడు చిత్తమునం గడుఁ జోద్య మంది, తా
నప్పుడ దిగ్గనన్ యవనికాభిముఖుం డయి యారహస్య మీ
చొప్పునఁ జెప్ప నెవ్వరికిఁ జొప్పడు ? నొప్పుగ నిట్టి దిమ్మెయిం
జెప్పినచొప్పు నా కెటులు చెప్పితి ? చెప్పుము నీవు బాలికా ! 123

క. వాకిలి వెడలి యెఱుంగవు
రాకొమరుని యెఱుఁగవులి యరణ్యాంతర భా
షాకలనం బెట్లొద వెను ?
మా కున్న నిజంబుఁ జెప్పుమా గురుపుత్త్రీ ! 124

వ. అనిన శారదానందుం డన్న రేంద్రున కిట్లనియె. 125

తే. సర్వభూదేవ దేవప్రసాదమహిమ
శారదాదేవివరమున సకలలోక
వర్తనంబులు గానంగవచ్చు మాకు
భానుమతిమచ్చఁ గన్నట్టు భాషవీధి. 126

తే. అనినఁ బతి శారదానందుఁ డగుట యెఱిఁగి
పరభసము నొంది యత్తిరస్కరిణి దీసి
భయము, భక్తియు సిగ్గు విస్మయముఁ బొవ
లేచి గురునకు వందనం బాచరించె. 127

తే. అట్లు ప్రణమిల్లి గురుని నత్యాదరమున
గారవించి, బ్రహ్మసుతుఁ జేరఁ బిలిచి

కరము కరమునఁ గీలించి కరముఁ బ్రీతి
నందుఁ డాతని కనియె నానంద మెసఁగ. 128

ఉ. నిందకు నోర్చి దోషము గణింపక, రిత్తకు రిత్త శారదా
నందునిఁ జంపు మన్న, నిదిన్యాయము గాదని యెంత చెప్పినన్
మందమతిన్ వినం దెఱఁగుమాలిననన్ను మొఱంగి కాఁచి, మ
మ్మిందఱ సత్క్రియానిరతి నిప్పుడు గాఁచితి, చెప్ప నేటికిన్. 129

తే. దోసమును నవకీర్తియుఁ దొలఁగఁ బెట్టి
నాఁడు గురుఁగాఁచుకొంటిని, నేఁడు నన్ను
సుతునిఁ గాఁచితి ప్రిస్థానకుద్దిగాను
నీఋణం బింక నేమిట నీఁగువాఁడ! 130

క. నీకతమున నిహపరములు
నా కిట సిద్ధించె. నీ సనాతనబుద్ధి
ప్రాకారముకలిమి నఘా
నీకంబుల గెలచు టరుదె, నృపనయవేదీ! 131

తే. అని యనేకవిధంబుల నాదరించి
మంత్రి కతిసుస్థిరైశ్వర్యమహిమ యొసఁగి
శారదానందగురునకు దారవోసి
యగ్రహారసహస్రంబు నర్థి నిచ్చె. 132

క. ధృతిమంతుఁడు ధీమంతుఁడు
మతిమంతుఁడునైన మంత్రి మహినెత్తటి నే
నతిసంపద నొరెడుఁబతి
కతఁ డబ్బుట పెన్నిధాన మబ్బుటగాదే! 133

ఆ. వరరథాశ్వసుభటవర్గ మెల్లను గల్గి
చాలినంతభూమి యేలఁగల్గి
తగినమంత్రిలేని ధరణీశురాజ్యంబు
గాలిఁ దూలు దీపకళికఁబోలు. 134

వ. కావున. 135

ఆ. భట్టి నీకు హితుఁడు పరమవిశ్వాసియు
భట్టిబుద్ధి మేలుబంతి నీకు
సకలరాజతంత్ర సర్వాంగరక్షకు
భట్టి నీతి వజ్రపంజరంబు. 136

వ. అట్లగుటం జేసి మీరిరువురుం జేరి చరితార్థులరై వాగర్థంబులుంబోలె నభిన్న ప్రభావంబుల వర్తిల్లునది యని హితోపదేశంబు చేసి పరమ యోగానంద జితేందిరానందనుండై మదనరేఖానందనుండు నిజేచ్ఛం జనుటయు. 137

శా. శ్రీకర్ణాటమహామహీశ్వర సదాసేవా ప్రధానోత్తమా
నీకస్తుత్య, లిపిక్రియానిపుణపాణిద్వంద్వపంకేరుహా
యాకల్పాంతకనిత్యకీర్తి జలజాస్యాకేళిగేహీభవ
ల్లోకాలోకధరాధరావృతధరాలోకైకరత్నామణీ ! 138

క. రాజప్రసాదసముదిత
తేజఃకీర్తిప్రతాపదీపితలక్ష్మీ
రాజితనీతిధురంధర
రాజముఖీపుష్పచాప రసికకలాపా ! 139

భుజంగప్రయాతము

సరోజాననానందసౌందర్యమూర్తీ
సరోజాతసంజాతచాతుర్యపూర్తీ
ధనే[illegible]ధీనదానానువర్తీ
శరచ్చంద్రికాపూరసారూప్యకీర్తీ ! 140

గద్యము. ఇది శ్రీమదఖిలకవిమిత్ర పెద్దయయన్నయామాత్యపుత్ర శారదాదయావిధేయ జక్కననామధేయప్రణీతంబైన విక్రమార్క చరిత్రం బను మహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు

# విక్రమార్క చరిత్రము

## చ తు ర్థా శ్వా స ము

శ్రీమదపారకృపారస
సామాగ్రీ వర్ధమానసకలార్థిజన
స్తోమబహువిభవ, యనితర
సామాన్యగుణాభిరామ జన్నయసిద్దా ! 1

### విక్రమార్కునకు నారదుఁడు రాజనీతి నెఱిఁగించి, విదర్భ రాజపుత్రి సౌందర్యమును వర్ణించి తెలుపుట

వ. అమ్మహీశ్వరుండు తదుపదిష్టప్రకారంబున వసుంధరాపరిపాలనపరాయ ణుండై యుండునంత నొక్కనాఁడు. 2

శా. ఆలోలామలదీపవల్లికలతో నాకాశసంచారి యై
కైలాసం బిటవచ్చు టెట్లుకొ యనంగా, శోణచంచజ్జటా
జాలం బొప్పఁగఁ బాండురద్యుతులతో, సాక్షాత్కరించెన్ మహీ
పాలాగ్రేసరుమ్రోల నారదుఁడు భూభాగంబు భూషించుచున్. 3

ఉ. అమ్మునినాథశేఖరుని నర్థి నెదుర్కొని, భక్తిమై ఁబ్రణా
మ మ్మొనరించి. సన్మణిసమంచిత కాంచనపీఠి నుంచి నె
య్యమ్మున నర్ఘ్యపాద్యవిధు లాదిగఁ బూజ యొనర్చి యెంతయున్
సమ్మద మొందఁజేసి, సురసంయమితోడ నరేంద్రుఁ డిట్లనున్. 4

చ. తలకొని యున్నతొంటిసుకృతంబుకతంబున వచ్చి, మీఁదటం
గలిగెడు శోభనంబులకుఁ గారణమై, మఱివర్తమానని
శ్చలదురితంబులం దలఁగి సన్మునినాథకులావతంస! ని
ర్మలభవదీయదర్శనము మాకొనరించెఁ ద్రికాలయోగ్యతన్. 5

వ. అనిన నమ్మునీశ్వరుండు సర్వంసహాధీశ్వరున కిట్లనియె, 6

సీ. పరమధర్మజ్ఞత బ్రాహ్మణప్రవరుల
నరసి రక్షింపుదే యనుదినంబుఁ
బ్రజఁ దల్లిదండ్రులపగిదిఁ బాలింపుదే
పరులొత్తొరవులేక బ్రదుకునట్లు
దివిజభూజముఁబోలె దీనార్థిసమితికి
నభిమతార్థము లిత్తె యాదరమున
ననిఁ బ్రాణ మిచ్చినయట్టివారల వారి
కెల్ల తేజంబులు నిచ్చి మనుతె ?
తే. యాజ్ఞపాత్రిక సంపద లర్థి నిచ్చి.
బంధువర్గంబుఁ బోషింతె బహువిధముల ?
సకలవర్ణాశ్రమాచారసరణి తప్ప
కుండ నియమించెదే మహీమండలమున ? 7

క. సప్తాంగరక్ష సేయుదె
సప్తోపాయములఁ బరుల సాధింతె మదిన్
సప్తవ్యసనము లుడుగుదె
యాప్తుల రక్షింతె సాహసాంకమహీశా ! 8

క. మంత్రంబును రక్షింపుదె
తంత్రాచరణంబులందు దత్పరమతివై
మంత్రము పరమంత్రిమన
స్సంత్రాసకర ప్రభావసంపన్నులతోఁ. 9

క. ఆజ్ఞ వెలయింతె దిక్కుల
యజ్ఞాధిక్రియల సురల నలరింతువె ? నీ
విజ్ఞులఁ బరిపాలింపుదె
సుజ్ఞానపరీక్షచేసి సుకవుల మనుతే ? 10

*క. అని కుశలప్రశ్నముగతి
ననిమిషముని రాజనీతి యాద్యంతంబుం

---

*పా. క. అన విని మనమున నలరుచు
ననిమిషమునినాథుతోడ నతిగంభీర
స్వనమునఁ బ్రియపూర్వకముగ
వినయముతోడుతను మనుజవిభుఁ డిట్లని యెఁ.

దన కెఱుఁగ నానతిచ్చిన
విని, వినయముతోడ మనుజవిభుఁ డిట్లనియెన్. 11

చ. పరిచితసర్వశాస్త్రపథపారగు లైనవసుంధరేశ్వరుల్
నిరుపమలీలమై నడచునీతిపథంబున పంచరింప నా
తరమె మహాత్మ మీకృపకతంబున నింక నిరంకుశక్రమ
స్ఫురణమహామహీభరణభూరినయోన్నతి నుల్లసిల్లెదన్. 12

వ. అనిన నన్నరేంద్రచంద్రునకు మునికులాగ్రగణ్యుం డిట్లనియె 13

చ. అలఘువినూత్నరత్నములకన్నింటికిం గుదురైనరోహణా
చలపతిరీతి నీవఖిలసద్గుణశాలుల కాలవాలమై
వెలయుట, నిన్ను వాసవుఁడు వేయివిధంబులఁ బ్రస్తుతించు, ను
జ్జ్వలతరభాగ్యసంపద భవత్ప్రతిమానులె యన్యభూపతుల్ ? 14

ఉ. ఇట్టి భవన్మహత్త్వ మిదియెల్ల విదర్భవిభుం డెఱింగి, నీ
పట్టపుదేవి గాఁదగినపట్టి వరంబునఁ గోరి యీశ్వరున్
గట్టిగఁ గొల్చి తత్కరుణఁ గాంచె మనోభవరాజ్యలక్ష్మికిం
గట్టనుగైనమూర్తి గుణగణ్య ననంగవతీకుమారికన్. 15

ఆ. వెలఁదినోయగంబు వీక్షింప వినుతింప
వేయికన్ను లమరవిభున కిచ్చి
రెండువేలజిహ్వ లండజాధీశున
కొసఁగబోలుఁ బంకజోద్భవుండు. 16

సీ. భామినీమణిమధ్యభాగంబు కృశ మని
కటితటంబున నిల్పె గౌరవంబుఁ
దొయ్యలివలిచన్నుదోయి కర్కశ మని
యడుగుల మార్దవం బలవరించెఁ
గమలలోచనకుంతలములు వక్రములని
తనువల్లికకుఁ జక్కఁదన మొసంగెఁ

బూఁదీఁగఁబోఁడిచూపులు చంచలము లని
మెలపు నెన్నడపున మేళవించె

తే. సబల్ధనఖములు క్రూరంబు లని తలంచి
సౌమనస్యంబుగుణమున సంతరించె
నీరజాసనుఁ డెంతకు నేరఁ డనుచు
జగము గొనియాడ నొప్పు నాచిగురుఁబోఁడి. 17

తే. తమ్మి లాకొమ్మనెమ్మోముతమ్మి లనఁగ
బింబ మాయింతికెమ్మోవిబింబ మనఁగ
జాతి యానాతి లేనవ్వుజాతి యనఁగ
రామ యొప్పారు లోకాభిరామ యగుచు. 18

సీ. తులకు వచ్చియు రాదు తళుకులగని యైనఁ
గోమలికాంతితోఁ గుందనంబు
సరియయ్యుఁ గాదు నిశ్చల మైనజిగి నొప్పు
కాంతయూరులతోడఁ గరభయుగము
*ప్రతివచ్చియును రాదు సతతాచ్ఛవిచ్ఛవి
తరుణికంధరతోడ దరవరంబు
†జోడయ్యుఁ గాదు మించులనటించుచునున్న
చానచన్నులతోడఁ జక్రమిథున

తే. మింతినెమ్మోము ప్రతిచేసి యెన్నుచోటఁ
జందురునిమేను పూర్వపక్షంబు నొందు
ననఁగ జగమున నావిదర్భావనీశు
ననుఁగుఁదనయకు నెనయైనయతివ గలదె ? 19

శా. ఆనారీమణి, తంత్రిసమ్ముఖమునం దశ్రాంతముం గ్రొత్తగా
నానాగాయకపాఠకోత్తము లొగిన్ సంగీతసాహిత్యవి

---

*ప్రతియయ్యునుం గాదు బహువిలాసములకు రమణిరూపముతోడ రత్నపుత్రి
†సమతనొందియు నొంద దమితశృంగారంబు గలయింతినాసతోఁ గాంచనంబు

ద్యాన్నై పుణ్యము మీఱ. నీగుణవిలాసాకారరేఖాదుల
న్వేనోళ్లన్ గొనియాడఁగా విని, రసోన్మేషంబు సంధిల్లఁగన్. 20

వ. పంచశరశరప్రపంచచంచలాయమానమానసయై యుండునంత. 21

తే. సిద్ధపుర మేలురాజు ప్రసిద్ధబలుఁడు
శకమహీనాథచంద్రుఁ డాచంద్రవదన
నడుగఁ బుత్తెంచి, యీకున్న నాగ్రహించి
యేపున విదర్భమీఁద దండెత్తఁ దలఁచె. 22

వ. కావున. 23

క. హరువరమున జనియించిన
వరపుత్రికయగు ననంగవతి ననురాగ
స్ఫురణమ్మున బరియించుట
కరణీయము నీకు నిపుడు కరుణాభరణా! 24

క. నావుడు నాకార్యము వసు
ధావల్లభుఁ డెంతయేని తాత్పర్యముతోఁ
గావింప నియ్యకొనుటయు
నావిబుధమునీంద్రముఖ్యుఁ డరిగెను బిదపన్. 25

క. వేసవివేఁడి సహింపక
వేసఱుజీవులకు నెల్ల విశ్రాంతికర
శ్రీసంపాదనకరమై
యాసన్నంబయ్యె నంబుదాగమ మంతన్. 26

## వర్షర్తు వర్ణనము

సీ. గగనరత్నము కట్టుమొగులతో నుదయించెఁ
జరమదిక్కునఁ దోఁచె శక్రధనువు
పూర్వాపరవ్యాప్తిఁ బొలుపారె జలరేఖ
లాలోలగతి వీచె మూలగాలి

మెఱుఁగుమొత్తంబులు మెఱసె నుత్తరమునఁ
గడఁగె దక్షిణపుమేఘములగములు
ప్రాలేయభానుండు పరివేషగతుఁ డయ్యెఁ
జాతకంబులు నింగి సంచరించె
తే. నెఱలపెనుపట్టె నేలపైఁ గొఱలఁజొచ్చె
మొనసి చీమలగమిగ్రుడ్డు మోవఁదొణఁగెఁ
గుజముకొనగొమ్మ డిగి క్రిందికొమ్మమీఁది
నిలుపుఁగైకొనుపులుఁగులయెలుఁగు లెచ్చె, 27

ఉ. తూనిఁగలాడెఁ, దోయనిధిఁ దోరపుమ్రోఁత జనించెఁ, బంక్తులై
కానఁబడెన్ బలాకములు, కప్పయెలుంగు చెలంగె నిర్జల
స్థానములందుఁ, గుంజముతువం గృకలాసము నిల్చి నింగికై
యాననమెత్తెఁ, భూమిరజ మంగములన్ బెరయించెఁ బిచ్చుకల్. 28

క. తదనంతరంబ, జనముల
కిది పగ లిది రాత్రి యనుచు నేర్పఱుపంగా
హృదయముల కగోచరమై
చదలం బొదలంగఁజొచ్చె జలధరవితతుల్. 29

క. ధారణి గలమేలెల్లను
ధారాళకరాళవర్షధారలచేతన్
నీరామని గాఁగల దని
పూరాల్చినభంగి ముసురు పొరిఁబొరిఁ గురిసెన్. 30

సీ. ప్రథమోదబిందులఁ బల్లవించె ననంగ
నింద్రగోపద్యుతి నిలఁ దనర్చె
భానుచంద్రుల సూడుపట్టి గెల్చె ననంగఁ
గంధరపటలాంధకార మడరె
జలదానిలంబునఁ బులకించెనో యనఁ
గుటజభూజంబులు కోరగించె

స్తనితమర్దళరవంబునకు నాడె ననంగ
వనమయూరములు నర్తనము చేసెఁ

తే. కాంధజనచిత్తచిత్తసంభవమహాగ్ని
ఘనతరజ్వాలజాలానుకరణనిపుణ
వివిధవిద్యుత్పరంపరావిభ్రమంబు
లఖిలహరిదంతరంబుల నతిశయిల్లె. 31

మ. దళితానంతదిగంతమై ఘుమఘుమధ్వానంబు సంధిల్లగాఁ
గలయం గాముల వేలగట్టినటు, లుగ్రవ్యగ్రలీల న్నిర
ర్గళధారాళకరాళమై కురిసె వర్షం; బెందు నేయింటివా
రలుఁ బొర్గింటికి నేఁగకుండఁగ నహోరాత్రంబుఁ జిత్రంబుగన్. 32

తే. ధరణియెల్లఁ గదంబపుష్పరచితంబు
దిక్ప్రకరమెల్ల సరసనర్తితమయూర
మంబరంబెల్ల నీరదాడంబరంబు
విరహిజనచాతకము లెందు విశ్రమించు. 33

మ. రమణీయోన్నతసౌధసీమల విహారప్రౌఢి సంధించుచోఁ
దమకుం గర్జితఘోరఘోషములు నిద్రాభంగముం జేసినం,
బ్రమదం బందిరి కాముకుల్ సమదకుంభత్కుంభికుంభద్వయ
క్రమవక్షోరుహమండలీమదవతీగాఢోపగూహోన్నతిన్. 34

చ. లలితగతి న్మయూరికలు లాస్య మొనర్పఁగ, *భేకభామినీ
కలకలనాదము ల్సెలఁగ, గర్జనవాద్యము లుల్లసిల్లఁ గం
దళకుసుమాంజలుల్ వెలయ, నర్తనశాలయనం దనర్చె భూ
తలము విచిత్రవారిదవితానతిరస్కరణీసమేతమై. 35

ఉ. హారిమయూరవిభ్రమము లంచలఁ జెందె దటిద్విలాసముల్
తారలఁ జేరెఁ, బుష్పితకదంబవిజృంభణ సప్తపర్ణనా

* భేకజంవతీకలకలనాదముల్. వావిళ్ళ. 1926.

నారుచిర ప్రసూనభజనం బొనరించె, శరత్సమాగమం
బారయ నంబుదాగమ మహామహిమోన్నతి నాక్రమించినన్. 36

## శరదృతు వర్ణనలు

చ. శరదుదయప్రభావమునఁ జంద్రదినేంద్రుల తేజ మెక్కి త
ద్గరిమలఁ గైరవాంబుజవికాసము మించెఁ దదీయవాసనం
బరఁగె మదాలిమాలికలు భావసముద్భవవర్తనోన్నతిం
బొరసి నిశాహముల్ సిరులఁ బొంది సుఖింతురు మేదినీజనుల్. 37

మ. జలజచ్ఛత్రరుచిం బ్రకాశతరకాశశ్రేణికాచామరం
బుల భద్రాసనకాంతి రాజ్యపద మొప్పల్ మీఱఁ గుంభోద్భవుం
డెలమిన్ దక్షిణదిక్కునం దుదితుఁ డయ్యెం; జంద్రతారాబలం
బుల మేలైనదినంబు లెవ్వరికి సమ్మోదంబు సంధింపవే! 38

ఉ. బాలలు లీలతో, బలుసుఁబండులచాయఁ దనర్చి పండి కై
వ్రాలినరాజనంబులకు వచ్చుశుకంబులఁ జేరనీక ప్రోఁ
దోల రవంబుతోఁ జెలఁకుఁదోఁటలనీడల నుండి పాడి రు
న్మీలితహావభావరమణీమకరాంకుని సాహసాంకునిన్, 39

వ. ఇవ్విధంబున శరదాగమంబు దనప్రయోజనంబునకు ననువర్తనసూత్రం బగుటయు, దండయాత్రాసముత్సుక సేనాసనాథుండై, సాహసాంక మహీనాథుండు, తగినకాలరులం బంచుటయు సుమతిసూనుండు లేఖాముఖంబున నంతయు నెఱింగి. రాగమంజరీపుత్త్ర మిత్రుండైన చిత్రరథుండను గంధర్వపతిని జంద్రపుర రాజ్యసింహాసనాసీనుంగావించి యాతఁడుంబ. 40

సీ. రథివిక్రమప్రౌఢరథికలీలారూఢ
నానావిధస్యందనములతోడ
సహజదానోద్దండ చండశుండాదండ
బంధురసింధుర ప్రతతితోడఁ
జారుమూర్తికమహాశ్చర్యసంచారణ
కమనీయతరతురంగములతోడఁ

బరభూవరపూర్వాహిభయదోగ్రసన్నాహ
గర్వితసుభటవర్గములతోడ
తే. మందరాచలమంథానమథ్యమాన
నిరవధికనీరనిధిఘోషనిర్విశేష
పటుపటహముఖ్యవాద్యజృంభణముతోడ
భట్టిచను దెంచి వసుమతీపాలుఁ గాంచె. 41

తే. అర్థి దండప్రణామంబు లాచరింప
నమ్మహామంత్రి ముఖ్యుని, నా నరేంద్రుఁ
డతిముదంబున నాలింగనాదులైన
సముచితోపచారంబుల సత్కరించి. 42

వ. సాదరావలోకంబున నాలోకించి లోకవృత్తాంతంబు నడుగుటయు, నత
నికి సుమతిసూనుం డిట్లనియె. 43

సీ. ఏరాజునకుఁ జెల్లునెంతయు నరుదైన
మణిపాదుకాదులు మహిమఁ గొనఁగ
నేరాజునకుఁ జెల్లు నింద్రుని మెప్పించి
నవరత్న సింహాసనంబు వడయ
నేరాజునకుఁ జెల్లు నీరజాసనుసభ
బ్రహ్మస్త్రులాభసంపద వహింప
నేరాజునకుఁ జెల్లు నితరదుర్లభమైన
యుట్టిచేరులుగోయు దిట్టతనము
తే. దేవపతి యైన శ్రీమహాదేవుదేవి
కాళికాదేవి యేరాజుకడిమి మెచ్చి
లీల నుజ్జని వేయేఁడు లేల నిచ్చె
ననుచు నినుయెల్ల దేవర నభినుతించు. 44

చ. అనిన దరస్మితాస్యుఁడగు నమ్మనుజేంద్రునితోడ భట్టి యి
ట్లను, జగదంబ వత్సరసహస్రము రాజ్యము నీకు నిచ్చె, నా

యినుమడి యేండ్లు లిద్దరణి యేలు నుపాయము సేయువాఁడ నేఁ
ననుటయు నవ్విభుండు మది నచ్చెరువంది వినంగఁ గోరుటన్. 45

వ. అవధరింపు మని మనుజవల్లభునకు భట్టి యిట్లనియె. 46

సీ. జగదంబ భవదీయసాహసోన్నతి మెచ్చి
యిచ్చె నుజ్జయిని వేయేఁడులేల
నావరం బెబ్బంగి ననుభావ్య మైనది
యటుగాన నొకయుక్తి యవధరింపు
మేఁటేఁట నొనరింపు మితరదేశవిహార
మాఱునెలలు రాజ మాఱునెలలు
నిమ్మెయి రెండువేలేఁడులు చె నఁ
బురి నున్నయట్టివ రము లెల్ల
తే. శాంభవీవరలబ్ధవత్సరసహస్ర
మయ్యె. దేశాంతరాంతరావాప్తిఫలనఁ
జనిన వెయ్యేండ్లు మనబుద్ధిసంచితములు
ఘనయశస్సాంద్ర విక్కమార్కక్షితీంద్ర ! 47

వ. అనిన నతనిమనీషావిశేషంబునకు సంతోషించి. 48

## విక్రమార్కుఁడు సిద్ధపురీశుని పైకిఁ దండెత్తిపోవుట

మ. అతఁడుం దానును గార్యలబ్ధిగతి నేకాంతంబ యూహించి, స
మ్మతితో సిద్ధపురీశుపైఁ జనుటకు న్మౌహూర్తికోత్తంస ని
శ్చితవేళన్ మొరయింపఁ బంచుటయు, మించెన్ దండయాత్రాసము
ద్ధత నిస్సాణధణంధణంధణధణంధాణంధణధ్వానముల్. 49

సీ. పాలమున్నీటిలోఁ బవ్వళించినయట్టి
నీలవర్ణుఁడు నిద్రమేలుకొనియె
వెగడొంది రవితేరినొగలఁ గట్టినయట్టి
వాహంబు లణకలు వైచుకొనియె
నదరిపాటున బిట్టు బెదరి పర్వతపుత్రి
కందర్పదమనునిఁ గౌఁగిలించెఁ
బన్నగంబుల కెల్ల భయము మిక్కుటముగాఁ
బాతాళలోకంబు బమ్మరిల్లెఁ

తే. గమలజుని వేదపఠనంబు కవలువోయె
నద్రు లెల్లను నచలత్వ మపనయించె
దిగ్గజంబులు జిఱజిఱదిరిగి మ్రొగ్గె
వారిరాసులు పిండిలివండు ల్రొప్పె. 50

వ. అంత, 51

క. సంగరములు గలుగుటఁ జతు
రంగమ్ములు సమ్మదాంతరంగము లగుచున్
గంగాతరంగసంగత
రంగములై బెరసె నెరసి రంగక్షోణిన్. 52

ఉ. చుట్టము లైనరాహుతులు సూరెలఁ బేరెలమిన్ జవోజ్జ్వలా
రట్టజవాహరోహణవిరాజితులై తనుఁజేరి కొల్వఁగాఁ,
బట్టపుదంతి నెక్కుకొని భట్టి నృపాలుని సేన కంతకుం
బెట్టనికోటయై నడచె భీకరసన్నహనాఖిలాఘుఁడై. 53

మ. జయలక్ష్మీసతితో ననగవతి నిచ్చంగై కొనం గోరి, యు
జ్జయినీనాథుఁడు దివ భూషణవిలాసం బొప్ప నాయోధన
ప్రియుఁడై పెండ్లికి నేగుభంగి వెడలెం; బృథ్వీజనశ్రేణికా
నయనానందద రత్నకాంచననవీనస్యందనారూఢుఁడై. 54

వ. ఇవ్విధంబున రాజమందిరద్వారంబు వెడలి,యాంగికంబులగు శుభసూచ
కంబులు ననుకూల సమీరసంచారంబులును నానావాద్యాది మంగళద్రవ్య
సందర్శనంబులు, నవనీసురాశీర్వాదంబులు నగణ్యపుణ్యాంగనాముక్త
మౌక్తికశేషావిశేషంబులును, నభంగతురంగ హేషాఘోషంబులు
నంగీకరించుచు, నిరర్గళప్రసాదశరణాగి శరణుండై పురంబు నిర్గమించి,
సకలసేనా సమన్వితుండై కదలి కతిపయ ప్రయాణంబుల విదర్భానగ
రంబు చేరంజన, నప్పురంబునకుం గ్రోశమాత్రంబున నతిపవిత్రంబైన
వేత్రవతీతటంబున, నతిమాత్రవిశాలరమణీయంబును సమస్థలంబును నైన
స్థానంబున, నత్యాశ్చర్యకరణ ప్రచండంబయిన యోగదండంబున ప్రాసి
నం దత్క్షణంబ.

సీ. బంధుర కాంచన ప్రాకారములతోడఁ
బరిఖాజలౌఘసంపదలతోడ
మహనీయతరదివ్యమందిరంబులతోడ
రమణీయదివ్యసౌధములతోడ
మణిమయబహుసభా మండపంబులతోడ
నగణితదివ్యగేహములతోడ
వర్ణితశృంగారవనవితానముతోడఁ
గమలకైరవవనోత్కరముతోడ
తే. నప్రమేయాతివిస్తరాయామ మగుచు
నొక్కపుర ముద్భవిల్లిన నుచితభంగి
సకలసామంతపరివారసమితితోడ
విక్రమాదిత్యవసుమతీవిభుఁడు విడిసె. 56

చ. తలఁచినమాత్ర, బాత్రిక సుధామధురాన్నము లుద్భవింపఁగాఁ,
బలుమఱుఁ గంధ రాల్చిన నపారధనంబులు పంకవింపఁగాఁ,
గొలఁదికి మీఱుసైన్యములకుం బరితృప్తి యొనర్చె ధారణీ
తలపతి యిష్టభోజనవిధానమునన్ విపులార్థసత్కృతిన్. 57

వ. ఇవ్విధంబున సకలసైనికులను సంతోషితస్వాంతులఁ గావించి, పేరోలగం బున్నసమయంబున శకమహీశ్వరురాయబారి చనుదెంచి, సముచితప్రకారంబునం బ్రవేశించి నిశ్శంకంబుగా సాహసాంకనరేంద్రుని కిట్లనియె.

## శకన్నపాలుని రాయబారము

ఉ. మున్ను శకకుమారమణముఖ్యుఁ డనంగవతిన్ వరింప, వే
డ్క న్నిజసర్వసైన్యబలగర్వము మీఱ విదర్భమీఁద, న
త్యున్నతశక్తిమై విడిసి యుండఁగ; నీ వొకపోటుబంటవై
మిన్నక వచ్చి తేల, పులిమీసల నుయ్యెలలూఁగ వచ్చునే? 58

సీ. ప్రియతనూజులపే వెట్టి వెంపొందిరి
మాళవ పాళమగధపతులు
వేఁటఁ గప్పంబు చ్చి వర్ధిల్లిరి
సౌవీరసౌరాష్ట్రనగరనృపులు

పుత్త్రిల గిరవులు పుత్తెంచి బ్రతికిరి
కుంతలాపంతీశకుకురవిభులు
కన్యలఁ గొనితెచ్చి కానుకఁగా నిచ్చి
మనిరి కాళకరూశమద్రపతులు
తే. జగతి నేరాజు మారాజుచరణయుగము
గాంచి కొలువనివాని నేఁ గాన నెందు,
గాదమున మాటుపడియున్న కాయవోలె
నుజ్జయిని డాఁగియున్న నీ వొకఁడుదక్క. 60

తే. కాకతాళీయముగ మహాకాళికరుణ
నుజ్జయినిరాజ్యవైభవ మొనరెఁ గాక
యట్టిచేరులు గోయుట లెట్టియరిది
యెలుక గొఱకదె యటువంటి వెన్నినైన. 61

క. ఇప్పుడు శకవిభుఁ జెనకుట
యెప్పుదుసూ! మున్న బొంతయును లాతమునుం
గప్పెరయును బాదుకలును
జొప్పడినవి, బ్రతుకుటొప్పు జోగియుఁబోలెన్. 62

చ. పలుకులు వేయు నేటి కిఁక, బ్రాహ్మణసూనుఁడ వీవు, నీకు దో
ర్బలమున కేమి కారణము; బాఁపనపోటును గప్పు కాటునుం
గలదె ధరిత్రి? భట్టిమొన గట్టిగ నమ్మకు మోసపోకు, నీ
కొలఁదులె రాచకార్యములు కోమటిబుద్ధులఁ దీర్పఁ దీఱునే? 63

ఆ. శకనరేంద్రచంద్రచరణాబ్జసంసేవ
విడిచి, యావిదర్భవిభునిఁ గలసి
వచ్చు; టోడ విడిచి *వదరు పట్టుట సుమీ
చెప్పఁదగినమాట చెప్పినాఁడ. 64

---

* సొరకాయ.

వ. అనినవిని ప్రహసితముఖారవిందుండై సుమతిసూనుండాక్షేపవాగ్గర్భితం
బుగానిట్లనియె. 65

క. ఇట్టి వివేకమహోన్నతి
యిట్టినయోచితవిహార మేరికిఁ గలదే ?
యిట్టినిను దూతఁగాఁ జే
పట్టినపతి వేఱె భాగ్యపరుఁ డన నేలా ! 66

వ. అని మఱియు నిట్లనియె. 67

తే. తొల్లి యొకకాకి రాయంచఁ దొడరినట్లు
శకుఁడు సమరనిశ్శంకుని సాహసాంకుఁ
జెనకఁజూచుట యెన్న, నీతనికిఁ దనకు
హస్తిమశకాంతరము గాదె యలవుకలిమి. 68

క. మాటలు పదివేలాడినఁ
బోటరియై రణములోన భుజబలమెల్లం
దేటపడఁ జూపకుండిన
మేటియశం బేల కలుగు మీరాజునకున్. 69

శా. భూచక్రాఖిలరాజ్యభోగ మొనరుం బోరన్ జయం బందినం,
బ్రాచీనాయకలోకలోలనయనావంచాప్సరః కేళికళా
వైచక్షణ్యము సంభవించుఁ గదనవ్యాపారతన్ మాలినన్;
"కా చింతా మరణే రణే" యనుట నాకర్ణింపవే యెన్నఁడున్. 70

ఉ. ఇంచుక సూదివేదన సహించినమాత్ర నృపాంగనాకుచో
దంచితసౌఖ్యకేళి సతతంబును *గంచులి గాంచు, నాజి ని
ర్వంచనఁ దీవ్రబాణనికరక్షతదేహుల కబ్బవే మరు
చ్చంచలలోచనాఘనకుచస్తబకద్యుతిసంగసౌఖ్యముల్. 71

క కావున, మీభూవిభునకు
నీవిధ మంతయును దెలియ నెఱిఁగించి, రణ

* అవిక

శ్రీవిక్రమంబు నెఱపఁగ
రావింపుము, రజ్జులాట రాజోచితమే ? 72

వ. అనియె, ననంతరంబ విక్రమార్కమహీపాలుండు శకభూపాలుదూతకుఁ గనకమణిభూషణాంబరతాంబూలాదిసత్కారంబు లొనరించి, వేత్రవతీ తటంబు పుణ్యస్థలంబుగావున నెల్లియుద్ధంబునకు సిద్ధపురీశ్వరుండిచ్చటికి సన్నద్ధుండై వచ్చునట్లుగా నెఱింగింపుమనివీడ్కొలిపి, తద్వృత్తాంతం బంతయు విదర్భేశ్వరునకుం జెప్పిపంపి తదానీతంబులైనయుపాయనంబు లంగీకరించి, నిజభృత్యామాత్యులం దమతమనివాసంబులకుఁ బోవం బనిచిఁ సముచితప్రకారంబున నుండి మఱునాఁడు ప్రభాతసమయంబున.

క. నానామంజులమాగధ
గానధ్వను లెసఁగ మేలుకని, సంధ్యాదుల్
పూని యొనరించి, బహువిధ
దానానందితవిశిష్టధరణీసురుఁడై. 74

క. తరుణాంగరాగమాల్యా
భరణప్రభ లలర, నుదయపర్వతముపయిం
గర మొప్పునరుణుఁడో యన
నరదముపై నెక్కి విక్రమార్కుఁడు వెడలెన్. 75

క. దక్షిణనయనాస్పందము
దక్షిణపవనానుకూలతయు నిజవిజయం
బక్షయముగ నెఱిఁగింపఁగ
నాక్షణమున సాహసాంకుఁ డానందించెన్. 76

క. అటమున్న భట్టియనుమతిఁ
బటుగతిఁ బడవాళ్లు సైన్యప్రతతులకెల్లం
జటులతరసమరలీలా
ఘటనకు వెడలుఁడని యెఱుఁగఁగాఁ జెప్పుటయున్. 7

## విక్రమార్క సిద్ధపుర్గీశుల యుద్ధము

సీ. సంగరసన్నాహసమయం బెఱింగించు
నిఖిలమంగళతూర్యనిస్వనములుఁ
గట్టుమట్టుననుండి కదలించినఁ జెలంగు
భీకరశుండాలబృంహితములు
రథములఁ గట్టి సారథులు ముట్టిన మిన్ను
దన్నెడి *రథ్యనిధ్వానములును

తే. గలసి విలసిల్లుసాహసాంకక్షితీంద్ర
చంద్రుశిబిరాంగణస్థలి సాంద్రరవము
పూర్ణచంద్రోదయోదీర్ణఘూర్ణమాన
మగుమహార్ణవఘోషంబు ననుకరించె. 78

క. సందీపితరిపుకుంజర
సందళనక్రీడనైకసాహసలీలా
నంద మలర, సింగంబుల
మందగతి న్వీరభటసమాజము నడచెఁ. 79

మ. పిలయారంభవిజృంభణంబున సముద్వేలంబులై, కుంభినీ
వలయంబుం గబళింపఁగైకొను మహావారాకరానీకవీ
చులభంగిన్, జవసత్త్వవిస్ఫురణలం జూపట్టి యప్పట్టునన్
విలసిల్లెం దురగంబు. లాశ్వికులకున్ వీర్యం బవార్యంబుగన్. 80

చ. సలలితగండమండలము సన్మదధారల నివ్వటిల్లఁగా
నలఘువినూత్నరత్నకనకాంచితభూషణదీప్తులొప్పఁగా
వెలువడె నున్మదద్విరదబృందము, నిర్ఝరదీప్రవల్లికా
కులకలితంబులై ననడగొండలతండముఁ గ్రేణిసేయుచున్. 81

క. దివినుండి భువికి డిగ్గిన
దివిజవిమానము లనంగ, దివ్యమణివిభా

* రథ్యనిశానములును. అని వా. 192౮.

నివహము దిశలకు నిగుడఁగ
నవలీలన్ వెడలె నప్పు డరదములగముల్. 82

మ. ప్రతివీరప్రళయాంతకుండగు విదర్భక్షోణిపాలుం డినా
యత తేజుండని సాహసాంకమనుజేంద్రాలోకసంభావనో
చితసంభాషణమాధురీమహిమచేఁ జిత్తంబు లార్జించుచుం
జతురంగంబులఁ దోడుసూపె సమరోత్సాహైకసన్నాహుఁడై. 83

ఆ. దేశకాలబలము దెలిసి దైవబలంబు
కలిమి నచ్చి బాహుబలము బెరయ
మూలబలముతోడ మోహరంబుగఁ దీర్చి
సుమతిసుతుఁడు సైన్యసమితి నడపె. 84

క. ద్విరదములకు నరదములును
నరదములకు నశ్వములును, నశ్వంబులకున్
వరభటులును, వరభటులకు
నరిగెలవారలును బన్నిరగ్రేసరులై. 85

ఉ. అంతకు మున్న, సిద్ధనగరావనినాథునిదండనాథుఁ డ
త్యంతబలాభిరాముఁడు మహారథనాముఁడు సర్వసైన్యమున్
సంతనకట్టె, బాహుబలసారధనుండు విదేహధారణీ
కాంతుఁడు శాలివాహనుఁడుఁ గయ్యపువేడుకతోడఁ దోడుగన్. 83

క. ఆ రెండు సేనలందును
వీరాగ్రేసరులు సమరవిక్రమకేళీ
ప్రారంభజృంభణాహం
కారత నొండొరులమీఁటి కనుపట్టి రాగిన్. 87

క. భీకరసంగరలీలా
లోకనకౌతుకదిగీశలోకేశసుధా
నీకవిమానంబులచే
నాకాశము నిరవకాశమై విలసిల్లెన్. 88

వ. ఇవ్విధంబునం బ్రతిఘటించి, పూర్వాపరసముద్రంబులుంబోలె వీరరసో
ద్రేకంబున విజృంభించి. 89

సీ. అరుణదృగ్గుచులును నాయుధప్రభలును
మార్తాండదీప్తితో మాఱుమలయ
హుంకారములు భేరిభాంకారరవములు
వలయాద్రిఁ బ్రతివిరావముల నినుప
సింహనాదంబులు శింజినీధ్వనులును
నాశాకరులగుండె లదరఁజేయ
నట్టహాసంబులు హయహేషితంబులు
గగనంబు తోరణకట్టికొనఁగ
తే. నుభయబలములసుభటులు నుగ్రవీర
రసవిజృంభణ మరుదుగా రహిఁ గడంగి
కదియునప్పటిపటుపాదఘట్టనమున
నుర్వి యంతంత నుట్టూఁత లూఁగఁదొణఁగె. 90

ఉ. అత్తఱి, సాహసాంకమనుజాధిపుబంధురగంధసింధురో
దాత్తకపోలమండలమదద్రవధారలతావు లెక్కొనం,
జిత్తము లత్తఱిం జెదిరి సిద్ధపురీంద్రచమూగజేంద్రసం
విత్తమదంబు లింకె, నరిబృందము డెందము చిన్నవోవఁగన్. 91

వ. అంత. 92

మ. దివిజస్త్రీకుచకుంభకుంకుమముతో, దివ్యాంగనావీటికా
నవకర్పూరరజంబుతో, నమరకాంతాదేహహారిద్రపం
కవిశాలోన్నతితో, సురీనిటలభాగన్యస్తకస్తూరితో
నవనీరేణువు సాటియై పరఁగె నాశాకాశకీమంబులన్. 93

చ. కలయఁగ ధూళి దృగ్గుచులు గప్పిన, జోదులు శబ్దవేదులై
పెలుచఁ గడంగి, నేమిరవబృంహితహేషితసింహనాదసం

కులముగ నుల్లసిల్లు రధకుంజరఘోటకసద్భటావళిం
గొలఁదికి మీఱఁగా ధరణిఁ గూల్చిరి బాణపరంపరాహతిన్. 94

ఉ. అప్పుడు, కుండలీకృతశరాసనులై విలుకాండ్రు తూపులం
గప్పిరి నింగి, నాంగికముగాఁ గయిసేసినవన్నె లన్నియుం
జిప్పిలు దట్టపుంజెమటఁ జిందఱవందఱగాఁగఁ జాల నిం
పొప్పఁగఁ దీవ్రభానుకిరణోగ్రత సడ్డము చేసిరో యనన్. 95

ఉ. చాపము లింద్రచాపములచందము చూపఁగఁ, గెంపుసొంపువా
ల్దూపులక్రొమ్మెఱుంగులకుఁ దోడుగఁ దర్జనగర్జ లొప్పఁగాఁ,
జాపధరాంబువాహములు సాయకవృష్టుల యేపుసూప, ను
ద్దీపితరక్తవాహినులఁ దెప్పలఁదేలెను భూతసంఘముల్. 96

చ. బలములు రెంటఁ బేరుగలబంటులరోషమహానలంబులం
దొలిదొలి ధూమముల్ నిగిడి తోన శిఖావళు లంకురించి ని
ప్పులు ధరమీఁదఁ బేర్చుక్రియ భూరజముల్ దివిముట్టిరక్తధా
రలు గనుపట్టి తొట్టె సమరస్థలి నెల్లను మాంసఖండముల్. 97

వ. అట్టియెడనుభయబలంబుల నుభయబలంబులును, సేనాముఖంబుల సేనాముఖంబులును, గణంబుల గణంబులును, వాహినుల వాహినులును, నక్షౌహిణుల నక్షౌహిణులును, దలపడి సన్నాహంబుల సముత్సాహంబులు పోషింపఁ, గోపంబు లాటోపంబుల భూషింప, హుంకారంబు లహంకారంబుల ముదలింపఁ, జలంబు లచలంబులం బొదలింప, నవార్యంబు లగు శౌర్యంబులు, నఖర్వంబు లగుగర్వంబులు, నశాంతంబు లగుపంతంబులు, నవరోధంబు లగువిరోధంబులు, నఖేదంబు లగుసింహనాదంబులు, నద్భుతారంభంబు లగుసంరంభంబులు నుల్లసిల్లఁ జలంబులు వదలక, బలంబులు ప్రిదులక, ధీరంబు లెడలక, బింకంబులు సడలక, బిగువులు దక్కక, బిరుదులు స్రుక్కక, వెలవెలంబాఱక, వెన్నుచూపి జాఱక, తాలిమి దింపక, మాలిమిఁ బెంపక, తలఁగక మలఁగక, విఱుగక సురుఁగక, కేడింపక జోడింపక, వెఱవక చేమఱవక, అత్తళంబులఁ గత్తళంబులు సించియు, శరంబుల శిరంబులు ద్రుంచియుఁ, గుంతంబుల దంతంబులు పొడిచేసియు,

నారసంబుల నీరసంబుల నేసియు, పరిఘంబులఁ గేతనంబు లడిచియు,
శూలంబుల ఫాలంబులు వ్రొడిచియుఁ, గత్తుల నెత్తులు వగిలించియు,
బల్లెంబుల నెల్లెంబుల నొగిలించియుఁ, గుఠారంబులఁ గఠారంబుల మర
ల్చియు, వీరావేశంబుల విహరించునవసరంబునం, బతి యవసరంబు
నెఱపం దెఱపి గని, వెఱవిడి తఱపికొన్న విధంబున శిబిరంబు చొచ్చి,
బలుమగలం బరిమార్చి యార్చి, పేరువాడి వీరాలాపంబు లాడువారును,
బొమ్మలుగాఁడి వీఁపుల వెడలి నేలం గీలుకొనియున్న తోమరంబు లాధా
రంబులుగా నిలిచి, గతప్రాణు లయ్యును సమీరసంచారంబునఁ జలించు
కతంబునఁ జేతనులుం బోలెఁ బరులకు భయం బాపాదించువారును, ద్విర
దంబు లరదంబులం బోరల నెత్త నొరగిన యారసంబున నాభీలంబు లగు కర
వాలంబులు వెఱికి దంతకాండంబులతోడన కండతుండెంబులుగా ఖండించి,
చిత్రలీలావిలాసనిరవధికులని యమరవరుల చేతం బొగడు వడయువారును,
బహుముఖంబు లగు శరముఖంబుల మర్మోద్ఘాటనంబు సేయుటంజేసి వర్మం
బులతోడన చర్మంబులు సించిన రక్తప్రసిక్తంబు లగు శరీరంబులు చెంది
రపుఁగీలుబొమ్మలట్ల చెలంగం, గలన నెక్కటికయ్యంపు నెయ్యంబునం
బెనంగువారును, గరవాలభిండివాలప్రముఖప్రహరణంబులు ప్రతిహతంబు
లగుటయు రయంబునం బ్రతిభటప్రయుక్తంబు లగు నాయుధంబులు
గైకొని పరాక్రమించువారును, నెత్తురుల జొత్తిల్లిన యంగకంబులు పల్లవి
తంబులైన యశోకంబులును, బుష్పితంబులైన కింశుకంబులును, శలాటు
కీలితంబులైన వటంబులును, ఫలితంబులైన కింపాకంబులునుం బోలె నుల్ల
సిల్లం బెల్లగిలక కయ్యంబు సేయువారును, నయిదుపది సేయక యవక్ర
విక్రమంబునం బరాక్రమించి చని, దేదీప్యమానంబులయిన దివ్యవిమా
నంబు లెక్కి, కృతాలింగనలైన సురాంగనలకు హర్షోత్కర్షంబుగాఁ దమ
చేత వికలాంగంబులైన చతురంగంబులం జూపి పౌరుషంబులు ప్రకటించు
వారును నై, కలహభోజన నయనపారణంబైన దారుణరణవిహారణం బొన
రించుసమయంబున. 98

ఉ. ఏమెయి రెండువాహినుల నెక్కువతక్కువ యింతలేక సం
గ్రామము సేయునప్పుడు, పరాక్రమ మొప్పఁగ శాలివాహన

జ్ఞామహీశేశ్వరుండు విలసద్బలసంపదసొంపు చూపినం,
దామరపాకునీటిక్రియఁ దల్లడమందెను వైరిసైన్యముల్. 99

క. నిజబలము వీఁగఁజాఁచిన
భుజబల మలరఁగ విదర్భభూవరుఁడు మహా
గజ మబ్జినిఁ జొచ్చినగతి
విజిగీష విదేహసైన్యవితతిఁ గలంచెన్. 100

చ. అతనిమహోగ్రవిక్రమసమగ్రత సైఁపక, శాలివాహనుం
డతిశితశక్తి వైచిన, నహంకరణస్ఫురణ విదర్భభూ
పతి యతితీవ్రబాణముల భగ్నము సేయుటయు, న్విదేహరా
జతులితచాపహస్తుఁ డయి యవ్విభుపై శరవృష్టి నించినన్. 101

చ. కనుఁగవఁ గెంపుసొంపడరఁగా నతఁ డానరనాథుచాపముం
దునిమి, హయంబుల జదిపి, తోడనె సారథి నేపుమాపి, కే
తనము ధరిత్రిఁ గూల్చిన, రథంబును గ్రక్కున డిగ్గి యాతఁడుం
గినుక దలిర్ప సైనికుల గీటణఁగించెఁ గృపాణపాణియై. 102

క. అంత విదర్భేశుఁడు విల
యాంతకుగతి నాక్రమించి, యవ్విభు నడిదం
జెంతయు బెడిదపుఁదూపుల
నింతింతలుతునియలై మహిం బడ సేసెన్. 103

తే. ఏసి, కంఠము గుఱిచేసి యేయఁ దలఁచి
శరము దొడిగినమాత్ర నచ్చెరువుగాఁగ
నారితోడనకూడ బాణాసనంబుఁ
దునిమె నొక్కుమ్మన మహారథుండు గడఁగి. 104

వ. ఇవ్విధంబున సురక్షితదేహుండై విదేహుండు తత్సమయసమానీతం బగు
నొండురథంబెక్కి పరాక్రమించుటయును. 105

తే. అమ్మహారథ శాలివాహనులమీఁద
భల్లనవకంబు సేసిన భట్టిమేన
వారలును సేసి రన్నేసి వాలుటమ్ము
లాహవమ్మున సీడ జోడాడినట్లు. 106

వ. మఱియును. 107

క. అయిరువురు నమ్మెయిఁ దన
నేయుశరావళుల నెల్ల నిసుమంతలుగాఁ
జేయుచు భట్టియుఁ దర్పున
కాయనిషంగముల సాయకంబుల నించెన్. 108

క. అసమరప్రౌఢికి మది
రోసించి, విదేహనరవరుండు చమూపా
గ్రేసరులకుఁ జెయిచీచిన
నాసురగతి శకబలంబు లతనిం బొదివెన్. 109

వ. అట్లు పొదువుటయును. 110

సీ. మొక్కలంబునఁ జొచ్చి ముక్కోనప్రయ్యఁగా
భటకోటిచట్టలు వాపివాపి
యారోహకులతోన హయములఁ గబళించి
పేమాలు నేలతో వ్రేసివ్రేసి
భద్రేభములు వీఁపుపఁ జాఁకఁ గోల్కొని
గుంజెలు వగులఁగఁ గ్రుమ్మిక్రుమ్మి
రథ్యసారథులతో రథము లుద్ధతిఁ బట్టి
దిద్దిఱ వినువీథిఁ ద్రిప్పిత్రిప్పి
తే. విమతరాజన్యవరసైన్యకమలషండ
ఖండనోద్దండవిహరణక్రమనిరూఢి
నెదురులేక రణంబులో నేపుమాపె
భట్టి జగజెట్టి దీకొల్పు భద్రగజము. 111

తే. ఆకరీంద్రుని యీయాటోప మపనయించి
మాఱుకొన్న విదర్భేశుఁ జూఱఁదోలి
సాహసాంకక్షమానాథచంద్రు నెదిరి
సిద్ధపురినాథుఁ డిట్లనుఁ జేవ మెఱసి. 112

సీ. అత్యద్భుతము లైనయమ్ములసొమ్ములు
కుటిలమార్గమునఁ గైకొనఁగవచ్చు
నింద్రజాలపువిద్య నెచ్చోటనైనను
బయలు పట్టణముగాఁ బన్నవచ్చుఁ
గపటంపుఁగంథచేఁ గలిగినయర్థంబు
సకలార్థులకు వెదచల్లవచ్చు
నాకలోకాధీశు నటనమాటలఁ దేల్చి
వరరత్నపీఠంబుఁ బడయవచ్చుఁ
తే. గాక, పరిపంథిదర్పాంధకారహరణ
సుప్రతాపప్రదీపవిస్ఫురణశరణ
పటుశరాయసనుకృపాణపాణి నైన
నను నెదుర్కొని, యని నీకుఁ జెనక వశమె ? 113

మ. అని, సంరంభవిజృంభణస్ఫురణమై, నావిక్రమార్కక్షితీం
ద్రునిపై నంపపరంపరల్ గురియఁగాఁ, దోడ్తో నతం డన్నియున్
ఘనశస్త్రాహతిచే నణంచి, విలసత్కాండప్రకాండంబులం
దునిమెం గేతనరథ్యసారథిరథస్తోమంబుఁ జిత్రంబుగన్. 114

ఉ. ఒండొక తేరు గైకొని సముద్ధతి సిద్ధపురీశ్వరుండు కో
దండగుణధ్వనుల్ చెలఁగఁ దచ్చతురంగవరాహవక్రియా
పండితమూర్తియై మెఱసి పావకసాయక మేసె, నాత్మలో
మండెడుకోపవహ్ని నరిమండలిపైఁ బచరించుపోలికన్. 115

క. ఆవిశిఖశిఖికిఁ దలఁ కొక
యావంతయు లేక విక్రమాదిత్యధరి

త్రీవరుఁడు వనధివల్లభ
దైవత్యం బైనశర ముదగ్రత నేసెన్. 116

సీ. మెఱుఁగులు గ్రక్కెడుమేఘాస్త్ర మేసినఁ
బవనబాణంబునఁ బరిహరించె
విషము లుమియుకాద్రవేయాస్త్ర మేసిన
గరుడబాణంబున గర్వ మణఁచె
సమధికోన్నత మైనశైలాస్త్ర మేసిన
నింద్రబాణంబున నేపు మాపె
దృష్టినిరోధం బైనతిమిరాస్త్ర మేసిన
నరుణబాణంబున విరియఁ జేసె
తే. నిత్తెఱంగున శకధారణీశదివ్య
శరపరంపరఁ బ్రతిబాణసమితి నణఁచి
యదరి పుంఖానుపుంఖనానాస్త్రశస్త్ర
వితతి నందంద యతనిపై వెల్లిగొలిపె. 117

వ. ఇట్లు నిరర్గళప్రసారంబు లైనశరాసారంబులకు మిసిమితుండుగాని శక మహీకాంతునిం జూచి యాశ్చర్యధుర్యుం డై, సాహసాంకనృపవరుండు భట్టితో నిట్లనియె. 118

ఉ. ఇంతకుమున్ను నన్ను నోరుఁ డెవ్వఁడు మార్కొని యింతసేపు వి
క్రాంతి వహించి మించి భుజగర్వము చూపినవాఁడు లేఁడు, నేఁ
డెంతయు మేటియై శకమహీపతి దివ్యశరప్రయోగదు
ర్దాంతనితాంతనైపుణధురంధరుఁడై యనిసేయు టెట్లొకో? 119

వ. అనిన సుమతిసూనుం డిట్లనియె. 120

క. ఉగ్రుం డితఁ డొనరించిన
యుగ్రతపంబునకు మెచ్చి, యొసఁగినవరసా
మగ్రి యిది, యితని నోరుఁడు ర
ణాగ్రంబున నెదిరి గెలుచు టరిది నరేంద్రా! 121

వ దీనికిం బ్రతివిధానం బొకటి విన్నవించెద నది యవధరింపు మని యిట్ల
నియె. 122

మ. చరణాబ్జంబులు యోగపాదుకలతో సంధించి, యాకాశసం
చరణారంభవిజృంభమాణరణదీక్షాదక్షత న్మించి, వా
విరి బ్రహ్మాస్త్రము నిన్న రేశ్వరునిపయిఁ‌ వేగం బ్రయోగింపు; సు
స్థిరలీలన్ సమకూరు నీకు జయలక్ష్మీనిత్యసాంగత్యముల్. 123

తే. అనిన సౌమతేయునిబుద్ధి కాత్మ నలరి
చరణములఁ బాదుకలు మెట్టి చదల నిలిచి
మంత్రతంత్రానుసంధానమార్గశుద్ధి
వెలయ, బ్రహ్మాస్త్ర మేసె నవ్విమతుమీఁద. 124

శా. ఆదివ్యాస్త్రము భీషణానలశిఖాహంకారశంకావహ
ప్రాదుర్భూతపటుస్ఫులింగపటలీ ప్రచ్ఛన్నదిగ్భాగమై,
యౌదార్యంబున వాసవాదిసకలాశాధీశవ్యూహాన్మాలముల్
భేదిల్లం జని, సంహరించె జగదాభీలున్ శకక్షోణిపున్. 125

వ. ఇవ్విధంబున శకక్షోణీశ్వరుండు హతుం డగుటయు నద్దివ్యబాణంబు నుప
సంహరించి, హతశేషులై నవిరోధివరూథినీనాథులకు నభయప్రదానంబు
దయచేసి, ప్రధానపురస్సరుండై వచ్చి శరణంబుసొచ్చిన శకమహీనాథ
నందనుం గనుంగొని కరుణించి తదీయ సామ్రాజ్యంబునం బ్రతిష్ఠించి. 126

సీ. నవరత్నమయభూషణస్ఫారరణభూమి
విలసిల్లుకల్యాణవేది గాఁగ
దళితకుంజరకుంభకలితమౌక్తికరాజి
కమనీయ శేషాక్షతములు గాఁగ
సమరసంక్రీడనసందర్శనాగత
సురకోటి పెండిలిదొరలు గాఁగ
బహువిధజయతూర్యపటునిస్వనంబులు
రమ్యమంగళవాద్యరవము గాఁగ

తే. నుచితకాలజ్ఞుఁడగు భట్టి యొజ్జ గాఁగఁ
జటులమైనప్రతాపాగ్ని సాక్షిగాఁగ
విజయలక్ష్మీసముద్వాహవిలసనమున
సాహసాంకమహీనాథచంద్రుఁ డొప్పె. 127

వ. అప్పుడు తదీయమహనీయపరాక్రమప్రభావంబునకు హర్షించి, శతమఖ ప్రముఖబర్హిర్ముఖు లతనిపై దివ్యప్రసూనవర్షంబులు గురియించి, తమలో నిట్లనిరి. 128

సీ. పాథోనిధానంబు బాణాగ్రమున నిల్పి
గరిమమీఱిన చాపధరుఁడు దక్కఁ
బెనుఁగూపమునఁ బడ్డ పృథుకందుకము బాణ
తతిఁ బుచ్చియిచ్చిన ధన్వి దక్క
నఖిలరాజులు చూడ యంత్రమత్స్యము నేసి
ప్రౌఢిమించిన ధనుఃపాణి దక్క
ననిలోనఁ బరశురామునకు మిక్కుటముగాఁ
గడిమిచూపిన విలుకాఁడు దక్కఁ
తే. జిత్రకోదండవిద్యావిశేషసహజ
సాహసక్రమవిక్రమోత్సాహలీల
విక్రమాదిత్యవసుమతీవిభునిఁ బోల
నన్యరాజన్యవరులకు నలవి యగునె! 129

వ. అని యనేకప్రకారంబులఁ బ్రశంసించుచు నిజనివాసంబులకుం జనిరి. తద నంతరంబ పటుపటహభేరీమృదంగాదిమంగళతూర్యనిస్వనంబులును బాఠక పఠనరవంబులును, మాగధగీతికానినదంబులును, వందిసంకీర్తనస్వనంబును, సముద్భటసుభటవీరాలాపకలకలంబును నభంబు నైసర్గికగుణంబు నాపా దింపఁ, ద్రిభువనభవనమోహనాకారరేఖారమానందనుండైన రాగమంజరీ నందనుండు, నిజసౌందర్యసందర్శనాలోల లోలలోచనాలోచనకువల యితగవాక్షలక్షితప్రాసాదశోభాకరంబైన విదర్భానగరంబు ప్రవేశించి, ప్రాగ్ద్వారవేదికానివేశితసముదీర్ణపూర్ణకుంభంబును, రంభాస్తంభసంభా వనానందనందనమాలికావిలసనంబును, భూసురాశీర్వాదమేదురంబును,

విశాలవిజృంభిత జగజ్జేగీయమానగౌరీకల్యాణగానపరికల్పిత కర్ణపారణం బును; విదర్భేశ్వరదర్శితంబునైన తదీయప్రధానాగారంబున విడిసి, సకల సైన్యంబును సముచితప్రదేశంబుల విడియింప సుమతిసూను నాజ్ఞాపించి, విదర్భేశ్వరుని నిజనివాసంబునకుఁ బోవ నియమించిన, నతం డిట్ల నియె. 130

విక్రమార్కుఁడు విదర్భరాజపుత్రికను వివాహమాడుట

క. దురమున నెదురై యేరికిఁ
బరిమార్పఁగ రాకయుండఁ బరమేశ్వరుచే
వరములు గాంచినశకవిభుఁ
బొరిగొంటివి, నీకు నితరభూపతు లెనయే ? 131

చ. కుమతి శకుండు మత్పురముకోటపయిన్ విడియంగ, నెంతయుం
గమలదళంబుమీఁదియుదకంబునుబోలెఁ జలించునాదుడెం
దము, భవదీయశౌర్యసముదగ్రతప్రాపున నుల్లసిల్లి, సిం
హము మెడగంటవోలె నభయంబునఁ బొందె వసుంధరేశ్వరా ! 132

చ. హరునివరంబునం గనినయాత్మజఁ, బట్టపుదేవి గాఁగ నో
నరవర ! నీకు నిత్తు నని నామదిఁ గోరిక సంభవింప సు
స్థిరతరకీర్తిసంపదలఁ జెంది సుఖింపఁగఁ గంటి, రాజశే
ఖరునకుఁ గూఁతు నిచ్చి నుతి గాంచినశీతనగేంద్రుకైవడిన్. 133

చ. జనవర ! నీపురోహితుల శాస్త్రరహస్యనిరూపణక్రియా
వనజభవప్రభావు లగువారి, ముహూర్తము నిశ్చయింపఁగాఁ
బనుపు, 'శుభస్యశీఘ్ర' మనుపల్కు నిజం బొనరింపు మన్న, గొ
బ్బునఁ బతిచిత్తవృత్తిఁగని భట్టి విదర్భుఁడుఁ దాను వేడుకన్. 134

క. ఉభయపురోహితసమ్మతి
శుభలగ్నము నిర్ణయించి, సొంపుగఁ బురికిన్
విభవోచితశృంగారము
నభినవముగఁ జేయఁ బనుచు నాక్షణమాత్రన్. 135

సీ. కుడ్యభాగంబులఁ గుంకుమంబులు పూసి
వేదికాస్థలుల జవ్వాది నలికి ..

కస్తూరి ముంగిళ్లఁ గలయంపిగాఁ జల్లి
నిగ్గుఁగప్పురమున ముగ్గు వెట్టి
కంబాలఁ జీనిచీనాంబరంబులు చుట్టి
గోపురంబులఁ బైఁడి కుండ లెత్తి
మేడల ముత్యాలమేలుకట్టులు గట్టి
రత్నదీపిక లగారముల నుంచి
తే. కనకకాండరంభాస్తంభకలితముకుర
పట్టపటపుష్పచామరపల్లవాది
తోరణము లెల్లవీథులఁ దొంగలింపఁ
జేసి కైసేసి రభినవశ్రీలు మెఱయ. 186

వ. అంత. 187

సీ. మెఱుఁగులగతిఁజూపు మెఱుఁగుఁగన్నుల చూపు
పసిఁడికమ్మలమీఁదఁ బరిఢవింప
మొలకవెన్నెలనవ్వు మురిపంపులేనవ్వు
చెక్కుటద్దములపైఁ జెంగలింప
జక్కవకవమించు చనుఁగవనగుమించు
మణిహారదీప్తితో మచ్చరింప
హరినీలములఁగప్పు నలకల నునుఁగప్పు
కస్తూరితిలకంబు గారవింప
తే. నతివ మోహనమంత్రదేవతయొ నా, న
నంగవతి కాంతమన్నించు ననుఁగుబోటి
యగు చకోరికయను చకోరాక్షి వచ్చి
సాహసాంకమహీపాలచంద్రుఁ గాంచి. 188

తే. ప్రణతి యొనరించి సరససంభాషణముల
రాగమంజరిసుతమనోరాగ మెఱిఁగి
చిత్త మౌచిత్యవృత్తి వశీకరించి
విన్నమవుమీఱ నిట్లని విన్నవించె. 189

క. నినుఁ జూచినచూపులనే
తనుఁ జూడఁగ, నవును మదనతాపోపశమం
బనుచు విదర్భేశ్వరుసుత
పనుపఁగ, నినుఁ జూచువేడ్కఁ బనివింటిన్నృపా ! 140

వ. ఎట్లనినం దదీయదశావిశేషంబు లవధరింపుము. 141

క. దేవర మోహనలీలా
లావణ్యవిలాసగుణకలాపము లెమ్మై
భావింతురొ, యిట్లని నుతి
గావింతు రనంగవతిసకాశమునఁ జెలుల్, 142

సీ. కాంతామనోహరాకారుఁ డౌ మారుండు
సర్వజ్ఞకలహానిశ్చయుఁడు గాని
శ్రితపరిరక్షణస్థేముఁ డౌ రాముండు
వరపుణ్యజనభయంకరుఁడు గాని
మహితదివ్యాస్త్రసమర్థుఁ డౌఁ బార్థుండు
గురుసుతాప్రియగుణకరుఁడు గాని
సంతతవిభవనిస్తంద్రుఁ డౌ నింద్రుండు
కులగోత్రభేదనోగ్రుండు గాని
తే. యనుచు వారలగుణముల నపహసించు
సరణి, సర్వజ్ఞులును బుణ్యజనులు గురులుఁ
గులనగేంద్రులుఁ గొనియాడఁ గొమరుమిగిలె
విక్రమార్కమహీపాలచక్రవర్తి. 143

ఉ. ఆరసికాగ్రగణ్యునిసమంచితరూపగుణప్రసన్నగం
భీరతఁ గన్నఁ గామినుల పేరిటి రాలయినం గరంగు, సం
సారఫలంబు గాదె యెలజవ్వని ! నీకుఁ దదీయనర్మలీ
లారసనర్మకేళిరతిలాలితసౌఖ్యము సంభవించుటల్. 144

వ. అని యి ట్లనేకప్రకారంబుల. 145

చ. పలుమఱు నెచ్చెలుల్ సెవులపండువుగా నినుఁ బ్రస్తుతింపఁ, ద
త్సలలితసారభాషణసుధారసధారలఁ దొప్పఁదోఁగి, తో
య్యలి హృదయాలవాలమునయం దనురాగలతావితానముల్
మొలచు నెఱింగి యంగజుఁడు, మోహనబాణము నారిఁ గూర్చినన్ 146

సీ. నిలువుటద్దము సూడ, నెచ్చెలితో నాడ
సరసోక్తులకు నవ్వ, సరులు గ్రువ్వఁ
జిత్తరువులు వ్రాయఁ, జిలుకఁ బెండిలిసేయ
సరసాన్నము భుజింప, మరు భజింపఁ
దల్లిచిత్తము పట్టఁ, దారహారము వెట్టఁ
గ్రొవ్విరు ల్వేడఁ గూర్పఁ, గురులు దీర్పఁ
గనకసౌధముచేరఁ, గమ్మజాజులు గోర
నాట్యరంగము ద్రొక్క, నటన కెక్క
తే. హంసనడపింప, జలకేళి కగ్గలింప
వీణవాయింపఁ, బాన్పుపై విశ్రమింప
నెఱుఁగ; కి ట్లొక్కనాఁ డొకయేఁడు గాఁగ
బాల వలపంతఁ జింతించుచుఁ జెలఁగి. 147

వ. ఆకాంత కేకాంతంబున నిట్లంటి. 148

ఉ. ఇంతవిచార మేల తరళేక్షణ? యెంతటివాని నైన నీ
కాంతునిఁ జేయుదాన, రతికాంతునిపాదము లాన, నీకు నా
యంతటిబోటి గల్గఁ దగవా వగఁ జెందఁగ? నీమనోరథం
బింతయుఁ జెప్పు, వేమిటికి నేనుఁగు నెక్కియు దిడ్డి దూఱఁగన్? 149

క. నావుడుఁ దొంగలిఱెప్పల
క్రేవల నునుసిగ్గు లంకురింపఁగ, నాపై
భావానుకూలశీలా
భావితముగఁ జూడ్కి నిలిపి, బాలిక తనలోన్. 150

ఉ. చెప్పఁ దలంచు, సిగ్గు తనుఁ జెప్పఁగనీమికి సంచలించుఁ, దాఁ
జెప్పెడుమాట యెవ్వరికిఁ జెప్పకుమీ ! యనఁ జూచు, నంతటం
జెప్పక యుండ రాదు మఱి చెప్పఁగ రాదని కొంకు, నెమ్మెయిం
జెప్పక పోదు పా ! మ్మనుచుఁ జిత్తము నూల్కొనఁ జేసి యిట్లనున్ .151

తే. 'నిజకరస్పర్శ మొనరించి నీరజముల
నర్కుఁ డలరించునది యెంత యన్నకరణి
విని నయంతన విక్రమవినుతుఁ డైన
యర్కుఁ డలరించె నాహృదయాంబుజంబు'. 152

వ. అని భావగర్భితంబుగా నిన్నుఁ బేర్కొనుటయు. 153

మ. తలఁపోఁతల్ దల లెత్తెఁ, దాల్మి సడలెం, దాపంబు దీపించెఁ, జేఁ
తలు డిందెన్, ధృతి వీడుకోలు గొనియెన్, దైవాఱెఁ గన్నీరు, కో
ర్కులు గోవావులకోడలై నిగిడె, సిగ్గుల్ దూరమై పోయె, న
గ్గల మయ్యెం దమకంబు పద్మముఖికిం గందర్పుచే నెంతయున్. 154

వ. ఆసమయంబునం బ్రదీపించు నుద్దీపనవిభావప్రభావంబు భావించి, సోపా
లంభంబుగా నెచ్చెలు లి ట్లనిరి. 155

సీ. కుంభోదకముఁ బోసి యంభోజముఖి వెంపఁ
జూతంబు కొమ్మలు సూపఁ దొణఁగె
ఫలరసంబులు వోసి బాలిక పోషింపఁ
జిలుక మోమెత్తగాఁ జేసికొనియె
మూలమూలల దాఁచి ముద్దియ పాలింప
నలరులు ములుకులై యంటఁదఱిమెఁ
బ్రాణంబుగా నింతి భావింపఁగా గాలి
యంతకు దెసనుండి యాక్రమించె
తే. వెలఁదిచేసినమే లెల్ల వీటిఁబుచ్చి
యివి యకారణవైరులై యేపఁ జొచ్చె

జలజముఖులార! యన్యపుష్టముల కెందుఁ
గొమ్మఁ గొనిపోవు టారయ గుణముగాదె! 156

వ. అనుచు నమ్మదవతిమదనవికారంబులకుఁ బ్రతికారంబులు శీతలోపచారం
బులుగా విచారించి. 157

క. నవమకరందయుతంబై
ప్రవిమలసీహారసలిలపరిమిళితంబై
యువతాళించుజలమ్మున
నువిదకు మజ్జనవిధాన మొనరించి తగన్. 158

తే. జిగి దొలంకెడుచెంగల్వసెజ్జ నుంచి
గంద మందంద మెందంబునందు నలఁది
తరుణరంభాదళాంభోజతాళవృంత
పవనసంపాదనక్రియాప్రౌఢి మెఱసి. 159

ఉ. కట్టిరి సన్నపుందనుపుఁగావి కటీతటి, మేనితీఁగపై
నొ ిరి కమ్మపుప్పొడి, సమున్నత మైనకుచద్వయంబుపైఁ
బె రి క్రొత్తముత్యముల పేరులు, కంకణనూపురాకృతిం
జు రి పాణిపాదములఁ జొక్కముగా బిసకాండకాండముల్. 160

వ. మఱియును. 161

సీ. చంద్రకాంతపుఁగోరఁ జల్లనిపన్నీరఁ
దొరఁగెడుకన్నీరు తుడిచి తుడిచి
పుంచునఁ దోఁగినమించులేఁజిగురాకు
లొయ్యనఁ గరముల నొత్తి యొత్తి
కేటి ముట్టనిపువ్వుఁదేనియఁ బుప్పొడి
మెదిచి, పాదంబుల మెత్తి మెత్తి
పిర మైనపచ్చకప్పురము గందముతోడఁ
గలిపి పాలిండ్లపై నలఁది యలఁది

వ. అని యంతస్స్మితసంస్మితవదనుం డగుచు, సుధర్మా నగరంబునకుం జని
లీలావతీమందిరంబు ప్రవేశించుటయు. 81

సీ. దారపోరలు గాఁగఁ దాఁకిన ఘలుపచ్చి
కసమస వలరాచమసలతోడ
నక్కడక్కడ మేర నడ్డపాటులుగాఁగ
వైచిన గందంపువలపుతోడఁ
దొలకరించి నటించు మొలక సిగ్గులచేత
సుడివడి కడకొత్తు చూపుతోడ
నూరక మంటమై యుబ్బినవిరహాన
లపు శిఖ నెగయు నూరువులతోడ
తే. నెలమిఁ దనరారి దనదు కట్టెదుర నిలువఁ
బడిన విటచక్రవర్తి సౌభాగ్యమూర్తి
రసికజనముఖ్యుఁ బుష్పకరండకాఖ్యుఁ
దెలప కనుఱెప్పవెట్టక మిటిసి చూచె 82

క. చూచిన, వాఁడుఁ దలోదరిఁ
జూచెం బులకించి, చూపుఁ జూపును దమలో
ద్రోచికొని రాకఁ గ్రీడా
శ్రీచతురత మెఱయ సాముచేసె న్నడుమన్. 83

ఉ. ఇందునికందు వేర్పఱిచి, యిందునిచే సతిమోము చేసి; యా
కందును గుంతలంబులుగఁ గంజభవుం డొనరించెఁ, గానివాఁ
డెందును మోమునుం గురులు నిట్టివి గంటిమె! యీతలోదరిం
బొందనియట్టి వాని మగపుట్టువుఁ బుట్టువుగాఁ దలంతురే! 84

వ. అనుచు మనోహ రాలోల హేలా లలిత పాంచాలుండగు నప్పుష్ప
కరండకుం లీలావతీవిలాసినీ విలోకన వాగురుం దగిలి, యల్లనల్లనఁగది
యంజనుటయు.

మ. వరసౌభాగ్య విలాసమూర్తి యితఁ డెవ్వండొక్కో! యీరూప మె
వ్వరియందుం గనుఁగొంటిమే? యితని లావణ్యంబుఁ గన్నారఁ గ

ననిచి, యథోచితక్రియల నమ్మనుజేశ్వరు డుండునంత, స
ద్వినయధనుండు భట్టి చనుదెంచి నమస్కృతి చేసి, యిట్లనున్. 168

క. పురిశృంగారముఁ జూచిన
నరులకు నెల్లను నవాఙ్మనసగోచరమై
కర మొప్పుచున్న, దెల్లియ
పరిణయలగ్నంబు, వలయుపను లొడఁగూడెన్. 169

శా. భూపాగ్రేసర! యుష్మదీయచరు లుద్బోధింప నానావిధ
ద్వీపానీతగజాశ్వరత్నరమణీదివ్యాంబరశ్రేణిచే
నీపాదాంబుజసేవ సేయుటకునై నెయ్యంబుతో వచ్చినా,
రాపూర్వాపరదక్షిణోత్తరదిగంతానంతధాత్రీశ్వరుల్. 170

వ. అని విన్నవించి వారలఁ గానిపించుటయు. 171

క. సకలనృపప్రకరంబును
బ్రకటితముగ సాహసాంకుపదపీఠికకున్
మకుటమణిదీపకళికా
నికరము నీరాజనముగ నిర్వర్తించెన్. 172

వ. అప్పు, డప్పుడమిఱేఁడు తదానీతంబులైనపావడంబులు గైకొనియె,
నంతం దదనుమతివడసి భట్టియు రాజలోకంబును నిజనివాసంబులకుం
జనిరి. మఱునాఁడు శకమర్దనుండు ప్రభాతసమయసముచితకృత్యంబులు
నిర్వర్తించునంత, నక్కడ. 173

చ. హితులఁ బ్రధానవర్గముఁ గవీంద్రుల బంధుల మిత్త్రులం బురో
హితులను దండనాథుల మహీపతులం బరివారముం గళా
వతులను మాగధోత్తముల వందిజనంబు దిగంతరాగత
క్షితిపతులన్ విదర్భపతి శ్రీ వెలయంగ సభాంతసీమకున్. 174

వ. ప్రియపూర్వకంబుగాఁ బిలిపించి, గంధాక్షతకర్పూరతాంబూలంబు
లాదిగా సత్కారంబు లొనరించె, ననంతరంబ. 175

## వి హా హ వ ర్ణ న ము

సీ. సంప్రీతిఁ గిన్నరేశ్వరుఁడు పుత్తెంచిన
రమణీయచీనాంబరములు గట్టి
కడువేడ్క నాకలోకస్వామి యనిపిన
మందారకుసుమదామములు దాల్చి
వినయంబున దినేంద్రతనయుండు పంచిన
బంధురశ్రీగంధపంక మలఁది
భక్తితో భువనాధిపతి దూత తెచ్చిన
నవరత్నమయభూషణములు దొడిగి
తే. తనువిలాసంబు కనుఁబాటు దాఁకకుండఁ
గా నొనర్చిరి గాక శృంగార మనఁగ
పతియుఁ బతియును వచ్చి రప్రతిమలీల
సఖులు దోడ్తేర నుద్వాహసదనమునకు. 176

క. అత్తఱి విదర్భభూపతి
చిత్తంబున సంతసంబు చిగురొత్తఁగ, వి
ప్రోత్తములు వేదమార్గా
యత్తంబుగ నాచరించి రౌచిత్యంబుల్. 177

వ. తదనంతరంబ, మౌహూర్తికదత్తశుభముహూర్తంబున 178

క. సారోదారసుధారస
ధారాహోరానుసారి ధరణీదివిజో
దీరిత వేదధ్వనితో
గౌరీకళ్యాణమధురగానము మెఱసెన్. 179

ఉ. శ్రీ మెఱయం, బురోహితవిశిష్టమతంబున విక్రమార్కధా
త్రీమహీశేశ్వరుండు సముదీర్ణత నించినసేసఁబ్రాలు, కాం
తామణికేశభారమునఁ దద్దయు నొప్పె; మరుండు లీలతోఁ
గోమలనీలగుచ్ఛములఁ గూర్చినముత్తెపుజల్లి యో! యనన్. 180

వ. తదనంతరంబ. 181

సీ. పసిడికుండలమించు పాలిండ్లనునుమించు
కరమూలములకాంతిఁ గ్రాఁగలింపఁ
గరమూలములకాంతి కడలెత్తి యందంద
కేయూరదీప్తులఁ గిలుకొనఁగఁ
గేయూరదీప్తులు గిటికొని నెరసుతోఁ
గంకణద్యుతిమీఁదఁ గాలుద్రవ్వఁ
గంకణద్యుతి సోయగముమీఱఁ బలుమాఱు
రత్నాంగుళీయకప్రభలఁ జెనకఁ
తే. దనదు మెఱుఁగారుకెంగేలుఁదమ్మి యెత్తి
ప్రాణవిభుమౌళిపైఁ దలఁబ్రాలు వోయు
నపుడు, కాంతకు మైపుల్క లంకురించి
కోరకితమల్లికావల్లి కొమరుదాల్చె. 182

ఆ. ఇరువురందు నప్పు డెక్కువ తక్కువ
యింత లేక, కూర్మి యెఱుకపడియె
సహజరీతిఁ బుష్పశరుఁడు త్రాసునఁ దూఁచి
ప్రియముతోడఁ బంచిపెట్టినట్లు. 183

క. ఆలో, నాలోలేక్షణ
కేలం దనకేలుఁదమ్మి గీలించి, మహీ
పాలశిఖామణి లీలా
ఖేలగతి వివాహవేదికిం జనుదెంచెన్. 184

వ. చనుదెంచి హోమకార్యం బనుసంధించి. 185

క. సూరిజనసస్యసమితి న
పారముగా సాహసాంకవర్జన్యుఁడు, సొం
పారఁగఁ గంథాబంధుర
ధారాళకరాళకనకధారలఁ దనిపెన్. 186

ఉ. అంత, శకాంతకుండును దిగంతనృపాలకులున్ సమస్తసా
మంతులు భట్టియాది యగుమంత్రిజనంబు, విదర్భధారణీ
కాంతుఁడు దోడితేరఁ జని, గారవ మొప్పఁగ భుక్తిమండపా
భ్యంతరవీథిఁ దత్తదుచితాసనపంక్తి సుఖోపవిష్టులై. 187

సీ. మించుకన్నులు గోరగించు రాజాన్నంబు
నువమింపరాని సద్యోఘృతంబు
నమృతోపమానంబులగు పిండివంటలు
నుజ్జ్వలంబై యొప్పు నొలుపుఁ బప్పు
మది కింపుఁబెంచు కమ్మనిపదార్థంబులు
బహుపాకరుచులైన పాయసములుఁ
దగువాసనావాసితములైన పచ్చళ్లు
వడియఁగట్టిన యానవాల పెరుఁగు
తే. సరసమధురరసావళిసముదయములు
పంచసారసమంచితపానకములుఁ
గమ్మకస్తురినెత్తావిఁ గైవుచేసి
యూరుఁగాయలుఁ జల్లనియుదకములును. 188

వ. మఱియుఁ బచనరచనారంజితంబులగు బహువిధమాంసవ్యంజనంబులును, రసికరసనాతపఃఫలంబులగు పరిపక్వఫలంబులును, యువతికరనిర్మథితంబులగు మథితంబులు నుపయోగించి, రంభోరూకరాంభోజశాతకుంభసంభరితంబులును సుగంధబంధురంబులునగు జలంబులం గృతాచమనులై. విదర్భేశ్వరుండు ప్రియపూర్వకంబుగా నొసంగుతాంబూలాంబరమణిభూషణాదిసత్కారంబులు గైకొని, వివాహోత్సవస్తుతికథాముఖరులై, దిగంతరాగతు లగుమహీపతులను మఱియునుం దగువారును బాంధవులును దమతమదేశంబులకుం జనిరి. తదనంతరంబ. 189

మ. జవసత్త్వప్రభవప్రభావభరి తాజానేయవాహంబులన్
శ్రవణోత్సారితచంచరీకమదచంచద్వారణవ్రాతముఁ

నవరత్నాభరణవ్రజంబు నయనానం దారవిందాతులన్
నవశస్త్రావళులన్, వధూవరులకున్ వైదర్భుఁ డిచ్చెం దగన్. 190

క. చుట్టములసురభి వీవని
భట్టికిఁ, దగఁ బ్రియము చెప్పి, పంకజనయనా
పట్టాంశుకమణిభూషా
రట్టజహాయగంధసింధురంబుల నొసఁగెన్. 191

క. ఆసమయమునఁ గుమారిం
గై సేసి, తదీయజననిఁ గాన్పించి, చకో
రీసుదతి సుప్రయాణ
శ్రీసూచన చేసి, ప్రణతి సేయించుటయున్. 192

తే. తల్లిపాదంబులకు మ్రొక్కి తలిరుఁబోఁడి
యశ్రుపూరంబు ఱెప్పల నప్పళింపఁ
గలికికన్నులు మకరందజలము గ్రమ్మ
కమ్మతమ్ములతమ్ములై కరము మెఱసె. 193

వ. అత్తెఱంగెఱింగి, యమ్మహాదేవి యక్కుమారీరత్నంబు నక్కునం జేర్చి, చెక్కుటద్దంబులు పుణుకుచు నిట్లనియె. 194

సీ. ఏరాజు నుజ్జయినీరాజ్యపదమున
నంబికాదేవి పట్టంబు గట్టె
నేరాజు తనసభ కేతెంచిన విరించి
యచ్చెరువంది బ్రహ్మాస్త్ర మిచ్చె
నేరాజు నాట్యవిద్యారసజ్ఞత మెచ్చి
భద్రాసనం బిచ్చె బలవిరోధి
యేరాజునకుఁ గల్గె నీశ్వరవరగర్వ
యుతుని సిద్ధపురీశు నోర్చుకడిమి
తే. యట్టిరాజు పట్టపుదేవివైన నీవు
సకలరాజన్యకాంతలు చరణయుగముఁ

గొలువఁ గొలువుండుదువు గాక, కోమలాంగి
నీకు నేలమ్మ కన్నుల నీరునింప. 195

క. పతికనుసన్నల మెలఁగుము
పతిహితు లగువారి నెఱిఁగి పాటింపు, మదిం
బతి దైవముగాఁ దలఁపుము
పతియ సుమీ యేడుగడయు భామామణికిన్. 196

వ. అని బోధించి పునఃపునరాలింగనంబు చేసి, తదీయనర్మసఖియగు చకో
రికం జూచి యిట్లనియె. 197

సీ. పతియును నేనును పార్వతీపతి చేత
వరముగాఁ గొంటి మీ వాలుఁగంటి
నర్కతేజుఁడు విక్రమార్కక్షమానాథుఁ
డల్లుఁ డయ్యెడిభాగ్య మబ్బె మాకు
రమణునితోడ దూరముగాఁగ నేఁగుచోఁ
బొలఁతికి నీయట్టిబోటి గలిగె
నేమిటఁ జూచిన నీయింతి తొలుమేన
సుకృతంబు సేయుట ప్రకటమయ్యె
తే. నింక నిటమీఁదఁ దగుబుద్ధి యెఱుఁగఁ జెప్పి
విభునిచిత్తముపార్జించువెరవు గఱపి
పొడయు నీడయుఁ బోలె వీడ్వడక మెలఁగి
యబలకంటికి ఱెప్పవై యరయవమ్మ. 198

వ. అని యప్పగించి యనుపుటయుఁ, జకోరికాప్రముఖసఖీసహస్రంబుగొలువ
నాందోళికారూఢయై, చనుదెంచినప్రియాంగనం గనుంగొని సంతుష్టాంత
రంగుండై సాహసాంకమహీనాథుండు. 199

చ. వినయముతో విదర్భపతి వీడ్కొని, దేవియుఁ దాను రత్నకాం
చనరథమెక్కి, వందిజనసంస్తుతి మాగధగానమంజుల

ధ్వనులను హృద్యవాద్యనినదంబును దిక్కులు పిక్కటిల్లఁగాఁ
జనియె, రమాసమేతుఁ డగుసారసనేత్రుని గ్రేణి సేయుచున్. 200

## విక్రమార్కుఁడు భార్యతో నిజపురిఁ బ్రవేశించుట

వ. అటమున్న సర్వసన్నాహసమేతుండై వెడలి భట్టియుం జనుదేర విదర్భా నగరంబు నిర్గమించి, పయనంబున యోగదండప్రకాండకల్పితానల్పపుర నిరూపణంబుల, దివ్యపాత్రికావిచిత్రాన్న పానసంతర్పణంబులఁ, గంధా నుసంధీయమాన నానానిష్కనిరచితద్రవ్యంబుల నాత్మనిర్విశేషంబుగా నశేషసైనికులకుం బరితోషం బొనరించుచుఁ జని, నిజాగమనోత్సవాలం కృతంబైన యుజ్జయినీపురంబుఁ బ్రవేశించునప్పుడు. 201

క. అన్నరపతిచంద్రుని, నొక
కన్నియ మణిసౌధజాలకంబునఁ జూడం,
గన్నులవలఁ గన్నులతో
నున్న ట్లున్మీలనయనయుగయై యొప్పెన్. 202

సీ. నెరసుఁజూపులతోన నెయ్యంబు కూర్మికి
నెరవైన తియ్యంబు నిగుడుచుండ
విరులగాదిలియైన వేణీభరముతోన
కేలిమై గనయంబు కీలుపడల
హృదయంబులోపల నెసఁగుకోర్కులతోన
మేదీఁగెఁ బులకలు మెండుకొనఁగ
విలసితశీలారవిందముతోడన
చెలిమూఁపుఁ గీల్కొన్నచేయి సడల

తే. మఱపు వేడ్కాను మదిలోన మచ్చరింప
చెమరుఁ గలవంబు గ్రొమ్మేన జిగిఁ దనర్ప
నింపుఁ దమకంబు మనములో నినుమడింప
రమణియొక్కతె వసుమతీరమణుఁజూచె. 203

చ. నెఱవుగ వన్నె వెట్టి, రమణీమణి పయ్యెద సంతరింపఁగా
మఱచి, నరేంద్రుఁ జూడఁగ నమందగతిం జనుదేర, హార మ

య్యాలిచనుముక్కులం దగిలి యొంతయు నొప్పె, రథాంగదంపతుల్
తెఱఁ గొదవంగఁ బట్టి తరితీపులఁ బెట్టు మృణాళమో! యనన్. 204

చ. మలయజకర్దమం జలఁది. మౌక్తికభూషణభూషితాంగియై
పొలఁతుక యోర్తు రాచిలుకబోద కరాగ్రమునంద యుండ, భూ
తలపతిదర్శనంబునకుఁ దత్పరతం జనుదెంచి నిల్చె, ను
జ్జ్వలరుచితో నృపాలునకు శారద సన్నిధి చేసెనో! యనన్. 205

ఆ. రాజవరునిఁ జూచు రాజబింబాస్యల
కలికి మెఱుఁగుఁజూపుగములు పర్వి
కలువతోరణములు గట్టినవిధమున
నప్పురంపువీథు లొప్పుమిగిలె. 206

చ. సమధికచంద్రికాధవళసౌధసమున్నతచంద్రశాలలం
బ్రమదము మీఱ నిల్చి, పురభామలు సేసలు చల్లఁగ్రొత్తము
త్తెములు దనర్చె. నమ్మదవతీమనుజేంద్రులమీఁద వేలుపుం
గొమిరెలు కల్పభూజనవకోరకముల్ గురియించిరో! యనన్. 207

వ. ఇవ్విధంబున సర్వజననయనపర్వంబులగు నపూర్వవిలాసవైభవంబులు మెఱయం జని రాజమందిరంబు ప్రవేశించి, రథావతరణంబు సేసి యనంగవతీమహాదేవిని సఖీజనసమేతంబుగా నంతఃపురంబున కరుగ నియమించి, యాస్థానమండపంబున మణివిచిత్రద్వాత్రింశత్సాలభంజికాభవ్యంబైన దివ్యసింహాసనంబుననాసీనుండై యున్న యవసరంబున. 208

సీ. కాంచనమణిముద్రికా ప్రభాజాలంబు
వసిఁడిపళ్లెరములమిసిమిఁ జెనకఁ
గలికిఱేఁగన్నులఁ గ్రమ్ముక్రొమ్మెఱుఁగులు
వరదీపకళికల వన్నెవెట్టఁ
గమ్మపువ్వులతావి కర్పూరవర్తికా
సౌరభంబులతోడ సరసమాడఁ

గంకణంబుఁఝణత్కారంబు తోరమై
యాశీర్నినాదంబు నాదరింపఁ
తే. దరళతాటంకమౌక్తికోదారకాంతి
గండదర్పణదీప్తుల గారవింప
రాజముఖులు గావించి రారాజమణికి
రచితరుచి చక్రవాళనీరాజనములు. 209

వ. తదనంతరంబ. 210

తే. సౌమతేయాదిసామంతసముదయంబు
నాత్మసదనంబులకు నేఁగ నానతిచ్చి
యంతిపురమున కేఁగి, ధరాధినాథుఁ
డుచితలీలానురక్తుఁడై యుండునంత. 211

చ. అరవిరిదమ్మిఁ దేనియక్రియ న్మది రాగరసంబు గాఢమై
పరఁగ, విహారసౌధమణిబద్ధగవాక్షము చేరి, వేడ్కఁ బ్రో
ద్దరయు విదర్భరాజతనయం గరుణించినభంగి దోఁపఁగాఁ
బరమదిశామహీధరముచాటున కేఁగె దినేంద్రుఁ డత్తఱిన్. 212

తే. కణఁక నన్యోన్యసంభోగకాంక్ష నున్న
సాహసాంకవిదర్భరాజన్యసుతల
హృదయరాగంబు పుంజమై యెసఁగె ననఁగ
నుదయరాగంబుతోఁజంద్రుఁ డుల్లసిల్లె. 213

శా. తత్కాలోచితకృత్యముల్ నడపి, రత్నస్నిగ్ధభూషావళీ
సత్కాంతిప్రకరంబు రాగరససాక్షాద్భావముల్ పూనఁగా,
నుత్కంఠైకసఖీసహాయుఁ డయి, రాజోత్తంసుఁ డుండెన్ సము
ద్యత్కేళీసదనాంతకాంతబహుళిల్పాకల్పతల్పంబునన్. 214

క. అంతఁ జకోరిక మొదలగు
కాంతలు వైదర్భతనయఁ గైసేసి, మహీ

కాంతుం డున్న విహారగృ
హాంతరమున కెలమిఁ దెచ్చునాసమయమునన్. 215

చ. పదములఁ దొట్రుపాటొదవఁ బ్రాణసఖీజనభాషణంబులన్
మదిఁ దమకంబు లజ్జయును మచ్చరికింప, వణంకు మేనితో
మదవతి మందమందగతి మార్దవ మొప్పఁగ వచ్చెఁ బైపయిం
బొదలుచు నున్న రాగరసపూరముతో నెదిరించు కైవడిన్. 216

వ. వచ్చి విహారగేహాగేహళీప్రదేశంబున నిలిచి. 217

క. లోపలికి నరుగ నులుకుచుఁ
బైపై మిథ్యారహాస్యభాషలఁ గాల
క్షేపము సేయుచుఁ, జెలితోఁ
ద్రోపాడుచు నుండె నబల తోరపులజ్జన్. 218

సీ. కలువఱేకులమీఱు కలికికన్నులకాంతి
మేల్కట్టుముత్యాల మెఱుఁగు వెట్ట
నిండుఁజందురు నేలు నెమ్మొగంబు బెడంగు
నిలువుటద్దమునకుఁ జెలువు నొసఁగ
నరుణాబ్జములమించు నడుగుల నునుఁజాయ
నెలకట్టు కెంపులనిగ్గుఁ జెనకఁ
గారుమెఱుంగులఁ గైకొను తనుదీప్తి
కనకకుడ్యప్రభ గారవింప
తే. సారఘనసారధూపాదిసౌరభంబు
లలఁతియూర్పుల నెత్తావి నతిశయిల్ల
మందిరాభ్యంతరము సొచ్చె మాను దేఱి
భీతమృగనేత్ర ప్రియసఖీప్రేరణమున. 219

చ. వలభుజముం గపోలమున పంచి ధృలంచిన మోము లజ్జయున్
లలితకటాక్షము..త్రియవిలాసముఁ జిత్తముఁ జిత్తజాతుఁడుం

దలఁపులుఁ గోర్కులుఁ బెరయఁ దద్దయు నొప్పె విహారశయ్యపై
విలసితలీల బాల బొటవ్రేల నిలాతలముఁ లిఖించుచుఁ. 220

చ. అతులితభావగర్భితములైన మృదూక్తులచేతఁ గేలికిం
బుతపుత వోవుచున్ననృపపుంగవుచిత్త మెఱింగి, నిర్గమో
ద్గతమతియైననెచ్చెలికిఁ గన్నుల మ్రొక్కులతాంగిభావ మూ
ర్జితరతిరాజరాజ్యపదసీమకుఁ బట్టముగట్టె భూవిభున్. 221

వ. తత్సఖీనిర్గమనానంతరంబున. 222

సీ. మేలంపుమాటల మెచ్చులు పచరించి
తోరంపుసిగ్గును దొలఁగఁ దోలి
పరమసౌఖ్యాయత్తపరిరంభణంబునఁ
దనువల్లిఁ బులకలుదళము కొలిపి
పారవశ్యదములై పరఁగుచిట్టంటులఁ
జనవున గనయంబు సడలఁజేసి
క్రొత్తలయందెల్లఁ గ్రొత్తలై పరఁగెడు
కామతంత్రంబుల గరిమ గఱపి

తే. బాలికామణి సుఖవార్ధి నోలలార్చి
కాముసామ్రాజ్యలక్ష్మికిఁ గర్త్రిఁ జేసెఁ
బ్రసవశరశాస్త్రమతకళాపారగుండు
సాహసాంకమహీపాలచక్రవర్తి. 223

చ. చిలివిలివోవుకోరికలు చిత్తములం దలలెత్తి, దేహముల్
పులకల నీనఁగాఁ దమకముల్ నిగుడన్, సుఖపారవశ్యతం
దలఁపుల కందగింపఁ, బ్రమదంబునఁ బట్టినచోటు లెల్లనుం
గళలకు నిక్కలై మెఱయఁగా, రతిసల్పిరి వేడ్క దంపతుల్. 224

క. సురతావసానలీలా
పరిరంభము మీఁద రతికిఁ బ్రారంభముగాఁ

దరుణియు వరుఁడు రమించిరి
కర మరుదుగఁ జతురశీతికరణప్రౌఢిన్. 225

సీ. తొంగలిఱెప్పలతుదలు గైవ్రాలినఁ
గొసరుఁజూపులయందు మిసిమి దోఁపఁ
దారహారముల న ర్తనఁ గళాసించినఁ
గుచకుంభములు మీఁదఁ గొంతనిక్కఁ
గుంతలంబులఁ ద్రుళ్లగింతలు సడలినఁ
గెమ్మోవిచుంబనక్రీడ కెలయ
మణికాంచివలయంబు మౌనంబు గైకొన్న
నురునితంబముకేళి కుత్సహింపఁ
తే. జెమటచిత్తడి మైపూఁత దెమలిచనిన
నెమ్మనంబునఁ దమకంబు నివ్వటిల్ల
నున్న జలజాక్షి యొప్పు నృపోత్తమునకు
మదనపునరుద్భవవికారమంత్ర మయ్యె. 226

సీ. సంపూర్ణపూర్ణిమాసాంద్రచంద్రాతప
విలసితశశికాంత వేదికలను
మంజరీసంజాతమకరందనిష్యంద
మాకందమాధవీమండపముల
శృంగారవనమహాశృంగారమణిశృంగ
హాటకశైలశృంగాటకముల
సంపుల్లహల్లకసహావాసవాసనో
జ్జ్వలదీర్ఘదీర్ఘికాసైకతముల
తే. గగనగంగాతరంగిణీగంధవాహ
బంధురోదగ్రసౌధాగ్రభాగములను
నవనవోల్లాసరతికళానైపుణములఁ
బ్రతిదినంబు రమించిరి పతియు సతియు. 227

వ. ఇత్తెఱంగున సాహసాంకమహీనాథుండు చిత్తానందంబుగ విదర్భరాజనందనం దగిలి కందర్పలీలావిలాసంబులం జతురుదధివలయవలయిత మహామహీపరిపాలనఖేలనంబులం బ్రవర్తిల్లుచు మఱియును. 228

శా. నారీచిత్తసరోమరాళ, నవనానాగంధసౌగంధ్యవి
స్తారోదారభుజాంతరాళ, ప్రతిభాసర్వజ్ఞ, సోమాబ్జవి
స్మేరాకార శరన్నిశాకరకరాశ్లేషప్రియంభావుక
స్ఫారక్షీరపయోధిలంఘనకళాజంఘాలకీర్తిశ్వరా! 229

క. భూరిమణిహేమభూషా
పూరితకన్యాప్రదానపుణ్యచరిత్రా
పేరయనన్నయవరతన
యారత్నశ్రీమదక్కమాంబాపుత్రా! 230

బంధురవృత్తము

విలసితబహుధనవితరణకరుణా, విశ్రుతవీరగుణాభరణా
జలరుహనవదళసలలితచరణా, సత్కవిసన్నుతసంచరణా
కలుషవిమతధరఘనమదహరణా, కాంతినవీనసుధాకిరణా
జలనిధివలయితజగదుపకరణా, సారయశోధనతాభరణా! 231

గద్యము. ఇది శ్రీమదఖిలకవిమిత్త్ర పెద్దయయన్నయామాత్యపుత్త్ర శారదాదయావిధేయ జక్కననామధేయప్రణీతంబైన విక్రమార్క చరిత్రం బను మహాప్రబంధమునందుఁ జతుర్థాశ్వాసము.

బులఁ గూర్చె ననఁగఁ దరువుల
నలరులుఁ దలిరులును బండ్లు నక్కజ మయ్యెన్. 4

క. కిసలయకింజల్కరజః
ప్రసవశలాటుప్రభాపరంపర లెసకం
బెసఁగె మకరందవృష్టికిఁ
బొసఁగంగా నింద్రధనువు పొడమినభంగిన్. 5

మ. కనదంభోజముఖీనవీనముఖరాగవ్యాప్తిపూర్వంబు గా
ననుసుల్లాసముఁ బొందె సంపెఁగలు, నానాకాననశ్రీవిలా
సిను లభ్యాగమవేళఁ జైత్రునకు నౌచిత్యంబు గావింప నె
త్తి ననీరాజనదీపమాలిక లనన్ దేదీప్యమానంబులై. 6

చ. పరువపుఁబుప్పరేణువులపై మకరందపువెల్లిడొల్లి బం
ధురవనదుర్గమార్గ మతిదుస్తమమై చెలువొంద. నెందు న
చ్చెరువుగ మందమందగతిఁ జెందె మహాబలుఁ డయ్యుఁ జాల దు
స్తరమని కన్నెతావు లగు తావులవ్రేఁగున వాయు వామనిన్. 7

చ. విరహులఁ బట్టి తెచ్చి మనవీట భటావలి నెవ్వరైనఁ బూఁ
దరటులపాలు సేయమియ తప్పు సుఁడీ, యని చాటుచున్నశం
బరరిపుఘంటికారవముభంగిఁ జెలంగె నశోకతాడన
స్ఫురితవిలాసినీచరణభూషణఘోషణ మెల్లతోఁటలన్. 8

క. తిలకితవసంతలక్ష్మీ
తిలకములై నిరుపమానతేజోగరిమం
దిలకములు తరళనయనా
తిలకంబులు చూడఁ జూడఁ దిలకము లొప్పెన్. 9

క. కాముకులుఁ గామినులునుం
గామాతురు లగుట యరుదె? ఘనతరులతికా
స్తోమము ప్రేమము గైకొనె
నామని నబ్జజునకైన నలవియె పొగడన్. 10

బులఁ గూర్చె ననఁగఁ దరువుల
నలరులుఁ దలిరులును బండ్లు నక్కజ మయ్యెన్. 4

క. కిసలయకింజల్కరజః
ప్రసవశలాటుప్రభాపరంపర లెసకం
బెసఁగె మకరందవృష్టికిఁ
బొసఁగంగా నింద్రధనువు పొడమినభంగిన్. 5

మ. కనదంభోజముఖీనపీనముఖరాగవ్యాప్తిపూర్వంబు గా
ననుపల్లాసముఁ బొందె సంపెఁగలు, నానాకాననశ్రీవిలా
సిను లభ్యాగమవేళఁ జైత్రునకు నౌచిత్యంబు గావింప నె
త్తిన నీరాజనదీపమాలిక లనన్ దేదీప్యమానంబులై. 6

చ. పరువపుఁబుప్పరేణువులపై మకరందపువెల్లిఁ డొల్లి బం
కపు దుర్గమార్గ మతిదుస్తమమై చెలువొంద, నెందు న
న్ని పథా మందమందగతిఁ జెందె మహాబలుఁ డయ్యుఁ జాల దు
స్తరమని కన్నెతావు లగు తావులవ్రేఁగున వాయు వామనిన్. 7

చ. విరహులఁ బట్టి తెచ్చి మనవీట భటావలి నెవ్వరైనఁ బూఁ
దరటులపాలు సేయమియ తప్పు సుఁడీ, యని చాటుచున్నశం
బరరిపుఘంటికారవముభంగిఁ జెలంగె నశోకతాడన
స్ఫురితవిలాసినీచరణభూషణఘోషణ మెల్లతోఁటలన్. 8

క. తిలకితవసంతలక్ష్మీ
తిలకములై నిరుపమానతేజోగరిమం
దిలకములు తరళనయనా
తిలకంబులు చూడఁ జూడఁ దిలకము లొప్పెన్. 9

క. కాముకులుఁ గామినులునుం
గామాతురు లగుట యరుదె ? ఘనతరులతికా
స్తోమము ప్రేమము గైకొనె
నామని నబ్జునకైన నలవియె పొగడన్. 10

సీ. కమలగర్భునిఁ బుత్త్రికాకాముఁ గావించి
కౌశికు వెలయాలిఁ గవయఁ బనిచి
నిందిరాధిపు గొల్లయిల్లాండ్రఁ దగిలించి
రజనీశు గురుసతిరతిఁ గొనర్చి
రుద్రుని నర్ధపౌరుషునిఁగా నొనరించి
శుకునితాతకుఁ గామసుఖము సేర్చి
కులిశాయుధునిఁ బట్టి *కోడాట లాడించి
ఋష్యశృంగుతపస్సమృద్ధి మాన్పి
తే. విషమశరునకు త్రైలోక్యవిజయ మెసఁగె
నిట్టిచరితంబు లెఱిఁగినయట్టినరులు
విజితకాముల మనుమాట విడువుఁడనుచుఁ
బల్కుగతిఁబల్కెఁ దోఁటలఁ జిల్కగములు. 11

వ. ఇత్తెఱంగునఁ జిత్తసంభవసామ్రాజ్యలక్ష్మీనివాసం బైన మధుమాసంబు
సకలజంతుదంపతీసంపాదితమనోవిలాసంబై భాసిల్లునంత నొక్కనాడు. 12

## రాజదంపతుల ఉద్యాన విహారము

క. నరపతి యనంగవతితో
వరసతులు భజింపఁ బ్రమదవనమున కరిగెన్
సురపతులు గొల్వ శచితో
హరి నందనవనములోని కరిగినభంగిన్. 13

వ. అంత. 14

మ. అలరుం దేనియ నర్ఘ్యపాద్యముల పర్యాయంబుతో నిచ్చి యిం
పులు మీఱన్ విరవాదిజాతిసుమలం బుష్పాంజలుల్ చేసి యు
జ్జ్వలభృంగీనినదంబులం గుశలసంప్రశ్నంబు గావించి, భూ
తలనాథుం భజియించె గంధవహుఁ డుద్యానాంతరాళంబునన్. 15

వ. ఆ సమయంబున 16

* కోడి+ఆటలు.

క. కాననవసంతలక్ష్మియొ
నా నుపవనపాలబాల నయవినయగతిం
గానుకతెచ్చినగుచ్ఛము
కానుక గావించె విభుఁడు కాంతామణికిన్. 17

ఉ. ఇచ్చిన నిచ్చలో నలరి యింతి, దరస్మితకాంతి చెక్కులం
దచ్చుపడం బ్రసన్నవదనాంబుజమై, వనపాలబాలికం
బొచ్చెము లేక రత్నమయభూషణభూషితఁ జేసి, దానితో
మచ్చిక మీఱఁగా మధురమంజులభాషల నల్ల నిట్లనున్. 18

సీ. ప్రోదిగాఁ బన్నీరుపోసి పెంచినకన్నె
సురపొన్న యున్నదే సుందరాంగి
పొలుపారఁ బచ్చకప్పురపుబాదున నిడ్డ
విరజాజి యున్నదే హరిణనయన
యెలమిఁ గస్తురిబూదియెరుపునఁ బెరిఁగిన
సంపెంగ యున్నదే చంద్రవదన
క్రొవ్వారుజవ్వాదికుదురునఁ బెరిఁగిన
చేమంతి యున్నదే కోమలాంగి
తే. సంతతంబును బూఁదేనె జాలువాఱఁ
గమ్మగందవుముద్దలఁ గట్టపెట్టి
కాలువలు దీర్చినపసిండికేళకూళి
నిండి తొలఁకాడుచున్నదే నీలవేణి. 19

వ. అనిన నయ్యనంగవతీమహాదేవికిం బ్రమదవనపాలబాలికాలలామం బిట్లనియె. 20

చ. జనవరవంశవారినిధిచంద్రుఁ డనం దగుచంద్రగుప్తనం
దనుకరుణాసుధారసమునం ద్రిజగంబులు పల్లవింపఁగాఁ
బనివడి ప్రోదిచేసి పెనుపం బెనుపొందినతోఁటలోనినూ
తనలతికావలీతరువితానమునొప్పులు చెప్ప నేటికిన్. 21

క. నావుడుఁ దదీయవచన
ప్రావీణ్యంబునను ధరణిపతి ప్రముదితుఁడై
యావైదర్భియుఁ దాను
గేవలలీలావనాంతకేళీరతుఁడై. 22

శా. లీలాశైలము లెక్కుచుం, దరుణవల్లీలాస్యముల్ చూచుచున్
డోలారోహణకేళిఁ దేలుచు, మదాటోపాలిగానధ్వని
శ్రీలాలించుచుఁ గీరభాషణములం జిత్తంబులన్ మెచ్చుచుం
గాలోన్మీలితపుష్పభూరుహతతిం గైసేయుచుం జూడ్కులన్. 23

సీ. మంజరీసంజాతమకరందమధుమత్త
చంచరీకద్వంద్వసంభ్రమములఁ
గోరకితానేకకోమలవల్లికా
వేల్లితభూజాతవిలసనముల
సహకారఫలరసాస్వాదనసంతుష్ట
1శుకసతీపతిరుతిప్రకటనములఁ
గిసలయాంకురరసగ్రసనసముత్కంఠ
కలకంఠవిటవిటీకలకలములఁ
తే. గనియు వినియు వసంతసంక్రాంతరాగ
సర్వసామాన్యమహిమ కాశ్చర్యమంది
చెలి కెఱింగించి కొనియాడి చెప్పిచెప్పి
ప్రమదవనకేళిఁ దేలిరి పతియు సతియు. 24

చ. అలరులు గోయుచోట నళు లాలనసౌరభ సూన మూఁగినం
గలఁగుట గాంచి కొప్పుపయిఁ గమ్మనిసంపెంగఁదండ సేర్చి, తొ
య్యలి హృదయంబునందుఁ గుసుమాపచయవ్యసనంబు గ్రమ్మఱన్
మొలవఁగఁజేసినన్, నృపతిముఖ్యునిఁ బ్రౌఢలు మెచ్చి రందఱున్. 25

1. శుకదంపతీరతి ప్రకటనముల. అని పా.

## పు ష్పా ప చ య ము

సీ. అరవిరిపూదండ లఱుత నించెద నని
యనువునఁ జనుదోయి నంటి యంటి
పుప్పొడినెర సొయ్యఁ బోవ నూఁదెద నని
నయనచుంబనకేళి నడపి నడపి
చిప్పిలుపూఁదేనె జీరువాఱెడు నని
పాణిపద్మము గేలఁ బట్టి పట్టి
యలిమ్రోఁతలకు నింత యలుకంగ నే లని
చిక్కనికౌఁగిట జేర్చి చేర్చి
తే. నృపకులాగ్రణి మేలపునెపము గాఁగ
నలరుబంతిఁ గళాస్థాన మరసి యరసి
రమణి నిబ్బంగి బహుబాహ్యరతులఁ గలఁచి
సరవి సుఖములఁజాతుర్యసరణి మెఱసి 26

ఉ. అందనిపువ్వుగుత్తిదెసకై యఱుసాఁపగ నేల బాల? కో
యం దలఁపయ్యెనేని నెగయ న్నిను నెత్తెద నంచు సంతసం
బందఁగ నెత్తియెత్తి విభుఁ డందఱిముందఱ డించుచుండగా
నందినకంటె సంతసము నందె లతాంగియు మాటిమాటికిన్. 27

చ. తనరునశోకభూరుహలతాముకుళంబుల నంతరాంతరం
బున నిడి, పొన్నక్రొన్ననల భూపతి మాలికగా నొనర్చి చూ
పిన, గరువంపుఁగొంపు లెడవెట్టిన మౌక్తికహారలీల నె
క్కొనఁజనుదోయిపై నునిచెఁ గోమలి లేనగ వంకురింపఁగన్. 28

సీ. పల్లవంబులయొప్పుఁ బరికించుఁ బరికించి
యబ్జాస్యకెమ్మోవి యానఁ దివురు
విరులగుత్తులమించు వినుతించు వినుతించి
కామినిచనుదోయి గదియఁ గోరుఁ
గీరభాషణములఁ గీర్తించుఁ గీర్తించి
యంగనసరసోక్తు లాస సేయు
నెలదీఁగెపడుదల నీక్షించు నీక్షించి
రమణిమైపొందు చిత్తమున నిల్పు.

తే. నిత్తెఱంగునఁ జిత్తజాయత్తుఁ డగుచు
చెలువయును దాను బూసెజ్జఁ జేరుటయును
దరుణు లొండొరుఁగనుసన్నఁ దాల్చుకొనుచుఁ
జెలఁగి పుష్పాపచయకేళి చేసిరంత. 29

ఉ. అసురపొన్న నాకు నలువందెడి వేగమె పువ్వులన్నియుం
గోసెద నన్నఁ గై కొనినకోమలిగర్వము సైఁప కాత్మలో
నీ సొదవంగఁ బెల్లు జనియింపఁగఁ జేసె ప్రసూనరాజి లీ
లాసరసత్వ మొప్పఁగ విలాసిని యొుర్తు దరస్మితంబుచేన్. 30

క. సన్నపుఁబల్లవములు గని
కన్నియచనుమిట్ట లనుచుఁ గనుఁగొని ప్రౌఢుల్
మిన్నక యుల్లసమాడరె
కన్నెఱికము దొరఁగెఁ జెక్కుగఱచిన దనుచున్. 31

చ. తొలఁగి నికుంజపుంజములు దూఱుచు దాఁగురుమూఁత లాడుచుం
గెలఁకులఁ జొచ్చి నిల్చినసఖీజనము న్నవకంపుఁదీఁగెలం
దెలియఁగలేని ముగ్ధలకుఁ దెల్లమిగా నెఱిఁగించెఁ దత్సఖీ
సలలితరత్నభూషలవిశాలవిలోచనదీప్తిజాలముల్. 32

చ. బలువిడి ఫాలలోచనునిపైఁ బ్రసవాయుధుఁ డేగునప్పు, డీ
యళులును గోకిలంబులు శుకాలియు మందసమీరణంబుఁ గెం
దలిరులు వచ్చినం గడుఁ బ్రతాపసమగ్రుఁడు గాఁడె యంచుఁ జె
ల్వలు వనవైభవస్ఫురణ వర్ణనచేసిరి కేళి సల్పుచున్. 33

చ. అరవిరజాజిగుత్తి నరుణాధరదీధితిచే, నశోకమం
జరినిఘనస్తనప్రభలఁ జంపకగుచ్ఛము నీలకుంతల
స్ఫురణఁ దమాలకందళముఁ బోలఁగఁ జేయుచు, నొక్కప్రౌఢ య
చ్చెరువుగ నైంద్రజాలికవిశేషముఁ జూపు సఖీజనాలికిన్. 34

చ. అలరులతోఁటలోన విరులన్నియుఁ గోసితి రంచు బోటులన్
సొలయఁగ నేల? బాల యిటు చూడఁగదే తిలకావనీరుహం

బులదెస, ద్రవ్వితండములు పుష్పము లున్నవి యంచుఁ బ్రోడయై
పలుకువయస్య నేర్పుఁగలభాషిణులెల్లను మెచ్చి రిచ్చలన్.

వ. ఈ తెఱంగున మత్తకాశిను లుత్తరంగిత ప్రమదవనవిహారం బొనరించి
చాలించి. 36

చ. చెదరినకుంతలంబులును జెక్కులఘర్మకణాంకురంబులన్
వదలినకేశపాశములు వాడిననిద్దపుమోముదమ్ములుం
బదనెరవై నవాతెఱలుఁ బైకొనునూర్పులు నుల్లసిల్లఁగాఁ
గదిసినయయ్యనంగవతి గాదిలిబోటులతోడ నిట్లనున్. 37

క. *అలఘుతరాంశుకజాలము
కలుగునె సభమందు ఘర్మకాలము చూడన్
జలకేలి యుచిత మనవుడు
నెఱతుక కిట్లనిరి చెలులు నిపుణత మెఱయన్. 38

చ. లలితవళీతరంగరుచులం దరలేక్షణ మీనలోచనాం
చలవదనాంబుజద్యుతి లసత్కుచచక్రవిలాసరేఖ నే
ర్పలరెడునీతనూసరసియందు నిరంతరమున్ విహారమున్
సలిపెడురాజహంసునకు సైఁచునె తక్కినపద్మినీరతుల్, 39

ఉ. నావుడు నాననాంబుజమున్ దరహాసము తొంగలింప థా
త్రీవరముఖ్యుఁ డామదవతీతతి కిట్లను, నింతయేల ? యే
నీజనజాతియాజ్ఞ యొకయించుక యైనను మీఱువాఁడనే
సేవకులై నవారికి విశృంఖలవృత్తిఁ జరింపఁగూడునే. 40

క. అని సరసవచనరచనలఁ
దన ప్రియసతి నలకఁజేసి ధరణీశ్వరుఁ డా
వనితారత్నముఁ దానును
వనజాతులు గొలువ వనజవనమున కేఁగెన్. 41

---

* సా. నలివాళ్లువాడుచున్నవి, లలితమహాతరుణదేహలతికలుమనకున్.

ఆ. అంత నెదురువచ్చి యరవిందమకరంద
కలితసౌరభములు [1]గానుకిచ్చి
యబ్జినీసమీరుఁ డమర యథోచిత
స్థితి నరేంద్రు మనసు చెలఁగఁజేసె. 42

మ. భువనాధీశ్వరుదర్శనోత్సవసుఖంబుం బొంది యానందతాం
డవముం జూపెడుభంగి నాకమలషండం బొప్పె భృంగాంగనా
రవగానంబులతో సరోజదళనేత్ర శ్రీవిలాసంబుతో
నవచిత్రాభినయోర్మిహస్తఘటనా నానావిలాసంబుతోన్. 43

## సరోవర విహారము

ఉ. ఆకమలాకరంబున విహారము సల్పగ నుత్సహించి, శో
భాకరనూత్నరత్నసముదంచితకాంచనదివ్యభూషణా
నీకములం దొలంగ నిడి, నీరజలోచన లొప్పి రోలిఁ గా
రాకుల నుజ్జగించి చెలువారెడుమవ్వపుఁదీఁగెలో యనన్ 44

ఉ ఆనెలఁతల్ సరోజినికినై దిగునప్పుడు, నూత్నరత్నసో
పానములం దదీయతనుబంధురబింబము లుల్లసిల్లెఁ దే
జోనిధి యైనయానృపతిసోయగమున్ దరిసించువేడుకం
బూని జలాధిదేవత లపూర్వగతిం జనుదెంచిరో యనన్. 45

సీ. ఉవిద లందఱుఁ గూడి యొక్కర్తుఁ జెలరేఁగి
కరయంత్రధారలఁ గప్పికప్పి
జలములో మునిఁగినసఖులయిక్క లెఱిఁగి
సలిలంబులోఁ గేలి సలిపి సలిపి
పంచపట్టుల నిల్చి పడఁతు లొండొరులతో
నలవునఁ జలుఁబోరాడి యాడి
సలిలకేలికి నోడి చను భీరువును బ
జలజపరాగంబు చల్లిచ
తే. యొనర నొండొరుభుజము చేనూఁ తూఁది
సరసగతులను జెలఁగి మత్సరము లోర్చి

1. కానుక+ఇచ్చి.

కినిసి తొడరినయింతుల గెలిచి గెలిచి
జలవిహారము సలిపిరి సంతసమున. 46

చ. మృగమదపంకిలాంగు లొకమే, నొకమే ఘనసారచందన
స్థగితలు నైనకామినులు, పాటిగ నొండొరుఁ జల్లియాడుచో
నగమున నల్పుదెల్పు లగు చాయలు నెందఁ గళిందకన్యకా
గగననదీసమాగమముకై వడిఁ బర్మిని యొప్పె నత్తఱిన్. 47

చ. నెలఁతలు కంఠదఘ్న మగునీర విహార మొనర్ప నిల్చినం
గొలను తదాననస్ఫురణఁ గ్రొత్తమెఱుంగు వహించెఁ బెక్కుత్రి
ప్పులఁబడి యొక్కచంద్రుని నపూర్వముగాఁ గను టెంత యంచు నా
జలనిధి నెంచి, లీల బహుచంద్రులఁ దా నొనరించెనో యనఁ. 48

క. చందనము సలిలకేలిని
బొందెడలినయొక్కయింతి, ప్రోడతనమునం
గందర్పముద్ర లుండెడు
కందువలకు మాటుసేసెఁ గచనిచయంబున్. 49

ఆ. సలిలకేళి సల్పుచామలమోములు
కమలసమితి యనుచుఁ గదిసి యలులు
కురులసిరులు చూచి కొన్ని కెఁటులు మున్న
మూఁగి యున్నవనుచు మొగినిజనియె. 50

తే. ఆననాంబుజసౌరభ మానునలుఁ
జోఁపనేరక సఖులలోఁ జొచ్చి నీట
మునిఁగి యవి వారిమోముల ముసురుకొనిన
నవ్వుచును లేచియొక్కతె నవ్వుచుండె. 51

ఉ. అంత మహీవిభుండును బ్రియాంగనయుక్ స్వకరావలంబనా
నంతసుఖానురక్తులయి యబ్జిని డిగ్గఁగఁ దత్కరంబు ల
త్యంతము రోమహర్షణసమగ్రత గైకొని నాథుదండ వి
క్రాంతి సరోరుహద్వయవికాసవిలాసముఁ బూనె నత్తఱిన్. 52

ఆ. జలముమీఁద నీఁదుసర్వంసహాకాంత
కెలమి మూఁపుఁదెప్ప యిచ్చినట్లు
జలముమీఁద నీఁదుజలజాతనేత్రకు
నెలమి మూఁపుఁదెప్ప యిచ్చె విభుఁడు. 53

చ. బిసముల పేరులుణ్ సలిలబిందులకర్ణికలుం జెలంగఁగాఁ
బసిమి మెఱుంగుగాఁగ నవపద్మపరాగము చెందిరంబుగా
లసితపరాగకేసరకలావసమగ్రత చిన్నపువ్వుగాఁ
బొసఁగ నమర్చి, నూతనవిభూషణఁ జేసెఁ బ్రియుండు ప్రేయసిన్. 54

చ. కరమనురక్తి భూవిభుఁడు కంజదళాయతచారునేత్రపైఁ
బోరిఁబోరిఁ జల్లునీట మయిపూఁత గరంగినఁ జన్నుదోయిపై
నరుదుగఁ గామముద్రలు బయల్పడకుండఁగఁ గప్పె ధారణీ
శ్వరకరనిర్గళత్సలిలసాంద్రసరోజసమాజపత్త్రిముల్. 55

చ. అరవిరిదమ్మిరేకుల నయంబున మైఁ గబళించి యొండొరుల్
సరిపడఁ జల్లులాడునెడఁ జంద్రనిభానన చెల్లఁ జల్లు శా
స్వరశతపత్త్రిజాతములు చాల శరీరముఁ బొందిన, న్మనో
హరరుచిఁ బూనె భూపతి సహస్రవిలోచనుఁ బ్రేణిసేయుచున్. 56

శా. రాజేంద్రుండు విదర్భరాజతనయారత్నంబుఁ జెన్నొద్దులై
రాజీవాక్షుల నుద్దులుంచుకొని నీరం జల్లుఁబోరాడుచో,
రాజీవాకర మొప్పె వాసవశచీరంభాదిదివ్యాంగనా
రాజత్కేలన ఘూర్ణమానఖధునీప్రాకామ్యముం బూనుచుణ్. 57

వ. అయ్యవసరంబున. 58

సీ. రాజుపంపున నొక్కరామ వైదర్భిపైఁ
గరయంత్రధారోదకంబు గురిసె
నద్దేవికనుసన్న ముద్దియయొక్కర్తు
జననాథుపై నించెఁ జల్లుసీగు

రమణునియానతి రమణి డగ్గఱి యోర్తు
తమ్మిపుప్పొడిఁ దాను నెమ్మిఁ జల్లె
నయ్యనంగవతీకరాబ్జసంజ్ఞ నొకర్తు
కువలయాధిపు వైచెఁ గువలయముల
తే. వరుఁడు నీలోత్పలంబుల వైవ ననతి
హల్లకంబుల వైచెఁ దా నాత్మవిభునిఁ
గాంతలును దాను నిబ్బంగి గలసి మెలసి
వనజవనకేళి యొనరించి తనివిఁ బొందె. 59

క. శ్రీరమణీమణిఁ గైకొని
క్షీరాంబుధి వెడలుగరుడకేతనుభంగిన్
నీరజలోచనఁ దోకొని
నీరజషండంబు వెడలె నృపవరుఁ డంతన్. 60

సీ. అళికభాగంబున నంటినకురులతోఁ
గరఁగినయంగరాగములతోడ
నరుణిమ వాసినయధరబింబముతోడ
దీపించుమదనముద్రికలతోడ
దళ మైనమవ్వంపుఁబులకాంకురములతోఁ
జూపుల నునుఁగెంపు సొబగుతోడఁ
జెదరినమకరికాచిత్రపత్త్రికలతోఁ
బరఁగెడునూర్పుఁదెమ్మెరలతోడఁ
తే. దొడల జెడఁగారునునువల్వతోడ నపుడు
రతి*కళాసించివచ్చినరమణ మెఱయఁ
గొలనువెలువడి వచ్చి రాజలజముఖులు
వసుమతీనాయకానంగవతుల బలసి. 61

క చీనాంబరమణిభూషణ
నానాగంధానులేపనవమాల్యములన్

---

* అలసివచ్చిన.

మానినులును వైదర్భియు
మానుగఁ గైసేసికొనిరి మచ్చరికములన్. 62

చ. అనుపమరత్నభూషణసమంచితవస్త్రములన్ సుగంధచం
దనవికచప్రసూనములఁ దద్దయు నేర్పలరం బ్రసాధికా
జనము లలంకరించినఁ బ్రసన్నవిలాసవిభాసమానుఁడై
మనుజవరేణ్యుఁ డొప్పె శివుమన్ననఁ గన్న రతీశుఁడో యనన్. 63

క. సమయజ్ఞతఁ బొడసూపిన
సముచితపరివారవందిజనబృందములుం
బ్రమదలుఁ గొలువఁగ భూపతి
ప్రమదముతో నరిగె నాత్మభవనంబునకున్. 64

వ. ఇత్తెఱంగున నవీనచిత్తానందంబున విదర్భరాజతనయాలీలాలాలనంబునఁ జతురుదధివలయవలయితవసుమతీపరిపాలనంబు ఖేలనంబుగాఁ బ్రవర్తిల్లుచు నుల్లసిల్ల సకలమనీషావిశేష పరిగ్రహణచాతురీ ధురంధరుండై యవ్వసుంధరాధిపసింధురుండు సర్వేశ్వరీప్రసాదాసాదిత సామ్రాజ్య నియమిత వత్సరసహస్రద్విగుణీకరణపరిణతంబగుసుమతిసుతునిమతంబునం బ్రతివత్సరంబు నాఱేసినెల లన్యదేశపర్యటనం బనుసంధించుతలంపున యోగీశ్వర వేషధరుండై దివ్యపాదుకాపాదితస్వైర సంచారంబువలనను యోగదండ ప్రకాండప్రకల్పనానల్పనానానగరకల్పనా విహారంబువలనను విచిత్రమణిపాత్రికాసంజాతసరసాన్నసముచితాభ్యవహారంబువలనను దుకూల కంథానిష్కాంతనిష్కావశీకృతపరోపకారంబువలనను విచిత్రంబులగు మానుషచరిత్రంబులం బ్రవర్తిల్లినప్పుడు. 65

యోగిరూపంబున విక్రమార్కుఁడు పరదేశములఁ బర్యటించుట

సీ. స్తంభన మోహ నోచ్చాట నాకర్షణ
మారణోద్వేజ నోన్మాదనములు
వాద వయస్స్తంభ వశ్యపురక్షోభ
గజకరుణాద్యాకర్షకరణములును
ఖగ పశు మృగ ముఖ్య బహురూపధారణా
విధి పరకాయ ప్రవేశములును

సర్వాంజన మహేంద్రజాల మాయోపాయ
మణి మంత్ర తంత్ర సామర్థ్యములును

తే. ద్వీప దుర్గాది దుర్గ ప్రదీపములు
నమృతకర భాస్క రోదయవ్యత్యయములు
సకల జంతు భాషా పరిజ్ఞానములును
నాదిగాఁగలవిద్యల నతిశయిల్లి. 66

క. ఒక్కొకమరి తనయంతన
యొక్కొకమరి సుమతిపూతియుం దానునునై
యెక్కడ నభిమత మైనను
నక్కడ విహరించుచుండు నాఱేసినెలల్. 67

చారుఁడు విక్రమార్కునకు చిత్రకూటమునందలి వింతలుచెప్పుట

తే. అంత నొకనాఁడు లోకవృత్తాంత మరసి
యరుగుదెంచినవారలయందు నొకఁడు
తాను గనినట్టిచోద్యంబు ధరణిపతికి
వినయ మొసఁగంగ నిట్లని విన్నవించె. 68

క. దేవరపనుపున నేఁ జని
భూవలయము దిరిగి యొక యపూర్వము గంటిం
భావనగతిఁ బ్రవహించును
దైవతనది చిత్రకూటధరశృంగమునన్. 69

తే. సజ్జనంబులు సద్భక్తిమజ్జనములు
సేయ నన్నీరు పన్నీరుచెలువు నొందు
సుకృతహీనులతనువులు సోఁకెనేని
కజ్జలముభావమున నొందుఁ దజ్జలంబు. 70

ఆ. అన్నగంబుపొంతఁ బన్నగాభరణుని
నిలయ మొప్పు వప్రవలయ మొప్పు
గోపురంబుతోడ నేవున రాపాడు
గోపురంబుతోడఁ గొమరుమిగిలి. 71

తే. తత్సమీపకాననభూమిఁ దపసి యొకఁడు
కలఁడు మౌనివ్రతుండు నాఁగఁ గడు మెఱసి
వెదలుసల్లినభస్మంబు వెండికొండ
బోలె నప్రమాణోన్నతిఁ బొలుపుమిగిలె. 72

తే. ఎంతకాలంబు గలదొ మున్నింక నెంత
కాల మొనరింపఁగలవాఁడొ కనఁగ నిపుడు
సలుపుచున్నాఁడు హోమంబు చలముపట్టి
యతనికోరిక లెవ్వరు నరయ రధిప. 73

చ. అన విని విక్రమార్కవిభుఁ డప్పుడు చారుఁడు మున్నుగాఁగ వే
చని కనియెన్ సమాధిగతసంయమిరత్నవినూత్నపేటమున్
ఘనమదహస్తిహస్తపరికంపితసానుగతాగవాటముం
గనదురురత్నవచ్ఛిఖరకమ్రకిరీటముఁ జిత్రకూటమున్. 74

కాళికను మెప్పించి విక్రమార్కుఁడు మునికి వరము లిప్పించుట

క. కని తద్గిరివిశ్రుతవా
రి నియతి సుస్నానము నొనరించి మహాదే
వునిగుడి కరిగి వినతుఁడై
చనె హోమనివాసమునకు సమ్మతితోడన్. 75

క. చని యమ్మునివరు నడిగిన
ననుపమమగుమౌన ముడిగి యతఁ డిట్లని చె
ప్పెను బెద్దగాలమును నే
నొనరించెద నుమగుఱించి హోమం బనఘా. 76

క. నాకోర్కి యొసఁగ దిప్పుడు
నాకోరిక యొసఁగుదనుక నడుపుదు హోమం
బీకరణిఁ బ్రతిదినంబును
జేకొని మధుసిక్తమైనశ్రీఫలసమితిన్. 77

ఆ. అనిన సాహసాంకుఁ డంబిక నెల్లెక
ప్రముదితాత్మఁ జేయఁ బ్రతినపట్టి

మధునిషిక్తమైనమాలూరసత్ఫల
వితతిఁ దాను నట్లు వేల్వఁ దొణఁగె. 78

క. అత్యంతనియతి వేల్చినఁ
బ్రత్యక్షము గాక యున్నఁ బార్థివుఁడు శిరం
బత్యాశ్చర్యముగాఁ గొని
ప్రత్యయమతి వేల్చి వరమువడయుదు ననుచున్. 79

చ. అడిదము కేలఁ బూని మెడయుం దొడఁగూర్చిన, దేవి వచ్చి య
ప్పుడ వెసఁ జేత నున్నయసి పుచ్చి మదిం గడుమెచ్చి; యేవరం
బడిగిన నిత్తు నీ వడుగు మన్నఁ గరంబులు మోడ్చి భక్తి యే
ర్పడఁ బ్రణమిల్లి యిట్లనియెఁ బార్థివుఁ డాజగదేకమాతతోన్. 80

క. వర మీవచ్చితి నా కిటు
పరమేశ్వరి నిమిషమాత్రఁ బ్రత్యక్షంబై
వర మొసఁగవు పొడసూపవు
చిరకాలం బితఁడు తపము సేయుచు నుండన్. 81

తే. ఏమికారణ మానతియిమ్ము నాకు
ననిన నంబిక యిట్లను నతనితోడ
నేకభావంబు నావయి నింతలేదు
జపవిధాన మెఱుంగక జప మొనర్చు. 82

క. మనసోం జైన జపంబును
మునివ్రేళ్ల నె యెన్ను జపము మునుమేరవిలం
ఘన మొనరించుజపంబును
మునుకొని లెక్కిడనిజపము ముఖ్యం బగునే ? 83

వ. అదియునుంగాక. 84

క. దేవుండు లేమి కలిమియు
భావింపఁగరాదు కనకపాషాణములన్

భావమున నునికి సిద్ధము
గావున భావంబు ప్రథమకారణ మనఘా ! 85

క. చిత్తంబు పాపసహితం
బె త్తెఱఁగున నిత్తు నితని కీప్సితఫలముల్
రిత్తకు రిత్త ఫలించునె
యుత్తమఫలసిద్ధి భావ మొందని క్రియలన్ ? 86

క. నీ సాహసనియతికి వి
శ్వాసమునకు నిచ్చ మెచ్చి వర మిచ్చెద, నీ
వాసక్తి నెద్ది వేఁడినఁ
జేసెద నిష్టార్థసిద్ధి చేసెద నీకున్. 87

వ. అనినం బరమదయాలవాలుండును విశిష్టధర్మశీలుండును నైన విక్రమార్కమహీపాలుం డద్దేవి నుద్దేశించి యిట్లనియె. 88

ఉ. ఈముని యింతకాలమును నిట్టితపం బొనరించుచున్నవాఁ
డేమివరంబు గోరియొ మహేశ్వరి యవ్వర మిమ్మహీసుర
గ్రామణి కిమ్ము, నా కిది వరం బని వేఁడిన నట్ల చేసి యా
భూవిభు వీడుకొల్పి, గిరిపుత్త్రి యదృశ్యత నొందె నత్తఱిన్. 89

ఆ. ఇట్టిసాహసంబు నిట్టియౌదార్యంబు
గలుగకున్నఁ గలదె గరిమ యనుచుఁ
బ్రజలు ప్రస్తుతింప నిజరాజధానికి
నుచితలీల నరిగి యొక్కనాఁడు. 90

చ. చిరతరకీర్తి యానృపతిశేఖరుఁ డంచితభక్తియుక్తితో
వరరుచిఁ జూచి యిట్లనియె, వైదికలౌకికధర్మవైభవా
కరుఁడవు, సర్వతోముఖముఖప్రముఖంబు లనేకయాగముల్
వరుస నొనర్చితి, వుభయవంశములున్ నుతికెక్కునట్టుగన్. 91

## విక్రమార్కుం డశ్వమేధము నొనరించుట

క. మనుజాధీశకులోచిత
మనఁబరఁగిన యశ్వమేధయాగం, బది నే
నొనరించెదఁ దదుపక్రమ
మనఘా యొజ్జఁగింపు మనిన నతఁ డిట్లనియెన్. 92

సీ. కాంచనమయములుగా స్రుక్స్రువాదిక
యజ్ఞసాధనముల నలవరించి
సకలభవ్యద్రవ్యసంపాదనమునకు
హితుల నియోగింపు మతులగతుల
శాస్త్రోక్తమతమున సంఘటింపఁగఁ బంపు
మతిపవిత్రస్థలి యజ్ఞశాల
షట్కర్మనిర్వాహచాతురీఖని యైన
యాజ్ఞికుచేత ననుజ్ఞ వడయు
తే. మర్హ్యలక్షణసంపన్న మైనహయము
భూప్రదక్షిణసంచారమునకుఁ బంపు
భట్టిఁ దద్రక్షణమునకుఁ బాలుపఱుపు
వలయురాజుల మునులను బిలువఁ బనుపు 93

వ. మఱియు వలయు నుచితకరణీయంబులకుఁ దత్తద్విధిజ్ఞుల నాజ్ఞాపింపు మని పనిచినం దదనుజ్ఞాపూర్వకంబుగా సర్వంబునకుఁ నిర్వాహకుల నియమించి యజ్ఞయజనదివసంబు భావించి చైత్రపూర్ణమాసిగా నిర్ణయించి దీక్షితుండై సుపరీక్షితం బైనయుత్తమాశ్వంబునకు నుచితోపచారంబు లొనరించి దిగంతంబుల సంచారపూతంబులుగా ననుగ్రహించి చను దెమ్మని ప్రార్థించి యాంగికంబు లైనశుభసూచకంబు లంగీకరించి ప్రమోదాంతరంగుండై భట్టినవలోకించి 94

చ. హితుఁడవు కార్యఖడ్గముల కెంతయు మేటివి నర్వశాస్త్రస
మ్మతచరితుండ వార్యుఁడ వమానుషకీర్తివి, నాకు శోభనా
న్వితమగుచారుకీర్తు లొదవింపఁగఁ గర్తవు నీవె, యంచుఁ ద
త్క్రతుహయరక్షకుం బనిచెఁ గర్మవిధేయుని సౌమతేయునిన్. 95

చ. పనిచిన సర్వసన్నహనబంధురుఁడై చనుదెంచి, యాతఁ డ
జ్జనపతికి న్నమస్కృతి ప్రసన్నతమై నొనరించి నిల్చి, యా
జనచరితార్థవిప్రవరసంఘముతోడఁ దదేకనిష్ఠమై
వెనుచన, నాహయంబు పృథివీవలయభ్రమణాభిలాషి యై. 96

వ. నిర్గమించినకతిపయదివసంబులకు సుమతిసుతసమీపంబుననుండి యొక్క
జంఘాలుఁడు చనుదెంచి పురోపకంఠలీలావనభూమియందు సబలంబుగ
నిల్చి భవత్పుత్రిధానుండున్నవాఁ డుర్వీశ్వరా తత్పరాక్రమధురీణత చెప్పం
జిత్రం బని యిట్లనియె. 97

సీ. సౌవీరభూపతి శరణుజొచ్చినఁ గాచె
గాంధారరాజుచేఁ గప్పమందెఁ
గుంతలాధిపుకూర్మికూఁతులఁ గొనివచ్చె
సౌరాష్ట్రవిభునిచేఁ బేరుగొనియెఁ
బాంచాలభూపాలుఁ బ్రతిరోపితునిఁజేసెఁ
గేరళాధిపుసూను గిఱువుపట్టె
యవనక్షమానాథు నాజ్ఞావశునిఁజేసె
నంగక్షితీశున కభయమిచ్చె
తే. జయము గైకొన్న పిదప నాసకలనృపుల
నుచితసంభాషణములచే నూఱడించి
యజ్ఞవేళకు రమ్మని యానతిచ్చి
నిగ్రహానుగ్రహక్రియానిపుణుఁ డగుచు. 98

చ. ధనదదిశామహీశ్వరవితానముచేత నుపాయనంబుగాఁ
గొనినవినూత్నరత్నఘనకుంజరఘోటకవారకామినీ
జనకనకాంబరాదుల నసంఖ్యములం గొనివచ్చినాఁడు, పెం
పెనయఁగ నన్యభూపతుల కిట్టిప్రధానులు గల్గ నేర్తురే! 99

సీ. సవనాశ్వరక్షకై సగరనందను లేఁగి
కపిలుకోపంబుచే గాసిపొరి

క్రతుహయఘనరక్షక ర్తయై సౌమిత్రి
కుశునిచేఁ దమ్మునిఁ గోలుపడియె
యజనాశ్వరక్షకుం డయి దిలీపసుతుండు
వాసవుకుటిలత మోసపోయెఁ
బార్థుఁ డధ్వరహరి పరిపాలనము సేయఁ
జని తనూజునిచేతఁ జచ్చిపుట్టె
తే. నరసిచూడంగ నొరులు నిరంతరాయ
సప్తతంతుతురంగసంచరణకరణ
బహుళతరకార్యలంపటబాహుశక్తి
భట్టిఁ బోలంగ నేర్తురే? పార్థివేంద్ర! 100

తే. అనిన రోమాంచకంచుకితాంగుఁ డగుచు
నెమ్మనంబునఁ బ్రమదంబు నివ్వటిల్లఁ
గనకమణిభూషణాదులు గట్టనిచ్చి
జాంఘికునిపైఁ గటాక్షవీక్షణము నిగుడ. 101

ఉ. అమ్మెఱునాఁడు దంతితురగాదిసమస్తవరూథినీవితా
నమ్ము భజింపఁగా, మనుజనాథవరుం డెదురేఁగెఁ బేర్మి, నె
య్యమ్ము మనమ్మునం బెరుఁగ నాసుమతిప్రియకారికిన్ జగ
త్సమ్మతసర్వలక్షణసుపమ్మత మేధ్యహయానుపాలికిన్. 102

వ. భట్టియు సాహసాంకుని పాదంబులకు భక్తియుక్తంబుగాఁ బ్రణమిల్లి
మఱియుం దగువారలకెల్లను సముచితోపచారంబులు నడపి తదనంత
రంబ. 103

క. పురజనులెల్లను బ్రమద
స్ఫురణంబున సేస లొలుకుచుం దనుఁ జూడం
దురగానుచరణనియమా
చరణుండై యతఁడు యజ్ఞశాలకుఁ జనియెన్. 104

క. చని జనపతి తనకూర్చిన
జనవినుతమఖోపకరణసామగ్రి ప్రియం
బున వేఱువేఱ చూపఁగ
ననురాగముఁ బొంది భట్టి యద్భుతమతియై. 105

వ అంత మధుమాసపూర్ణమాసి యాసన్నం బగుటయు. 106

క. తమలో నొండొరు మెచ్చక
సమధికవైభవసమగ్రసామ్రాజ్యరమా
రమణీయు లగుచు వచ్చిరి
సమధికశృంగారులై నజగతీనాథుల్. 107

ఉ. వారలకెల్ల నమ్మనుజవల్లభుఁ డాసనపాద్య ముఖ్య స
త్కారములన్ సముజ్జ్వలదగారములం రసవచ్చతుర్విధా
హారములన్ రయం బొసఁగునట్టులుగా నియమించె విశ్వధా
త్రీరమణీశ వర్ణితమతిం దనమామ విదర్భభూపతిన్. 108

క. పరమజ్ఞాననిరూఢులుఁ
బరమతపోవర్ధితప్రభావులు నగు భూ
సురముఖ్యులు మునిముఖ్యులు
నరుదెంచిరి యజనదర్శనాపేక్షితులై. 109

క. పరమాదరమున వారల
తరతమభావంబు లెఱిఁగి తగఁ బూజింపన్
వరరుచిమామాత్యహునిం
బరహితమతి విష్ణుశర్మఁ బ్రార్థన చేసెం. 110

వ. మఱియుఁ బ్రతివాసర సమాగతులైనవారికెల్ల నుల్లంబులు పల్లవింప నుచితోపచారంబు లొనరించుచు, నొక్కనాఁడు సకలసేనాధీశ్వర సంయమీశ్వర మంత్రి సామంతపురోహితపరివృతుండై పేరోలగం బున్నయవసరంబునం, దదీయప్రాణబంధువయిన సుధాసింధువుం బిలువంబోయిన

హితామాత్యుం డగు మహీసురోత్తముండు చనుదెంచి యన్నరేంద్రున
కిట్లనియె. 111

చ. నరవర యేను మీపనుపునం జని కంటిఁ బయోనిధానముం
దరళతరంగతుంగకరతాడనజాతనవీనఫేనముం
గరిమకరోగ్రతుండశతఖండితశశ్వదహీనమీనమున్
ఖరకరబాడబానలశిఖాతతిదీధితిదిగ్వితానమున్. 112

సీ. లక్ష్మీసముత్పత్తి లావణ్యసంపత్తి
గోత్రరక్షణవృత్తిఁ గొమరుమిగిలి
కవిరంజనాసక్తి ఘనరసోదయయుక్తిఁ
బూర్వాపరవ్యక్తిఁ బొలుపు మిగిలి
పటుసత్త్వ విస్ఫూర్తి బంధురతరకీర్తి
గంభీరతాపూర్తి గరిమకెక్కి
వాహినీశఖ్యాతి వరరత్నమయభూతిఁ
బురుషోత్తమప్రీతిఁబొగడువడసి
తే. త్రిజగదానందకరకళాదీవ్యమాన
రాజసందర్శనోత్సవరసనిరూఢి
నతిశయిల్లెడు నీకు నయ్యంబునిధికి
మహితసద్గుణసమితమై మైత్రియొనరు. 113

వ. ఈదృశాభిరామగుణరత్నాకరుండైన రత్నాకరుండు భవదశ్వమేధయజ
నారంభంబునకుం బ్రియం బంది నన్ను సముచితసత్కారంబులం దనిపి
యీదివ్యమణిచతుష్టయంబు నాకుం జూపి యిట్లనియె 114

సీ. ఇది యధ్వరమునకు నిష్టాన్న పానాదు
లవ్వారిగా విచ్చు నద్భుతముగ
నిది యాగరక్షకు మదదంతిహయముఖ
చతురంగబలముల సంఘటించు
నిది యజ్ఞదక్షిణ పొదలించునట్లుగా
నప్రమేయధనంబు లావహించు

నిది మఖాగతులకు నీఁదగియెడు నూత్న
బహురత్నభూషణాంబరము లొసఁగు
తే. ననుచు నీనాల్గుమణులను నంబురాశి
పావడంబుగ నాచేతఁ బనిచె మీకుఁ
దానువచ్చినయట్లుగాఁ దలఁపు మనుచు
విన్నపము సేయుమనుచును వేడ్కతోడ. 115

క. అని పురుషార్థ చతుష్టయ
మన నొప్పెడు మణిచతుష్టయము నిచ్చుటయున్
మనుజాధిపుఁ డా విప్రునిఁ
గనుగొని యిట్లనియె వినయగౌరవ మెసఁగన్. 116

ఉ. అప్రతిమానలీల నొకయాగము నీవును నాచరింపు లో
కప్రథమానకీర్తి యెసకంబుగఁ గైకొనుమంచు నిచ్చె న
వ్విప్రకులాగ్రగణ్యునకు విశ్రుతపుణ్యునకుం గృపావిశే
షప్రతివర్తితో నమృతసాగరదత్త వినూత్నరత్నముల్. 117

క. ఇచ్చిన మునులును నృపతులు
నిచ్చలఁ గడు మెచ్చి మెచ్చి యీయౌదార్యం
బెచ్చటను వినఁగఁజూడఁగ
నచ్చెరు వని ప్రస్తుతించి రా సమయమునన్. 118

వ. అనవరతాహూయమానాగ్నిభట్టారకుండైన వరరుచిభట్టారకుండు చను
దెంచి యజనవాసరం బాసన్నం బగుటయుఁ బ్రసంగించి శశాంకతనకు
నిట్లనియె. 119

సీ. మున్ను నీభండారమున నున్న బహురత్న
కాంచనావళు లసంఖ్యములు గలవు
సతతంబుఁ గంధానుసంధీయమానంబు
లగుమాడలు గణింప నలవి గాదు
నృపులచే భట్టి కానికలు దెచ్చినసొమ్ము
కొలఁది యెవ్వరికి వాక్రుచ్చ రాదు

తగనేత్రములను జింతామణి చేతులఁ
బరుసవేదియు నుండు సిరులఁ బెనుప
తే. నీవు జగదేకదానదీక్షావిధాన
గురుఁడ వటుగాన వేదోక్తసరణికంటెఁ
బదిమడుంగులు దక్షిణ లొదవ నిచ్చి
మేదినీనాథ దాశాశ్వమేధి వగుము. 120

ఆ. అన్నయన్నపలుకు లన్నియు గురుమంత్ర
సరణి నాత్మ నునిచి సాహసాంక
మనుజనాయకుండు మఱునాఁటిపున్నమ
జన్నమునకు దొణఁగె సముచితముగ 121

ఆ. అమరగురుసమాను లైనయాజ్ఞికముఖ్యు
లఖిలసత్క్రియలును నాచరింప
నవభృథంబు సొరక యంకురితంబులై
యతిశయిల్లె నమ్మహాధ్వరంబు. 122

క. అనలుఁడు ప్రవర్గ్యవేళను
ఘనదీప్తులతోడ నూర్ధ్వగతిఁ గనుపట్టెన్
మనుజేశ్వరునధ్వరమున
దనహృదయం బలర మిన్నుదాఁకినభంగిన్. 123

సీ. అమృతోపమానంబు లైనయన్నంబులు
కడిమాడ సేయంగఁ గుడుచువారు
బహుధనధాన్యసంపదలసొంపు వహించి
పేదర్మికిని బొమ్మపెట్టువారు
వరరత్నభూషణాంబరసమగ్రత మించి
ప్రీతిఁ బ్రోద్ధోకవస్నె పెట్టువారు
నాచంద్రతారార్క మైననిర్వాహముల్
గాంచి యుల్లము పల్లవించువారుఁ

తే. గోరికలకంటె సాహస్రగుణితఫలముఁ
బొరసి యవ్విభు వెయినోళ్ళఁ బొగడువారుఁ
గాని మిన్నక యుండెడుమానవుండు
మందునకునైన లేఁడు తన్మఖమునందు. 124

చ. మన మలరంగ భూసురసమాజము కోటి భుజించెనేని క్రం
గనఁ దనుఁదాన మ్రోయుజయఘంటిక తన్మఖవాసరంబులం
దొనర నిమేషమాత్రమును నూరకయుండక మ్రోయుచుండె స
న్మునిజనకోటి నివ్వెర మునుంగ నమందరవంబు పెంపునన్. 125

ఉ. ఏచినవాఙ్మయప్రతిభ లెంతయుఁ జిత్రముగా నధీతిబో
ధాచరణప్రచారణసదర్థముగా శ్రుతిశాస్త్రముఖ్యవి
ద్యాచతురత్వముల్ మెఱయునట్టి మహాత్ముల కాని, యెవ్వనిం
జూచిన నల్పమానవుఁడు సున్న తదీయసదస్యకోటిలోన్. 126

క. సురుచిరమై యష్టాదశ
కరమితమై పసిఁడియిట్టికల నిర్మితమై
యరయఁ జతుస్సిత్యంబై
గరుడాకృతి వేది యొప్పెఁ గడు నద్భుతమై. 127

వ. విధ్యుక్తప్రకారంబుగా మేధ్యాశ్వబంధనబంధురంబైన యూపంబుచుట్టును ఖాదిరంబులుం పాలాశంబులు బైల్వంబులుంగా నాఱేసియు, దేవదారుమయంబులు రెండును, శ్లేష్మాత్మకవిరచితం బొక్కటియునుంగా నేకోత్తరవింశతి యూపంబులు, నలంకారార్థంబుగా ననేకశాతకుంభయూపంబులుం బ్రతిష్ఠించి, యందు జలచరశతంబునుం బక్షిశతంబునుం జతుశ్చరణశతంబునుంగా మున్నూఱుపశువుల నమర్చి, తద్విశసనాంతరంబున నశ్వాలంభనం బొనరించి, తదీయంబులగు మాంసంబులలోనం దత్తద్దేవతాప్రియకరంబులైనయాహుతులు గావించునప్పు, డనంగవతీమహాదేవిచేత నర్హ్యంబు లగుహుతంబులు సేయించి, పరిశిష్టంబు లగునవయవంబులు ఋత్విజులు యథోక్తహుతంబులు గావించిరి. తదీయహోమగంధంబు ఘ్రాణతర్పణంబు గావించి శీలవతీసుతుండు సమస్తసదస్యయుతుండై

యుచ్చైర్నినాదం బగునాశీర్వాదంబుచేసె. తదనంతరంబ సాహసాంక
మహీవల్లభుండు. 128

క. అక్షీణదానలీలా
దక్షుండై ఋత్విజులకు దశగుణితముగా
దక్షిణ లొసఁగెను నుత్తమ
పక్షమున దశాశ్వమేధఫలతత్పరతన్. 129

క. హాటకములు దక్షిణగాఁ
గోటానంగోటు లొసఁగి కుంభినియెల్లం
బాటించి ధారవోసెను
హాటకగర్భప్రభావుఁ డగువరరుచికిన్. 130

వ. అతఁ డమ్మహీదానప్రతిగ్రహానంతరంబున నమ్మహీకాంతున కిట్లనియె. 131

ఉ. దానఘనుండ వౌట మఘదక్షిణగా ధరయెల్ల నిచ్చితీ
వేనది విప్రవర్గమున కిచ్చితి, నీవు భుజాగ్రపీఠికం
బూని ధరించుభూతలము భూసురకోటి భరింప నేర్చునే ?
యేనుఁగుపల్లనం బిడిన నేడికకున్ వశమే వహింపఁగన్. 132

శా. ఉర్వీమూలము కోటికోటుల ధనం బొప్పించి విప్రాళిచే
సర్వక్షోణియు నీవు గైకొనుట కర్జం బన్న, నాయన్నయం
తర్వాణిత్వము మెచ్చి భూవిభుఁడు తద్వాక్యంబు చెల్లించి, మున్
"గుర్వాజ్ఞాం ప్రతిపాలయే" త్తనెడి పల్కుల్ బుద్ధిఁ గీలించుచున్. 133

ఉ. చిత్రతరంబులై నయవశిష్టధనంబులు, రాగమంజరీ
పుత్త్రుఁడు సత్కృపామహిమఁ బూనినమాపులఁ జూచి దానవై
చిత్రి యెలర్ప నిచ్చుటయు జిత్తములం బ్రియమంది బ్రాహ్మణ
క్షత్త్రియవైశ్యశూద్రు లొగి గైకొని మోచిరి తద్వితండముల్. 134

వ. అనంతరంబ యవభృథాభిషేక నిరతిశయతేజోవిరాజితుండై, యారాజ
శేఖరుం డాత్మీయమందిరంబుఁ బ్రవేశించి, యాస్థానమండపాభ్యంతరం

బుననిరంతరమణిమరీచివిలసదున్నత ద్వాత్రింశత్సాలభంజికారంజితంబైన దివ్యసింహాసనంబున నాసీనుండై, సముచితసంభావనాపూర్వకంబుగా సర్వసంయమిద్విజసర్వంసహాధీశ్వరుల నిజస్థానంబులకుం జన నియమించి. 135

ఆ. వితరణంబుగని వివేకంబుకందువ
సత్యశౌచములకు జన్మభూమి
సాహసంబు నెలవు శౌర్యంబుపాడవు నా
విక్రమార్కవిభుఁడు వినుతికెక్కె. 136

క. సజ్జనపరితోషకుఁడు జ
గజ్జనజనకుండు శత్రుగణకంఠాసృ
జ్జ్మజ్జనకౌక్షేయుఁడునై
యుజ్జయనీనగర మేలుచుండెను గడిమిన్. 137

వ. అట్లుండి 138

శా. ఆభూపాలకుఁ డొక్కనాఁడు మృగయావ్యాపారలీలాగతిన్
శోభాబంధురవాహవారణరథస్తోమంబు దుర్గాటవీ
క్షోభంబుం బొదలింపఁగా మెలఁగ నచ్చో నొక్కచో నొంటిమై
నాభీలం బగుదంష్ట్రివెంట నట డయ్యం బాటి ఖిన్నాంగుఁడై. 139

## దేవదత్తుని వృత్తాంతము

క. ఘనవటవిటపిచ్ఛాయను
జనపతి శయనించి యున్నసమయమున, జగ
జ్జనసుతుఁడు దేవదత్తుం
డనుభూసురవర్యుఁ డొక్కఁ డతనిం గాంచెన్. 141

తే. కాంచి యవ్విభుతనుపరిక్లాంతి యెఱిఁగి
చేతికుండికాజలముల సేదఁదేర్చి
యాత్మపురమున కేశేర నవధరింపు
మండలాధీశ! యొంటిమై నుండనేల. 141

చ. అనినఁ బ్రమోద మంది వసుధామరవర్యునిఁ గూడి విక్రమా
ర్కనృపవరేణ్యుఁ డాత్మనగరంబునకుం జనియెన్, ద్విజుండునుం
దనసదనంబు చేరెఁ బ్రమదమ్మున నమ్మఱునాఁడు పిల్చి, య
జ్జనపతి దేవదత్తునకు సమ్మతి నిచ్చెఁ బురోహితత్వముల్. 142

వ. ఇచ్చి యొక్కనాఁడు. 143

తే. కలయఁగాఁ జూచి కొల్వులోఁ గల్గువారు
వినఁగ దేవదత్తుఁడు మున్న విపినభూమిఁ
గోరి నాకుఁ జేసినయుపకారమునకు
మాఱుసేయ నెన్నఁడు సమకూఱు నొక్కొ! 144

వ. అనిన నమ్మాటకు దేవదత్తుండు నృపోత్తమునియాసన్న వర్తిత్వంబునం జేసి, తనవర్తనం బఖిలజనంబులు పరికీర్తనంబు సేయం బ్రవర్తించుచు నొక్కనాఁడు, సర్వాభరణభూషితుండై నరాజకుమారుండు ముంగిట నాడ ముద్దాడువాఁడునుంబోలె నెవ్వరు నెఱుఁగకుండ గూఢవృత్తి నెత్తుకొని నిజనివాసంబునకుం జనియె, నంత నక్కుమారు నెల్లవారు నెల్లెడల నరసి కానక ధాత్రీశ్వరున కత్తెఱం గెఱింగించిన, నతండును గుమారా న్వేషణంబునకుఁ దలవరుల నియోగించిన నయ్యారెకులు చని పురంబు సర్వంబును శోధించి, విపణివీథిం దదీయాభరణమ్ములమ్మ నమ్మహీసురు మచ్చంబుతోడం బట్టి తెచ్చి సమ్ముఖంబునం బెట్టిన, నమ్మహీపాలుం డుచితాలాపంబుల వెఱవువాపి యడుగుటయు. 145

ఉ. భూసురముఖ్యుఁ డిట్లనియె భూషణసంగ్రహణాభిలాషినై
యాసురవృత్తిఁ బూని భవదాత్మజుఁ జెప్పఁగరానిచేత నేఁ
జేసితి, నావుడున్ సభ నశేషజనమ్ములుఁ గ్రూరదండితుం
జేసినఁగాక యీచెడుగు చేసినచేఁత సహింపవచ్చునే? 146

క. ఈభూషణంబు లెక్కడ
నాభూపకుమారుఁ డేడ నకటా! కృప లే
కేభంగిఁ దెగి వధించితి
వేభూములఁ జెప్పఁ గలరె యిట్టి దురాత్ముల్! 147

వ. అని కలుషించి దండింపం దలఁచి. 148

ఆ. కొలువువెడల నీడ్చికొనిపోవ నతిసంభ్ర
మమున విక్రమార్కమనుజవిభుఁడు
వారి మగుడఁ బిలిచి వలదని వారించి
యెల్లవారు వినఁగ నిట్టు లనియె. 149

క. మున్నొకపురుషార్థము మది
నెన్నఁడు మఱవంగ రాని దితఁ డొనరించెఁ
నన్నును నేనెఱుఁగక పడి
యున్నెడ వనభూమి శీతలోదక మొసఁగెన్. 150

ఉ. కావున నీతఁ డెంతయపకారము సేసిన సైఁపఁ బాడి, యే
నావిపినంబు వెల్వడికదా పురికిం జనుదెంచి రాజనై
యీవిభవంబుమై మనుట, యెంతటి తప్పిది ? నాకుఁ దప్పినఁ
దైవముసాక్షి యీతనికిఁ దప్ప నొకింతయు, మాట లేటికిఁ ? 151

ఉ ఆపద చక్కఁబెట్టి తనయక్కఱెల్లను దీర్చి, యెయ్యెడం
బ్రాపయినట్టికార్యములపట్టున నిర్వహణం బొనర్పఁగా
నోపి, తను న్భరించినబుధోత్తము నొప్పరికించు నమ్మహా
పాపికి నెన్నిజన్మములఁ బాయునొకో క్రిమికీటజన్మముల్ ! 152

ఉ. నావుడు రాజుసభ్యవచనంబున కెంతయు సంతసిల్లి. భూ
దేవుఁడు మందిరంబునకు దిగ్గనఁ బాటి కుమారుఁ దెచ్చి, ధా
త్రీవరు నంకపీఠి నిడి దీవన లొప్పఁగ నిచ్చి తత్సభా
కోవిదకోటిడెందమునకుం బ్రమదంబు జనింప నిట్లనున్. 153

ఉ. దేవర నేఁడు కొల్వున మదిం గడునెంతయు సంతసించి, సం
భావనమీఱ నాకు నొకప్రత్యుపకారము సేయఁబూనుశే
నావల నీవల న్వినిి, యథార్థ మెఱుంగుటకై యొనర్చితిన్
నావెడబుద్ధికి న్మనమునం గలుషింపకుమయ్య వేఁడెదన్. 154

క. అనవుడు ధరామరేంద్రుని
కనుపమ మణిభూషణాదు లగుసంపదలన్
మనమలరఁజేసి గృహమున
కనిచె సభాసదులు నిచ్చ నచ్చెరువందన్. 155

వ. ఇత్తెఱంగున విక్రమార్కావనీశ్వరుండు సత్యవచన ప్రత్యుపకార పరాయణుండై ధరాపరిపాలనంబు సేయుచుండె నంత. 156

## కమలాకరుని వృత్తాంతము

తే. అన్నరేంద్రుపురోహితుఁ డార్యనుతుఁడు
వేదవేదాంతవేది వివేకఘనుఁడు
దత్తనూజుఁడు మదవతీచిత్తహరణ
హారిలీలాకరుఁడు కమలాకరుండు. 157

వ. అక్కుమారుండు విద్యావిదూరుం డగుట గనుంగొని జనకుం డతని కిట్లనియె. 158

క. శత్రుఁడు చదువనిపుత్త్రుఁడు
శత్రుఁడు ఋణకారి యైనజనకుఁడు, మిగులన్
శత్రువు రూపసి యగుసతి
శత్రువు దుశ్చరిత యైనజనని తలంపన్. 159

క. కుల ముద్ధరింపు చదువం
దలకొనుము "వచ స్సుభాషితపరివ్యక్తం
బల మేవ హి కేవల" మను
పలుకు పురాతనము గాక ప్రశస్తంబే. 160

వ. అని ప్రార్థించినం గమలాకరుం డొక్కింతచింతాక్రాంతుండై యుండి నిశ్చితాంతఃకరణుండై తండ్రికిట్లనియె. 161

ఉ. వేదపురాణశాస్త్రముఖవిద్యలు సర్వము నభ్యసించి, లో
కాదరణీయసారకవితాభ్యసనం బొనరించి మేటి నై
యాదిమునీంద్రవర్తనగుణాఢ్యుఁడనై చనుదెంచి, నీకు స
మ్మోద మొనర్తు నావలుకమోఘపదం బని చెప్పి నమ్రుఁడై. 162

వ. తండ్రిపీడ్కొని మహీమండలమండనం బైన కాశ్మీరమండలంబునకుం జని, యందు సరస్వతీవిహారసదనంబునుంబోని యొక్కమహాగ్రహారంబున సన్నిహితచంద్రజూటుండగుచంద్రచూడుం డనువిద్వచ్చూడామణిపాలికిం జని నమస్కరించి, తనయభిలాషంబు నెఱింగించి దేవతానిర్విశేషంబుగాఁ బరిచర్యసేయుచుండ, నతనిసేవాతాత్పర్యంబునకు సంతసిల్లి సిద్ధసారస్వత మంత్రం బుపదేశించె, నంతం దదనుష్ఠానవిశేషంబునకు శారద ప్రత్యక్ష్యంబై యతని సముచితవిద్యావిశారదుం గావించిన, లబ్ధకాముండై పితృదర్శనప్రీతి గురునియుక్తుండై యుజ్జయినీపురంబునకు వచ్చి నిజ మందిరంబు ప్రవేశించి. 163

చ జనకునిఁ గాంచి భక్తిభయసంభ్రమసంభృతుఁడై నమస్కరిం
చిన, నతఁడెత్తి నందనునిఁ జిక్కఁ గవుంగిటఁ జేర్చి పెక్కుదీ
వనలొనరించె, ముత్పులకవారము సమ్మదబాష్పపూరముం
దనరఁగ సమ్మదం బొదవదాల్చినలీల వికాసలక్ష్మితోన్. 164

వ. అమ్మఱునాఁడు. 165

ఉ. భూవరుసమ్ముఖంబునకుఁ బోయి ప్రసన్నతఁ గాంచి, యింపుమైఁ
గోవిదవర్ధనీయ మగుగోష్ఠి యొనర్చిన, న ంభుండు మో
దావహచిత్తుఁడై యభిమతార్థపరంపర లి- , యమ్మహీ
దేవకుమారచంద్రమునిదిక్కుఁ గనుంగొని ప్ర తి నిట్లనున్. 166

తే. ఈవు బహుదేశములఁ జరియించి యచ్చ
టచట నేమేమి చోద్యంబు లనఘచరిత
కనినవినినవి క్రొత్తలు గలిగెనేని
నాకుఁ జెప్పుమ యనఁ గమలాకరుండు. 167

## నరమోహినీ వృత్తాంతము

క. పరిచితవిద్యానిధినై
గురునాథునిచే ననుజ్ఞ గొని యిట మిమ్మున్
దరిసించు నభిమతంబున
నరుదెంచుచునుండి మండలాధిప యంతన్. 168

తే. కాంచియే లెదుజయసేనుఁ గాంచి, యతఁడు
నన్నుమన్నింప నందుఁగొన్నాళ్లు నిలిచి
యొక్కనాఁడేను బొడగంటి నొకవధూటి
నావిలాసిని చెలువ మేమని నుతింతు. 169

సీ. పొలఁతి వేసవితోడఁ బురినెమ్మి తనపురి
ప్రతివచ్చునని పాముఁబట్టెనేని
యింతినెమ్మోముతో నెనయుదునని వార్థి
పట్టి విష్ణుపదంబు ముట్టెనేని
చామచన్నులతోడ సరివత్తుమని కోక
ములు దండగుండాన మునిఁగెనేని
యతివమై దొరయుదు నని సువర్ణ శలాక
వహ్నిలోపలఁ జొచ్చి వచ్చెనేని
తే. నిక్కువంబుగ నమ్మంగనేర కజుఁడు
శుద్ధపట్టంబు గనుటకుఁ జొరక మానె
ననిన నయ్యంబుజాతాయతాక్షితోడ
నితరవనితల నుపమింప నెట్లువచ్చు? 170

క. అయ్యంగన క్రేఁగన్నుల
యోయారపుఁగలికిచూపుటురులం బడినం
గాయజునిచిత్తమైనను
గాయజసంతాపవహ్నిఁ గరఁగక యున్నే. 171

సీ. చంద్రబింబముఁ బాలసంద్రంబులోఁ దోఁచి
కందెల్లఁ బోఁ బులు కడుగకున్నఁ
గామబాణంబులఁ గరసానఁబట్టించి
తొలుకారుమెఱుఁగునఁ దొడయకున్నఁ
బసిఁడిసలాకకుఁ బరిమళం బొనగూర్చి
గరువంపువెన్నెల గరఁగకున్నఁ

జిగికందకుండ లేఁజిగురాకుఁ గొనివచ్చి
యొగరెల్లఁ బుచ్చి యింపొసఁగకున్నఁ
తే. గాంతనెమ్మోమునకు వాలుఁగన్నులకును
వళులు నునుమేనికిని నొప్పువారెఱకును
నీడుజోడై నవ్రతి యని యెన్నఁగడిది
హస్తిమశకాంతరము సహజైకకాంతి. 172

క. అన్నాతిముద్దుమోమునుఁ
దిన్నని నెన్నడుము నగవు దేఱెడి కన్నుల్
పెన్నెఱివేణియుఁ గ్రొవ్విన
చన్నులునుం గనినఁ బుష్పశరుఁడుం గరఁగున్. 173

వ. అది నరమోహిని యనువారనారీతిలకంబు. 174

ఆ. అవధూటితోడ ననుభవకేళికి
నభిలషించి యెవ్వఁ డరిగెనేని
నతఁడు రాక్షసాభిహతుఁ డగు నారాత్రి
యంద దాని కిట్టి నింద గలదు. 175

వ. తన్నిమిత్తంబున. 176

క. పురిలోన నెదురుఁ దెరువై
యరుదెంచిన నవ్వధూటి నంగుళిఁ జూపం
గరిమర్థిఁ జూడ వెఱతురు
పురుషులు రక్కసుఁడు చంపుఁ బొమ్మని క్షితిన్. 177

క. అని విన్నప మొనరించిన
విని వేడ్కను విక్రమార్కవిభుఁ డప్పుడ స
జ్జనహితుఁ డగు కమలాకరుఁ
డనుచరుఁడై యరుగుదేర నరుదెంచి తగన్. 178

క. కాంచెం గాంచీపురముం
గాంచనమణిసౌధసాలఘనగోపురముం
జంచలనయనానటనస
మంచితపర్యటనరణితమణినూపురమున్. 179

వ. కాంచి యందు నయ్యిందువదనమందిరంబునకుఁ గమలాకరమహీసురోప
దిష్ట మార్గంబునం జని యజ్ఞనవరుండు. 180

క. నరమోహనవిలసనముల
మరుమోహనశరముకంటె మధురాకృతియై
నరమోహిని యనఁదగియెడు
నరమోహినిఁ గాంచి మనుజనాథుఁడు మదిలోన్. 181

ఉ. ముప్పిరిగొన్న వేడ్క నరమోహినిపై నెలకొన్న జూపులం
ద్రిప్పఁగలేక యామదవతీరమణీయత ప్రాపున న్మరుం,
డప్పరమేశపద్మనయనాంబుజగర్భులనైన వ్రేల్మిడిం
ద్రిప్పులబెట్టు, నంచు వినుతించి మదిం దిలకించి వెండియున్. 182

ఆ. ఈవధూటిరూపయౌవనసంపద
కాముకులకు లోచనామృతంబు
చిత్రగతి మృతంబు సేయుచునున్నది
కనకపాత్రలోనిగరళమట్లు. 183

వ. అని తలంచుచున్న యవసరంబునఁ గమలాకరుం డాకమలానన కిట్ల
నియె. 184

ఉ. ధీరుఁడు విక్రమార్కజగతీతలనాథుఁడు నిన్నుఁజూచు ని
చ్చారతి వీఁడె వచ్చె ననః జాగిలి మ్రొక్కి ప్రియోక్తి నిట్లనుం
గ్రూరనిశాచరుం డొకఁడు కూరిమి నాయెడఁ గల్గియుండు, సం
హార మొనర్చు వచ్చినవిటావళిఁ దన్నిశనొక్క వ్రేల్మిడిన్. 185

వ. అని తనతెఱం గెఱిఁగించి మహీవల్లభునకు నప్పల్లవాధర యుచితోప చారంబు లొనరించి, సరసకథాభూషణంబులగుభాషణంబులం బ్రొద్దు పుచ్చుచున్నయంత సాయంతనసమయం బగుటయు. 186

చ. మునుకొని దంష్ట్రి కారుచులు ముందటిచీఁకటి నెల్లఁ బాపఁగా
వెనుకఁ దమాలనీలనిజవిగ్రహదీప్తులు చిమ్మచీఁకటిం
బెనుపఁగఁ గొమ్ముమేనుఁగు విభీషణతం జనుదెంచుకై వడిన్
దనుజవరుండు వచ్చెఁ దనదారుణరూపము భీతిఁ బెంపఁగన్. 187

ఉ. తత్సమయంబునందు వసుధావరుఁ డుద్గతుఁడై యదల్చి, యు
ద్యత్సమదగ్రసింహగతి దైత్యుని మార్కొని, యోరిదుష్ట ! ని
న్మత్సరబుద్ధి నీక్షణమ మర్దితుఁ జేసి, ధరిత్రికెల్ల న
త్యుత్సవ మేనొర్చెదఁ బయోరుహాలోచనకోర్కి దీర్చెదన్. 188

చ. అన విని దానవేశ్వరుఁ డహంకృతి రౌద్రరసంబు మూర్తిగై
కొనినవిధంబునన్ నృపతికుంజరు నేడెత్తఱఁ దాఁకి వీఁకమైఁ
బెనఁగి పెనంగి లావఱినఁ బేర్చి నరేంద్రుఁడు కాళ్ళుపట్టి నే
ల నడచి మల్లవిద్య సఫలంబుగఁ బీనుఁగుఁ జేసె దానవున్. 189

తే. ఇట్లు దానవు వెసఁ జంపి యిల్లువెడలఁ
దివిచి వైచిన మేదినీధవునిఁ జూచి
హర్షమున నరమోహిని యల్ల నగుచు
నింపు రెట్టింప నతనితో నిట్టులనియె. 190

క. నరమోహిని నానామము
నరఘాతిని యని జనంబు నను నిందించున్
నరనాథ నింద మాన్చితి
చరితార్థం బయ్యె నాదుజననం బరయన్. 191

తే. ఏను మీపనిచినపని యెట్టిదైనఁ
జేసి మీదాసినై సేవ సేయుదాన

ననిన విక్రమాదిత్యుఁ డట్లయిన నీవు
నాకుఁ బ్రియముగ నొకటి యొనర్పవలయు. 192

క. లోకవిలోచనకైరవ
రాకాచంద్రుం డితండు, రమణీమణి నీ
వీకమలాకరుఁ బ్రియుఁగాఁ
గైకొను మిది నాకుఁ బ్రియము కమలదళాక్షీ ! 193

వ. అని యయ్యిరువురం గూర్చి యజ్జననాథుం డుజ్జయినీపురంబునకుం జని, దుష్టనిగ్రహ శిష్ట ప్రతిపాలనంబులు సహజఖేలనంబులుగా ననయంబును సర్వంసహానిర్వహణ దుర్వార భుజాగర్వఖర్వేతరుండై రాజ్యంబు సేయుచుండి, జగంబున నత్యాశ్చర్యభరితంబులైన చరితంబు లెఱుంగవేఁడి కర్ణావతంసీకృత కౌక్షేయకసహాయుండై చని యొక్కరుండును బెక్కుదిక్కులం జరియించుచు నొక్కనాఁడు. 194

## విక్రమార్కుఁడు రక్షసునిచే మనుజవధ మాన్పించుట

క. పేరడవిలోన రాఁగా
నీరజహితుఁ డస్తమించి నెఱినఖిలాశా
పూరితమై తమ మెచ్చెను
భూరిపదాన్యులవితీర్ణిఁ బోల్పఁగఁ బట్టై. 195

క. ఆచీఁకటి నొక్కండును
ద్రోచిచనఁగ రామి, ననతిదూరంబున వా
గ్గోచరము గానియున్నతి
నేచినవటవిటపినీడ నెలమి వసించెన్. 196

వ. అట్లున్న సమయంబున. 197

క. ఆవిటపి సుచితవచన
ప్రావీణ్యము మెఱయ నున్నపతులకుఁ జిరం
జీవి యనువిహగముఖ్యుఁడు
కోవిదబహుమాననీయగుణుఁ డిట్లనియెన్. 197

క. మీ రావారార్థముగాఁ
గోరి చరింతురు సమస్తఘోరాటవులన్
దూరగ్రామంబుల ఫలి
తారామంబులను దశదిశాంతరములలోన్. 199

తే. కన్న చోద్యంబు లేవేని గల్గెనేని
నాకు నెఱిఁగింపుఁ డేను వినంగవలతు
ననిన నందులో నబ్బరికాభిధాన
మొకపతత్రి యిట్లనియె, నేఁ డుదయవేళ. 200

క. ఏ మొకకొండఅము మహా
గ్రామవనాంతరము లెల్ల గడచి చని, గ్రహ
స్తోమగతిప్రతిరోధన
భూమావంధ్య మగువంధ్యము సమీపమునన్. 201

క. చైత్రరథనందనంబుల
చిత్రస్ఫురణముల నుల్లసిల్లుఁ బ్రశంసా
పాత్రమయి యొక్కవిపినము
చైత్రరమాకాంతజన్మసదనం బగుచున్. 202

వ. అవ్వనంబున వన్యఫలాహారణార్థంబు సంచరించుచు, నొక్కయెడం గమలకల్హారకుముదశోభితంబును గలహంస కారండవ క్రౌంచ చక్రవాక సారసమదసారంగ సంకులారావవిరాజితంబును నగునొక్కకమలాకరంబు తీరదేశంబున, ననేకబంధులోకపరివృతుండును దీర్ఘనిశ్వాసపవనధూళిధూసరితుండును గళద్బాష్పనయనకమలుండుమ దురంతదుఃఖపరవశుండునునై యున్న కంకాళఖండనుం డనునొక్క విహంగపుంగవుం గని చేరంజని, తన్నెఱిఁగించుకొని దుఃఖకారణం బడిగిన నతం డెట్టకేలకుఁ జిత్తంబుకలంకదీర్చుకొని యీరెలుంగున నాతో నిట్లనియె. 203

తే. ద్వాదశగ్రామములకు నధ్యక్షుఁ డొక్క
రాక్షసుఁడు వింధ్యనగగహ్వరమున నుండు

నతని కాయూళ్ళవార లాహార మెపుడు
బండిఁ గొనిపోయిపెట్టుదు రొండొకండ. 204

వ. వాఁ డన్నరమహిషసహితంబుగాఁ దదన్నంబు భక్షించుచుండు. 205

క. ఇలువరుసగాఁగ నీక్రియఁ
గలవారల నెల్లఁ బుచ్చెఁ గాలునిపురికిన్
ఖలుఁ డగునారాక్షసుఁ డా
కులపడుఁ ద్విజగంబు నతఁడు కుపితుండై నన్. 206

ఉ. ఏమని చెప్పుదున్ ఖగకులేశ్వర ! నాసఖుఁ డొక్కభూసుర
గ్రామణి చావఁగాఁ గలఁడు రాక్షసుచేఁ, నదిమాన్పఁ ద్రోవలే
దేమెయిఁ జూచినన్ హితులయిష్ట మొనర్పఁగ లేనినాభవం
బేమిభవంబు ! దీనికిని నే దురపిల్లెద నేమిసేయుదున్. 207

వ. అనిన నేనిట్లంటి. 208

క. నరులకుఁ బక్షులకును నె
వ్వరుసున సమకూరు మిత్రభావం, బిది య
చ్చెరువు, వినవలతు నా కిది
వరిపాటి నెఱుంగఁజెప్పు బంధునిధానా. 209

వ. అవినఁ గంకాళఖండనుం డిట్లనియె. 210

క. నాచుట్టంబులు నేనును
వే చని యళనార్థ మడవి విహారింపంగాఁ
జూచి మముఁ బట్టఁ దిరిగెడు
నీచుఁ డొకఁడు మాచరించునెల వెఱఁగి తగన్. 211

క. మచ్చులిడి యురులు బోనులు
నచ్చట వెస నొగ్గి చనిన నది యెఱుఁగక యా
మచ్చుచ్చురులను బడి వగ
నిచ్చను దుఃకపిల్లుచున్నయెడ నచ్చటికిన్. 212

వ. సమిత్కుశార్థంబు దైవవశంబున. 213

క. వచ్చి యొకద్విజకుమారుఁడు
చెచ్చెర మముఁ జూచి కరుణ చిగురొత్తంగాఁ
గ్రచ్చఱ నయ్యురులూడ్చిన
నిచ్చల మామనికిపట్ల కేఁగితిమి వెసన్. 214

క. అది చనియును నేఁటికి నిరు
పదియేఁడులు గడచె. నాఁటఁబట్టియు నేనా
మది నాతనియాపద సం
పద నాయదిగాఁ దలంతు బంధుత్వమునన్. 215

క. అని చెప్పిన విని వచ్చితి
నని చెప్పిన విహగవిభునియాలాపంబుల్
వినియెఁ జెవియొడ్డి భూరుహ
మునక్రింద వసించి యున్నభూమీశ్వరుఁడున్, 216

క. విని యపుడ కదలి. జామె
క్కినయంతకుఁ జనియె నసురకేలిసదనా
వనిభృత్కంధరభూమికిఁ
దన కిదియ పరోపకృతికిఁ దఱి పొమ్మనుచున్. 217

క. చని వధ్యశిలాస్థలి న
జ్జనపతి కూర్చుండె నిర్విశంకత, నంతం
గనియె గుహవెడలి చనుదెం
చి నిశాటుఁడు వధ్యశిల వసించినవానిన్. 218

చ. కని భ్రుకుటీమహోగ్రపరికంపితఫాలభయంకరాస్యసం
జనితనిదాఘవారికణజాలవిజృంభణరౌద్రమూర్తియై
యనియెఁ గణంగి యోరిమనుజాధమ! నిచ్చలుఁ దెచ్చువంటకం
బును నులివేఁడికూరలు నపూపములున్ గొనిరా కహంకృతిన్. 219

తే. ఒక్కఁడవ వచ్చి వధశిల యెక్కి నన్ను
నవహసించుచునున్నాఁడ వనుచుఁ దీవ్ర
గమనుఁడై చనుదెంచురాక్షసునితోడ
నృపతి నిశ్శంక నిట్లను నిభృతుఁ డగుచు. 220

చ. దితిసుత ! నేఁడు చావనరుదెంచు మహీసురవర్యుమాఱు వ
చ్చితిఁ బరదేశి. నాచనవు చేకొని మత్తనురక్తమాంసముల్
ధృతిఁ గొను మంతకంటెఁ బరితృప్తి యొనర్చు, మదన్వయక్రమా
గతమగు నిప్పరోపకృతికల్పనఁ బారమునొందఁ జేయుమీ. 221

ఉ. నావుడు దానవేంద్రుఁడు మనంబున నచ్చెరువంది, సత్కృపా
భావనకుం బరోపకృతిభంగికి మెచ్చితి, నేఁడు మర్థి నీ
కేవర మైన నిచ్చెదఁ బ్రహృష్టమనస్కుఁడ నైతి నీయెడన్
నావుడు విక్రమార్కనరనాథుఁడు నద్దనుజేంద్రుతోడుతన్. 222

ఆ. ఈవివేకబుద్ధి యీచిత్తసంశుద్ధి
యీకృపారసావసేకసిద్ధి
కలదె యొరుల కెందుఁ గారణజన్ముండ
వగుటఁజేసి నీక యబ్బెఁ గాక ! 223

తే. నాకు వరమిత్తు నను మాట నైజమేని
మనుజవధ యొనరింపక మాను మనినఁ
దత్పరోపకారైకతత్పరత కలరి
యట్లచేసెద నని పల్కి యసుర చనియె. 224

వ. ఇవ్విధంబున. 225

ఆ. భూపచంద్రముఁడు "పరోపకారార్థమి
దంశరీర" మనినధర్మమార్గ
సరణి దప్పకుండ సకలార్థిరక్షణ
వర్తనమున నిత్యకీర్తిఁ గాంచె 226

మ. పరమబ్రాహ్మణదేవభక్తినియమప్రజ్ఞారమాలంకృతా
పరుషారాతిమహీశమంత్రిజనశుంభద్గర్వసంరంభసం
హరణప్రౌఢనయోన్నతా కనకదండాందోళికాఛత్రచా
మరముఖ్యోజ్జ్వలరాజవిహ్నమయసమ్యగ్వైభవప్రాభవా. 227

క. భావపరిశుద్ధికలనా
ప్రావీణ్యామృతగిరిశపావనపదరా
జీవయుగభక్తితత్పర
సేనాహేవాకనిరతసిద్ధయపౌత్త్రా. 228

## కాంతావృత్తము

ధారాధరవాహనధైర్యకృతీ
క్షీరాబ్ధిశిబీశ్వరశీతలరు
గ్ధారాధరకల్పకకామగవీ
తారాధిపసన్నిభదాననిధీ.

గద్యము : ఇది శ్రీమదఖిలకవిమిత్త్ర పెద్దయ యన్నయామాత్యపుత్త్ర శారదా దయావిధేయ జక్కయనామధేయప్రణీతం బైనవిక్రమార్క చరిత్రంబనుమహాకావ్యంబునందుఁ బంచమాశ్వాసము.

శ్రీ ర స్తు

# విక్రమార్క చరిత్రము

## ష ష్ఠా శ్వా స ము

శ్రీమేళనగుణఖేలన
సామాదికచతురుపాయచాతుర్యనిధీ
స్వామిహితకార్యఘటనా
సౌముఖ్య జగత్ప్రసిద్ధ జన్నయసిద్ధా. 1

సీ. విభవంబు పొలుపున విలువిద్యబలుపునఁ
బురుహూతుఁ దత్సుతుఁ బోలు ననఁగ
సత్ప్రభ పెంపునఁ జాగంబుసొంపున
మిత్త్రుఁదత్పుత్త్రుని మీఱుఁ ననఁగ
రాజరాజవిభూతి రతివిహారఖ్యాతి
ధనదుఁ దత్సూనుని నెనయు ననఁగ
గంభీరతాస్ఫూర్తి ఘనకాంతిమయమూర్తి
శరధిఁ దదాత్మజు దొరయు ననఁగ
తే. నిరతసేవాగతాగణ్యనృపవరేణ్య
నుతకిరీటాగ్రకీలితనూత్నరత్న
కిరణనికరారుణారుణచరణుఁ డగుచు
విక్రమాదిత్యవసుమతీవిభుఁడు మెఱసె. 2

వ. అమ్మహీపతి యొక్కనాఁడు సకలప్రధానదండనాథసామంత మండలేశ్వర సమూహంబును, గురుభూసురపురోహితబంధుమిత్త్రపుత్రపౌత్త్రప్రకరంబును, గవిగాయకపాఠకవైతాళిక సందోహంబును బరివేష్టింప, మణిగణ భూషణ ప్రభాపటలశోభితాంగుండై మౌక్తికహారంబునడిమి నాయక రత్నంబునుంబోలెఁ దేజరిల్లుచు,మణిమయోన్నత భద్రసింహాసనాసీనుండై పేరోలగంబున్న సమయంబున. 3

సీ. ఆదినాథునియపరావతారము పూని
మత్స్యేంద్రనాథునిమహిమఁ దనరి
సారంగనాథుని సామర్థ్యమును బొంది
గోరక్షనాథునిగుణముఁ దాల్చి
సిద్ధబుద్ధునిబుద్ధి చిత్తమునం జేర్చి
ఖనిరువిద్యాధికఘనతఁ బేర్చి
మేఖనాదునిమంత్రవైఖరివహియించి
నాగార్జునునికళాశ్రీగమించి
తే. యావిరూపాక్షుఁ డితఁడన నతిశయిల్లి
యర్థి నవనాథసిద్ధుల కైక్యమైన
మోహనాకృతి యితఁడనుమూర్తిఁ దనరి
చిన్మయస్వాంతుఁ డగునొక్కసిద్ధవరుఁడు. 4

ఉ. పాదములందు బంగరపుఁబాపలు వెట్టి, దుకూలకంథ మై
మోదముతోడఁ దాల్చి, జనమోహనమారణధాతువాదయం
త్రాదిసమస్తవిద్యల సమర్థు లనం దగుశిష్యపంక్తి య
త్యాదరలీల నిర్మెయిలయందుఁ దనుం గొలువన్మహోన్నతిన్. 5

క. వచ్చి తగుచందమున సభఁ
జొచ్చి, మహీకాంతుఁ జూచి సుభగాకృతికిన్.
మెచ్చి తలయూఁచి. కానుక
తెచ్చినరత్నంబుతోడ దీవన లిచ్చెన్. 6

ఉ. ఇచ్చిన సిద్ధవల్లభున కిమ్ముల నాసనపాద్యసత్కృతుల్
పొచ్చెము లేకొనర్చి నృపపుంగవుఁ, డెయ్యది మీకుఁ బేరుఁ తా
రెచ్చటు, నేను జేయుపని యెయ్యది? భాగ్యయుతుండనైతి మీ
వచ్చుటఁజేసి భక్తజనవత్సల! యన్న దరస్మితాస్యుఁడై. 7

క. ఇందందుండుదు నవలే
కెందైనఁ జరింపుదును నిక్షేచ్ఛమెయి, సదా

నందుఁడు నామము, వచ్చితి
నిందులకును నిన్నుఁజూడ నిష్టం బగుటన్. 8

వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 9

సీ. ఏవేళ వేఁడిన నావేళ దివ్యాన్న
పానాదు లొడఁగూర్చుపాత్ర గలిగి
యెచ్చోట వ్రాసిన నచ్చోట పుటభేద
నములు గావించుదండంబు గలిగి
యెటఁబోవఁ దలఁచిన నట కెత్తుకొనిపోవు
సుకుమారయోగపాదుకలు గలిగి
యెపుడు విదల్చిన నపుడు వేలతులు
కనకంబు వర్షించుకంథ గలిగి
తే. నిర్మలజ్ఞానవిజ్ఞాన నిరుపమాన
రాజయోగీశ్వరత్వవిరాజిమహిమ
తనర మించిననీ కస్మదాదులకును
హస్తిమశకాంతరము గాదె యంతరంబు. 10

సీ. వేయిమోములవాఁడు విషముక్తుఁడైనను
బ్రతి యగు నీకు భూభరణశక్తి
వేయిగన్నులవాఁడు విమలవర్తనుఁడైనఁ
దర మగు వైభవస్ఫురణనీకు
వేయిచేతులవాఁడు విగ్రహవ్యథఁ జెంద
కున్నఁ దేజమున నీజోరయువాఁడు
వేనామములవాఁడు వేడనివాఁడైన
నిత్యలక్ష్మియుక్తి నిన్నుఁ బోలుఁ
తే. గాక యేతద్గుణంబుల గణన సేయ
నన్యరాజన్యవరులు నీయంతవారె?
ప్రసవశరరూప యప్రతీపప్రతాప
దీసితాటోపవిక్రమాదిత్యభూప! 11

మ. అని యానందమరందకందళితవక్త్రాంభోజుఁడై యోగిరా
డ్జననాథుండు ప్రశంససేయుటయు, నాసర్వంసహాధీశ్వరుం
డనఘా! నీదుకటాక్షవీక్షణము నాయం దందమై చెందెఁ గా
న నవీనప్రథమానభాగ్యమయధన్యత్వంబు నేఁ గాంచితిన్. 12

ఆ. అనుచు శిష్యసహిత మమ్మహాయోగీంద్రు
గారవించి కొలువువారి ననిచి
మనుజనాయకుండు మజ్జనభోజన
క్రియల వారికెల్లఁ బ్రియ మొనర్చె. 13

వ. వారలుం దానును సుఖాసీనులై యున్నయవసరంబున యోగీశ్వరునకు విశ్వంభరాధీశ్వరుం డిట్లనియె. 14

క. ఎన్నిక కెక్కిన దేశము
లన్నియుఁ జూచితిరి కరతలామలకముగా
నిన్నిటిలోపలఁ జోద్యము
కన్నది విన్నదియు నొకటి గలిగినఁ జెపుఁడా. 15

వ. అనపుడు. 16

చ. జనవర నీయెడం బ్రియము చాలఁగఁగల్గి యపూర్వపుం బ్రయో
జన మెఱిఁగింతు నన్యులకు సాధ్యము గానిది, లాటభూమిఁ గా
ననమునఁ బుట్టమీఁద నొకనాతుక, కోమలబాహువల్లి య
త్యనుపమకంకణాంకితసమన్విత మై కనుపట్టు నెప్పుడున్. 17

వ. అనిన నమ్మహీకాంతుం డక్కాంతవృత్తాంతంబాద్యంతం బెఱింగింపుఁ డనిన నా సిద్ధవరుం డిట్లనియె. 18

చ. భుజగజగద్విభూషణము పుష్పపురం బది యేలురాజు చి
త్తజనిభమూర్తి కీర్తివనితారమణుండు ధనుంజయాఖ్యుఁ డా
సుజననుతప్రతాపుఁ డతిశోభనగానకళానిరూఢి శై
లజ నలరించి, తత్కృపఁ గళావతిఁ గాంచెఁ గళావిశారదన్. 19

వ. అక్కన్యకా జననసమయంబున 20

సీ. ఎలజవ్వనమున నియ్యిందీవరేక్షణ
భూలోకమున వనభూమిలోన
వల్మీకబిలమధ్యవాసిని యై యుండి
కరపంకజము తదగ్రమున నిల్పి
యాకేలు గేల నెయ్యమునఁ గీలించిన
పురుషునిఁ దనపుష్పపురికిఁ దెచ్చి
యతని మజ్జనభోజనాదుల నలరించి
మేలిపర్యంకంబుమీఁద నునిచి
తే. తాను నొకశయ్య శయనించి మౌననియతి
నుండ, ముమ్మాఱు పలికింప నోపెనేని
వాఁడు రమణుండు గాఁగలవాఁడు దీని
కనుచు, నాకాశవాణి యిట్లానతిచ్చె. 21

చ. లలితకళావిశారద కళావతికే లది దాని నెవ్వఁడేఁ
బోలుపుగఁ బట్టెనేని తనపుష్పపురంబునకుం గరంబు మె
చ్చులుగఁ గరంబు పట్టికొనుచుం జని యాఁతఁడు తన్ను మూఁడుమా
టలు పలికింపఁ దక్కును దృఢంబుగఁ, దక్కదు లేక తక్కినన్. 22

వ. అని చెప్పి యోగీశ్వరుండు ధరణీశ్వరున కిట్లనియె. 23

తే. ఆకళావతి సౌందర్య మసమశరుఁడు
ఎసఁగఁ జెప్పినఁ బోసఁగుఁ గా కితరజనులు
మించులావణ్యరస మొకయించుకైన
నొలుకకుండఁగ వర్ణింపఁ గలరె జగతి. 24

సీ. అమృతాబ్ధి జనిత మై యలరుకల్పకలత
యంగనతనులత కనుగుణంబు
పుండరీకాక్షునిపొక్కిటితమ్మికి
సతిమోమునెత్తమ్మి సంగతంబు

కామసౌధోపరికనకకుంభములకు
రమణియురోజకుంభములు చెలులు
దివిజాధిపతిదంతితిన్ననినడపున
కంగననడపు విహారభూమి
తే. తెలవయధరంబు పవడంపుఁ దీవెయురపు
పడఁతియలకము లళులకుఁ బ్రాణసఖము
లింతిచూపులు మగమీల నేలఁ గోరుఁ
దరుణిపలుకులు కామమంత్రములగములు. 25

చ. కలువల గండుమీలఁ దొలుకారు మెఱుంగుల నిండువెన్నెలన్
వలపులరాజు తూపులగు వారిరుహంబుల, నొక్క యెత్తునన్
గెలుపుకొనంగఁ జాలు మృగనేత్ర యపాంగనిరీక్షణద్యుతుల్
బలుపుగ ధైర్యమూలమున పాఁ తగలింపవె యీశ్వరాదులన్. 26

సీ. ముద్దులుదొలఁకాడు ముద్దియపలుకు ల
య్యసమాస్త్రుమంత్ర బీజాక్షరములు
క్రొమ్మెఱుంగులనీను కోమలిచూపు ల
య్యంగసంభవు వాలుటంపగములు
శృంగారరసమొల్కుచెల్వయాకారంబు
కామునివలపులకత్తె కనుఁగు
ఇంపులువెదచల్లు నేణాక్షిచెయ్వులు
శంబరాంతకు జయసాధనములు
తే. కాంతమెయికాంతి కంతునిఖడ్గకాంతి
వనజముఖికురుల్ రతిపతివాగురములు
మగువమురిపంబు మరునిసామ్రాజ్యపదము
చెప్పఁ జిట్టలు పూఁబోడి యొప్పుకలిమి. 27

తే. సుదతినునుఁబల్కులమృతంపుసోన గురియుఁ
దరుణిచూపులు మెఱుఁగుమొత్తముల నీను
రమణిచేఁత లనంగతంత్రముల నెఱుపు
నువిదనడపులు హంసల కొఱపుఁ గఱపు. 28

వ. అయినుంగాక యానీరజానన నెవ్వండు వరియించె నతండు సార్వభౌముం డగుట సిద్ధంబు గావున నౌదార్యవీర్య భుజశౌర్య సకలకళాచాతుర్యధైర్యధుర్యుండ వైననీకు నమ్మత్తకాశిని పట్టపుదేవియైన, రత్నకాంచనసాంగత్యంబునుంబోలె నత్యంతశోభితంబగు నని చెప్పిన. 29

ఉ. యోగివరేణ్య మీకృపఁ బయోరుహలోచనచెయ్యి చూడ నే
లాగున నాకుఁ జేకుఱు, విలాసినిహస్తము నాకరంబు నే
లాగునఁ గీలితం బగుఁగళావతి పుష్పపురంబులోని కే
లాగున నేను జేరుదుఁ దలంపఁగ దుష్కరభంగు లిన్నియున్. 30

వ. అదియనుంగాక, యాబింబోష్ఠిమౌనవ్రతనిష్ఠాగరిష్ఠయైయుండ హృదయపుటభేదనంబుగావించి, మూఁడు మాటలుపలికించుట యత్యంతదుర్లభంబని తలంచెద, నన్న నమ్మానవేశ్వరునకు సమానుషచరిత్రుండైనయాసదానందుండు కృపానందకందళితహృదయారవిందుండై, దారుశిలాలోహాదులకైనను జైతన్యంబు గలిగించి పలికించెడినేర్పు గలుగునట్లుగా విద్యోపదేశంబుచేసి, యాశ్రితానేకసిద్ధగణపరివృతుండై యంతర్ధానంబునొందె నంత విక్రమార్కుండును దత్కరలతాసందర్శన కుతూహలావేశంబునఁ జిత్తం బుత్తలపడ నిజప్రధానాగ్రగణ్యుండును నాప్తుండునునైన భట్టిమొదలుగాఁగల వారికి నెవ్వరికి నెఱింగింపక, నిజకరకీలిత నిశితాసియ సహాయంబుగా నర్ధరాత్రంబున యోగపాదుకలు దొడిగి కదలి, మనోవేగంబున ననేకశైలంబులు నరణ్యంబులు దఆసి, లాటదేశంబునకుం జని యరణ్యమధ్యంబున. 31

## విక్రమార్కుఁడు నాగకన్యకను జూచుట

ఉ. శ్రీకరమూర్తి యానృపతిసింహకిశోరము గాంచె నొక్కవ
ల్మీకము సంతతప్రకటలీనవధూకరకంకణప్రభా
నీకము, వేష్టితామలకనింబకదంబతమాలవిద్రుమా
శోకము, రంధ్రమార్గపరిశోభితగోచరనాగలోకమున్. 32

తే. కాంచి తిలకించి పులకించి కనియ నేఁగి
సమణికాంచన కంకణోజ్జ్వలిత మైన

హ స్తకమలంబుఁ బలుమాఱుఁ బ్రస్తుతించి
సిద్ధసూక్తుల కాశ్చర్యచిత్తుఁ డగుచు. 33

వ. సాహసంబు చేసి సాహసాంకుం డహీనాహిభువన బహుమానమాననీయవరారోహా మనోహారనవరత్నమణిగణ ఘటితకంకణముద్రికాలంకృత హస్తాంబురుహావిన్య స్తకరారవిందుం డైన, నానీలవేణి కళాపారీణ గావున మీఁదటం బాణిగ్రహణంబు గలుగుట కిదియ కారణంబన్నకరణిఁ నిఖిలక్షోణీభరణశోభాకరం బగుకరంబు కరంబనురాగంబున నిజకరంబునం గీలించి పుష్పపురంబునకుం జని, వజ్రవైడూర్యమరకతపద్మరాగాది వివిధరత్నధగద్ధగాయమాన మాననీయం బగుకనకమయ సంకేతనికేతంబున నునిచి, షడ్రసోపేతం బగుచతుర్విధాన్న పానాదులం బరితుష్టుం జేసి, కర్పూరపరిమిళితంబగు తాంబూలంబు వెట్టి వినూత్నరత్న పర్యంకస్థునిం జేసి, చతురపరిచారికాజనంబును వాకిటనుండ నియోగించి మణికవాటఘటనపాటవంబు నెఱపి, తాను వేరొక్కశయ్యం బసిండి తగడు దెగడు మెఱుంగుగల పఱుపుపయి శయనించి, పట్టుపుట్టంబు ముసుంగు వెట్టుకొని పలుకకున్న సమయంబున, నప్పుడమిఱేఁడు వెఱఁగుపడి తనలోనిట్లనియెఁ 34

సీ. కురులు కప్పు దనర్చి యిరులుగ్రమ్మక యున్నె
నగవు వెన్నెలమించు నిగిడెఁగాక
చన్నుజక్కవదోయి మిన్నుఁ బ్రాఁకక యున్నె
పయ్యెదవల యడ్డపడియెఁగాక
కనుగండుమీలు వే కడచిపోవక యున్నె
చెవు లనుకొలఁకులఁ జిక్కెఁగాక
యాననాంబుజముపై నళులు పైకొనకున్నె
మేను సంపెఁగతావిఁ బూనెఁగాక
తే. యొప్పు కనుఁబాటుదాఁకక యున్నె రత్న
భూషణద్యుతులొక్కటఁ బొదివెఁగాక
తలఁప నచ్చెరువై నయీతరళనయన
యవయవశ్రీలలీల లేమని నుతింతు. 35

చ. పసిఁడిసలాకవోలెఁ గనుపట్టుతనుం గనుఁగొంచు, మన్మథ
ప్రసవశిలీముఖాలి కగపడ్డ మనోగతి నెట్టకేలకున్
వెస గుదియించి, చూపులచవిం బులకించుచు నున్నచోటఁ దా
ముసుఁగిడుకొన్న దింతి, నిజమూర్తిఁ గనుంగొననీని కైవడిన్. 36

వ. అని వెండియు. 37

ఉ. ఇంచుకప్రొద్దుపోకడకు నెవ్వరితో నుబుసేమి చెప్పుదుం
బంచశరవ్యథం దలఁకుభావము నేగతిఁ గుస్తరింతు, నీ
చంచలచారులోచనఁ బొసంగఁగ నేగతి మూఁడుమాట లా
డించి కవుంగిలింతు, నని డెందములోఁ దలపోసి యంతటన్. 38

విక్రమార్కుఁడు దివ్వెగంబముచేఁ జెప్పించిన కామమంజరి కథ

ఉ. దీనికిఁ జింతయేల యని తెల్వి మనంబునఁ బూని, కాంతిరే
ఖానవరత్నదీపకళికం దనరారెడు దివ్వెగంబముం
దా నొకసూత్నమంత్రమున దాఁకి సజీవను జేసి, దానితో
శ్రీ తెఱయంగ నొక్కకథ చెప్పఁగదె యని గారవించినన్. 39

క. అయ్యఁ యవుఁగాక యంచును
దియ్యమెసఁగ రాజుఁ జూచి దివ్వియగంబం
బియ్యకొని, యపూర్వపుఁ గథ
నెయ్యంబునఁ జెప్పఁదలఁచి నెఱి నిట్లనియెన్ 40

చ. నరవర సావధానముగ నాదొకవిన్నప మాలకింపు, ము
త్తరకురుభూములందు విశదంబుగ నాగపురం బనంగ న
త్యురుతరలక్ష్మి నొక్కపుర, మొప్పు నయోధ్యకుఁ బొమ్మవెట్టి కి
న్నరిపతిపట్టణంబు నగి నాగపురంబుఁ దృణీకరించుచున్. 41

మ. వినుమావట్టణ మాదిరాజవిలసద్విఖ్యాతి ధర్మధ్వజుం
డనుభూపాలకుఁ డేలుచుండును, జనాధ్యక్షుండు భూమీశ భూ
జనసంస్తుత్యుఁడు నిత్యసత్యుఁ డురుసౌజన్యుండు ధన్యుండు స
త్త్వనయప్రాభవధీవిధేయుఁడు గుణాధారుండు ధీరుం డిలన్. 42

క. మనునిభుఁ డనఁ దనరినయా
మనుజపతికి సుగుణమధుపమంజరి యనఁగా
జనియించెఁ గామమంజరి
వననిధి జనియించుపద్మవాసినిఁ బోలెన్. 43

సీ. కమ్మనిపసిఁడిటంకంబునఁ గరగిన
లాలితనూత్నశలాకవోలె
రమణీయశృంగారరసమునఁ బసవారు
మురిపంపువలపుల మొలకవోలెఁ
గళ లమృతంబుచేఁ గరువుగాఁ గట్టి వ
ర్తించి నించినచంద్రరేఖవోలె
మీఁటి తళుక్కున మెఱసి నిల్చినయట్టి
సోగక్రొమ్మెఱుఁగు తీఁదీఁగవోలె
తే. దినదినంబునఁ బెరుఁగుచుఁ దియ్యమొదవఁ
దల్లిదండ్రులమనము లుత్సవము లొందఁ
గామమంజరి మంజువికాస మెసఁగె
బ్రజల కెల్లను గన్నులపండు వగుచు. 44

చ. పడఁతుక దేహవల్లికకుఁ బ్రాయపుసంపద కావువచ్చినన్
నొడువుల రాజకీరముల నున్నని పల్కులఁ దూలఁదోలె, ను
గ్గడువగు మేనికాంతిఁ దొలుకారుమెఱుంగులమించు మించె నె
న్నడుపులచేతఁ గీడ్పఱిచె నాగమరాళమయూరయానముల్. 45

క. ఎవ్వరికైనను గనుఁగవ
యువ్విళ్ళూరంగ మరునియున్మదనాస్త్రం
బివ్వనిత యొకో నాఁగను
జవ్వనమునఁ బువ్వుఁబోఁడి సన్నుతికెక్కన్. 46

క. లాలితమధురసుగంధము
గ్రోలఁగ విరిదమ్మిమీఁదఁ గొమరారెడుమ

త్తాలికులమొక్కొ! నాఁగను
బాలికనెన్నుదుటఁ గురులు భాసురమయ్యెన్. 47

తే. ఒప్పులే యేటి మాటులేకుండ బ్రహ్మ
యంగకంబులు చేసె నం చాత్మ మెచ్చి
యవయవశ్రీలు గనుఁగొనునట్టి యిచ్చఁ
దరుణికన్నులు తలచుట్టుఁ దిరిగివచ్చు. 48

తే. బయలఁ గనుపట్టునొంటికంబంబుమీఁదఁ
బసిడికుండలు నిల్పినభంగి దోఁప
పసదుఁగౌఁదీఁగెఁ బొలుపారునారుమీఁద
వలుదనునుగుబ్బలొప్పారు వనజముఖికి. 49

ఉ. అంతటఁ గూర్మినందనవయఃపరిపాకము చూచి, తండ్రి య
త్యంతముదంబునం బొదలి, యంగజలక్ష్మియుఁబోలె నున్నయీ
కాంతకు, వంశశీలగుణగౌరవయౌవనరూపసత్కళా
వంతుఁడు కాంతుఁడైన. గరువంపుదపంబు ఫలంబు నొందుఁబో. 50

వ. అని విచారించి సకలలోకజయధ్వజుం డగుధర్మజుండు, మదవదసహ్య
రిపుకరటిసింహుం డగుసింహళేశ్వరకుమారుండు హేమాంగదుండు రూప
విజితమకరధ్వజుండగుట మున్ను వినియునికిం జేసి, తగినవారలం బుచ్చి
రప్పించి ప్రియపూర్వకంబుగా గారవించి, శుభముహూర్తంబున నా
నృపకుంజరునకుఁ గామమంజరిని వివాహంబు చేసి, మణిగణోజ్జ్వలానేక
విరాజితోపచారంబులం బూజించి, యల్లునిఁ గూఁతుననర్ఘ్యరత్నఖచిత
కనకమయమందిరంబున నుండ నియమించిన. 51

క. రతియును గంతుఁడును, శచీ
పతియును నింద్రుండుబోలె, జలజాక్షియు భూ
పతియు సుఖాంబుధిఁ దేలుచుఁ
జతురత విహరించుచున్నసమయమునందున్. 52

క. హేమాంగదభూపతి తన
భూమికిఁ బోవంగ బుద్ధిపుట్టి, విరక్తిన్
ఏమివిహారమునకుఁ జొర
కేమియు ననకున్న నింతి యిట్లనుఁ దనలోన్. 53

క. ఏకాంతకాంతరూపమొ
యీ కాంతుని నయనవీథి కిరవైనది, గా
కేకాంతంబునఁ గాంతల
కేకాంతులు నోఁపు సడల నిట్లుండుదురే! 54

వ. అని యతని తెఱం గెఱుంగం దలంచి సవినయంబుగా నిట్లనియె. 55

క. ఓనరనాయక భవదీ
యాననమునఁ దెలివి దోఁప, దాత్మయుఁ జింతా
ధీనం బైనది, యీగతి
నా నయహీనతనో మజ్జనకుచేఁతలనో. 56

వ. అనవుడు. 57

క. నీవలన నప్రియం బొక
యావంతయు లేదు, భూతలాధీశుఁడు న
న్నేవలన నుదాసీనత
గావింపఁడు, వినుము నాదుగతి నలినాక్షీ! 58

సీ. ఏను బోత్తుకురాక యెన్నఁడు నారగిం
పనియట్టి రక్తు మజ్జనకుఁ దలఁచి
చెమట నెత్తురుగాఁగఁ జిత్తమ్మునఁ దలంచి
యర్మిలిఁ బెనుచుమదంబఁ దలఁచి
నిముసంబు ననుఁబాసి నిలువక యొడఁగూడి
చరియించు మత్ప్రాణసఖులఁ దలఁచి
యెయ్యది పనిచిన నొయ్యఁ జేయుచు నాదు
కనుసన్న మెలఁగుభూజనులఁ దలఁచి

తే. గంధసింధురసైంధవోత్కరముఁ దలఁచి
సతతసేవాగత నరేంద్రవితతిఁ దలఁచి
వనటయొదవిన నింత యొప్పనిమనమున
నున్నచందంబుగాని, వేఱొండు లేదు. 59

క. అనిన విని కామమంజరి
యనఘా! దీనికి విచార మంపఁగ నేలా ?
జననాథు మొఱఁగిపోదము
మనభూమికి, నతఁడు వినిన మాన్పఁగఁజూచున్. 60

వ. అనిన నత్తలోదరియుత్తరంబునకుఁ జిత్తం బిగురొత్త నియ్యకొని, హృద్యానవద్యంబులైన మణికనకాదిసమస్తవస్తువులు నాయితంబు చేసికొని, గమనోన్ముఖుండై యుండునంత, మార్తాండమండలంబు పశ్చిమాచలప్రాసాదశిఖరంబునకు శాతకుంభకుంభంబై యుల్లసిల్లె, నయ్యవసరంబున. 61

## సూర్యాస్తమయాది వర్ణనము

క. తక్కువలుగాక నిగిడెడి
మక్కువలు మనంబులోన మల్లడిగొనఁగా
జక్కవలకవలు విరహము
వెక్కువలు దలంచి పరితపింపఁగఁ జొచ్చెన్. 62

క. పగలెల్లను దము నేఁచిన
పగలెల్లఁ దలంచి యిరులుపవుఁజులు దనపై
దెగి యెత్తివచ్చు నని రవి
పగ వెగడినభంగి నపరవనధి నణంగెన్. 63

క. మెఱపగ్గలింపఁ జుక్కలు
తఱచై పొడముటయు, గగనతల మొప్పారెన్
మెఱుగారుముత్తెములచే
మెఱవడి యగునల్లపట్టుమేల్కట్టుగతిన్. 64

శా. ఉర్వీచక్రమునం జరాచరములై యొప్పారురూపంబులన్
దుర్వారోన్నతి లోనుచేసికొని చేతోవృత్తి కాశ్చర్య మై
పర్వెం జీఁకటి నీలనిర్మలరుచిన్ భవ్యప్రభావంబునన్
'సర్వం విష్ణుమయం జగ' త్తనుట సైశంబై నచందంబునన్. 65

వ. ఇట్లు క్రమంబునం దమంబు నిగిడి, మిట్టుపల్లంబు బయ లోలం బని యేర్పఱుప రాకున్నసమయంబున, నటమున్న సాహిణి నడిగి తెచ్చి సన్నద్ధసర్వాయుధంబై యింద్రాయుధం బనుతురంగంబు నంతరంగంబు సంతసం బెసంగ నంగనాసహితం బారోహణంబు చేసి, పౌరులెల్ల నిద్రించుచుండఁ దలవరులఁ గన్నుఁగ్రామి పురంబు నిర్గమించి, నిజపట్టణాభిముఖుండై యరుగునప్పుడు. నిజాన్వయజాతుండైన హేమాంగద మహీపాలునకు గమననివారణకారణం బైన యంధకారంబు దూరంబు సేయ నుత్సహించుచందంబున. 66

సీ. కైసేసి పూర్వదిక్కామినీమణి చూచు
పద్మరాగంపుదర్పణ మనంగ
వేయిగన్నులుగలవేల్పుతొయ్యలిచేతఁ
జూపట్టుచెంబట్టుసురఁటి యనఁగఁ
విరహులపై దండువెడలంగఁ దమకించు
నసమాయుధుని కెంపు[1]టరిగ యనఁగ
గల్పకభూజశాఖాశిఖాగ్రంబున
భాసిల్లు పరిపక్వఫల మనంగ
తే. నభ్రమాతంగకులపతి యఱుతనొప్పు
కనకఘంటిక యనఁగ, లోకములకెల్ల
నుదయరాగంబు రాగంబునొదవఁజేయ
నిందుఁ డుదయించె లోచనానందుఁ డగుచు. 67

వ. తదనంతరంబ. 68

1. ధ్వజము.

సీ. గంగాప్రవాహంబు గాఁబోలు నని వసి
ష్ఠాదు లనుష్ఠాన మాచరింప
నమృతంబు వెల్లువ యని నిలింపాదులు
మునుకొని దోసిళ్ళ ముంచి క్రోల
దుగ్ధాంబునిధి యని తోయజాతుడు శేష
పర్యంక మిడుకొని పవ్వళింపఁ
బరమేశువిశ్వరూపం బని బ్రహ్మాదు
లమర దండప్రణామములు సేయఁ
తే. దలఁప భూనభోంతరములకొలఁది దెలిసి
శెరసి యెన్మిదిదిక్కులఁ బొరలి పొరలి
దట్టముగ నంతకంతకుఁ దనరి తనరి
యిట్టలంబుగ వెన్నెల నిట్టవొడిచె. 69

వ. అంత. 70

సీ. పసగలవెన్నెలమిసిమి పుక్కిటఁ బట్టి
పొసఁగఁ బిల్లలనోళ్ళఁ బోసి పోసి
నున్ననిక్రియ్యక్కువెన్నెలతుంపరల్
హుమ్మని చెలులపై నుమిసియుమిసి
కమ్మనివెన్నెల కడుపునిండఁగఁ గ్రోలి
తెలివెక్కి గఱ్ఱునఁ ద్రేన్చిత్రేన్చి
కన్నిచ్చలకువచ్చువెన్నెలఁగ్రొన్నురు
వేఱి వే ప్రియురాండ్ర కిచ్చియిచ్చి
తే. తఱచువెన్నెలగుంపులఁ దాఁటితాఁటి
యీఱమగువెన్నెలలలోనఁ దూఁటితూఁటి
పలుచనగువెన్నెలలలోనఁ బాఁటిపాఁటి
మెలఁగెఁ బెక్కుచకోరంపుఁబులుఁగుగములు. 71

వ. ఇవ్విధంబున సాంద్రం బైనచంద్రాతపంబున నరేంద్రుం డతంద్రుండై, హాయంబు రయంబునకు మెచ్చుచు నతిదూరం బరిగి, వేకువయగుటయు

నిద్రాలసుండై యొక్కపురోపవన ప్రాంతంబున వటవిటపి నశ్వంబు బంధించి, యాతరుచ్ఛాయను సతియంకతలం బుపధానంబుగా శయనించి కన్ను మొగుడ్చునంత. 72

ఉ. రాయిడికత్తెలైనపెనుఁద్రాయిడియత్తలయిండ్లఁ గోట్రముల్
సేయువిలాసినుల్ మునుకుసెందఁగ, వేశ్యలప్రక్కదాపులం
బాయనికాముకుల్ వెలుకఁబాఱ కలంగఁగ, మ్రోసెఁ గొక్కొరో
క్కోయని కుక్కుటస్ఫురదకుంఠితకంఠకఠోరనాదముల్. 73

సీ. శ్రీమదామ్నాయలతా మూలకందంబు
పద్మినీమదవతీ ప్రాణపదము
చక్రవాకానీక సంజీవనౌషధ
మఖిలలోకాలోకనాంజనంబు
ప్రబలాంధకారనిగ్రహ రత్నదీపంబు
హరిహరబ్రహ్మ విహారగృహము
కైరవకాన నోత్కటకాలకూటంబు
ప్రాలేయవిఘటనాకీలకంబు
తే. రత్నసానుసురక్షణారక్షకుండు
సతతసన్మార్గలంఘనజాంఘికుండు
దివిజకల్లోలినీసపత్నీగురుండు
భానుఁ డుదయించె దేదీప్యమానుఁ డగుచు. 74

వ. అంత, నంత వృత్తాంతంబు సెఱింగి ధర్మధ్వజుండు ప్రళయకాలవృషభ ధ్వజుండునుంబోలెఁ గోపారుణితలోచనుండై నిజదండనాథుం డగు నీతి ధ్వజుం బిలిపించి యిట్లనియె. 75

చ. తగిననరేంద్రసూనుఁ డని తన్నుఁ బ్రియంబునఁ బిల్చి తెచ్చి, మ
చ్చిగ సుత నిచ్చి మత్ర్పతిముఁ జేసిన సింహళరాజసూనుఁ, డా
తగవు మదిం దలంపక ముదంబున మత్తురగంబు నెక్కి, ప్రము
చ్చ్చగతి వధూటిగొంచుఁ బ్రజఁ జొక్కిడి పోయినవాఁడు చూచితే. 76

క. చనఁ దలఁచిన మన మనుపఁగఁ
జన నొప్పదె తనకు, నిట్టి చలచిత్తునిపై
నను పమసేనాన్వితముగఁ
జని క్రమ్మఱఁ బట్టి తెమ్ము సమ్ముఖమునకున్. 77

వ. అనిన విని నీతిధ్వజుండు యుద్ధసన్నద్ధాఖిలసేనాసమన్వితుండై యాప్రొద్దె కదలి హేమాంగదుండు చనినజాడ యరసి యతిత్వరితగతిం జని కూడ ముట్టిన, నాఖిలంబైన యాకలకలం బాలించి కామమంజరీకాంత నలు దిక్కులం బరికించి, పడగలయడియాలంబులు నిరీక్షించి నిజజనకు సేనా సంకులంబుగా నిశ్చయించి, తనపతినిద్రాభంగంబు గాకుండ నతనియుత్త మాంగంబున కుపధానంబుగా నొక్కపరిధానంబు చుట్టి పెట్టి, తలచీర యాయితంబు చేసికొని సంగరోత్సాహం బంతరంగంబునం బొంగ, సన్నద్ధసర్వాయుధం బైన యింద్రాయుధంబు నారోహణంబుచేసి, ప్రాణే శ్వరచరణస్మరణపరిణతాంతఃకరణ యగుటను రణవిహరణంబు తృణ కణాయమానంబుగా గణించుచు, విటవిటపి కనతిదూరంబున వచ్చు చున్న తత్ప్రబలవాహినిలోనికి నిజవాహనంబు నుఱక తఱియం బఱసి. 78

## కామమంజరి యుద్ధ వర్ణనము

మ. మదదంతావళదంతముల్ నఱకు నమ్మావంతు లుద్భ్రాంతతన్
బెదరం, బల్లము గుఱ్ఱమున్ రవుతునుం జేటాఱుతుం డెంబులై
చెదరంగా వడి వ్రేయు, వీరరథికశ్రేణిన్ బలౌఘుంబులం
గుదియం జేయు, భటాళిఁ ద్రుంచు విలసద్ఘోరాసిధారాహతిన్. 79

చ. ప్రతిబలవార్ధి బాడబముఖంగి దహించును, రాముపోలికన్
శితశరధారపాల్పఱుచుఁ, జెల్లెలికట్టయుఁబోలెఁ బాఱునీ
కతులితలీల నాఁగు మునియచ్చునఁ బొంకమణంచు, మందగ
క్షితిధరవృత్తిమైఁ గలఁచుఁ జిత్రముగా లలితాంగి యుక్కునన్. 80

క. సరి నాధానము సేయుట
యరిఁజోయుట తివియు చేయు టద్భుతకరమై

తరుణీశరంబులు భానుని
కరములగతి రిపులగములఁ గప్పెఁ దఱచుగన్. 81

క. కప్పిన మదిలో నెంతయు
నుప్పొంగెడు రౌద్రరసమహోగ్రత నింతిం
దప్పక కనుఁగొని, కన్నుల
నిప్పులు రాలంగ వాహినీపతి పల్కెన్. 82

క. అక్కున నిడుకొని మక్కువ
పెక్కువమై నేను నెనుపఁ బెరిఁగితి, నేఁడుం
జెక్కడిచిన వస రాలెడు
నిక్కము, నాకోలుతలకు నిలువఁగఁ గలవే? 83

వ. అనవుడు నక్కాంతారత్నంబు. 84

క. తనయింటిదీప మనుచును
విను ముద్దిడికొనఁగఁ దఱచువీఁడి గలఁడే?
నను మార్కొనఁగఁ దలంచెదు
మును పెంచినమందె మేలమున నాలమునన్. 85

క. ననుఁ గినియఁ జేసి మగుడం
జనఁ గలవే నీవు పురికి? స్వామిహితుఁడవై
చను మింక నింద్రపురమున
కనినం గోపించె యేసె నతఁ డంపగముల్. 86

క. ఏసిన నవి పొడిచేసి, శ
రాసనముం దునిమి వేయ, నతఁ డొండొకచా
ణాసనము నెక్కువెట్టి శ
రాసారము గురియఁ దొణఁగె నంబుదముక్రియన్. 87

వ. ఇత్తెఱంగున నొండొరులకు వట్రపడక,నయ్యిరువురుం జలంబును బలంబును
మెఱయ, దృష్టిముష్టి లక్ష్యలక్షితశీఘ్రతరశరసంధానాకర్షణమోక్షణ

దూరాపాతనాద్యనేకధనుర్విద్యాకౌశలంబులు మెఱయుచుఁ బెద్దయుం బ్రొద్దు మహాయుద్ధంబు సేయుచున్న సమయంబునఁ, గామమంజరి నితి ధ్వజునిరథరథ్యసారథుల లీలవోలె నాఖిలభల్లంబులు వెల్లేసి పొడిచేసి వేర్చిన, నతండు విరథుండయ్యును బోలివోవనిబలిమి నతినిశితవిశిఖం బులు వఱపిన, నత్తన్వి కుముదలోచన యయ్యును గోపావేశంబున నరు ణాబ్జపత్త్రినేత్రయై యతనికోదండంబు తుండంబులు చేసి మఱియును.

తే. ఎత్తనెత్తంగఁ జాపంబు లెన్నియేనిఁ
దోడుతోడనె దునుమాడి తోయజాక్షి
తోమరము వైవ నడుమన త్రుంచివైచెఁ
గుంత మెత్తినఁ బొడిచేసెఁ గుంతమెత్తి. 89

వ. ఇవ్విధంబున. 90

క. ఆహవమునఁ దరుణీమణి
బాహాటోపమున సైన్యపతిఁ దూలించెన్
సాహసము షడ్గుణం బని
యూహింపఁగ సతులకెందు నుచితమ కాదే. 91

వ. ఇట్లు వికలసకలాయుధుండై సేనానాయకుండు. 92

క. కనుకనిఁ బఱచిన, నాతని
వెనుకొనుటయు, వాఁడు శరణు వేఁడినమాత్రం
గినుక యుడిగి తొయ్యలి మదిఁ
గనికరము జనింప మగిడెఁ గాంతునికడకున్ 93

ఉ. అంతట మేలుకాంచి వికచాబ్జముఖిం దురగంబు గానమిం
జింత జనింప నున్న నృపసింహుఁడు, గాంచె హయాధిరూఢయై
సంతసమార వచ్చిననిజప్రియకారిణి, నుగ్రసంగర
శ్రాంతశరీరిణిన్, మహితసజ్యశరాసనబాణధారిణిన్. 94

చ. కని తురగాధిరూఢగతిఁ గార్ముకబాణకృపాణపాణి వై
చనిననిమిత్త మెయ్యది ? నిజం బెఱిఁగింపు మనంగ, నాథుతో
వనజదళాక్షి యిట్లను, నవారణ నన్నును నిన్నుఁ బట్ట మ
జ్జనకుఁడు దాడిమైఁ బనిచె సైన్యయుతంబుగ దండనాథునిన్. 95

చ. పనిచినఁ గూడముట్టిన నృపాలకసైన్యముఁ గాంచి, కొంచెపుం
బనికయి నీదునిద్రకును భంగ మొనర్పఁగ నేల యంచు, నేఁ
జని యనిచేసి తత్ప్రబలసైన్యము నెల్లను దూలఁదోలి, వే
వెనుకొన భీతుఁడై శరణు వేఁడినఁ గాచితి సైన్యనాథునిన్. 96

వ. అని విన్నవించిహయావతీర్ణయై, కృపాణబాణాసనబాణతూణీరంబులం దురంగంబుపై నెప్పటియట్ల పదిలపఱిచి, వినయవినమితోత్తమాంగ యైన యత్తన్విఁ జిత్తం బిగురొత్త, సమీపంబున నునిచికొని యతం డిట్లనియె. 97

క. తలఁపఁగఁ గయ్యపువెరవును
నలవును నీ కచ్చుపడుట యచ్చెరు ! విమ్మైఁ
దలపూ వాడక యుండఁగఁ
బలుసేన జయించి తిట్టిభార్యయుఁ గలదే ! 98

తే. అనుచుఁ బ్రియురాలిఁ జేరంగ నల్ల దిగిచి
ఘనకుచంబులు విపులవక్షంబుతోడఁ
గదియఁ జేర్చుచు బిగియారఁ గౌఁగిలించి
విజయ మగ్గించి చెవులకు విందొనర్చి. 99

వ. కదలి యచ్చోటికనతిదూరంబునఁ దేటనీట నొప్పారునేట సంధ్యావంద నాదికృత్యంబులు నిర్వర్తించి, యమ్మేటిజోటియుం దానును ఘోటకం బునుం దత్కాలోచితాహారంబులం దృప్తిసలిపి, కాలుకొన్న యంతనేల యరిగి యపరాహ్ణసమయంబున నొక్కపురవరోపాంతంబున నేకాంతం బైన కాళికాస్థానంబున విడిసి యున్నంత, నత్తలోదరి తనమగని చేతికి

నొక్క సౌన్నాటంకం బిచ్చి యిప్పట్టణంబున నాహారం బడిగి తెమ్మను టయు. 100

క. అన్నరపతి తగులాగున
నన్నగరము చొచ్చి, యెల్లయంగళ్ళందుఁ
సౌన్నాటంకం బిచ్చెద
నన్నమిడెడువారు గలరె ? యని యడుగుతఱిఁ. 101

క. విన్నజనము లవ్విభునిం
గన్నారం జూచి, యాదిగర్భేశుఁ డితం
డెన్నఁడుఁ బ్రయాసమునకుం
జన్నతెఱఁగు దోఁప దేల చనుదెంచెనొకో ! 102

క. సౌన్నాటంకము సేయఁగ
నన్నము దన కెట్టు వెట్టనగు గరగరగా
విన్ననువున నని పలుకుచు
నున్నఁ, విన్నదఁన మెసఁగ నున్నకుమారున్. 103

క. కనుఁగొని విలాసవతి యనఁ
జను వారవధూటి దాసి చని తద్విధమే
లినదాని కెఱుఁగఁజెప్పి, త
దనుమతిఁ గొనివచ్చె నింటి కానృపతనయున్. 104

వ. ఇట్లు వచ్చినహేమాంగదమహీపాలుఁ నబ్బాల యభ్యంతరమందిరంబు నకుం దోడ్కొనిపోయి సమున్నత కనకాసనంబున నునిచి తత్క్షణంబ. 105

ఉ. మజ్జనభోజనాభరణమాల్యవిలేపనవస్త్రరాజిచే
బుజ్జవమారఁ దృప్తిసనఁ బూజలొనర్చి, లతాగృహంబులో
గొజ్జఁగనీటఁ బైచిలికి క్రొవ్విరిజాజులఁ జేసినట్టిపూ
సెజ్జకుఁ దార్చి చిత్తజవిశేషసుఖంబుల నోలలార్చినన్. 106

వ. ఇట్లు వారసీమంతినీకృత నిరంతరలతాంతశరలీలా సంతోషితస్వాంతుండై మైమఱచి, మహీకాంతుండుం నిజకాంతవలనిచింత యావంతయు లేక యుండె నంత. 107

చ. ఉదయమునం దలిర్చుదిశ నొల్లక, తన్వసుహీనుఁ జేయుచుం
గదిసి ప్రతీచిఁ జెందె దిననాథుఁడు, భూరమణుండు సంతతా
భ్యుదయముఁ గోరుచున్నసతి నొల్లక, త న్వసుహీనుఁ జేయఁగా
మదిఁ దలపోయువారసతి మక్కువఁ జెందినలీల నత్తఱిన్. 108

వ. ఇట్లు సూర్యాస్తమయం బగుటయుఁ దనపతి రామికిఁ గామమంజరికాంత సంతాపి తాంతఃకరణ యై. 109

చ. ఇరవును దల్లిదండ్రులను నెత్తిన పెంచినవారిఁ బాసితిఁ,
దురమునఁ దండ్రిసైన్యవతిఁ దోలితి సేనలతోడఁగూడ నీ
పురుషునిమీఁదిభక్తి, మఱి పోయి యితండు నా రాక తక్కె, నె
వ్వరుసున నోము నోఁచితినొ ప్రాక్తనజన్మమునందు నక్కటా! 110

వ. అని విలపించుచున్నసమయంబునఁ గాళికానికేతంబునకు నొక్కవృద్ధాంగన చనుదెంచి, దీపికానికరంబు సమర్పించి, మనోభవ రాజ్యలక్ష్మియుంబోలె నున్నయత్తన్వి న్నిరీక్షించి, నీవెవ్వ రెందుండి యేమికతంబున వచ్చి యిచ్చట నొంటి నున్నదాన? వనినం దనవృత్తాంతంబంతయు నెఱింగించిన. 111

క. అజ్జరఠ దోడుకొనిచని
మజ్జనభోజనము లాత్మమందిరమున నా
లజ్జావతి కొనరించి, సు
హృజ్జనభావంబు నడపి హృదయముఁ దేల్చెన్. 112

ఆ. మగఁడు చన్న దెసకు మనసును జనియున్నఁ
జెయ్వు వెఱఁగుపడినఁ, జెవులు సొరని
వృద్ధవనితకథలు వెడవెడ నూఁకొంచు
నుండె వగల నొగిలి యుత్పలాక్షి. 113

క. వేగింపరానివేదన
వేఁగింపఁగ నంత బ్రొద్దు వేగియు, సతికిఁ

వేగకయుండెను దైవని
యోగంబున నంతఁ బతివియోగము కతనన్. 114

ఆ. ఎట్టకేల కట్లు హితవచనంబుల
నువిద నూఱడింప, నుల్లమునను
లేనిధృతి ఘటించి లేమ, యాపూజారి
సానిఁ బిలిచి ప్రియము సాలఁ జెప్పి. 115

క. క్షోణీనాయకుఁ గానమిఁ
బ్రాణములును మేన వెడలఁబాఱం జొచ్చెం
బ్రాణసఖి! యేవెరవునఁ
బ్రాణేశ్వరు నన్నుఁ గూర్చి బ్రతికింపఁగదే. 116

క. పతి కలుగుకంటె సౌఖ్యము
సతులకు నొండొకటిగలదె చర్చింపంగాఁ
బతిలేమి సర్వశూన్యము
పతి గలిగిన సతికి నింద్రపద మది యేలా ? 117

వ. అనినం బూజరిసాని యెత్తెఱంగుననైన భూవరోత్తము న్వెదకి తెత్తు నని
యరిగిన. 118

తే. మగనిపోకకుఁ గడలేనిదిగులు వొదువఁ
గామమంజరి యెంతయుఁ గళవళించి
యరయఁ బోయినయంగనతెరువు చూచి
వనట నిట్లని తలపోయు మనములోన. 119

సీ. పూర్ణచంద్రాననుఁ బొడగాంచివచ్చినఁ
దొడిగినతొడవు లాపడఁతి కిత్తు
కమలాప్తకీజునిఁ గన్నార నేఁ గన్నఁ
గాళికాదేవికి గ్రాస మిత్తు
సింహాసత్త్వనిపల్కు చెవిఁ జేర్పఁ గల్గిన
నాషలికి భూరిదాన మిత్తు

రాజశేఖరుపరిరంభణం బబ్బినఁ
గోటిగోవుల విప్రకోటి కిత్తు
తే. ననుచు జింతించుఁ దనలోన నట్టె నవ్వుఁ
జెక్కుటద్దంబు గదియంగఁ జెయ్యి సేర్చు
వెగుచు దైన్యంబు వొదలంగ విహ్వలించుఁ
బనవుఁ గొనగోరఁ గన్నీరు పాయ మీటు. 120

చ. ఎదురఁ జరించినట్లయిన సింపగువల్కులు పల్కఁజూచుఁ దఱ
గదిసినచందమైన నిఱికౌఁగిటఁ జేర్పఁ గడంగు. భీతుఁ డై
పదముల వ్రాలిన ట్లయినఁ బాణితలంబున నెత్తఁ గోరు, సే
యదియును లేక రిత్తయిన యంబుజలోచన యార్తిఁ జేడ్పడున్. 121

ఉ. పట్టణమెల్ల దేవి గుడిభామిని యారసి తోడితెచ్చునో
కట్టెదురఁ నృపాలుఁ గని క్రమ్మఱ నా కెఱిఁగింప వచ్చునో
యిట్టును నట్టునుం దిరిగి యొందును గానక తానె వచ్చునో
యట్టిద యైన నామనికి కాస్పద మెయ్యదియొక్కొ దైవమా ! 122

వ. అని యిట్లు కామమంజరి పురుషవియోగంబున నాతురచిత్తయై
తలపోయుచున్న సమయంబున. 123

ఉ. భూరమణీశుఁ దెత్తు ననిపోయెదునప్పుడు పంతమాడి యే
నూరక యింటికిం జని తలోదరి నేమని చూతునంచు దు
ర్వారవిచారభావమున వట్టుచు మోమున దైన్య మొందఁ బూ
జారివధూటి వచ్చి జలజాతవిలోచనఁ జేరి యిట్లనున్. 124

క. పురము గలయంతమేరయు
నరసితి నిల్లిల్లు దప్ప కతిశోధన, నీ
వరుఁ డెందుఁ గానఁబడఁ, డె
ప్పరుసున నీకరుణవడయ భాగ్యము లేమిన్. 125

చ. అనినమరుక్తి వీనులకు నస్త్రమయంబయి తాఁకి మూర్ఛ వ
చ్చిన ధర వ్రాలి యొంతయు నచేతనయై, మఱి యెట్టకేలకుం

దనువునఁ బ్రాణ దెచ్చుకొని, దైవకృతంబులు మానవంచు గ్ర
క్కున ననలప్రవేశమునకుం గృతనిశ్చయ యయ్యె నంతటన్ 126

వ. సర్వసన్నాహంబును మెఱయఁ గాళికానికేతనంబునకుం జని, యమ్మహా శక్తికి దండప్రణామం బాచరించి వెడలి, తదాలయ పురోభాగంబున ఘృతప్లుతమలయజాగురు రక్తచందనదేవదారుపూరితంబును, ననలోచితంబును గర్పూరాదిసుగంధబంధురంబును నైన యగ్నికుండంబునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి ప్రవేశించునప్పుడు, జన్మ జన్మంబు నందును హేమాంగదమహీపతియే నాకుం బతి గావలయు నని కుండ మధ్యంబునం బడుటయు, నటమున్న తదాలోకనకుతూహలాంగదుం డయ్యును నయ్యబల నిరీక్షింప మఱచి, విలాసవతీమధురసల్లాపాయత్త చిత్తుండైన హేమాంగదుండు విని, తలంచికొని యదరిపడి తన్నుఁదాన నిందించుకొనుచు, విలాసవతీకరకీలితం బైనకేలు తిగుచుకొని. 127

క. నానేరమివలనఁ బయో
జానన వైశ్వానరునకు నాహుతి యయ్యెన్
దీనికిఁ బ్రాయశ్చిత్తం
బౌనని తనమేను వహ్ని కాహుతిచేసెన్. 128

క. చేసిన, విలాసవతి తన
చేసినదోసమునఁ గాదె శిఖిఁ బడి వీరల్
వాసవుపురికిం జని రని
వాసిగఁ దనమేను నిచ్చె వహ్నికి నంతన్. 129

క. అవ్వారాంగన బానిస
ముప్వురు సీల్గుటకుఁ దాన మూలం బనుచున్
నెవ్వగపు వగల నీసం
గ్రొవ్వఱి వెసఁ జొచ్చె నగ్నికుండములోనన్. 130

వ. అంత నమ్మహాకాళి యెల్లవారును వినుచుండ. 131

క. కడచిరి నలువురు వహ్నిని
బడి యొక్కట నేను చూడ, బ్రదికించెద ని
ప్పుడు వీరి ననుచుఁ దానొక
పడఁతుకమేనను వసించి పల్కినమాత్రన్. 132

క. వెలఁదియు ధరణీవిభుఁడును
వెలయాలును దాసిఁ గూడి విమలాకృతులై
వెలువడిరి యగ్గిగుండము
జలరుహషండముననుండి చనుదెంచుగతిన్. 133

వ. తదనంతరంబ ధర్మధ్వజుతనయ తనప్రాణేశ్వరు నింగితం బెఱింగి యిట్లనియె 134

ఉ. కారణ మేమి 'నా యసుఁలు గల్గిన సర్వము గల్గు' నాక, తా
వారవధూటియయ్యు ననివారణ దారుణవహ్నికుండ మీ
ధారుణి మెచ్చ మీవెనుకఁ దానును దోడనె చొచ్చెఁ, గాన నీ
వారిజనేత్ర మీకృప కవశ్యముఁ బాత్రము సేయఁగాఁ దగున్. 135

వ. అనినఁ గామమంజరీసముచితాలాపంబులకు సంతుష్టాంతరంగుండై హేమాంగదుండు విలాసవతిం దోడ్కొనిపోవు కౌతుకంబును దాని తల్లి దండ్రుల కెఱింగించి, వారల నుచితసత్కారంబులఁ బరితోషితులం జేసి యనంతరంబ. 136

క. రమణులు శిబికారోహణ
రమణీయత మెఱసి కొలిచి రాఁగా, ధరణీ
రమణుఁడు నిజపట్టణమున
కమరేంద్రాయుధము నెక్కి యరిగెం బ్రీతిన్. 137

క. అని యిట్లు దివియగంబము
జనవినుతరసప్రసంగ సంగతరచనా
జనితకథామధుధారల
మనుజేంద్రుని చెవులఁ జవులు మరగించి తగన్. 138

క. వీరలలో సాహస మె
వ్వారిది ? యనవుడు నృపాలవర్యుఁడు నగుచుః
వారసతీమణిసాహస
మౌరా యని మెచ్చవచ్చు, నని పల్కుటయుః. 139

సీ. మణిమయకర్ణభూషణమరీచులతోడ
వెలఁదిచూపులమించు వియ్యమందఁ
జెక్కులమకరికాచిత్రరేఖలతోడఁ
జిఱునవ్వువెన్నెల చెలిమి సేయఁ
బయ్యెదకొంగుల బంగారుమెఱుఁగులఁ
జనుదోయితళుకులు చనవు మెఱయ
మంజరీకంకణ మంజులధ్వనులతో
మేఖలారావంబు మేలమాడ
తే. ముసుఁగుదొలఁగించి తనులత మోద మడరఁ
బద్మమధ్యంబునం దున్నపద్మవోలె
హంసతూలికాతల్పంబునందునుండి
యాకళావతి మనుజనాయకునిఁ జూచి. 140

క. దీవియగంబంబునకును
జీవము గల్పించి కథలు చెప్పింపంగాఁ
బ్రావీణ్యము గల్గియు నీ
వీవిధమునఁ దప్పఁజెప్పు టిది నిపుణతయే. 141

క. తనపతిఁ గానక యెంతయు
మనికితపడి వచ్చి కామమంజరి చోరఁగా
గనికరమున నక్కాంతుం
డనలశిఖలలోనఁ జొచ్చె నవ్విధమునకున్. 142

క. కడుఁజోద్య మంది లంజియ
కుడిచినఋణ మెడల నగ్నికుండముఁ జొచ్చెం

గుడువక కట్టక శానిస
పడుటయు సాహసము గాక పార్థివముఖ్యా ! 143

వ. అని పల్కి కళావతీనితంబిని కాదంబినీసమాక్రాంత యైన క్రొమ్మెఱుంగు తెఱంగునం గృతావకుంఠ యగుట యవలోకించి. 144

ఉ. అష్టమహావిభూతికలనాహవమంత్రజనానువర్తనా
దుష్టవిరోధిమంత్రిజన దుర్వహగర్వప్రమోదకర్తనా
యిష్టఫలప్రదాన దివిజేశ్వరధేనుసమానకీర్తనా
శిష్టజనప్రమోదకరజీవిత వైదికధర్మవర్తనా 145

క. కుకురు కురు చేర కేరళ
శక మరు కర్ణాట లాట సౌరాష్ట్ర మహీ
పకుమంత్రిజనమనీషా
నికషోపలనయకలాప నిగమాలాపా. 146

మ ం దా ర దా మ ము

శృంగారరేఖావిశేషస్వరూపా
రంగజ్జనానీకరక్షాదిలిపా
సంగీతసాహిత్యసారస్యలోలా
యంగీకృతాంగీకృతాచారశీలా. 147

గద్యము: ఇది శ్రీమదఖిలకవిమిత్ర పెద్దయ యన్నయామాత్యపుత్ర శారదా దయావిధేయ జక్కయనామధేయప్రణీతం బైన విక్రమార్క చరిత్రంబను మహాకావ్యంబునందు షష్ఠాశ్వాసము.

శ్రీ ర స్తు

# విక్రమార్క చరిత్రము

## స ప్త మా శ్వా స ము

శ్రీమత్కనకాంబరగో
భూమిప్రముఖేష్టదానపోషితబంధు
స్తోమమహీసుర సరస
క్షేమంకర సదయహృదయ సిద్ధనమంత్రీ. 1

మ. జగదాశ్చర్యకళాకలాపకలనాచాతుర్యధుర్యుండు వీ
రగుణోదర్కుఁడు విక్రమార్కుఁడు మహారాజాగ్రగణ్యుండు, సా
రగతిన్ రెండవమాట యమ్మదవతీరత్నంబుఁ బల్కింపఁగాఁ
దగుయత్నంబున నంతరంగమునఁ దాత్పర్యం బవార్యంబుగన్. 2

క. దర్పితరిపుహరణభుజా
దర్పధురంధరుఁడు, మంత్రతంత్రస్ఫురణం
గర్పూరకరండమునకు
నేర్పునఁ బ్రాణంబు లొసఁగి, నెఱి నిట్లనియెన్. 3

క. తగ వెఱిఁగి దివియగింబము
తగుతెఱఁగునఁ బ్రొద్దుపుచ్చెఁ, దగ వెఱుఁగక యీ
యిగురాకుఁబోఁడి పలికినఁ
బగడంబులు రాలునట్లు పలుకదు మాతోన్. 4

### విక్రమార్కుఁడు కప్పురపు బరణిచేఁ జెప్పించిన రాజశేఖరుని కథ

క, ఇప్పాలఁతిపగిది నీవును
నొప్పరికించుకొనియుండు టుచితముగా, దో
కప్పురపుబరణి యొకకథ
చెప్పఁగదే నాదుచనవు చేకొని యనినన్. 5

వ. మహాప్రసాదం బని, యొకకథ విన్నవించెద నవధరింపు మని యాబరణి ధరణీశ్వరున కిట్లనియె. 6

సీ. ఉల్లోలసురధునీ కల్లోలమాలికా
ప్రతిభటధ్వజపటప్రాభవంబు
నానామహాసౌధ నవసుధాచంద్రికా
ధగధగాయితనభోదర్పణంబు
ఖేచరదంపతి లోచనానందన
వందనమాలికావైభవంబు
ప్రాకారకీలిత బహురత్నదీపికా
విహితవిక్రమదిశావిలసనంబు
తే. వివిధశృంగారవనమహీ విహరమాణ
మందపవమాన వలమానమానితంబు
రమణరమణీసమాకీర్ణ రాజమాన
భరితవిభవంబు పంచకపురవరంబు 7

క. అన్నగరమున కధీశుఁడు
సన్నుతకీర్తిప్రతాప సముచితగుణసం
పన్నుఁడు విక్రమకేసరి
యున్నతరిపువీర విదళనోగ్రత మెఱయున్. 8

ఉ. పావనమూర్తి యవ్విభునిపట్టపుదేవి యుమావతీమహా
దేవి, కటాక్షవీక్షణవిధేయనిధానవరంపరారమా
దేవి, రసప్రసంగసముదీర్ణకళాకలనాసరస్వతీ
దేవి, చిరక్షమాధరణిదేవి యనం జెలువొందుఁ బెంపునన్. 9

క. ఆదంపతులకుఁ బ్రమద
శ్రీ దైవాఱంగ రాజశేఖరుఁడు దిశా
మేదురకీర్తివిహారమ
హోదారగుణాభిరాముఁ డుదయించె దగన్. 10

క. ప్రతిపక్షశిక్షణంబును
క్షితిజనసంరక్షణంబు చేసి, 'యవశ్యం
పితు రాచార' మ్మనుపలు
కతఁ డెంతయు నిజ మొనర్చె ననుపమశక్తిన్. 11

మ *పవమానప్రతిమాన సత్త్వజవకుంభద్వాహనారోహణో
త్సవసంభావితు లైనరాహుతులతో, ద్వాత్రింశదుగ్రాయుధ
వ్యవహారోద్భటసద్భట ప్రతతితో, నారాజసూనుం డుదా
రవిభూతిన్ జని యొక్కనాఁడు విపులారణ్యాంతరాళంబునన్. 12

వ. బహుప్రకారంబు లగుమృగయావిహారంబులం దగిలి చని చని, యొక్క యెడ సర్వాలంకారసుందరంబగు శర్వాణీమందిరంబుఁ గనుంగొని, యమ్మహాశక్తికి దండప్రణామం బాచరించి, యనంతరంబ తత్ప్రదేశం బున. 13

సీ. మత్తికాటుకపొత్తు మరగిననునుఁగెంపుఁ
జూపులఁ గలికిమించులు నటింపఁ
బెక్కువన్నెలకంథచక్కిఁ జిక్కక నిక్కి
చనుదోయి కెలఁకులఁ జౌకళింప
సంకుఁబూసలక్రొత్తసరుల నిగారించి
కంబుకంఠము నూత్నకాంతి నొసఁగఁ
బలుగుఁగుండలములప్రభఁ బ్రోదిచేయుచుఁ
జెక్కులఁ జిఱునవ్వు చెన్ను మీఱ
తే. యోగదండాగ్రగత పాణియుగళిమీఁదఁ
జిబుకభాగంబు నిలిపి. రాచిలుకతోడ
సకలవిద్యానుసంధాన సరసగోష్ఠిఁ
గలసి భాషించు యోగీంద్రకాంతఁ గనియె. 14

చ. కనుఁగొని, తద్విలాసములు కన్నులపండువు సేయ, సత్కథా
జనిత రసప్రసంగముల చందము డెందము నామతింపఁగాఁ

* పవమానప్రతిమానతత్త్వజవ. అని వా. 1926.

జనవు నటించి డగ్గఱినఁ, జయ్యన 'భైరవరక్ష' యంచు నిం
పెనయఁగ యోగినీతిలక మిచ్చె విభూతి నరేంద్రసూతికిన్. 15

వ. ఇచ్చినం బుచ్చుకొని సుఖాసీనుండై యున్నయవసరంబున. 16

క. పంజరము వెడలి నరపతి
కుంజరు దీవించి, సరసగోష్ఠి సునీతిన్
రంజింపఁజేసెఁ గీరము
మంజులభాషావిశేష మాధుర్యమునన్. 17

వ. అనంతరంబ యారాజు రాజకీరాభిలాపగర్భంబులైన సముచితాలాప
సందర్భంబు లుపన్యసించిన, నయ్యోగినీరత్నంబు ప్రయత్నపూర్వ
కంబుగా సర్వంసహాధీశ్వరున కిట్లనియె. 18

క. అష్టాంగయోగవిద్యా
వష్టంభమువలనఁ, గీరవర వచనసుధా
వృష్టి మదిఁ దొప్పఁదోఁగఁగ
నిష్టము గలిగినను జెల్ల దిది మాకు నృపా! 19

క. అఱువదినాలుగువిద్యల
నెఱవాది త్రికాలవేది నీ వీచిలుకన్
నెఱవుగఁ జేపట్టిన నది
చెఱకునఁ బం డొదవినట్లు చిరకీర్తినిధీ! 20

ఆ. రాజయోగ్య మైన రమణీయవస్తువు
యోగిజనులయొద్ద నునికి దగునె?
యవధరింపు మనుచు, నవరత్నపంజరా
నీత మైనచిలుకఁ జేతి కిచ్చె. 21

ఉ. ఇచ్చిన మూఁడులోకములు నేలినకంటెను సంతసిల్లి, దా
నచ్చపలాక్షి వీడుకొని, యద్రిసుతాభవనంబుచేరువన్

మెచ్చులుమీఱఁ గోమలసమీరవిశాలరసాలవీథికిన్
వచ్చి, పథిశ్రమాపనయవాంఛమెయిన్ విడియించె సేనలన్. 22

వ. తదనంతరంబ. 23

క. భూతలపతిసూతి, కళా
చాతుర్యనిరూఢు లైన సచివులు దానున్
శీతలశశికాంతోపల
చూతలతాగృహమునందు శుకవిభుతోడన్. 24

వ. సరసకథామాధురీధురీణ మంజులభాషావిశేషతోషితుండై యిట్లనియె. 25

సీ. అఖిలజగత్కర్త యైనపంకజగర్భు
పట్టంపుదేవి చేపట్టి పెనిచె
నారాయణసహస్రనామ సామ్యముగల
రామాఖ్య యొసఁగిరి రాజముఖులు
వలరాజు తనమూలబలములోపల నెల్ల
నెక్కుడుమన్నన యిచ్చి మనిచె
వేదాంతసిద్ధాంతవేది వేదవ్యాస
భట్టారకుఁడు పేరుపెట్టె సుతుని
తే. నిట్టిమీవంశకర్తల కితర పక్షి
వరులు తేజోనిరూఢి నెవ్వరును సరియె?
సకలవిద్యారహస్య భాషావిశేష
చాతురీధామ శుకరాట్సార్వభౌమ! 2౬

చ. పరిణతనూత్నరత్నమయ పంజరపీఠికలన్ సుఖించినన్
సరసరసాలసత్ఫలరసంబులు కత్తుకబంటి గ్రోలినం
బరిచితవాక్యభంగి బహుభంగిఁ బ్రసంగము చేసెనేని, నీ
కరణి ద్రికాలవేదు లనఁగా మననేర్చునె యన్యకీరముల్? 27

క. కావున నీభావంబున
భావించి, మదీయ భావిఫలసంప్రాప్తి
శ్రీ వివరించి వచింపుము
నావుడు, రాచిలుక మనుజనాథుని కనియెన్. 28

మ. కరుణానీరధి సత్యధర్మధరణీకాంతుం డవంతీపురీ
శ్వరుఁ, డారాజుతనూజ నూతనకళాసౌభాగ్య కర్పూరమం
జరి కన్యాతిలకంబు, మన్మథమహాసామ్రాజ్యలక్ష్మీధురం
ధర శృంగారవిలాసవైభవ సముద్యన్మూర్తి. ధాత్రీశ్వరా! 29

క. ఆ వెలఁదియు దేవరయును
దేవియు దేవరయుఁబోలెఁ దేజోవిభవ
శ్రీ వెలయఁగ నలరెద, రిదె
వైవాహికవార్త యిపుడె వచ్చు నరేంద్రా! 30

చ. అన విని భూవిభుండు నగి, యా నిది చెప్పెడువారుచెప్పినన్
వినియెడువారి కించుక వివేకములేదె శుకాగ్రగణ్య! నీ
వనియెడుమాట నాదు మది కచ్చెరువయ్యెడి నన్న. దేవ! యే
యనువుననైన నీయడుగులాన నిజం బని చిల్క పల్కినన్. 31

క. తాళము వైచినతెఱఁగున
భూలోకాధీశుడెందమున కానంద
శ్రీలొదవించుచు వచ్చెను
లాలితమంజీర మంజులధ్వను లంతన్. 32

సీ. కీలుకొప్పునఁ గన్నెగేదంగిఱేకులు
పునుఁగుసౌరభముల బుజ్జగింప
నలికభాగంబున నెలవంకతిలకంబు
కస్తూరివాసనఁ గుస్తరింప
సిరమైన పచ్చకప్పురముతో బెరసిన
తమ్ములమ్మున తావి గుమ్మరింపఁ

గుచకుంభములమీఁది కుంకుమపంకంబు
పరిమళంబులతోడఁ బరిచరింప
తే. గంధవహనామవిఖ్యాతి గణనకెక్క
నించువిలుకాని వేగువాఁ డేఁగుదెంచి
యిగురుఁబోఁడులగమిరాక యెఱుకపఱిచె
సరసనుతుఁడైన యారాజచంద్రమునకు 33

ఉ. చందనగంధు లిద్దఱు లసన్మణికాంచనదండచామర
స్పందన మాచరింప, నడపం బొకపంకజనేత్ర పట్టఁగా
నిందునిభాననామణు లనేకులు గొల్వఁగఁ జారులీలతో
నందల మెక్కి యొక్కజలజానన వచ్చె నృపాలుపాలికిన్. 34

వ. వచ్చి యాందోళికావతరణానంతరంబున. 35

సీ. జిగి దొలంకుచునున్న బిగిచన్నుఁగవ కేఁగ
గరమూఁతరోచులు కలయఁబొలయ
మించుగా దీపించు మెఱుఁగుఁజూపులయొప్పు
మణికంకణములపై మాఱుమలయ
గరపల్లవద్యుతిఁ గస్తూరితిలకంబు
కుంకుమపంకంబు కొమరుమిగుల
నవ్యవిస్ఫురణమై నఖముఖంబులకాంతి
వెలయుముత్యములతోఁ జెలిమిసేయ
తే. నలఁతినగవు లేఁజెక్కుల నంకురింప
రాచక్రొమొక్కుగ మ్రొక్కి యారాజవదన
రాజుచేసన్న నాసన్నరత్నపీఠిఁ
జెలువు రెట్టింపఁగా సుఖాసీనయయ్యె. 3[illegible]

క. ఆరమణి యుచితవచన సు
ధారసమున విభుఁడు సమ్మదము నందుతఱిం
గారము తనసర్వజ్ఞత
యారూఢికి నెక్క నంబుజాన కనియెన్. 37

చ. పలుకుల నేర్పునం జెవుల పండువు చేసితి వింత సేపు, నా
పలుకు శిలాక్షరంబుగ శుభం బది శీఘ్రముగాఁగ నంతయుం
దెలియఁగఁ జెప్పు మింక భవదీయ సమాగమన ప్రసంగముల్
జలజదళాక్షి! యేమిటికిఁ జల్లకు వచ్చియు ముంత దాఁపఁగన్? 38

వ. అనిన విస్మయానంద కందళితమానసయు మందస్మిత సుందరవదనారవిందయు నై, యయ్యిందువదన క్షమాపతినందను నవలోకించి, యామూల చూడంబుగా మదీయవిజ్ఞాపనంబు దత్తావధానుండ వై చిత్తగింపు మని యిట్లనియె. 39

సీ. వివిధ వైభవముల విలసిల్లుపట్టున
శ్రీలకెల్ల నవంతి మేలుబంతి
యన్నగరాధీశుఁ డధిగతపరమార్థ
నిత్యసద్ధర్ముండు సత్యధర్ముఁ
డావిభుపట్టపుదేవి లీలావతీ
దేవి రెండవభూమిదేవి తాల్మి
వారికిద్దఱకును వర్ణితసౌజన్య
కర్పూరమంజరి కన్య కలుగఁ
తే. గలిగె బాంధవతతికి భాగ్యములకల్మి
కలిగె నృపవంశమునకు శృంగారగరిమ
కలిగెఁ బ్రజలకుఁ గన్నులు గలఫలంబు
కలిగె మరురాజ్యలక్ష్మికి గౌరవంబు. 40

తే. మొదలిపక్షంబు విదియయం దుదయ మైన
చంద్రరేఖయుఁబోలె నాచంద్రవదన
దినదినంబునఁ గళలందుఁ దేజరిల్లు
సఖులనేత్రచకోరికాసమితి యలర. 41

సీ. మొదలిసిగ్గులనిగ్గుఁ బొదలించు కనుమించు
తొంగలిఱెప్పలఁ దొంగలింప

నెలవు లేర్పడుచున్న మొలకచన్నులచెన్ను
బంగారుసకినలభంగి మెఱయ
శృంగారరసనదీ భంగంబులో యన
నారుతోడనె వళు లంకురింపఁ
గఱుదు లేమియు నెఱుంగని ముద్దుఁబల్కుల
నలఁతి తియ్యఁదనంబు గులకరింపఁ
తే. గుంతలంబులు హరినీలకాంతిఁ జెనక
గతులమురిపంబు గజరాజుగతుల నొరయ
బాల నవయౌవనంబునఁ జాల మెఱసెఁ
బ్రజలకెల్లను గన్నులపండు వగుచు.

ఉ. నేరుపు రూపుగన్నకరణిం, జెలు వాకృతి నొందినట్లు, శృం
గారము మూర్తి గైకొనినకైవడి, నవ్యవిలాసరేఖ యా
కారము దాల్చి పొల్చుగతిఁ, గాంతి శరీరము గాంచె నాఁగ, నం
భోరుహనేత్ర యొప్పెఁ బరిపూర్ణవయో రమణీయలీలలన్.

సీ. కాంచన మణిగణ చంచలరోచులఁ
గాంతనెమ్మోముగా గండరించి
కుముద మీన చకోర కుసుమాస్త్రదీప్తులఁ
గామినీమణి కన్నుఁగవ యొనర్చి
కనకకుంభ రథాంగ కరికుంభ మంజరీ
రుచి నింతిచనుదోయి రూపుచేసి
బంధూక విద్రుమ పల్లవాంబుజకాంతి
నతివపాదములుగా నచ్చుపటిచి
తే. కలితశృంగారవిరచనాకౌశలమున
నఖిలమోహనమూర్తిగా నలరుఁబోఁడిఁ
బంచబాణుండు తాన నిర్మించెఁగాక
వేదజడుఁడైన యజునకు వెరవు గలదె ?

సీ. చందురు మెచ్చని చామ నెమ్మోముతో
జలజ దర్పణములు సాటి యగునె

మెఱుఁగులఁ గైకోని మెలఁతచూపులతోడ
రతిరాజశరచకోరములు సమమె
పసిఁడికుండల మీఱు పడఁతిచన్నులతోడఁ
గరికుంభ చక్రవాకములు సరియె
హరినీలముల గెల్చునంగనకురులతోఁ
గాలాహిచంచరీకములు ప్రతియె
తే. పొలఁతిక్రొమ్మేని సాటియే పువ్వుఁదీఁగె
బాలయడుగుల నెనయునే పల్లవమ్ము
లతివపలుకుల దొరయునే యమృతరసము
వెలఁది కెమ్మోవిఁ బోలునే విద్రుమంబు? 45

ఉ. అరసి లక్ష్యలక్షణ రహస్యనిరూఢముగా సమస్త వి
ద్యారతి నుల్లసిల్లె, వివిధంబులు చెల్వము లభ్యసించె, నా
నా రథవాజివారణ రణస్ఫురణంబులకీ లెఱింగె, నా
నీరజనేత్ర యిద్దరణి నేరనివిద్యలు లేవు భూవరా! 46

ఉ. ఆరమణీశిరోమణి వయస్యలు దాను నొక్కనాఁడు శృం
గారవనాంతవీథి రతికాంతుని నోమఁగ నేఁగి, యయ్యెడం
గోరికమీఱఁ గీరములకుం శ్రుతిశాస్త్రపురాణసత్కథా
సారము లొప్పఁజెప్పు నొకశారికఁ గాంచెఁ గళాభిసారికన్. 47

క. కాంచి తమకించి కదిసినఁ
జంచలగతిఁ జిలుకలెల్లఁ జదలికి నెగయం
మించినశారిక కోరిక
వంచనమైఁ జిక్కినట్లు వనితకుఁ జిక్కెన్. 48

ఉ. ఆగౌరవంకవంకఁ గమలానన నెయ్యపుఁజూడ్కిఁ జూచి, యే
లాగున నీకు నీబహుకళాకుశలత్వము సంభవించె? ని
చ్చాగతితోడ నీమెలఁగుచక్కటి యెక్కడఁ? జెప్పు మన్న శో
భాగరిమాభిరామ యగుపక్షివధూకులరత్న మిట్లనున్. 49

మ. వెలయన్ గాదిలిపుత్త్రిచందమున వేవేభంగులం బ్రోచుచుం
బలుకుందొయ్యలిచేతిరాచిలుక పెంపన్ బెర్గి, నానాకళా
కలనాలీలఁ ద్రికాలవేదిని యనంగాఁ, జంద్రకాంతోపలో
జ్జ్వలకాంతార లతాంతవాటికలలో వర్తింతుఁ గాంతామణీ! 50

క. అనవుడుఁ ద్రికాలవేదిని
యనునామము నీకుఁ గల్గినట్టి దయేనిన్
నను నుద్వాహము గాఁగల
మనుజేంద్రకుమారుఁ జెప్పుమా మెచ్చొదవన్. 51

వ. అనుటయు. 52

క. ఆవంచకపుర మేలెడు
భూవల్లభనందనుండు బుధగురుజనసం
భావిత గుణమణిభూషా
శ్రీవిలసత్కీర్తి రాజశేఖరుఁ డబలా! 53

సీ. కలిఖలప్రేరణాకుల వివర్ణుఁడు గాక
వర్తించు నలచక్రవర్తి యనఁగ
గౌతమమునిశాపభీతచిత్తుఁడు గాక
తనరారుపాకశాసనుఁ డనంగ
జటినిటలానలోత్కటపీడితుఁడు గాక
సొంపారునవవింటిజో దనంగ
రాహుగ్రహోరునిగ్రహుఁడు గాక సుకాంతిఁ
జాలనొప్పెడు పూర్ణచంద్రుఁ డనఁగ
తే. శ్రీలఁ గడుఁబేర్చి విభవంబుచేఁ దనర్చి
రూపమున నిక్కి సత్కళారూఢికెక్కి
గౌరవంబున రాజశేఖరుఁడు వోలెఁ
జెలువమున నొప్పు నారాజశేఖరుఁడు 54

వ. మదనమ త్తకాశినీ చిత్తాకర్ష ణాకార శృంగారలీలావిహారుం డైన యా
రాజకుమారత్నంబునకు. 55

మ. చనవొప్ప న్నినుఁ బొందఁ గాంచునదిపో సంసారసాఫల్య మం
గన, నీమాట లనంగశాస్త్రముల రంగన్మూలముల్, మ త్తకా
శిని నీమోవులు చి త్తజాయుధ మహాసింహాసన స్థానముల్,
వనితా! నీదుకుచంబు లంగభవదివ్యత్కుంభినీకుంభముల్. 56

శా. కాంతా! కంతుని మీఱునవ్వసుమతీకాంతుండు కాంతుండుగాఁ
గాం జేనిం, గమనీయహేమమణిసాంగత్యంబు సంధిల్లు నీ
సంతోషంబు ఘటించు నంతకు భవత్సౌందర్య మూహింపఁగాఁ
గాంతారాంతర వల్లికాకుసుమసంకాశంబు గాకుండునే? 57

సీ. తరుణి! యాతని యురస్సరసిలో నీ కుచ
చక్రవాకులు కేళి సలుపుఁగాక
యింతి! యాతని వదనేందుచంద్రికల నీ
దృక్చకోరికలు న ర్తించుఁగాక
కాంత! యాతని తనూకల్పభూరుహముపై
నీబాహులతికలు నిగుడుఁగాక
పొలఁతి! యాతని కర్ణపుటకరండముల నీ
వాచామృతంబు దైవాఱుఁగాక
తే. నీకుఁ దగు నాతఁ డతనికి నీవు తగుదు
నీకు సరియైనసతియు నానృపకుమార
వరున కెనయైనపతి యును నీవసుధఁ గలరె
నాదుమాటలు మదిలోన నమ్ము మనియె. 58

క. ఇ త్తెఱఁగున శారిక నీ
వృత్తాంతము విన్నవింప విని యనురాగా
య త్తం బగుచి త్తముతో
మ త్తచకోరాక్షి మరునిమాయలఁ దనన్. 59

సీ. అలరుఁదేనియఁ గ్రోలి యానందమున మ్రోయు
నళివిరావములకు నలికియలికి
చిగురాకుఁబొగ రాని చెలఁగి యెలుంగించు
పికనికాయములకు బెదరిబెదరి
ఫలరసంబులఁ జొక్కి పలువలై పల్కెడు
చిలుకలపలుకుల కులికియులికి
బిసములరస మాని పేర్చి వినోదించు
కలహంసములఁ జూచి కలఁగికలఁగి
తే. మేనుఁదీవెయు నలఁతయు మేళవింప
వెలఁదికరమును జెక్కును వియ్యమందఁ
జెదరుకురులును నుదురును జెలిమిసేయ
నున్న తన్వంగిఁ గనుఁగొని యువిదలెల్ల 60

క. గౌరవంకయాసమాటల
మరువంకఁ దలంకు గలిగె మగువకుఁ దమలో
వెర వింక నేమి గలదని
యిరువంకలఁ బొగిలి రప్పు డెంతయు వంతన్. 61

సీ. కనుదోయి మెఱుఁగులు కంతుతూపులకడ
గిరవుగాఁ బెట్టితే హరిణనయన
మెయిదీఁగె నునుఁగాంతి మెఱుఁగుముత్తములకు
నెరవుగా నిచ్చితే యిందువదన
చనుఁగవ గ్రొమ్మించుఁ గనకకుంభములొద్ద
నిల్లడ వెట్టితే యిగురుఁబోఁడి
పలుకులచెలువంబుఁ గలికికీరములకు
1వారకం బిచ్చితే వనజగంధి
తే. శుకముఁ జదివింప నందంబు చూడఁ గంద
మలఁదఁ బయ్యెద సవరింప వలను లేక

1. చేబదులిచ్చుట

వగలఁ బొగులంగఁ జూడంగ వలసె మాకుఁ
బులుఁగు నిన్నింతచేసెనే పువ్వుబోఁడి. 62

వ. అని చింతించి శిశిరోపచారంబులు సేయం దలంచి. 63

సీ. చేమంతిఱేకులఁ జేసిన పఱపుపైఁ
దెఱఁగొప్ప నల్లనఁ దెఱవ నుంచి
యందంద డెందంబునందు గంద మలంది
సిరమైన పచ్చకప్పురము సల్లి
పదపల్లవంబులు పల్లవంబుల నొత్తి
పుప్పొడి కరముల నప్పళించి
యఱుతఁ గ్రిక్కిఱియ ముత్యములపేరులు వేసి
పన్నీటఁ గన్నీరు పాయఁ దుడిచి
తే. చెలికి శిశిరోపచారముల్ సేయఁ జేయఁ
నంతకంతకు మదనాగ్ని యధిక మైనఁ
జెలులు మదిలోన నెంతయుఁ జిన్నవోయి
రాజునకు విన్నవించిరి రమణితెఱఁగు. 64

తే. విన్నవించిన నారాజు విన్ననగుచు
నిన్నుఁ దోడ్కొనిరమ్మని నన్నుఁ బనిచెఁ
జెప్పనేటికి దేవరచిత్త మింక
మదవతీమణిభాగ్యంబు మనుజనాథ. 65

వ. అనిన నారాజశేఖరుండు. 66

క. ఆరాజాననమాటయు
నారాజశుకంబుపలుకు, ననురాగరసాం
భోరాశిసుధాకరరుచి
సారం బై యప్పు డేకసంశ్రిత మయినన్. 67

క. పలుకులు వేయు యిఁకేటికిఁ
బలుకును బంతంబు నొక్కభంగిగఁ బొసఁగం

బలుకఁగ నేర్తుగదా ! యని
చిలుకను దిలకించి ప్రియము చిలుకం బలికెన్. 68

క. నీపలుకు వేదసారము
నీపలుకు గిరీశువరము, నీపలుకు శిలా
స్థాపితలిపి, నీపలుకున
కేపలుకు సమంబు శుకకులేశ్వర చెపుమా ! 69

వ. అనుచుఁ గీరంబును గారవించి, చతురికను దదనుచారికలను సముచితోప చారంబుల సత్కరించి, పరిణత పరిణయోత్సాహుండును సర్వసన్నాహుండును ననుగతానేక రాజశేఖరుండును నై యారాజశేఖరుం డాప్రొద్దె కదలి, కదళికాకదంబనింబజంబీరజంబు తమాలహింతాలలవంగ లుంగ నారంగ మాతులుంగపుగంగాది మహామహీరుహానితాంత కాంతం బైన యవంతిపురోపకంఠోపవనాంతరంబు ప్రవేశించిన యనంతరంబ, యా సర్వంసహాధీశు వీడ్కొని. 70

క. చతురిక వెస ముందరఁ జని
రతిపతిసముఁ డైన యతనిరాక ప్రియముతో
నతనునివేదనఁ బొరలెడి
సతితో మున్నాడిచెప్ప సమ్మద మొదవన్. 71

ఉ. వ్రాసినచిత్రరూపముకుఁ బ్రాణమువచ్చినభంగి లేచి, పే
రాస దలిర్పఁగాఁ జతురికాంగనఁ గౌఁగిటఁ జేర్చి. దానిలీ
లాసరసానులాపగతులం జెలికత్తెల గారవించి, కై
సేసికొనం గడంగె మునుచెప్పినశారికమాటఁ జెప్పుచున్. 72

వ. అంతఁ జతురికావిజ్ఞాపిత రాజశేఖరాగమనవృత్తాంతుండును సంతోషిత స్వాంతుండు నైన సత్యధర్మమహీకాంతుండు సరగ నగరంబు నలంకరింపం బనిచి. 73

సీ. లక్ష్మిసుతునిరాజ్యలక్ష్మి కెల్లను మూల
బల మైన శృంగారవతులతోడ

ఘనబలాకుంఠిత కంఠీరవప్రౌఢిఁ
గొమరారు భృత్యవర్గములతోడఁ
నాశాకరీశుల నపహసింపఁగ నోపు
గంధసింధుర సముత్కరముతోడఁ
బవమానుజవనత్వ మవమానపఱుపంగఁ
జాలెడు నుత్తమాశ్వములతోడఁ
తే. గమలసంభవసము లైనకవులతోడ
గరిమ సన్మతిగల మంత్రివరులతోడ
మహిమమై వచ్చి సత్యధర్మక్షితీంద్రుఁ
డింపు రెట్టింప నల్లుని నెదురుకొనియె. 74

వ. ఎదురుకొని తత్సమయసముచితోపచారంబులు నడపి తోడ్కొనిచని, నిజ ప్రధానాగారంబు విడియించి, పౌరులం బురోహితులను రావించి తదుప దిష్ట దివసంబున. 75

సీ. హితులైన నిజపురోహితులు చెప్పినయట్ల
శోభనద్రవ్యవిస్ఫురణ గూర్చి
కడువైభవముతోడఁ గళ్యాణవేదిక
నింపుమీఱ నలంకరింపఁ బనిచి
కర్పూరమంజరిఁ గైసేసి తెమ్మని
సరస విలాసినిజనులఁ బనిచి
రాజశేఖరమహారాజు శృంగారించి
తోడ్తేరఁ దగియెడుదొరలఁ బనిచి
తే. పరిణయాగారమునకు దంపతులఁ దెచ్చి
లక్షణోచిత వైదికలౌకికాది
కృత్యములు సాంగములు గాఁగ సత్యధర్మ
మనుజనాథుండు విబుధానుమతినొనర్చె. 76

వ. అయ్యవసరంబున మౌహూర్తిక దత్త శుభముహూర్తంబున. 77

చ. రతిరతిరాజమూర్తు లగురామయు రాకొమరుండు నొండొరుల్
సితలలితాక్షతావళుల సేసలు వెట్టిరి, మందమారుతో
చితచలనప్రసంగములచే నితరేతరకోరకావలుల్
చతురతఁ జల్లి యాడు నవజాతిలతా సహకారలీలలన్. 78

క. చనుదెంచి హోమకార్యము
లనువున నొనరించి, పెద్దలగువారలకుం
గనక మణిభూషణాదులు
తనియంగా నిచ్చె సత్యధర్ముఁడు దానున్. 79

ఆ. భక్ష్యభోజ్యలేహ్యపానీయచోష్యంబు
లింపువెంప నారగింపఁజేసి
వారయాత్రికులకు వసుమతీనాథుండు
గారవంబుతోడఁ గట్టనిచ్చె. 80

క. సొంపున నిమ్మెయిఁ బెండిలి
సంపతిలన్, సత్యధర్మజనపతిచంద్రుం
డంపగ, నావంచకపురి
కింపలరఁ గుమారుఁ డరిగె నింతియుఁ దానున్ 81

చ. అరిగి, పురంబులోని కమలాక్షులు మేడలమీఁదనుండి య
చ్చెరువుగఁ గ్రొత్తముత్యములు సేసలుచల్లుచు నుండ రాజమం
దిరమున కేఁగుదెంచి, జననీజనకుల్ తను గారవింపఁ ద
చ్చరణసరోరుహంబులకుఁ జాఁగిలి మ్రొక్కెఁ బ్రియాసమేతుఁడై. 82

తే. అంత నొకనాడు కాంతయు నవ్విభుండు
శారికాకీరరత్నపంజరము లొక్క
చూతపోతంబుకొమ్మను బ్రీతి నునిచి
మహిత శృంగారవన లతామండపమున. 83

వ. వినూత్నరత్న వేదికల మకరకేతనక్రీడాచాతుర్యంబులఁ బ్రొద్దుపుచ్చు
చున్నసమయంబున గీరంబు శారిక కిట్లనియె. 84

క. ఈరాజు రాజముఖియును
గారవమునఁ గలసిమెలసి కందర్పసుఖ
శ్రీరతులై విహరించెద
రీరీతిని మనము నునికి యెంతయు నొప్పన్. 85

క. అనవుడు శారిక కీరముఁ
గనుగొని, మగవారు 'పాపకర్ములు నమ్మం
జన' దనినఁ 'బాపజాతులు
వనితలుకా' కనుచుఁ జిలుక వాదముచేసెన్. 86

వ. తదాకర్ణన కుతూహలాయత్తచిత్తులై మత్తకాశినీమహీవరోత్తములు శారి
కాకీరంబులం దేర నొక్కపరిచారక నియమించి. 87

క. తెప్పించి వానిఁ గనుఁగొని
యిప్పుడు మీలోన వాద మేటికి మాకుం
జెప్పుం డనినను శారిక
చెప్పఁదొడఁగె నిందువదనచిత్తం బలరన్. 88

వ. నన్ను నీరాజకీరఁబు తనుఁ బరిగ్రహింపు మనిన. 89

క. పురుషులు పొలఁతులయెడలను
బరుపాత్మకు లనుచుఁ జాటిపలికినఁ గినుకం
బురుషులయెడలను బొలఁతులె
పరుషాత్మిక లనుచుఁ జిలుక పలికె నరేంద్రా ! 90

వ. అది యట్లుండె మదీయ వచనంబున కనుగుణంబుగా నొక్కకథ చెప్పెద
నవధరింపుమని యిట్లనియె 91

## శారిక రాజశేఖరునకుఁ జెప్పిన ధనగుప్తుని కథ

సీ. అభినవశ్రీలతో నలకాపురంబుతో
సదృశమై యొప్పుఁ గాంచనపురంబు
అన్నగరంబులోఁ గిన్నరేశ్వరుకంటె
ధర్మగుప్తుఁడు సముద్దామవిభవుఁ

డా వైశ్యవరపుత్త్రుఁ డగు ధనగుప్తుండు
యాపనోదయ దుర్మదాంధుఁ డగుచుఁ
దనతండ్రిపిమ్మట ధనమెల్లఁ బోనాడి
కడు నకించనవృత్తిఁ గంచి కరిగి.

తే. యందు నిజమాతులోత్తము ననుపమాన
విభవు శ్రీగుప్తుఁ డగు వైశ్యవిభునిఁ జేరి
తండ్రి మృతుఁడౌట చెప్పక తత్తనూజఁ
బరిణయం బయ్యె వైభవస్ఫురణ మెఱయ 92

వ. రాగ తరంగిణిఁ యను నక్కాంతం బరిగ్రహించి యనంతరంబ. 93

క. రాగతరంగిణిఁ దన్నును
శ్రీగుప్తుం డొక్కభంగిఁ జేపట్టి బహు
శ్రీగరిమ గారవింపఁగ
రాగిల్లి తదీయ మందిరంబున నుండెన్. 94

వ. అంత. 95

క. తనప్రాణము ప్రాణములై
యనవరతముఁ దన్నుఁ గూడి యాడెడుధూర్తుల్
మనసునఁ బాటిన నూరికిఁ
జనియెద నని మామతోఁ బ్రసంగముచేసెన్. 96

ఉ. చేసిన, మామ యల్లుని కశేషవిశేష వినూత్నరత్నభూ
షాసముదంచితాంబర లసద్ఘనసారపటీరవస్తువుల్
భాసురలీల నిచ్చి యనుపన్ సతిఁ దోడ్కొని యేఁగి, దుర్మద
శ్రీ పిగురొత్తఁ గాంచనపురీవరకాననమధ్యమస్థలిన్. 97

క. తనుఁగూడి వచ్చువారలఁ
గనుమొఱఁగి, మహోగ్రవృత్తి ఘనకూపములో
వనితఁ బడఁద్రోచి, తెచ్చిన
ధనమంతయుఁ గొంచు నేఁగెఁ దనపురమునకున్. 98

వ. ఇట్లు ధనగుప్తుండు త్రోచిపోయిన. 99

క. ఆకాంత కూపకుహర
వ్యాకీర్ణలతావితాన మాధారముగా
సాకారంబై నిల్చిన
శోకరసము భంగి. నేడ్చుచును వగఁ బొగులన్. 100

ఆ. అయ్యెలుంగు పథికు లాలించి యేతెంచి
వెడలఁ దిగువ నూతివెలిఁ దనర్చె
రాహు వదనగహ్వరంబున వెడలిన
చంద్రరేఖలీలఁ జంద్రవదన. 101

సీ. తావిఁ గైవ్రాలిన తమ్మిరేకులభంగి
వాలారుఁజూపులు వ్రాలుదేర
వేఁబోక కలువలవిందు చందంబునఁ
జెలువంపునెమ్మోము చిన్నుదఱుఁగ
ఉలుకు నొచ్చినయట్టిజక్కవకవభంగి
గరువంపు బిగిచన్నుఁగవ వణంక
నెండచే వాడిన యెలదీఁగెయునుబోలె
నిద్దంపుఁదనువల్లి నిగ్గుసడల
తే. ముదురుటూర్పులు గెమ్మోవిపదను దివియఁ
జెమటచిత్తడి చెక్కులఁ జిప్పిలంగ
నున్నతన్వంగి భయమేద నుపచరించి
యింపు రెట్టింప తెరువరు లిట్టు లనిరి. 102

క ఎవ్వరిబాలిక, వెవ్వతె
వెవ్వరు నినుఁ దెచ్చి రిచటి. కీకూపములో
నెవ్వరు నినుఁ బడఁద్రోచిరి
యెవ్వఁడు నీధవుఁడు నామ మెయ్యది నీకున్ ? 103

వ. అనవుడు. 104

సీ. కాంచిలోఁ జిరకీర్తిఁ గాంచి మించినయట్టి
శ్రీగుప్తుఁ డనియెడు సెట్టిపట్టిఁ
గాంచనపురియందు గణనకెక్కినయట్టి
ధనగుప్తునకుఁ బ్రాణదయిత నేను
రమణమై రాగతరంగిణి యనుదాన
నత్తవారింటికి నరుగుచోట
నిచ్చోట బ్రుచ్చుల నెడదవ్వులనె గాంచి
పతియు సహాయులుఁ బాఱిపోవ
తే. నశ్రుపూరంబు చూపుల కడ్డపడిన
బ్రమసి మతి తప్పి పడితి నీప్రాంతనూత
నింతలో వచ్చి మీరెల్ల నెదురుకొంటి
రెత్తుకొంటిరి నాప్రాణ మేమిచెప్ప. 105

ఉ. ఇంచినవేడ్కతోడ నను నేనుఁగుకొమ్మున దాదికొమ్మనం
బెంచినతల్లిదండ్రులకుఁ బ్రేముడి నాయెడఁ బాయకుండు నే
గాంచికి నేఁగి వారిఁ బొడగాంచిన సంగద వాయుఁ గాన, న
న్నించుక యాదరించి కర మేదెడునట్టుగఁ జేయరే దయన్. 106

వ. అనిన ననుకంపాతరంగితాంతరంగులైన యప్పథికు లిట్లనిరి. 107

చ. బలపదసహ్య సింహశరభప్రముఖోగ్రవనాంతభూమి ని
మ్ముల నిను డించిపోయెదమె ముంగి తెలుంగనిముద్దరాల, వా
వలఁ బనియేమి గల్గిన నవశ్యము నిన్నును దల్లిదండ్రులం
గలపకపోము, కంచి యది కంచియె మాకుఁ బయోరుహాననా! 108

క. అను నయవాక్యంబులచే
ననునయముం బ్రియము నొదవ నప్పథికవరుల్
తనవారికంటె మిక్కిలి
దనవారితనంబు దనరఁ దనుఁ బలుకుటయున్. 109

క. కాంతారత్న మొకించుక
సంతాపము సడల వెనుకఁ జనుదేరంగాఁ
గాంతారము వెలువడి చని
యంతట నకాృంచిఁ గాంచియందఱుఁ దమలోన్. 110

వ. ఇట్లని స్తుతియించిరి. 111

క. నీలీనింబకదంబక
సాలాగురుసరళవకుళ చందనబదరీ
తాలతమాలరసాల
శ్రీలం గడు నొప్పుఁ గంచిచెంగటితోఁటల్. 112

క. దీపితవినూత్న రత్న
ప్రాపిత ఘనకనకకలశ బంధురశోభా
గోపితగగనప్రాంగణ
గోపురమై కరిగిరీంద్రుగోపుర మొప్పున్. 113

సీ. ఏవీథిఁ జూచిన నెపుడు విద్వజ్జన
వేదశాస్త్రాలాపవిలసనంబు
లేయింటఁ జూచిన నిష్టాన్నభోక్తలై
యతిథులు గావించు నతులవినుతు
లేమేడఁ జూచిన నిందీవరాక్షుల
సంగీతవిద్యాప్రసంగమహిమ
లేతోఁటఁ జూచినఁ జూతపోతంబులఁ
గలికిరాచిలుకల కలకలములు
తే. కొలఁకు లెయ్యవి చూచినఁ గుముదకమల
కలితమకరందనిష్యంద గౌరవంబు
లెల్లభాగ్యంబులకుఁ దాన యెల్లయైన
కంచిఁ జూడనికన్నులు కన్ను లగునె? 114

ఉ. నూతనమీనకేతనవినోదపరిశ్రమఖిన్నులైనయ
జ్ఞాతముఖీనృపోత్తముల సారెకు సారెకు సేదదేర్చు. వే
గాతటినీతటీకలిత కాంతరసాలనికుంజమంజరీ
జాతమరందకందళిత సారసమీరము కాంచికాపురిన్. 115

సీ. చెక్కులక్రేవల సిరపుమించులతోడఁ
దరపాలతళుకులు తడఁబడంగఁ
గలికిక్రేఁగన్నులఁ గ్రమ్మక్రొమ్మెఱుఁగులు
ముత్తువాళియలపై మోహరింప
గరగరనై యొప్పుకచభరంబులతావి
పునుఁగుసౌరభములఁ బ్రోదిసేయ
మించిన వన్నెచీరంచులనెఱికలు
మేఖలాపళులతో మేలమాడఁ
తే. బసుపునునుఁజాయ మైకాంతిఁ బసలుసేయ
నేవళంబులు చనుదోయి నిగ్గు జెనక
ద్రవిళబాలవిలాసినీతతులు మెఱయ
సిరికిఁ బట్టైనకాంచికాపురమునందు. 116

క. నరుఁ డొకపుణ్యముచేసినఁ
బరువడి నది కోటిగుణితఫలదం బగుటన్
ధరఁ బుణ్యకోటి యనఁగాఁ
బరఁగుం గాంచీపురంబు ప్రతి యే పురముల్ ? 117

సీ. ఘనతరసౌధాగ్ర కనకకుంభములవి
కమలమిత్త్రుని దృక్ప్యకరణిఁ జూపఁ
బ్రాసాదకీలిత బహురత్నదీధితు
లింద్రచాపంబుల నీనుచుండఁ
బ్రతిమందిరధ్వజపటశీతపవనంబు
సిద్ధదంపతుల మైసేదఁ దేర్ప

గంధసింధురతురంగములసాహిణములు
శ్రీకాంత కేకాంతసీమ గాఁగ
తే. నావణంబులఁ బచరించునట్టిసరకు
లర్థపతివైభవంబుల నపహసింప
రమ్య మై యున్న కాంచీపురంబుతోడ
నితరపురముల నుపమింప నెట్లువచ్చు ! 118

వ. అని ప్రశంసించుచుఁ దత్పురంబు బ్రవేశించి, ప్రతిదినప్రవర్ధమాన మహా
వైభవసుందరం బైనశ్రీగుప్తమందిరంబుం బ్రవేశించి యతనిని గాంచి.

క. కాంతారాంతర కూపా
భ్యంతరమునఁ గాంతఁ గనుట యాదిగఁ, దా రా
యింతిని గొనివచ్చినవిధ
మంతయు నెఱుగంగఁ జెప్పి యరిగినపిదపన్. 120

వ. అతండు. 121

క. ఎల్లింటినేఁటిలోనన
తల్లీ వెదకించి తెత్తు ధనగుప్తుని ని
వుల్లమున వగపవల దని
చల్లనిమాటలఁ దనూజ సంభావించెన్. 122

వ. అట ధనగుప్తుండు ధనంబు గొని నిజమందిరమున కరిగి. 123

సీ. బందికాండ్రకు నిచ్చి పరిహాసకుల కిచ్చి
కూడియాడెడు ధూర్తకోటి కిచ్చి
కుంటెనీలకు నిచ్చి కోడిగీలకు నిచ్చి
మిన్నక వారకామినుల కిచ్చి
జూదరులకు నిచ్చి జుమ్మికాండ్రకు నిచ్చి
జారవిలాసినీసమితి కిచ్చి
యిచ్చగొండుల కిచ్చి యుచ్చుమల్లుల కిచ్చి
వారక యుబ్బించువారి కిచ్చి

తే. మాయజోగుల కిచ్చి దిమ్మరుల కిచ్చి
మద పానుల కిచ్చి పామరుల కిచ్చి
యె ధనమును ధనగుప్తుఁ డెఱుకమాలి
వచ్చు యికంబు లేకుండ వెచ్చపఱిచి 124

క. రాగతరంగిణి గర్భ
శ్రీగరిమ వహించె ననుచు సీమంతశుభో
ద్యోగము నెపమున, ధనములు
శ్రీగుప్తుని మోసపుచ్చి చేకొనుబుద్ధిన్. 125

క. కంచికిఁ జని, బహువిభవ స
మంచితమగు మేనమామమందిరము ప్రవే
శించి, తనవవితఁ గనుఁగొని
సంచలత వహించి గుండె జల్లన నున్నన్. 126

క. శంకింపవలదు, పోలఁగ
బొంకితి మును, కాననాంతమున ముచ్చులకుం
గొంకి యసహాయతను నే
వంకకు నరిగితివో యనుచు వైశ్యవరేణ్యా! 127

క. అని రాగతరఁగిణి తను
వినయోక్తుల వెఱపు మాన్పి, వేగంబుగ మ
జ్జనభోజనాదిసత్కృతు
లొనరింపఁగ, మామచేత నుపలాలితుఁ డై. 128

ఉ. ఆగుణహీనుఁ డొక్కటఁటి నర్ధనిశాసమయంబునందు సం
భోగపరిశ్రమస్ఫురణఁ బొంది కవుంగిట నున్నయట్టి యా
రాగతరంగిణీరమణిరత్నసువర్ణవిభూషణాదు లి
చ్ఛాగతిఁ గొంచుఁ బోఁదలఁచి, చంపఁ గతారము పూన్చెఁ బూన్చినన్.

మ. వనితారత్నము వానికార్యమునకున్ వాపోవ, నచ్చోటికిం
జని శ్రీగుప్తుఁడు తాను బాంధవులు నాశ్చర్యంబు రెట్టింపఁగా

ధనగుప్తుం డొనరింపఁబూనిన మహాధైర్యంబు సర్వంబు గాం
చి నిజేచ్ఛం జనుమంచుఁ గంచి వెడలించెం గిన్కతో నల్లునిన్. 130

క. అటుగాన నెన్నిభంగులఁ
గుటిలత్వము కూడు గాఁగఁ గుడుతురు మగవా,
రిటువంటివారి మదిలో
నెటుగా నమ్మెదురు సతులు హితు లని పతులన్ ? 131

క. అని శారిక కథ సెప్పిన
విని, మీఁదటికథ వినంగ వేడుకపడునా
జననాథుఁ జూచి, కీరం
బనఘా ! కథ యవధరింపు మని యిట్లనియెన్. 132

## స్త్రీలు పాపములకు మూల మనుటకుఁ గీరము చెప్పిన కథ

సీ. శ్రీకలితానూన చిత్రరేఖాయుక్తి
కొమ్మలందును గోటకొమ్మలందు
నవరసపదయుక్తి నానార్థగరిమలు
రాజులందును గవిరాజులందుఁ
గవిలోకసంతోషకర జీవనస్థితి
సరసులందును గేళిసరసులందు
నవనవశ్రీసుమనఃప్రవాళవిభూతి
మావులందును నెలమావులందుఁ
తే. గలిగి సముదగ్ర సౌధాగ్రతల సమగ్ర
శాతకుంభ మహాకుంభజాత గుంభి
తోరురత్న వినూత్నశృంగార మగుచు
సిరుల నొప్పారు విక్రమసింహపురము. 133

క. భూపాలలోకమకుట
స్థాపితరత్నప్రభాతిశయచరణుఁడు, వి
ద్యాపరిణతమానసుఁడు, ద
యాపరుఁడు ప్రతాపమకుటుఁ డప్పుర మేలున్. 134

క. ఆరాజేంద్రుని నందన
యారూఢస్మరవికార యౌవనలక్ష్మీ
గౌరవనిధి, సకలకళా
పారీణ విలాసవతి నృపాలతిలకా! 135

ఆ. ఆప్రతాపమకుటుఁ డాత్మజఁ బాటలీ
పుత్త్రి మేలురాజుపుత్త్రిఁ డైన
యాసుధర్మవిభుని ననుపమ మకరాంకుఁ
బిలువఁబనిచి వేడ్కఁ బెండ్లిచేసె. 136

ఉ. చేసి, సుధర్మభూపతికిఁ జిత్రవిచిత్ర వినూత్నరత్నభూ
షాసహితోరుసంపదలు సమ్మద మారఁగ నిచ్చి వైభవో
లాస మెలర్ప నిల్పిన, విలాసవతీసతిఁ గూడి సమ్మద
శ్రీ సెలువొంద నుండె, మును జేసినభాగ్యఫలంబు పెంపునన్. 137

తే. అంత నొకనాడు కాంత యత్యంతకాంత
చంద్రకాంతశిలాసౌధచంద్రశాలఁ
జాలవేడుకఁ దనప్రాణసఖులఁ గూడి
యంగజారాధనము సేయునవసరమున 138

సీ. చక్రవాకస్తని శైవాలధమ్మిల్ల
సందీప్త డిండీరమందహాస
యావర్తనతనాభి యభినవ బిసహస్త
రాజిత రాజమరాళయాన
సికతాతలనితంబ వికచబంధూకోష్ఠ
వరతరంగావళీవళివిలాస
కంబుకంధర దళితాంబుజాతానన
నానావిధవిలోల మీననయన
తే. యమృతసాగరవిభుని యర్ధాంగలక్ష్మి
యిందుధరునిలు పుట్టినయిలుగాఁగ

నెగడెడుపినాకినీ తటినీవధూటి
పట్టణాంతరసీమఁ జూపట్టుటయును. 139

వ. అక్కామినీరత్నంబు కేలుమొగిచి ఫాలభాగంబునం గదియించి. 140

మ. జయకారం బొనరించె నంబరమణీసాధర్మ్యసంపన్నకున్
నయనానంద నవారవిందమకరందశ్రేణికాస్విన్నకున్
నియతస్నాన నిరంతరాగత జనానీకక్రమాసన్నకున్
జయజాగ్ర జ్జలపక్షిపక్షపటలీ సంఛన్నకుం బెన్నకున్. 141

వ. అనంతరంబ తత్తటినీతటంబున. 142

సీ. వెన్నెల జరియిడ్డవెండి తీఁగెలఁ బోలు
యజ్ఞోపవీతంబు లఱుత నమరఁ
గన్నె చెంగల్వపూవన్నె మించిన నీరు
కావిదోవతికట్టు కటిఁ దలిర్ప
వెలిదమ్మివిరిమీఁది యెలదేఁటిగతి గంగ
మట్టిపై వేలిమిబొట్టు దనర
నీలకందుకముపైఁ గీలించు ముత్యాల
విధమున సిగఁ గమ్మవిరులు మెఱయ
తే. లలిత నవయౌవ నారంభకలిత మైన
మేనిమెఱుఁగులు మెఱుఁగులమెఱుఁగుఁ దెగడఁ
జంద్రధరుకృప బ్రహ్మవర్చసము గన్న
మారుఁడన నొప్పు విప్రకుమారుఁ గాంచె. 143

ఉ. అత్తఱి భూసురోత్తమునకై తనచిత్తసరోరుహాంబు మీఁ
దెత్తినమాత్రలోనఁ దెరలెత్త, వియోగ మహాంబురాశి చే
చెత్తఁ, దలంపుకీలు తలలెత్త వెసం దలపోఁత లించుమి
న్నెత్త, మనోజుఁ డింతి నడు గెత్తఁగనీని ప్రతిజ్ఞ [illegible]. 144

క. ఆరామ, కాముశలనం
బోరాములు వకుచుఁ, దనదు పోరామి చెలిఁ

గారాముతోడ నాతని
నారామంబునకుఁ దేఁ బ్రియంబునఁ బనిచెన్. 145

ఉ. పంచిన, భూసురోత్తముని పాలికి నేఁగి, ప్రియంబు చెప్పి రా
వించి, నవీన చంచదరవిందమరందవిలోల చంచరీ
కాంచిత దీర్ఘికాతటవనాంతరసీమ వసింపఁజేసి, తా
నించిన వేడ్కతో మగుడ నేఁగి కుమారికతోడ నిట్లనున్. 146

ఉ. భూసురవర్యుఁ దెచ్చితి, నపూర్వ వనాంత లతాంతశయ్యకుఁ
భాసురరూపసంపదల బ్రాఁతిగ నాతని భావసంభవుం
బ్రాసునఁ దూన్పవచ్చు, ననురాగరసాంబుధి నోలలాడు, నీ
చేసినభాగ్య మెవ్వరును జేయరు తోయజపత్త్రలోచనా. 147

క. అని యాసీమంతిని మం
తనమున నుపకాంతు నుపవనంబునకై తె
చ్చినవార్త విన్నవించిన
విని కౌఁగిటఁజేర్చి గారవించెం బ్రీతిన్. 148

క. అంతటిలోపల నపరది
గంతమునకు భానుమంతుఁ డరుగుటయుఁ బటు
ధ్వాంత మనంతంబై హరి
దంతర వియదంతరముల నంతటఁ బర్వెన్. 149

శా. ఆలో, నీలవినీలకుంతల విలోలాళీంద్ర సాంద్రప్రభా
భీళాకార మహాంధకారము విజృంభింపంగఁ, బ్రాణేశు ని
ద్రాలోలాత్మునిఁగా నెఱింగి, విలసత్సౌధంబుపై డిగ్గి, నా
లీలారామములోనికిం జనియె నాళీవంచనప్రౌఢియై. 150

క. అటమున్న పన్నగేంద్ర
స్ఫుటదంష్ట్రాదిష్టుఁ డగుచు భూసురవరుఁ డ
చ్చట మృతుఁ డై పడియుండఁగఁ
గుటిలాలక యిట్టు లనియెఁ గుందుచు నల్లన్. 151

చ. ఇలువడి వీటఁబుచ్చి, హృదయయేశ్వరునిం గనుఁద్రాామి, బోటులం
దలఁపక, కన్నతండ్రికినిఁ దల్లికి నాడిక దెచ్చి, చీఁకటిఁ
వలపులరాజుమాయఁ బడి వచ్చినదానికి నింత పెద్దయే!
వలనుగ బ్రహ్మము న్నొసల వ్రాసినవ్రాతఫలంబు దప్పునే? 152

క. పుటపుటనగు చనుఁగవపై
బోటపాటఁ గన్నీరు దొరఁగఁ బురపురఁ బొక్కం
దటతట గుండియ లదరఁగఁ
గటకట యిది నోముఫలముగా కేమనుచున్. 153

ఉ. ఓరువరానివంతఁ దలయూఁచును. నుస్సని వెచ్చ నూర్చు. మీఁ
దారయలేనికూర్మి యిటు లయ్యెఁగదే! యని పొక్కు; వెంట నె
వ్వారలు వత్తురో యనుచు వచ్చినమార్గము చూచి, వానియా
కారము మెచ్చి మైమఱచి కౌఁగిటఁజేర్చు మనోజవేదనన్. 154

వ. అప్పు డక్కళేబరంబు భూతావిష్టం బగుటయు. 155

క క్షోణీసురవరు బొందికిఁ
బ్రాణము వచ్చెనని యిచ్చ భావించుచు, న
య్యేణీలోచన సుమనో
బాణపరాధీన హృదయపంకజ యగుచున్. 156

క. కరతాడన గళరవములఁ
బరిరంభణ చుంబనములఁ బైఁబడి పెనఁగఁ
ధరణీసురశవభూతము
కరిగమనం బట్టి ముక్కు గఱచె మొదలికిన్. 157

ఆ. ముక్కు శవమునోరఁ జిక్కినమాత్రాన
విడిచి భూత మపుడు వెడలిపోయెఁ
దెగువతోడ మొదలిమగఁ డున్నచోటికి
నాతి వచ్చెఁ జుప్పనాతివలెను 158

వ. చని తదీయగేహదేహళీప్రదేశంబున నిలిచి, పరిచారికల మేలుకొలిపి. 159

ఆ. ముక్కులేని బోసిమొగమున వెడలెడి
నిడుద యార్పుతోడ నెత్తు రొలుకఁ
జెలువ మగనిదిక్కు చేసన్నఁ జూపి యీ
కొఱఁతనుఱుకు ముక్కుఁ గోసె ననియె. 160

క. ఇల్లటపు టల్లుఁ డని తన
యుల్లమురా మెలఁగదనుచు, నూరక నాకీ
కల్ల యొనరించె నని, తా
నల్లనఁ బల్కుటయు వార లాక్రోశింపన్. 161

క. విని, భూవరుఁ డచ్చోటికిఁ
జని, యంతయుఁ జూచి రోషసంతప్తుం డై
తనయల్లునిఁ గని నిర్దయ
జనులకు నొప్పించి, యపుడు చంపఁగఁ బనిచెన్. 162

ఉ. వారలు నాసుధర్మవిభు వధ్యశిలాస్థితుఁ జేసి, ఘోరదు
ర్వార కుఠారధార ననివారణ వ్రేయఁగ నుత్సహించినం
జేరువ నున్న దివ్యముని చిత్తమునందుఁ గృపావిధేయుఁ డై
నేరము లేక చంపఁ దగునే! యిది ధర్మము గాదు నావుడున్. 163

వ. ఆరెకు లతిత్వరితగతిం జనుదెంచి. 164

క. ఆమాట విన్నవించిన
భూమీశ్వరుఁ డచటి కరిగి, పుత్త్రికధార్త్ర్యం
బామూలచూడముగఁ దన
కాముని స్పష్టముగఁ దెల్ప నంతయుఁ దెలిసెన్. 165

చ. తెలిసి మహోగ్రుఁడై కినుకదేఱెడు చూపులఁ గూఁతుఁ జూచి, యీ
కులటకు శిక్ష యెయ్యదియొకో! యనుచుం దలపోసి, యాఁడువా

రల వధియింపఁ గాదని పురంబున నుండఁగనీక తోలి, యా
వల నొకచోట నలుని వివాహముచేసె రమాసమగ్రతన్. 166

క. కావున వనితాజనములు
భూవల్లభ యెల్ల పాపములకును మూలం
బేవిధమున మగవారలు
పావనవర్తనులె కాక పాపాత్ములే ? 167

వ. అని కీరంబు సరసప్రకారంబున నుచితకథావిన్యాసం బుపన్యసించి
యనంతరంబ. 168

ఆ. కడుఁ బ్రశంసచేసెఁ గర్పూరమంజరి
శారికాకథాప్రసంగమహిమ
రాజశేఖరుండు రాజకీరముకథా
ప్రౌఢి యొప్ప ననుచుఁ బ్రస్తుతించె. 169

చ. అని, ఘనసారపేటిక నయంబు మెయిం గథ విన్నవించి, యో
జనవర ! యిందు నెవ్వరిదెసన్ దురితం ! బిది చిత్తగింపుమా
యనుటయు; సాహసాంక వసుధాధిపచంద్రముఁ డల్లి నవ్వుచున్
వనితల కేమిరాదు మగవారు దురాత్ములుకాక ! నాపుడున్. 170

వ. విని. 171

సీ. చిన్నారిపొన్నారి చెక్కుటద్దములపైఁ
జిఱునవ్వు మొలకలు చెంగలింప
మదనునితూపుల మఱపించుచూపుల
దెఱఁగుల మెఱుఁగులు తుఱఁగలింప
మొగమున కెగిరెడు బిగిచన్నుఁగవమీఁద
మణిహారరోచులు మాఱుమలయఁ
గమ్మని నెత్తావిగ్రమ్ము క్రొమ్ముడినుండి
యరవిరి విరవాదివిరులు దొరఁగ

తే. సాంధ్యరాగంబు వెడలిన చంద్రరేఖ
యొసకమునఁ బోల్పు మునుముట్ట ముసుఁగుపుచ్చి
యాకళావతి మృదుల పర్యంకతలము
నందుఁ గూర్చుండఁబడి, సాహసాంకుఁ జూచి. 172

క. ఘనసారకరండమునకు
ఘన సార స్వరము నిచ్చి కథ చెప్పింపం
బనుపడిననేర్పు గలిగియు
జనవర ! యిటు తప్పఁజెప్పఁ జనునే నీకున్. 173

చ. పురుషుఁడు పాపకర్మ్ముఁ డనఁబోలదు కాంతయె కాని, కాంతకుం
బురుషుడు కీడుచేసినను భూషణ. మేనుఁగుఁ బల్లువట్టిచూ
తురె? మగవాఁడు చేసె నని తొయ్యలియున్ దురితంబు చేసినం
బరమ పతివ్రతాచరణభంగము గాదె, నరేంద్రశేఖరా ! 174

క. అని వనితామణి యుత్తర
మొనరంగా నిచ్చి, భూవరోత్తముచిత్తం
బనురాగంబున మల్లడి
గొనఁ, గ్రమ్మఱ ముసుఁగు వెట్టుకొని శయనించెన్. 175

ఉ. లాలిత లోచనోత్సవ విలాసవినూతనభద్ర, దానవి
ద్యాలలితప్రసంగనవదత్తక, మోహనశిల్పచాతురీ
ఖేలనకూచిమార, సుముఖీజనరంజన, కామకేళిపాం
చాల, సముల్లసత్కుసుమసాయకశాస్త్రకళావిశారదా ! 176

క. ధీరోదాత్తరఘూత్తమ
ధీరోద్ధతపరశురామ, ధీరలలితలీ
లారత్నాకరనాయక
ధీరమహాశాంతమాలతీసుదతీశా ! 177

స్రగ్విణి.

నిత్యభోగక్రియా నిర్జరాధీశ్వరా
సత్యభాషాహరిశ్చంద్రభూమీశ్వరా
చైత్యసత్కాంతినక్షత్రలోకేశ్వరా
భృత్యభావోదయప్రీతిలక్ష్మీశ్వరా. 178

గద్యము. ఇది శ్రీమదఖిలకవిమిత్ర పెద్దయయన్నయామాత్యపుత్ర శారదాదయావిధేయ జక్కయనామధేయప్రణీతంబైన విక్రమార్కచరిత్రంబను మహాకావ్యంబునందు సప్తమాశ్వాసము.

శ్రీ ర స్తు

# విక్రమార్క చరిత్రము

## అ ష్ట మా శ్వా స ము

శ్రీ మహిళాంచితనయనా
శ్రీమద్వాణీవిలాసజిహ్వాగ్రతలా
క్ష్మామహితదక్షిణభుజా
సీమాద్రివిహారకీర్తి సిద్ధనమంత్రీ! 1

మ. ప్రతిపక్ష క్షితిపాల ఫాలతలవర్ణ ధ్వంసనారంభ జృం
భితనిస్త్రింశుఁడు విక్రమార్కుఁడు గుణాభిజ్ఞుండు దేకోవిని
ర్జితదీప్తార్కుఁడు కాంతిసోముఁడు సుఖక్రీడా కలాపైకమం
డితుఁడై, మూఁడవమాట యత్తరుణి నాడింపంగ నుద్యుక్తుఁడై. 2

ఉ. చారుసువర్ణ పూర కలశంబునకుం దనమంత్రవిద్యచేఁ
గోరి సచేతనత్వమును గూర్చి, యపూర్వకళా మహోదర
శ్రీరుచి మీఱ నొక్కకథ చెప్పఁగదే! యని యానతిచ్చినం
గూరిమితోడ నాకనకకుంభము సంభ్రమ మొప్ప నిట్లనున్. 3

## సువర్ణకలశముచే విక్రమార్కుఁడు చెప్పించిన పద్మావత్యాదుల కథలు

శా. శృంగారాది రసప్రసంగములుగాఁ జెప్పంగ నేర్తుం గథల్
సాంగోపాంగము గాఁగ, నొక్కకథ సువ్యక్తంబుగా నన్వయిం
పంగాఁ జెప్పెదఁ, జిత్తగింపు మని చెప్పం జొచ్చె భూపాలుతో
సంగోత్పాదక వాగ్విశేష రచనాచాతుర్య మేపారఁగన్. 4

సీ. మాణిక్యసుందర మహనీయకందర
భరిత బంధురవింధ్యగిరి సమీప
మున, వివేకనిధాన మను పట్టణమునందు
శ్రుతవర్మ యను మహాక్షోణినాయ

కునకుఁ బద్మావతి యనఁగ, గుణావతి
యనఁగ, లీలావతి యనఁగఁ గలరు
ముగురు గూఁతులు; జగన్మోహనాకార ల
నంగశాస్త్రవిదగ్ధ లతివినీల
తే. కుటిలకుంతల ల్మదకుంభి కుంభయుగళ
గురుకుచలు, వారిఁ దగినట్టివరుల కొసఁగి
వరుస మూఁడూళ్ళ నిలిపె నావసుమతీశుఁ
డంత నాపురి కొకపరిహాసకుండు. 5

ఉ. హారివరాంగనాజనవిహారి విదూషకచక్రవర్తి, సం
సారసుఖైకసార ఘనసార పటీర విలిప్త మోహనా
కారుఁ, డనూన కాముకశిఖామణి పుష్పకరండకుండు నాఁ
జారుఁ డొకండు వచ్చె సరసస్థితి రెండవమారుఁడో యనన్. 6

సీ. కొదమచందురునిలోఁ గొదమ కైవడి మించు
నటియించు సన్నపునాభి వెట్టి
ములుపడి ప్రావడ్డ వలరాజుడాగుల
మీఁద గందపుఁబూఁత మేళవించి
తేఁటిఱెక్కలకప్పుఁ దెగడెడు కొప్పున
బాగుమీఱఁగ వన్నెపాగ చుట్టి
తనరుజవ్వాదివాసనలచేఁ జెన్నొందు
చిన్ని గేదఁగిఱేకు చెంపఁ జెరివి
తే. కప్పురపు సోనపల్కులఁ గమ్మఁదావి
గుబులుకొనుచున్న విడియంబుపొబగు తోడ
రమణఁ జూపట్టు పుష్పకరండకుండు
హరుని కనుదృష్టి దాఁకనిమరుఁ డనంగ. 7

ఉ. వచ్చి పురంబువాకిట రువారపుఁగొడెతనంబుతోడఁ గ
న్నిచ్చకువచ్చు చేడియల నెచ్చరికించుచు, ధూర్తకోటితో
మచ్చరికించుచున్, వెకలిమాటలు మాయపుఁగూచిమారపుం
బచ్చలు చూపుచున్, సెలవిపాఱఁగ నవ్వుచుఁ గేఁకరించుచున్. 8

క. కన్నుండఁగఁ గనుపాపను
గొన్నవిధంబునను, సతులఁ గూడకయును దాఁ
గన్నమిడి మనోధనములు
గ్రన్ననఁ గొనిపోవు, కన్నకాఁడుం బోలెన్ 9

వ. ఇట్లు వివేకవిధానం బను పట్టణంబునఁ బుష్పకరండకుండు బహుప్రకారంబులగు నిచ్ఛావిహారంబులం జరియించుచుండ, నొక్కనాఁడు కామశాస్త్రకళావేదులైన విట విదూషక పీఠమర్దక నాగరకులతోడ బహువిధ స్వైరిణీగణ ప్రసంగంబులం బ్రొద్దుపుచ్చుచున్న సమయంబున, మీ దేశంబునఁ గ్రొత్తలగు వార్త లెయ్యవి? యెవ్వరెవ్వరివలన నే మేమి చోద్యంబులు గల? వెఱింగింపుఁ డనిన వార లిట్లనిరి. 10

ఆ. ఇప్పురంబుచెంత నొప్పు మహాఘోష
పట్టణమున, జారపతులపాలి
భాగ్యలక్ష్మి యనఁగఁ బద్మావతీ కాంత
వినుతి కెక్కు మూర్తివిలసనముల. 11

చ. తొలకరివాన కాలమునఁ దోఁచు మెఱుంగుపసిండినీటు తే
టలఁ బలుమాఱుఁ బుల్కడిగి డాఁచిన మన్మథమోహనాస్త్రమో,
వలపులవన్నెలం దొలఁచి వారిజసంభవుఁ డాఁడురూపుగా
నలవడఁ జేసెనో యనఁగ, నాకమలానన యొప్పు నెంతయున్. 12

ఆ. కొలను చొచ్చి పుచ్చుకొని తన్ను మదనుండు
రూపుసేయ ముల్లుసూపెఁ గాక
లేకయున్న మీన మాకాంతచూపుల
వలల కుఱికి వఱుతఁ గలయ కున్నె. 13

ఆ. రమణ రాజమండలము నట్టనడుమఁ జూ
పట్టఁ బట్టి మిన్నుముట్టెఁగాక
గాకయున్న హరిణ మాకంజముఖచూపుఁ
దూపు లడర నడవిఁ దూఱకున్నె. 14

చ. సరసవి నూత్న రత్నరుచిజాలముచేఁ దులకించుచున్న యా
గురుకుచచక్రొమ్మెలుంగుఁజనుగుబ్బలతో సరిసేయవచ్చునే,
తొరలి హిరణ్యకుంభముల దొడ్డతనంబులు చెప్పనేటికిన్,
గురుత యదేల కల్గు గుడిగుండములం బడునట్టి వారికిన్? 15

చ. వరుఁడు ధనుర్ధరుం డయి దివానిశమున్ వెనుకం జరింపఁగా
వెరవున మోసపుచ్చి, తనవేడుకవచ్చినయట్టి వారితో
సరస రతిప్రసంగములు సల్పఁగ నేర్చుఁ, దదీయ నైపుణ
స్ఫురణముచంద మెందును నపూర్వము! చూడఁగఁ బొమ్మ గ్రిక్కినన్. 16

వ. అనుటయు. 17

చ చెలఁగి కటారిబిత్తరము చిమ్ము విడారపునవ్వు నవ్వు, మీ
సలు వడిపెట్టు నూరక, 'మజా' యనుఁ 'దన్నన'యంచుఁ బాడుఁ గ
న్నులు వెసఁ ద్రిప్పుఁ గొప్పువయి నున్నగ దువ్వు, బళాలు వెట్టు, మూఁ
పులు పలుమాఱుఁ జూచుకొనుఁ బుష్పకరండకుఁ డాత్మ నుబ్బుచున్. 18

## పద్మావతి కథ

ఉ. క్రన్నన వారి వీడుకొని, కన్నుల ప్రొక్కి, వెసం దలారి యై
క్రొన్ననవింటఁ దేఁటిగటికోల యమర్చి మరుండు వెంట రాఁ
మున్నుగ నెమ్మనంబు తన ముందటిచక్కని ద్రోవవెట్టఁగాఁ,
గన్నియయూరి కేఁగెఁ దమకంబునఁ బుష్పకరండకుం డొగిన్. 19

వ. అరిగి మహాఘోషపురవరోపాంతంబున, శశికాంత శిలాతలంబునఁ బథి
శ్రమం బార్చుకొని. తదవసరోచితాలంకృతుండై యన్నగరంబున కరిగి,
మనఃపద్మ సద్మయగు నప్పద్మగంధిమందిరంబు పౌరజనంబులవలన నెఱింగి,
మందమందగతిం జని తన్ని కేతనంబు ప్రవేశించి. 20

ఉ. ప్రాకట హేమరత్నమయ పంజరపీఠికలన్ శుకంబు ల
వ్యాకులలీలతో రతిరహస్యవికాస కళావిలాస కో
క్కోకము లర్థితోఁ జదువఁ గూరిమితో వినుచున్, సురూపరే

సీ. రంజిత మణిసాలభంజికలకుఁ దన
భాసురాకృతి మేలుబంతి గాఁగ
రత్నపంజర కీరరాజికిఁ దనవాక్య
సమితి గురూపదేశంబు గాఁగఁ
గమనీయ కలహంసగతులకుఁ దనగతి
యొఱపులు గఱపెడి యొజ్జ గాఁగ
ఘనసారగంధవాహమునకుఁ దనయూర్పుఁ
దనిగాలి నెయ్యంపుదాది గాఁగఁ
తే. దివిరి నడయాడుచుండు పూఁదీవె యనఁగ
నేకతమ నగరం జరియించుచున్న
కంబుకంఠిఁ బద్మావతీకాంతఁ గాంచెఁ
బెన్నిధానంబు గాంచినపేద వోలె. 22

తే. కన్న మనమును దనియ నక్కాంతఁ జూచి
యింత యొయ్యారమగు సతి యెందుఁగలదె !
యనుచుఁ, బ్రియమును గంపంబు ననఁగి పెనఁగ
నల్లఁ జేరంగ వచ్చిన, యతనిఁ జూచి. 23

మ. సుకుమారుం డగు మారుఁడో, కళలచే సొంపారు పాంచాలుఁడో,
యకలంకుం డగు కూచిమారుఁడొ యితం, డంచుం బ్రశంసించుచుం
బ్రకటస్నేహ మెలర్ప నాతనిపయిం బద్మావతీకాంత వా
లికక్రొవ్వాఁడి మెఱుంగుఁజూపుల నివాళించెం గువాళించుచున్. 24

క. కనుఁగొనినమాత్ర నొండొరు
మనములు నొడఁబడిన వారి మఱియొక్కడకుం
జనకుండ నడ్డపెట్టఁగ
మనసిజుఁ డను కోలుకాఁడు మాటికిఁ దఱిమెన్. 25

క. చూపుల వక్కాణంబున
నాపుష్పకరంపకాఖ్యుఁ డరుదెంచిన మా

యోపాయపుఁగార్యస్థితి
దీపించినఁ బరిణమించి తిలకించి మదిన్. 26

ఉ. ఈసుకుమారతావిభవ, మీదరహాసముఖారవింద, మీ
భాసురమూర్తి, యీలసదపార కృపారసనేత్ర కాంతి వి
న్యాసము లెందుఁ గంటిమె? ప్రియంవదుఁ డీతనియందె కాక; చేఁ
జేసినభాగ్య మెవ్వరునుఁ జేయరువో! యితఁ డేఁగుదెంచుటన్. 27

తే. అనుచుఁ గొనియాడి తిలకించి యావధూటి
చిన్ని లేనవ్వు చెక్కులఁ జిరువాఱ
సిగ్గు నెగ్గించు మధురోక్తి చెవులఁ జిలికి
యెలమి మజ్జన భోజనాదులను దనిపి. 28

వ. తదనంతరంబ వసంతుం డను నిజసఖుం బిలిపించి చౌర్యగతికళావిధే
యంబు లగు మాయోపాయంబు లుపదేశించిన, వాఁడును దదుక్తప్రకా
రంబునఁ బుష్పకరండకుం బురోపకంఠోపవనాంతరంబునకుం దోకొని
యాత్మీయ పరిదాన సంకేతలతానికేతనంబున నునిచికొని సముచితసల్లా
పంబు లొనరించుచున్నంత నిక్కడ. 29

క. మగఁ డింటికిఁ జనుదెంచిన
మొగమోటము వట్టి మోహమున జిత్తములో
నిగురొత్త, మెఱుఁగుఁజూపులఁ
జికురాకుంబోఁడి పూజచేసె న్నగుచున్. 30

ఉ. ఆయన మీఁదెఱుంగక, ప్రియంబు నిజం బని నమ్మి మోహముం
జేయుట చూచి; నావలలఁ జిక్కె నితం డని కౌఁగిలించి, సౌ
ఖ్యాయత కంఠరావమధురాధరపాన నఖాంకన క్రియో
పాయములందు మైమఱవఁ బన్నె విలోచన యీలవెట్టుచున్. 31

సీ. మకరందముల్గ్రోలు మగలకుఁ జవిచూపు
మధుకరమదవతీమణుల యొప్పు

ఫలరసంబులు గ్రోల్చి పతుల నిక్కకుఁ బిల్చి
కొనిపోవు కీరకామినుల బెడఁగు
బిసములఁ దనియించుప్రియులతో విహరించి
యలరు రాయంచతొయ్యలుల చెలువుఁ
బల్లవంబులు దెచ్చి ప్రాణేశ్వరుల కిచ్చి
చెలఁగెడు కోకిల స్త్రీలమురువు
తే. నెలమిఁ గొనియాడి, యాత్మేశునియ్యకొల్పి
యతఁడు నతనుండుఁ గార్ముకహస్తులగుచు
దోడఁ జనుదేర, జారనాథుఁడు వసించు
నుపవనాంతరభూమికి నువిద చనియె. 32

క. చని యాదంపతు లాత్మల
ననురాగరసంబు నిండి యలువులువాఱన్
వనకేలీ తత్పరులై
వినుతవిహారములఁ దగిలి విహరించుతఱిన్. 33

క. పదములు తొట్రుపడంగా
వదనంబున లేనిదప్పి వాతెఱ యెండం,
గదియఁగ వచ్చి వసంతుఁడు
హృదయమున భయంబుదోఁప నిట్లని పలికెన్. 34

చ. కడు వెరవేది నేఁ, బ్రథమగర్భవతిన్ సతిఁ బుట్టినింటికిం
దొడుకొనివచ్చుచో; నిచట దుస్సహమైన ప్రసూతివేదనం
బడియెడు, నియ్యెడం దగినబాసట లే; దటుగాన నింక నీ
పడఁతుకచిత్త మాపడఁతిభాగ్యము, మాటలు వేయునేటికిన్. 35

వ. అనుటయు వానిదీనాలాపంబులకు భ్రమసి పద్మావతీరమణుండు పద్మా
వతిం జూచి యిట్లనియె. 36

క. జలజేక్షణ యెవ్వరికిం
గలసంసారము నుపేక్ష గావించుట గా,

దలసత్వ ముడిగి చను మని
పలికిన, నది చనియె జారపతి యున్నెడకున్. 7

క. చని సరసవచనరచనలఁ
జనవులఁ బరిరంభణాదిసంభావనలన్
మనసు గరఁగించి, పులకలు
తనువునఁ బొదలించి, రతులఁ దగిలించి తగన్ 38

సీ. త్రుళ్ళుమింతలు వెట్టు తొడలదీప్తులతోన
చనుదోయిమించులు చౌకళింప
రాణించు నందెలరవళి తోడనె కూడ
మొలనూలి మువ్వలమ్రోఁత నిగుడఁ
గటితటంబునఁ దోఁచు కదలు పెక్కువతోడఁ
గర్ణభూషణములకదలు మెఱయఁ
గడలేని సుఖములఁ గరఁగిన మదితోడఁ
జిత్రకస్ఫూర్తి లేఁజెమట గరఁగ
తే. వదలుక్రొమ్ముడి యలకులవానఁ గురియ
హారమణిదీప్తి యుయ్యాలలాడుచుండ
మగువ పుంభావలీలల మాఱుమగనిఁ
గంతుసామ్రాజ్యలక్ష్మికిఁ గర్తఁజేసె. 39

వ. ఆ పుష్పకరండకుండును సంతోషిత స్వాంతుండై. 40

చ. పురిఁ బురిఁ దప్పకుండ, మొలపూసలు ద్రెవ్విననాఁట నుండియుం
దిరిగితిఁ బెక్కుభూములు సఖీ! రతిసౌఖ్యరసప్రసంగవి
స్ఫురణల తారతమ్యములు చూచితిఁ గాని, భవత్సమాన లే
తరుణులుఁ గారు భావభవతంత్ర కళాకలనా చమత్కృతిన్. 41

వ. అనవుడుఁ బద్మావతి మదీయచాతుర్యంబునకు నాశ్చర్యంబందనేల యని
యిట్లనియె. 42

## గుణవతి కథ

క. చేరువ ధర్మస్థల మను
నూర, గుణావతి యనంగ నొకయుగ్మలి చె
న్నారు, మనోహర మగుశృం
గారరసం బాఁడురూపు గైకొన్నక్రియన్. 43

సీ. చందురునెఱ వరజాఱఁజేయుట గాక
నెత్తమ్మిమీఁద దండెత్తఁ జూచుఁ
బసిఁడిసలాకపైఁ బగలుచాటుట గాక
తొలకరిమెఱుఁగులఁ దొడరఁజూచుఁ
గరికుంభములమీఁదఁ గాలుద్రవ్వుట గాక
జక్కవకవతోడ [1]వక్కరించు
మగమీలతో మగమాటలాడుట గాక
పువ్వుఁదూవులకును బొమ్మవెట్టు
ఆ నసఁగ మోముఁ దనువుఁ జనుదోయి కనుదోయి
కనుఁగొనంగ నొప్పుఁ గాముప్రోది
దీమమగు గుణావతీవధూమణికిని
సరి యనంగ మగువ జగతి గలదె?

క. వలపులవదనిక, చిలుకల
కొలికి, రువారంపుఁగలికిగుబ్బల నవలా
పులుగడిగిన ముత్యముసిరి
పులకండపుఁబొమ్మ యనఁగఁ బొలఁతుక యొప్పున్. 45

చ. కలువలు గండుమీలుఁ దొలుకారుమెఱుంగులు నిడురామికిం
జెలువుగ నేపదార్థ మెనసేయుదునో సతికన్నుదోయికిం?
దలఁచి పయోజసంభవుఁడు తామరలం బ్రతిసేయఁబోలు; నాఁ
బొలుపుగ నెల్లవారుఁ దమపుట్టినయిండ్లను బెద్దసేయరే? 46

క. అట్టి గుణావతి, తనపతి
కట్టెదురను మాఱుమగనిఁ గవయఁగ నేర్చున్.

---

1. డీకొను.

నెట్టుకొని యాఁడువారల
దిట్టతనం బెఱుఁగ బ్రహ్మదేవుని వశమే? 47

చ. అనుచుఁ దదీయనైపుణగుణాళి విరాళిగొనంగఁ జెప్పఁగా
విని, యిటువంటి వెన్నఁడును విన్నది కన్నది లేదు మున్ను; చా
లును గణుతింప *(గోనొఱవలో నిజమో తెలియంగఁ జెప్పుమా
యనఁగ, లతాంగి నీయడుగులాన నిజం బని నమ్మఁ బల్కినన్. 48

వ. తత్ప్రతీపదర్శినీ దర్శనతత్పరుండై తత్పురంబునకుం జని. 49

క. వన్నె మెఱయంగ నాసతి
యున్నగృహం బప్పు డరసి, యుచితస్థితితో
విన్ననువునఁ జని; యచ్చో
సొన్నాటంకంబువోలు సుదతిని గాంచెన్. 50

తే. మోవి పవడంబుఁ దమలోన ముడివడంగ
నడుము బయలును దమలోనఁదడఁబడంగ
మేను మెఱుఁగును దమలోన మేళవింపఁ
దెఱవ యొయ్యారముగ వానిదిక్కు చూచె. 51

తే. కందు వోరయని పున్నమచందురుండొ
శివునికనుఁబాటు దాఁకని చిత్తభవుఁడొ
కాక, నరమాత్రుఁ డేవీఁడు నాకుఁ జూడ
ననుచుఁదలయూచి కొనియాడె వనజగంధి. 52

క. వేడుకమై నపు డిరుమైఁ
గాడంగఁ దొణంగె నతనిఁ, గామునిశరముల్
చేడియచూపులుఁ దమలో
సూడించె ననంగ నొక్కసూటిం బెలుచన్. 53

క. మనసిజుఁ డిద్దఱకును గుం
టెనకానితనంబు చేసెడిం గనుఁగొన నాఁ,

---

*నీ యొఱపులో నిజమో. అని పాఠము (?)

జనవులు మాటలయనువులు
దనువునఁ బులకలును గలుగఁ దత్తఱపెట్టెన్. 54

క. చెన్నారు వచనరచనలు
మున్నాడం గనిన వలవు మొలకల తెఱఁగుల్
మున్నాడి మనసులతో
గ్రన్నన పీడ్కొనిరి సిగ్గుఁ గన్నెటికంబున్. 55

చ. పులకిత చిత్రరూపముల పోలిక నిద్దఱుఁ గొంతప్రొద్దు చూ
పులఁ బరిణామముల్ దెలిసి, పుష్పకరండకురాక యంతయుం
దెలిసి, గుణావతీలలన దిగ్గన మజ్జనభోజనాదిపూ
జలఁ బరితుష్టుఁ జేసి, తనచల్లనిమాటల గారవించుచున్. 56

సీ. అరవిరి విరవాది బిరుదపెండెములతో
సోలు కోయిలమూఁకటీల తోడఁ
బూఁదేనెగందాన బ్రుంగుడుపడి యున్న
గండుఁదుమ్మెదలేఁకగములతోడఁ
బరువంపు జాజిపక్కెరలతోఁ జెలరేఁగు
చిలుకగుజ్జుఁబౌఁజుసిరులతోడ
గుబగుబ వాసన గుబులుకో ముంగల
నేఁగెడి చలిగాలి వేగుతోడ
తే. హరిహరబ్రహ్మగాఢమానాపహారి
త్రిజగద్ధనుర్విహారపరీక్షకుండు
కమ్మవిలుకాఁడు మెఱమ, శృంగారవనము
లోని గురివెందపొదక్రింద వాని నునిచి. 57

ఉ. ఇంటికిఁ వచ్చునంత మఱఁ డింటికి వచ్చిన, నాథ ! నీవు న
న్నొంటిడి, రాక యింతదడ వుండఁగ గారణమేమి ? యింక న
న్నంటిన నీకు నీ వెఱుఁగు దంచు నొకానొక తప్పవెట్టి ; వె
న్వెంట నతఁడు రాఁ జనియె వెండియుఁ దొయ్యలి పువ్వుఁదోఁటకున్. 58

చ. చనునెడఁ, దాని మన్మథపిశాచము సోఁకిన నొచ్చెనంచుఁ దూ
యని పలుమాఱుఁ దూపొడిచి, యల్లనఁ బుప్పొడి రక్షవెట్టి, క్ర
మ్మన నధరామృతంపుబలుమం దొకయించుక యిచ్చిమించులం
బొనరినచూపులం బడిసిపో నటువైచుచుఁ గౌఁగిలించుచున్. 59

చ. కనదురుకాంతి కాంత శశికాంత శిలాతల కుట్టిమస్థలిన్
వినుత లతావనీజ సుమవేదికపై, శ్రమమార్ప దానునుం
దనమగఁడుం గళాకుశలతావశతం దదుపాంతవిస్ఫుర
ద్ఘనవకుళావనీరుహశిఖామణినీడ సుఖానురక్తయై 60

వ. కొంతదడవుండి, యాపొంతం గుసుమవిసరభరితం బగుచుఁ జెన్నారు
చున్న సురపొన్నఁ గన్నారం గనుంగొని, యిందులపువ్వులకుం గల పరి
మళం బెందులపువ్వులకుఁ గలదని మునుముట్ట మాయవెట్టం గడకట్టుచేసి
కొని, యప్పటికిఁగదలి యాసురపొన్నక్రిందికిం జనుదెంచి యిట్లనియె. 61

సీ. సేమంతిచవికెలఁ జెలరేఁగి చిలుకలు
మదనశాస్త్రంబులు చదువుచుండఁ
గడిమికూటములఁ బికమ్ము లనంగ నే
పాళప్రబంధంబు లాలపింప
జాజి యోవరులలోఁ జంచరీకంబులు
వలరాజు బిరుదాంకములు పఠింప
సంపెంగ నాటకశాలలఁ గలహంస
లతనుగీతంబుల నాడుచుండ
తే. వేడుకలతోడఁ జూడంగ వినఁగఁ గంటి
మిట్టి వనములు గలవె యేపట్టణముల?
ననుచు మగనిమనంబును నలరఁజేయు
కరణి, నుపకాంతు మాటల గారవించె. 62

తే. కురులకప్పున నెలదేఁటియిరులు బెరసి
మరులుగొలుపంగ, మరుచేతియురులు దగిలి

కన్నుగానక, మాఱుమగండు మగఁడు
బలుపుఁజీఁకటి దప్పంగఁ బడి విసువఁగ. 63

సీ. తరుణి యశోకంబు తన్ను నం దెలఁ బ్రోఁతఁ
గాంచీవిరావంబు గడ కొదుంగ
లలితాంగి తిలకించి తిలకంబుఁ గనుఁగొనుఁ
గనుదోయి మెఱుఁగు లాకసము గప్పఁ
బొలఁతి పుక్కిటికల్లు పొగడపై నుమియ లేఁ
జెక్కుల చిఱునవ్వు చెక్కులొత్తఁ
గలకంఠి యెలఁ గ్రోవిఁ గౌఁగిటిలోఁ జేర్చ
గంకణ ఝణఝణత్కార ములియఁ
తే. దియ్యవిలుకాని విడివడ్డదీమ మనఁగ
నతను మోహనమంత్ర దేవత యనంగ
మగని ముందట విరహాగ్నిఁ బొగులుమాఱు
మగనిముందటఁ బ్రౌఢయై మదము కవిసి. 64

వ. ఇవ్విధంబునఁ బువ్వువిలు కాని నవ్వుఁ గ్రొవ్వుగల యలజవ్వని మగనిముందట ముద్దుగురియుచు, సరసంపువచనరచనల మనంబుకొలఁది యరసి గరువంపు వలపుసొలపులు గ్రిక్కిఱిసి పునఃపున రాలింగనంబు చేసి, యతనితో నిట్లనియె. 65

ఉ. ఈసురపొన్న యెక్కి నుతికెక్కిన కమ్మనిపువ్వు లెల్ల నేఁ
గోసెదఁ జూడుమీ! యనుచుఁ గోమలి యాతరు వెక్కి, యొక్కపూఁ
గోసి నుతించి మూర్కొనుచుఁ గుత్సితబుద్ధి నిజేశుఁ జూచి, నే
జా! సిటు లేను జూడఁ బెఱభామినితో రమయింపఁ బాడియే? 66

తే. అనుచు వలవని *వలపనికినుకతోడ
మ్రానుడిగ్గినఁ, దొయ్యలి మ్రానుపడుచు
సొలయఁగా నేల? యిచ్చోట జోటి! యన్య
కాంతఁ జూపుమ వల దింత కటికితనము. 67

*మదన క్రీడ.

క. అనుచును వెలవెలఁబాఱెడు
తనపతి మది మెచ్చ, నీవు తరువెక్కి ననుం
గనుఁగొను; మే వేఱొక పురు
షునిఁ బొందిన చంద మగునొ చూత మటంచున్. 68

చ. జిగి దొలకాఁడు తేనగవు చిమ్మెడు చూపులు మీఁదఁ జల్లుచున్
సగినల వంటి చన్నుఁగవ జక్కవపిట్టల బైలువెట్టుచో
నిగిడెడుప్రేమ మీఁ దెఱుఁగ నేరక, తా సురపొన్న యెక్కె న
మ్మగఁడిల నాఁడువారి పలుమాయలఁ గాయజుఁడైనఁ జిక్కఁడే! 69

వ. ఇవ్విధంబునఁ బువ్వుంబోఁడి పిలుపిచ్చిన నవ్వుటాలమాటల వాని ప్రమానె
క్కించి, యొక్క పువ్వుఁగోసి మూర్కొను సమయంబున, నతండు చూచు
చుండఁ గుసుమ రసవిసర లసదహంకార ఝుంకార లలిత శిలీముఖ
జ్యాటంకార సముద్దండ ప్రసవకోదండ నిర్ముక్త పుష్పశిలీముఖ ముఖానల
శిఖా సంతప్త మానసుం డగు పుష్పంధరండకుం గనుసన్న నాసన్నుం జేసి,
తన యధరామృతంబున సేదదేర్చి పరమానంద కందళిత హృదయుం
జేసి కందర్పక్రీడం దనిపి, విస్మయానంద కందళిత స్వాంతుం డగు
నతని కిట్లనియె. 70

క. నను మెచ్చెద, విధి యచ్చెరు
వన నేఁటికి? నాసుధర్మ యను నగరమునన్
జనమోహిని లీలావతి
యనుకామిని యుండు, నసుజ యగు మఱి నాకున్. 71

లీ లా వ తి క థ

తే. కమ్మని పచాఱువన్నె బంగారుకరువు
కామవిద్యా రహస్యముల్ గఱపు గురువు
సరస జనములు భ్రమపడి తిరుగు తెరువు
మెఱయు లీలావతీకాంత మేనిమురువు. 72

ఆ. అలితాంగి చూపు లల్లార్చి చూచిన
నతను మహిమచేత యతులకైనఁ
దెమలి యనుపకచ్చడము లూడిపడు నన్న
నున్నవారి నింక నెన్న నేల? 73

ఆ. అమృతరసము తేట లంగన మాటలు
మరుని చేతియురులు మగువకురులు
కప్పురంపుఁగ్రోవి కలకంఠి కెమ్మోవి
యాలతాంగిఁ బొగడ నలవి యగునె! 74

వ. ఆలీలావతి మగండునుం దాను నేకశయ్య నుండి• యుపనాయకునిం గుసుమసాయకక్రీడ నలరించు, నీ వాలలనవలని చోద్యంబులు చూడవల కేనిం జను మని పీడుకొలిప. 75

క. తనవిభుని నగవుఁజూపులఁ
గనుఁగొని, నామాట నిజమొ కల్ల యొ చెపుమా!
యనిన నది యట్ల తప్పద
యొనరఁగ నీమాయ తెరవుదో పువ్వులదో? 76

క. అనుచు వెడనగవుతోడను
మనమునఁ గడు జోద్య మంది మ్రాను దిగి, నిజాం
గనయును దానును వీటికిఁ
జనియె; విలాసినుల నమ్మఁజన దెవ్వరికిన్. 77

క. అటఁ బుష్పకరండకుఁ డె
క్కటి యరిగె గుణావతీనఖ విలిఖితలతా
స్ఫుట కక్ష కంధరాతల
నిటలతట విలాసుఁ డగుచు నెయ్యం బలరన్. 78

వ. ఇట్లు చనుచుఁ దదంగనానంగసంగర సంగత నఖాసి పథాలంకృతం బగు నిజాంగంబుఁ గనుంగొనుచుఁ దనమనంబున. 79

మ. చిగురాకు న్మనుఁగెంపు లేఁదొడవు లిచ్చెం జిత్తజుం, డిచ్చెఁ బో
నగు నీలాగు ఋణంబు వీరలక యెన్నం డబ్బె నమ్మా! యనుం
దగుఁబో వీరికి నాకు సంగమము హా నాపాలిభాగ్యం బనున్
ముగురం గూర్చిన ముండదైవమునకున్ మ్రొక్కించు 'జే జే'యనున్. 80

*న్న రమానందనుఁడైన సిగ్గువడఁడే నాపాలిభాగ్యంబుగా
నరుదేఁబోలుఁ దలంప నీతఁ డనుచుఁ హర్షించె నక్కాంతయున్. 86

క. అంతట నిద్దఱ మనసులుఁ
గంతునిపస గలసె, వింతకసమస లొలయన్
మంతనములు పెనవుల నిసి
జింతలువాఱంగ, నగపు జెప్పలు గోరఁ. 87

వ. తదనంతరం బాపుష్పకరండకుండు. 88

క. తా వచ్చినకార్యమును, గు
ణావతి పుత్తెంచినట్టి నైపుణమును లీ
లావతికిఁ జెప్ప. నదియును
భావంబున సంతసంబు బైసుకవెట్టన్. 89

ఉ. ఆసమయంబునం దపనుఁ డస్తగిరీంద్రమునందుఁ బొంద, లీ
లాసరసానుకూలగతులం దగ వానికి నాఁడురూప మె
చ్చైచ్చ సొబగారుచుండ, మణిహారవిభూషణరాజిచేతఁ గై
సేసిన, నొప్పెఁ గృత్రిమపుఁజేడియయైన ముకుందుఁడో యనన్. 90

ఉ. అప్పుడు నాథుఁ డింటికి రయంబున వచ్చిన మ్రొక్కఁబంచినం
దప్పక చూచి చీఁకటికతంబున నాఁటదిగాఁ దలంచి, యీ
యొప్పులకుప్ప యెవ్వ, రని యువ్విళులూరుచు వేఁడఁబొచ్చినం
జెప్పఁ దొణంగెఁ దొయ్యలి వశీకృతదుశ్చరితప్రవీణ యై. 91

క. ఈయంగన పద్మావతి
మాయక్క, నను దలంచి మన సూఱటగా
నీయెడకు వచ్చె ననుచును
మాయోపాయంబుగాఁగ మగనికిఁ జెప్పెఁ. 92

---

*న్న రమానందనుఁడైనఁ జిక్కువడఁడే; నాపాలిభాగ్యంబు దా
నరుదేఁబోలుఁ దలంప నీతఁ డనియన్ హర్షించె నక్కాంతయుఁ.

ఉ. నావుడు సంతసిల్లి, వదినం దగులాగుల బుజ్జగించి, లీ
లావతితోఁ "దలంపని తలం పిట వచ్చిన దీలతాంగి ప
ద్మావతి దీనికిం దగిన మజ్జన భోజన వస్త్ర గంధ మా
ల్యావలులందుఁ బొందుగఁ బ్రియంబు దలిర్పఁగఁ జేయు మిత్తఱిన్." ౯౩

వ. అని, ప్రియానులాపంబులం గలుపుకొని సరసవచనరచనలం బ్రొద్దు పుచ్చుచుం, బ్రొద్దువోయినపిదప నమ్ముద్దియ లిద్దఱుం దాను బొత్తునం గుడిచి, పులుకడిగిన పసిండిగలఁతిం బరిమళమిళితోదకంబులం జేతులు గడిగికొని వార్చి, మడుంగులం దడియొత్తులం గరంబులు దుడిచికొని, కర్పూరతాంబూలంబులుం గైకొని, సస్మితముఖారవిందులగుచు దదుచితానురంజన సమంజస మంజులానులాపోద్వృత్తవిభవ క్రీడారసాయత్త ప్రమత్తాకులచిత్తులై, రత్తఱి లీలావతి మెత్తఁదనంబు లిగురొత్త నెత్తమ్మిరేకు లేటి పయింబఱచిన మెఱుంగుతళుకులు గిఱికొనిన హంసతూలికాతల్పంబు మీఁదికిం జని ౯౪

క. మగఁడును మాఱుమగండును
దగ నిరుదెసఁ బవ్వళింపఁ, దా నడుమైయొ
ప్పుగ శయనించె ముదంబున
బిగి చన్నులనడిమి మణులపేరుం బోలెన్. ౯౫

సీ. అందిచాపుల నధరామృత మాని తా
హృదయేశుచిత్తంబు పద నెఱింగి
చిడిముడిపడి మేను చెమరించె నటు ముట్టఁ
బొమ్మని, యుపనాథు బుజ్జగించి
కర్ణాభరణ హల్లకము వోవ మీఱెడు
తెఱఁగున, గొబ్బున దీప మార్చి
యెఱుఁగనియది వోలె నింక నోయనుచును
జీఁకటిరాఁ దగఁ జెలఁగి చెలగిఁ

తే. లీలఁ జేసన్న బరణి బాగాలు గులికి
యిద్దఱకుఁ బెట్టి చుట్టి యా కిచ్చి యిచ్చి

మగనిదిక్కు మొగంబుగా మంతనంబు
మాటగా నిట్లు లనియె నమ్మాయజోటి. 96

తే. ఇంపు లొదవంగ నేను నాయింతి గూడి
యాలిమగనాట లాడుదు మాదికాల
మిప్పు డిది చూతుగాక నీవెఱుఁగునట్లు
కన్నుమూసినవిధమునఁ గదలకుండు. 97

వ. అనుచు నాథ్రదేహగమన ముద్రవెట్టి కపటనిద్రాముద్రితుం జేసి సమున్నిద్రాతిశయ రతితంత్ర స్వతంత్ర మర్మ సమరత్యుపరతులఁ బుష్పకరండకునిఁబుష్పకోదండక్రీడం దేల్చిన నతండు లీలావతీవిలాసినీ కుహనాచాతురీధురీణత్వంబునకు వెఱఁగుపడియె నంత నరుణోదయప్రకట కుక్కుటకంఠకఠోరనిర్గళ న్నిరర్గళాత్యంత భయంకరారవంబు వీతెంచిన నుదరిపడి లీలావతీకాంత నిజకాంతునికిఁ దెలిపి పద్మావతీప్రయాణం బెఱింగించి యతని చేత ననిపించి తానును గొంత దవ్వరిగి పునఃపునరాలింగనంబు చేసి మఱవకుండు మని పద్మావతీనామాభిరామ పరిహాసవిహారుండగు నప్పుష్పకరండకునిం దగులాగున వీడుకొలిపి శయ్యకుం జని యాశ్చర్యకరుండైన మగనిమనసు తదవసరోచితక్రియలం బడసె నని ప్రతాపార్కుండైన విక్రమార్కునకు సువర్ణకుంభంబు మనోహర కథావిధానంబు పరిపూర్ణంబుగా నెఱింగించి యిట్లనియె 98

క. ఏవిన్నపంబు చేసిన
యీవెలఁదులలోన జాణ యెవ్వతె ? యనుచుం
దా వేడుక నడిగినఁ, బ
ద్మావతి యని పలికె నతఁడు మందస్మితుఁడై. 99

వ. పలికినం గోపించి. 100

సీ. చెక్కులందు నివాళి సేయు లేనగవులు
తాటంకరుచి కొల్లకోటు సేయ
జిగి ధగద్ధగయను బిగువుఁజన్నులమీఁదఁ
గ్రొమ్మించుసరులు త్రోద్రోపులాడ

నంటినఁ గందునో యనుమేనినునుఁ గాంతి
యిరుగెలంకులకు నుప్పరము దాఁటఁ
దొంగలిదెప్పలఁ దూఱుకుంకెనలాడు
సోలుఁజూపులు మరు మేలుకొల్పఁ
తే. బట్టుగవుసెన దీసిన భావభవుని
పసిఁడివిలు కమ్మిరయో నాఁగ ముసుఁగు దిగిచి
పఱపుమీఁదను గూర్చుండఁబడి కళావ
తీశిరోమణి యారాజుదిక్కు సూచి. 101

క. మీమాట కాదనఁగ రా
దేమీ తప్పంగఁ జెప్ప టిది తగ వగునే,
భూమిప! లీలావతి యను
భామినియె విదగ్ధ గాక పద్మావతి యే? 102

వ. అని పలికి నిజప్రభావ విశేషంబున నతని విక్రమాదిత్యుఁగా నెఱింగి కళావతీముగ్ధ కళావిదగ్ధయై వికసిత స్నిగ్ధాంచిత నయనారవిందంబుల నవ్విభునిం గనుంగొని. 103

ఉ. చాటున కెక్కినట్టి నెఱజాణతనంబున వాగ్విలాసతన్
మేటివి నీవు. నిన్ను నుపమింపఁ ద్రిలోకములందు రాజు లె
వ్వాట లేరు; నామనసుపాఁ తగలంచి వెలార్చినట్టియా
మాటలు మూఁడు నుంకువగ మానవనాయక నీకుఁ దక్కెఁ॒తిన్. 104

చ. నను వరియింపు కీర్తిలలనాకలనా లలితప్రతాప. యా
చనభజనానురూప, జలజాతముఖీసరసానులాప, నూ
తనవరపుష్పచాప, కవితామృదుగానకళాకలాప, శో
భనకరరూప! సర్వనరపాలకులోచితవర్తనంబునన్. 105

క. అని రాజుచిత్తమునఁ గృప
తనరంగా మాటలాడి. తమ కిద్దఱకున్
మనసిజుఁడు పెండ్లిపెద్దగఁ
జనవున వరియించి, కేళిశయ్యకుఁ దార్చెన్. 106

ఆ. తార్చి, వచనరచనఁ దేర్చి, చిత్తములోని
మదనవహ్ని యార్చి, ముద మొనర్చి
యసమరతుల నోలలార్చి, కౌఁగిటఁ జేర్చి
మనసుకోర్కి దీర్చి, మదిఁ దనర్చి. 107

క మానిని కరపాశంబుల
చే నీగతిఁ గట్టివైచి, జిగి దొలఁకెడు పూఁ
బానుపునఁ బెట్ట వలదా
మానధనం బపహరింప మరగినదొంగన్. 108

క ప్రోఢ యగుకళావతి యిటు
కూడి మెలఁగె రాజుమనసుకోలఁదినె, విభుఁడుం
జేడియఁ గూడి చరించెను
నీడయు రూపంబుఁబోలె నెయ్యం బలరన్. 109

వ అంత నొక్కనాఁడు. 110

సీ. మణిపంజ రాంతర మంజు కీరశ్రేణి
యాత్మీయ విజయంబు లభినుతింప
సరసవిలాసినీ చామరానిలమున
నలినీల కుంతలంబులు నటింపఁ
బ్రతిపన్న కామినీ ప్రౌఢగానక్రియా
రచనలు కర్ణపారణ మొనర్ప
రత్నసింహాసన నూత్నప్రభారాజి
తన తనుద్యుతులచే నినుమడింప
తే నంతిపురమున మండపాభ్యంతరమున
నంగనలు గొల్వఁ గొలువుండి, యానరేంద్ర
సింహుఁ డుజ్జయినీపురశ్రీలఁ దలఁచి
యింపుమీఱఁ గళావతి కిట్లనియె. 111

సీ. కాంచనపేటికా కర్పూరవీటికా
లలితవధూటికావిలసనంబు

గట్టిఁడివిధి చూపోపక
భట్టి! యెన్నాళ్ళు నిన్నుఁ బాయఁగఁ జేసెన్. 115

క. నావుడు సుమతితనూజుఁడు
ప్రావీణ్యము మెఱయ మనుజపతి కిట్లనియెన్
దేవర యెం దరిగిన, నా
భావంబునఁ బాయకుంటఁ బాయుట గలదే ? 116

వ. అని యిట్లు సలాపంబు లొనరించి యనంతరంబ. 117

సీ. ప్రకట దానోన్నిద్ర భద్రేభములు గొల్వ
నానా మణిస్యందనములు గొల్వ
జవసత్త్వసుమహత్త్వ చటులాశ్వములు గొల్వ
బలసముద్భట వీరభటులు గొల్వ
ధర్మవిధాన ప్రధానోత్తములు గొల్వ
సామంత మండలేశ్వరులు గొల్వ
వరవిలసనచారువారాంగనలు గొల్వ
గాయకనాయకోత్కరము గొల్వ
తే. నాత్మతరుణీసమేతుఁ డై యరద మెక్కి
శ్రీ మదుజ్జయినీసతీశ్రేణి పాణి
తామరసముక్త ముక్తాక్షత ప్రసక్త
నవ్యమణిమస్తకుండు నై • నగరు చొచ్చి. 118

క. తనుఁ గొల్చి వచ్చువారల
ననురాగ రసార్ద్రహృదయుఁ డై గృహమునకుం
జనుఁ డని, సతియును దానును
జననాయకుఁ డంతిపురికిఁ జను సమయమునన్. 119

ఉ. నైజ కటాక్షరోచులుఁ గన త్కరమూలమరీచులుం, గుచ
భ్రాజితకాంతివీచులును బైకొని దీపశిఖాలిఁ బ్రోవఁగా;
రాజిత కంకణధ్వనుల రాగ మెలర్పఁగ, నేర్పుతోడ నీ
రాజన మాచరించిరి పురంధ్రులు దంపతు లిచ్చ మెచ్చఁగన్. 120

నీలశైలస్థూల నిభిడ మహాఖిల
శుండాల ఘీంకారశోభితంబు
సలలితాంగకురంగ జవతురంగతరంగ
మంగళహేషాసమంచితంబు
మన్మథసుకుమార మహితశుభాకార
కలిత రాజకుమారకలకలంబు
తే. వేదశాస్త్రాది విద్యాప్రవీణ విప్ర
జన మనోహారచిరనిజస్థానకంబు
ఘనతరైశ్వర్యవిజితాలకాపురంబు
నిఖిలఫలసార ముజ్జయినీపురంబు. 112

ఉ ఆపుటభేదనంబు, సమదారి మనఃపుట భేదనక్రియా
లాప పటుప్రతాప రణలంపట సద్భటతోమరప్రభా
దీపశిఖాగళత్తిమిరదీప్తి దివానిశ, మస్మదీయ బా
హావరిఖావృతంబు, మన మక్కడ కేఁగుట యొప్పు నిత్తఱిన్. 113

వ. అనిన విని, దరహసితవదనయై కళావతి నిజకళాకౌశలంబు మెఱయఁ గరంబుప్రియంబున నతనికరంబు కరంబునం గీలించి. హృద్యోద్యానవద్విమందిరోద్యాన సముద్యత్ప్రాకారసార కనత్కనకమరీచి సముజ్జ్వలితప్రాసాదనాళంబుఁ బ్రవేశించి, యుజ్జ్వలోజ్జయినీపురవర సరసలీలాకుతుకానుకూలావనీరుహకుసుమవిసర పరిమళ పరాగానురాగ సుఖపరాయణశిలీముఖపక్ష విక్షేప ణోద్ధూత మందమారుత సంచరణ సమంచిత సరోజవిరాజిత రాజమార్గంబున నిర్గమించె, నంత సైన్యసమేతుం డైన భట్టి చనుదెంచి సర్వాంగ సంగతోర్వీతలం బగుదండప్రణామం బాచరించిన, సాహసాంక మహీపాలుండు పులకకలికా కంచుకిత సకలాంగుండును హర్షబాష్ప తరంగిత నయనాద్యపాంగుండునునై, పునఃపునరాలింగనంబు చేసి యతనితో నిట్లనియె. 114

క ఎట్టిదొకో సంసారము
నెట్టన నిముసంబుఁ బాయనేరని మనలం

ఉ. శ్రీయువతీధరాసతులఁ జెంది విహార మొనర్చు నాదినా
రాయణురీతిఁ, బ్రీతి వెలయంగ ననంగవతీకళావతీ
తోయజపత్త్రలోచనలతోడ నిరంతర సౌఖ్యవైభవుం
డై యఖిలప్రజావనపరాయణతన్ నుతికెక్కె నెంతయున్. 121

ఉ. పాడి సమస్తముం బోఁగడఁ బాయక, యాశ్రమవర్ణధర్మముల్
జాడలు దప్పకుండ, మఱి సజ్జనరక్షణ దుష్టశిక్షణ
క్రీడలె భూషణంబులుగఁ గీర్తి వహించె ధరిత్రి నవ్విభుం
డేడవచక్రవర్తి పదునేడవరాజునునై మహోన్నతిన్. 122

చ. అతులిత సామవాదసుఖశాఖలబాంధవ సత్కవీశ్వరా
ర్పితము నిత్యమౌ మహిమఁ బేర్చి చెలంగెను సిద్ధనార్యుఁ, డీ
క్షితి నతిదానవైభవదశేషవిశేషకళాగమప్రభా
సితహితమంత్రిసామ్యగుణశిష్టయథోచితదండనైపుణిన్. 123

క. భూరమణమంత్రి భాండా
గార సుహృద్దుర్గ రాష్ట్రఘనబల విభవో
దార, మదమత్సరాది వి
కారవిదూరప్రకార, కవితాకారా! 124

## మంగళమహాశ్రీ వృత్తము

శ్రీమ దుభయాన్వయ విశిష్టతరకీర్తి బుధశేఖరవిరాజితవివేకా
కామితఫలప్రకరకల్పితవితీర్ణి జితకల్పకసమాజసురరత్నా
స్వామిహితకార్యగతి సంఘటననైపుణవిచార నయమార్గమహనీయా
సామజహయాది బహుసంపదభిరామ గృహసన్నిహితమంగళమహాశ్రీ.

గద్యము : ఇది శ్రీమదఖిలకవిమిత్త్ర పెద్దయ యన్నయామాత్యపుత్త్ర శారదా
దయావిధేయ జక్కయనామధేయప్రణీతం బైన విక్రమార్కచరిత్రం
బను మహాకావ్యంబునందు సర్వంబును నష్టమాశ్వాసము.